# ప్రాచీన కావ్యాలు గ్రామీణ జీవన చిత్రణ

డాక్టర్ మసన చెన్నప్ప
లెక్చరర్, తెలుగు విభాగం
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాద్.

ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి
పిహెచ్.డి. పట్టంపొందిన
సిద్ధాంతగ్రంథం

# అంకితం

స్వర్గస్థులైన

మా అమ్మకూ, నాన్నకూ



మసన బుచ్చయ్యగారు          రామలక్ష్మమ్మగారు

బాల్యము తియ్యనై గడవ భాగవతశ్రవణమ్ము పెంచి సౌ
శీల్యము నేర్పి డెందమున స్నేహము నింపి గురూపదేశ సా
ఫల్యము గూర్చి నా బ్రతుకుబాట సుగంధపుతోట నాటి వా
త్సల్య ధనమ్ములిచ్చు తలిదండ్రుల కంకితమిత్తునీకృతిన్

—డా॥ మసన చెన్నప్ప

PRACHEENA KAVYALU—
GRAMEENA JEEVANA CHITRANA

A Doctoral Thesis by Dr. M. CHENNAPPA, M.A.,M.Phil.,Ph.D.
Lecturer, Dept. of Telugu, Osmania University, Hyd-7.



ప్రమీలా ప్రచురణలు-4

ప్రథమముద్రణ, 500 ప్రతులు

జూలై 1991

సాదాప్రతి వెల : రూ. 100/-

గ్రంథాలయ ప్రతి : రూ. 120/-

·నం :

పరిషత్

రాబాద్-1.

, Gandhinagar Hyd. &
Chikkadpally, Hyderabad

ద్యాలయంవారి ఆర్థిక సహాయంతో ప్రచురితం

# అంకితం

స్వర్గస్థులైన

మా అమ్మకూ, నాన్నకూ



మసన బుచ్చయ్యగారు రామలక్ష్మమ్మగారు

బాల్యము తియ్యనై గడవ భాగవతశ్రవణమ్ము పెంచి సౌ
శీల్యము నేర్పి డెందమున స్నేహము నింపి గురూపదేశ సా
ఫల్యము గూర్చి నా బ్రతుకుబాట సుగంధపుతోట నాటి వా
త్సల్య ధనమ్ములిచ్చు తలిదండ్రుల కంకితమిత్తునీకృతిన్

—డా॥ మసన చెన్నప్ప

# కృతజ్ఞతాంజలి

1988 లో డాక్టరేట్ పట్టాకోసం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత గ్రంథమిది. దీనిలో గ్రామం, నగరం అని స్థలంతో సంబంధం లేకుండా, గ్రామీణ జీవిత స్వభావాన్ని ప్రాచీన కవులు తమ కావ్యాలలో చిత్రించిన తీరుతెన్నులను పరిశీలించడమే ధ్యేయంగా పెట్టుకొన్నాను. నేటికి ఈ పరిశోధన గ్రంథం కొద్ది మార్పులతో ప్రచురణ భాగ్యం పొందినందుకు నాకెంతో సంతోషంగా ఉంది. ముఖ్యంగా నాకు జన్మనిచ్చి నా భవిష్యత్తుకు మంచి పునాది వేసిన పుణ్యమూర్తులైన నా తల్లిదండ్రులకు ఈ గ్రంథాన్ని అంకితం చేస్తున్నందుకు చెప్పలేనంత ఆనందంగా ఉంది.

ఎం. ఏ. లో పాఠాలు చెప్పి ఆ తరువాత ఎం.ఫిల్. లోనే కాక ఈ పిహెచ్.డి. పరిశోధనలోనూ నాకు పర్యవేక్షకులుగా ఉండి నిరంతరం ప్రోత్సహిస్తూ. అడుగడుగున సందేహాలు తీరుస్తూ, తగిన సూచనలిస్తూ, నాలోని అంతశ్శక్తిని వెలికితీసి కృతార్థుణ్ణి చేసిన గురుదేవులు, అమృత హృదయులు ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారికి—

నేను ఆంధ్రసారస్వత పరిషత్తువారు నిర్వహించిన ప్రాథమిక, ప్రవేశ, విశారద పరీక్షలతో పాటు వారి ప్రాచ్య కళాశాలలో చదివి డిప్. ఓ. ఎల్, బి. ఓ. ఎల్, ఎం. ఓ. ఎల్ పరీక్షలు పాసయ్యాను. ఆ సందర్భంలో ఆచార్యుల బోధనల వల్ల ప్రాచీన సాహిత్యం మీద అభిమానం ఏర్పడింది. ఆ తరువాత ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ చేస్తున్నప్పుడు ప్రాచీన సాహిత్యం మీద ముఖ్యంగా సైంఘిక జీవితంమీద పరిశోధన చెయ్యాలన్న కోరిక కలిగింది. తదనుగుణంగా ఎం. ఫిల్ తరువాత, 1983 లో "ప్రాచీన కావ్యాలు - గ్రామీణ జీవన చిత్రణ" అనే అంశాన్ని పిహెచ్. డి. పరిశోధనాంశంగా తీసుకొన్నాను. అందుకు అనుమతించిన విద్వన్మణులు సౌజన్యమూర్తులు ఆచార్య బి. రామరాజు గారికి, ఆచార్య నాయని కృష్ణకుమారి గారికి, ఆచార్య ఎం. కులశేఖరరావు గారికి, ఆచార్య ఎస్. వి. రామారావు గారికి—

ఈ పరిశోధన గ్రంథానికి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించి తమ ఆమోదాన్ని తెలిపిన సహృదయ సాహితీమూర్తులు ఆచార్య వి. రామచంద్ర గారికి, ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి గారికి, ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి—

పరిశోధన సమయంలో అవసరమైన సంస్కృత సమాచారాన్ని అందించి అత్యంతం ప్రోత్సహించిన గురువర్యులు ఆచార్య రవ్వా శ్రీహరి గారికి, పరిశోధనాసక్తిని పెంచిన ప్రముఖ కవిమిత్రులు డాక్టర్ ఎన్. గోపి గారికి, ప్రగతి మహావిద్యాలయం(1981 - 1989)లో లెక్చరర్‌గా ఉన్నప్పుడు పరిశోధనకనువైన పరిస్థితులు కల్పించిన కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ ఎన్. టి. వేదాచలం గారికి—

ఈ గ్రంథం వెలుగులోకి రావడానికి ఆర్థిక సహాయాన్ని అందజేసిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి—

ఈ పరిశోధన గ్రంథాన్ని చదివి నాకు శుభాశీస్సులందించిన మహాకవి, భారతీయ జ్ఞానపీఠ పురస్కార గ్రహీత ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి, అంతేవాసిగా నన్ను సమాదరిస్తూ ఆమోదాన్ని తెలియజేసిన ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారికి, 'జీవన చైతన్యం' పేరుతో అమూల్యమైన పీఠికను రచించిన సుప్రసిద్ధ విమర్శకులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారికి, మనఃపూర్వకంగా నా అభివృద్ధిని ఆకాంక్షిస్తూ సవిమర్శకమైన అభిప్రాయాన్ని అందజేసిన గురువర్యులు ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు గారికి, 'కావ్య జీవితం' పేరుతో అభినందన పూర్వకమైన అభిప్రాయాన్ని తెలియజేసిన సహృదయ విమర్శకులు ఆచార్య ఎస్.వి. రామారావు గారికి, అభినందనలు తెలిపిన ఆచార్య ఎం. కులశేఖరరావు గారికి, మాన్యమిత్రులు శ్రీ అద్దగట్ల ప్రభాకర్ గారికి—

ఈ గ్రంథ ప్రచురణకు ఎంతో అభిమానంతో ఆర్థిక సహాయం చేసిన 'సంగిశెట్టి కళా పురస్కారం' వ్యవస్థాపకులు, ఎస్.వి.ఎస్. గ్రూప్ ఆఫ్ కంపెనీస్ అధినేతలు శ్రీ సంగిశెట్టి శంభయ్య గారికి, అశ్వినీ చిట్‌ఫండ్స్ అధినేత యువజనుల ఆశాకిరణం శ్రీ అద్దగట్ల ప్రభాకర్ గారికి, ఆత్మీయ మిత్రులు శ్రీ బి. విజయకుమార్ గారికి, శ్రీ నోముల రాంప్రకాశ్ గారికి, శ్రీ రావికంటి

కృష్ణమూర్తి గారికి, శ్రీ వనం శంకరయ్య గారికి మరియు సోదరి శ్రీమతి వై. సత్యవతి గారికి—

నేను మహబూబ్ నగర్ జిల్లాలోని మా స్వగ్రామమైన కొల్కులపల్లిలో 5 వ తరగతి వరకు చదివి, ఆ తర్వాత నల్గొండ జల్లాలోని చింతపల్లి జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో చేరాను, ఆ సమయంలో నా దృష్టిని తెలుగు సాహిత్యం వైపు మళ్లించిన తెలుగు పండితులు పూజ్యులు శ్రీ బాలకృష్ణ గారికి-

పరిశోధన సమయంలోనేకాక జంటనగరాల్లో ఆయా సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించడంలో నాకు అత్యంత స్ఫూర్తిని ఇస్తున్న ప్రాణ మిత్రులు శ్రీ సంగిశెట్టి రవికుమార్ గారికి, వారి సోదరులు సుధాకర్ గారికి, సౌజన్యమూర్తులు పద్మజ్యోతి సంపాదకులు శ్రీ పెండెం రవీంద్రరావు గారికి, ప్రముఖ చిత్రకారులు శ్రీరామా ఫోటో స్టుడియో అధినేత శ్రీరుద్ర బలరామ్ గారికి, శ్రీ పి. లక్ష్మినారాయణ గారికి—

ఈ గ్రంథాన్ని విశ్వవిద్యాలయానికి సమర్పిస్తున్న సమయంలో శుద్ధ ప్రతులు తయారు చేసిన డా॥ బి. నాగిరెడ్డి గారికి, డా॥ సి. బి.కృష్ణ గారికి—

ఈ గ్రంథాన్ని ప్రచురిస్తున్న సమయంలో ప్రూఫులు చూడడానికి తమ అమూల్యమైన అధ్యయన సమయాన్ని వెచ్చించిన సోదరి జి. గీతావాణిగారికి—

నిరంతరం నాకు తోడునీడగా ఉండి ఈ పరిశోధనకే కాక సమస్త రచనా వ్యాసంగానికి సహకరిస్తున్న నా అర్ధాంగి శ్రీమతి ప్రమీలగారికి—

ఈ గ్రంథాన్ని సాధ్యమైనంతవరకు అందంగా అచ్చువేసిన ఆత్మీయ మిత్రుడు డా॥ వాసిలి వసంతకుమార్ గారికి, అక్షరాలంకరణ చేసిన శిలా వీర్రాజు గారికి, ఇంకా ఈ పరిశోధనలో సహకరించిన సహృదయులందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు అర్పిస్తున్నాను.

—డా. మసన చెన్నప్ప

# ఆశీస్సు

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ 16-7-91

అటు కవితా ప్రతిభను, ఇటు విమర్శన ప్రజ్ఞను కలబోసుకున్న ప్రవర్ధమాన రచయిత డా॥ మసన చెన్నప్ప.

ప్రాచీన కావ్యాల్లో గ్రామీణ జీవన స్వరూపాన్ని గురించి చేసిన పరిశోధన ఫలితం ఈ గ్రంథం. గ్రామాల్లోని వృత్తుల గురించి, ఆచార వ్యవహారాల గురించి, పరికరాల గురించి, పరిసరాల గురించి సువిస్తరంగా చేసిన సూక్ష్మపరిశీలన ఈ గ్రంథంలో అగుపిస్తుంది. నన్నెచోడుని కుమారసంభవం మొదలుకొని కూచిమంచి తిమ్మకవి నీలాసుందరి పరిణయందాకా పల్లెపట్టుల బతుకుతెట్టెల్లోని తేనెతెన్నులను సుమధుర శైలిలో డా॥ చెన్నప్ప పాఠకులచేతి కందించాడు. చెప్పదలచుకున్న అంశాలను గురించి మరో చెయ్యి పడనిరీతిలో సమగ్రంగా చెప్పాడు. తనవెంట పాఠక నేత్రాలను తీసుకొనిపోయే వచోవైఖరి చెన్నప్పకు అలవడింది. వస్తువురీత్యా, అభివ్యక్తిరీత్యా ఉత్తమగ్రంథాన్ని సంతరించిన డా॥ చెన్నప్పకు నా ఆశీస్సులు. గ్రంథ పర్యవేక్షకులు ఆచార్య వేటూరి ఆనందమూర్తికి నా అభినందన.

# ఆమోదం

వేటూరి ఆనందమూర్తి
పూర్వాధ్యక్షులు, తెలుగు విభాగం
ఉస్మానియా విశ్వవిద్యాలయం

చిరంజీవి డా॥ మసన చెన్నప్ప 1978-1980లలో హైదరాబాదు సాయంకళాశాలలో తెలుగు ఎం.ఏ చదివిన మా పూర్వవిద్యార్థి. అప్పటినుంచే అతడు నాకు పరిచయం. వినయం, విద్యార్జనాభిలాష, కౌశలంగల విద్యార్థిగా అప్పుడు నన్నాకర్షించిన చెన్నప్ప కవిగానేకాక పరిశోధకుడుగానూ కుదుర్కొంటూ ముందంజవేయడం నా కానందాన్ని కూరుస్తున్నది. వేటూరివారి వాఙ్మయసూచి పరిశోధన విషయంగా ఎం.ఫిల్ పట్టాన్ని (1983); ప్రాచీన కావ్యాలు-గ్రామీణ జీవన చిత్రణ పరిశోధనాంశంగా పి.హెచ్.డి పట్టాన్ని (1988) ఉస్మానియా విశ్వవిద్యాలయంలో నా పర్యవేక్షణలోనే కృషిచేసి పొందిన కారణంగా, ఆ అభిమానంతో, నన్నీ గ్రంథానికి ముందు మాటగా ఏదైనా వ్రాసి తీరాలని నిర్బంధిస్తే....ఈ అంతేవాసి కోరికను కాదనేదెట్లా?

వాస్తవానికి ఈ రెండు గ్రంథాలూ రచనా సందర్భంలో పరిశీలించి అప్పటికి నాకు తోచిన సలహాలేవో యిచ్చి మెచ్చుకొన్నవీ, నాటి పరీక్షకుల మెప్పు పడసినవీ కావడంవల్ల అవి మళ్ళీ యిప్పుడు బాగున్నాయనడం పునరుక్తే అవుతుంది. కనుక ఆ మాటనిప్పుడు ముక్తకంఠంతో ఇతరులనడమే బాగు.

అరు ప్రకరణాలలో శాస్త్రీయంగా సాగిన ఈ పరిశోధన రచన అచ్చుకూర్పులో ముద్రణ భారంవల్ల కొద్దిగా మారి 'కొంచెం చూపు' దాల్చినదేమో గానీ తెలుగువారి గ్రామీణ జీవన విధానానికి సంపూర్ణంగా దర్పణం పడుతూనే ఉన్నది. మరి కొంద అద్దమందు కొంచెమై ఉండదా? అది యిప్పుడు మీ చేతుల్లో ఉన్నది. దర్శించండని మనవి.

నేటి సామాజిక జీవితంలో వ్యక్తికీ అతని అంతరప్రకృతికీ, బాహ్య జగత్తుకీ ఉండవలసిన సమన్వయం క్రమంగా సన్నగిల్లి నానాటికి బ్రతుకు భారమైపోతున్నది. ఎకాలజీని గురించీ, మానవుని మనుగడలో దానికిగల ప్రాముఖ్యాన్ని గురించీ, ఈనాటి సృజనశీలంగల రచయితలూ, పరిశీలనదృష్టి గల పరిశోధకులూ ఇంకా గంభీరమైన భావన చేయవలసివస్తున్నది. ఈ దృష్టితో మానసిక చైతన్యసీమల్ని, భౌతిక ప్రాకృతిక పరిధుల్ని విశ్లేషించి సత్యాన్ని మరింత సన్నిహితంగా ఆవిష్కరించవలసిన ఆవశ్యకమేర్పడుతున్నది. సాహిత్యం జీవితానికి ప్రతీకం కాబట్టి జీవితంలోని, సాహిత్యంలోని పరమార్థాన్ని, ఆ పరమార్థాన్ని ప్రదర్శించే ప్రతీకల్నీ, వాటి విలువల్నీ, శ్రద్ధతో పసిగట్టి వెలకట్టుకోవలసిన సమయమాసన్నమైంది. ప్రబంధాలలోని అష్టాదశవర్ణనల ప్రాముఖ్యాన్ని సామాన్యదృష్టితోకాక విలువల్ని గుర్తించే చూపుతోచూస్తే ప్రతీకాత్మకంగా మనకనేక విషయాలు అందులో తోచి సంప్రదాయం లోనిలిచివున్న విలువలేమిటో ఆధునికత పేరిట మనం వాటితో కోల్పోతున్న సంపర్కస్వరూపమేమిటో అవగతం కాగలదు. ఉదాహరణకు వర్ణనలపేర చెట్టుకి చేమకు, ఊరికి నాడుకి, ఋతువుకి రసానికి, వివాహానికి కుమారోదయానికి మన ప్రాచీనులిచ్చిన ప్రాముఖ్యాన్ని సూక్ష్మంగా పరికిస్తే సోషియాలజీతోపాటు సైకాలజీ ఎకాలజీల మూలతత్వాలు వారికన్నా మన కెక్కువ తెలుసునా అనే అనుమానమొస్తుంది. కనుక ఈ దృష్టిభేదంతో ముందు ముందు మరిన్ని పరిశోధనలు జరుగవలసి వున్నవనిపిస్తుంది. అలాటిభావి ప్రయత్నాలకిలాటి గ్రంథాలు భూమికలవుతాయనడానికి సంకోచమక్కర లేదనుకొంటాను.

చెన్నప్పగారిని హృదయపూర్వకంగా అభినందిస్తూ,వారి లేఖని మరిన్ని మంచిమంచి రచనల్ని ఇలాగే ముందుముందూ అందిస్తుందని ఆశిస్తాను.

హైదరాబాదు
17-7-91

# జీవన చైతన్యం

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం
డీన్, స్కూల్ ఆఫ్ హ్యూమనిటీస్
యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్.

ఎన్నుకొన్న విషయమే పరిశోధన స్వరూపస్వభావాలను నిర్ధారిస్తుంది. 'ప్రాచీనకావ్యాలు - గ్రామీణ జీవనచిత్రణ'-అనే అంశం ఈ సిద్ధాంతవ్యాస రూపగుణ గతులను నిర్దేశించింది. ఇందులో రెండు విషయాలు స్పష్టంగా ముందుగా తేటతెల్లమౌతాయి.

1. ప్రజాజీవన విధానం వారునివసించే ప్రాంతంమీద బాగా ఆధార పడి ఉంటుంది. ఆ ప్రాంతాలను నగరాలనీ, గ్రామాలనీ ప్రధానంగా విభజించ వచ్చు. ఆ రెండింటిలో అంతర్విభాగంకూడా చేసికొనవచ్చు. నాగరక, గ్రామీణ జీవన విధానాలలో డాక్టర్ మసన చెన్నప్పగారు గ్రామీణ జీవన విధానాన్ని ఎన్నుకొన్నారు. అది ప్రాచీన కావ్యాలలో ప్రతిఫలించిన వైఖరిని విశ్లేషణాత్మకంగా వివరించారు. మన సమాజంలో గ్రామాలు అధికసంఖ్యలో ఉన్నాయి. కాబట్టి ఈ అంశంమీద మొదట పరిశోధన జరగటం సమంజసమని చెన్నప్పగారు భావించి ఎన్నుకోవటం సముచితంగా ఉంది.

2. ప్రాచీన కావ్యాలలో ధార్మిక సాహిత్యాంశాలను గురించి ఎంత విస్తారంగా పరిశీలించటానికి వీలుందో సాంఘికజీవనాంశాలను గురించికూడా అంత విపులంగా వివేచించటానికి వీలుందనే సత్యం ఈ పరిశోధనవలన ప్రకటితమౌతున్నది. ఈ అంశాన్ని నిరూపించటానికి పూనుకోవటంలో పరిశోధకుడు చూపిననిష్ఠ ప్రశంసనీయం.

సాహిత్యంలో ప్రతిఫలించిన సాంఘికపరిస్థితులను, సామాజిక వ్యవస్థను పరిశీలించటం ఈనాటి విమర్శలోనూ పరిశోధన పద్ధతులలోనూ ఒక శాఖగా

సాగుతున్నది. సాంఘిక పరిస్థితులను సమీక్షించే పద్ధతిలో విమర్శకులు సమాజంలోని జీవనస్థితిగతుల యధార్థచిత్రణను వివేచిస్తారు. సమాజచిత్రణ పద్ధతిలో ఆ స్థితిగతుల వెనుకనున్న కారణాలను, వర్గసంఘర్షణలను గతి తార్కిక భౌతిక దృక్పథంతో పరిశీలిస్తారు. మొదటిరకం ఉపరితల వాస్తవాలను చూచే పద్ధతి: రెండవరకం అంతర్గత పరిణామాన్ని పరిశీలించే పద్ధతి. ఈ రెండింటిలో మొదటిది ప్రాథమికం.

'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లు వెలువడ్డాయిగాని, 'ఆంధ్రుల సామాజిక వికాస చరిత్ర' ఇంకా ఒక రూపాన్ని సంతరించుకోలేదు. ఈ రెండు చరిత్ర లకూ ప్రాతిపదికగా ప్రాచీనాధునిక సాహిత్యాలలో ప్రతిఫలించిన ఎన్నో సాంఘిక, సామాజికాంశాలను వెలికితీసి విశ్లేషించవలసి ఉన్నది. ఈ ప్రయత్నం ఎలాంటిదంటే-ఒక సమగ్ర నిఘంటువు తెలుగులో రావాలంటే, కవులపద కోశాలు, వృత్తిపదకోశాలు, మాండలిక పదకోశాలూ తయారు కావాలి కదా: అలాగే ఒక సాంఘిక చరిత్ర, ఒక సామాజిక వికాసచరిత్ర వెలువడా లంటే ముందుగా ఆయాఅంశాల విశ్లేషణ విపులంగా సాగాలి. ఆ ప్రయత్నంలో ఈ పరిశోధన ఒకమంచి ముందడుగు.

డాక్టర్ మసన చెన్నప్పగారి సిద్ధాంతవ్యాసం నిశ్శబ్దంగా రెండు మూడం శాలను నిరూపిస్తున్నది. ఆ ఫలితాంశాలు పరిశోధకులకు, విమర్శకులకు ఎంతో ఉపయోగపడుతాయి. ఉదాహరణకు.

1, సాంఘిక జీవనాంశాలు ప్రాచీన కావ్యాలలో ప్రతిఫలించిన వైఖరిని ఒక విహంగవీక్షణంతో సమగ్రంగా సమర్పించే ప్రయత్నం ఇంత వరకు సజావుగా సాగలేదు. ఆ లోపాన్ని తీర్చటానికి చేసే ప్రయత్నంలో ఒక ప్రయోగం ఈ గ్రంధం.

2. ప్రాచీన కావ్యాలలో నగర జీవన చిత్రణం ఎక్కువగా అలంకారికం కంగానూ, ఆదర్శప్రాయంగానూ సాగింది. కాని, గ్రామీణ జీవన చిత్రణం వాస్తవాలను అధికంగా వ్యక్తం చేసింది. ఆ వాస్తవాలు కూడా కావ్యాలలోని కథలు జరిగిన కాలానివి కాకుండా, కవి జీవించిన కాలాని

విగా ఉండటం విశేషం. అందువలన ప్రాచీన కావ్యాలలో ప్రతిఫలించిన సాంఘికాంశాలు ఆయాకావ్యాలు వెలువడిన కాలానికి సంబంధించిన వని గ్రహించి, వాటిని విశ్లేషించటం ఈ గ్రంథంలో ఉన్న వాస్తవం కూడా.

3. గ్రామ జీవన చిత్రణంలో పరిశీలించదగిన అంశాలనూ, నగరజీవన చిత్రణంలో వివేచింపవలసిన విశేషాలనూ ఈ గ్రంథంద్వారా తెలుసుకోవచ్చు. నగరజీవన పరిశీలనం ఈ గ్రంథ పరిశేషమే అవుతుంది. ఒక విధంగా గ్రామజీవన చిత్రణకు ఒక మంచి ప్రణాళికను అందిస్తున్నది ఈ పరిశోధన.

4. మొదటి ప్రకరణం 'గ్రామం' అనే భావన (Concept) ను పరిచయం చేస్తుంది. 'జీవనచిత్రణ' పరిధి (Scope) ని నిర్దేశిస్తుంది. ముగింపు ప్రకరణం ప్రాచీన కావ్యాలలో-ఎటువంటి సాంఘికాంశాలు ఏయేకవుల రచనలలో ఏయే విధంగా లభిస్తాయో, వాటిని ఏ విధంగా సేకరించి పరిశీలించవచ్చునో వివేచించడం జరిగింది. ఈ రెండు ప్రకరణాలూ పరిశోధకుని స్పష్టమైన దృక్పథాన్ని వ్యక్తం చేస్తున్నాయి. పరిశోధనకు స్పష్టత బలం. అస్పష్టత అనారోగ్యం. ఇది ఆరోగ్యవంతమైన రచన.

5. తెలుగువారి సాంఘిక చరిత్ర వ్రాయదలచుకొన్న వారికి కావలసిన సామగ్రిని సమగ్రంగా ప్రాచీన కావ్యాలలోనుంచి సేకరించి, వర్గీకరించి, విశ్లేషించి, వ్యాఖ్యానించి, కాలక్రమ పద్ధతిలో అమర్చి అందించిన గ్రంథమిది. సిద్ధాన్నాన్ని వడ్డిస్తున్న వైఖరి ఈ గ్రంథం ప్రదర్శిస్తున్నది. పరిశోధకుని చిత్తశుద్ధితోపాటు అవిశ్రాంత కృషినికూడా మిగిలిన అయిదు పకరణాలూ ప్రకటిస్తున్నాయి.

స్వభావంచేత ఈ సిద్ధాంతవ్యాసం వర్ణనాత్మకం, విశ్లేషణాత్మకం. ఇటువంటి పరిశోధనలో సమగ్ర సామగ్రిసేకరణం ప్రధానాంశమౌతుంది. వాటిని ఉదాత్త పద్ధతిలో ప్రదర్శించటం మరొక ముఖ్యమైన అంశం

అవుతుంది. ఈ సిద్ధాంతవ్యాసంలో రెండవ ప్రకరణంనుంచి ఆరవ ప్రకరణం వరకూ గల అయిదు అధ్యాయాలూ అయిదు ప్రాణాలవంటివి.

మొత్తం గ్రంథం చదివితే ప్రాచీన కావ్యాలలో మన గ్రామీణ జీవితం ఇంత విస్తృతంగా వ్యాపించి ఉన్నదా ? ప్రాచీన కవులందరూ ప్రాబంధిక రచనా వ్యగ్రులని అనుకునే ఆధునికులకు వారితో కూడా ఇంత వాస్తవ జీవిత స్పృహ ఉందా ? ఇంత జీవిత రసికత్వం, భావుకత్వం, తాత్త్వికత్వం గ్రామీణ జీవితానికి మన సంస్కృతి అందించిందా ?-అని అనుభవిస్తూ ఆశ్చర్య పోతాం ! ఇది జీవిస్తున్న పరిశోధన రచనకు నిదర్శనం.

డాక్టర్ మసన చెన్నప్పగారు కవి, ఉపన్యాసకుడు, కార్యశీలి. ఇవన్నీ ఎన్నో కార్యాలద్వారా నిరూపించుకొన్నారు. 'నేత్రోదయం' కవితా సంపుటిని కూడా ప్రచురించారు. ఈ సిద్ధాంతగ్రంథం వారిలోని పరిశోధన ప్రవృత్తికి ప్రసన్నోదాహరణం. డాక్టర్ చెన్నప్పగారు నిరంతరం ఉత్సాహశీలి. ఏదో ఒక నిర్మాణాత్మక కార్యక్రమం చేయాలన్న నిష్ఠ వారి కన్నులలో, చేతలలో తొణికిసలాడుతూ ఉంటుంది. సాహిత్య సత్సంగాన్ని సమాదరించే సంస్కృతి వారికి సహజంగా ఉంది. ఉజ్జ్వల భవిష్యత్తుకు కావలసిన బీజాలన్నీ వారిహృదయ క్షేత్రంలో ఉన్నాయి. వాటి ఫలాలను పరిపూర్ణంగా అందుకొనేటట్లు అనుగ్రహించాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. ఈ విలువైన ప్రయత్నానికి అభినందిస్తున్నాను.

హైదరాబాదు
18-7-1991

# కావ్య జీవితం

ఆచార్య ఎస్వీ రామారావు
అధ్యక్షులు, తెలుగువిభాగం
ఉస్మానియా విశ్వవిద్యాలయం

మన దేశానికి గుండెకాయ పల్లెసీమ. ప్రాచీన భారతీయ సాహిత్యం గ్రామీణ జీవితాన్ని దర్పణం పట్టింది. తెలుగు కావ్యకర్తలుకూడా ఈ విషయంలో గణనీయమైన పాత్ర వహించారు. భావుకుడైన కవి ఎంత ఎదిగినా నేల విడిచి సాము చేయడు. తన చుట్టూవున్న పరిసరాలనూ, ప్రకృతి ప్రభావాన్నీ విస్మరించలేడు.

నన్నయనుంచి కూచిమంచి తిమ్మనవరకూ, ఆంధ్రమహాభారతంనుంచి నీలాసుందరీ పరిణయంవరకూ తెలుగు కావ్యాలలో చిత్రితమైన గ్రామీణ జీవితాన్ని సూక్ష్మేక్షికతో వీక్షించి మసన చెన్నప్ప ఈ సిద్ధాంతగ్రంథంలో విశ్లేషించారు.

సాంస్కృతిక జీవనం శీర్షికలో పల్లె ప్రజల ఆటలు-పాటలు, పండుగలు-పబ్బాలు, సాధారణజీవనం శీర్షికలో వారి ఆచారవ్యవహారాలు సువ్యక్తమైనాయి. వృత్తిజీవనం, పల్లీయుల రూపురేఖలూ, ఆభరణ ఆవాసాలూ మూడు, నాలుగు ప్రకరణాలలో ప్రదర్శితమైనాయి. చివరి రెండు ప్రకరణాలలో ప్రకృతి వర్ణనలతోపాటు మానవ ప్రకృతి చిత్రణ పరామర్శితమైంది.

శుకసప్తతి, హంసవింశతి వంటి సాంఘిక కావ్యాలేకాక, గొల్లపల్లెను స్వభావసిద్ధంగా చిత్రీకరించిన హరివంశం, సుందర గ్రామీణ ప్రకృతిని ప్రతిబింబించిన ఆముక్తమాల్యద మున్నగు కావ్యాల పరిశీలనలో చెన్నప్ప ప్రజ్ఞ ద్యోతకమౌతుంది. ఢిల్లీకిరాజైనా తల్లికి కొడుకే అన్న సామెత సాహితీ

సమరాంగణ సార్వభౌముడైన కృష్ణరాయలకి చక్కగా అన్వయిస్తుంది. ఆముక్తమాల్యదలోని విల్లిపుత్తూరు అలనాటి ద్రావిడ పల్లెసీమలకూ, విష్ణుచిత్తుడు భాగవతోత్తములకూ అచ్చమైన ప్రతిబింబాలు.

ప్రాచీనకవులు సమాజానికి దూరంగా ఊహాంబర వీధిలో విహరించే వారన్నది కేవలం ప్రచారం మాత్రమేనని ఈ పరిశోధన గ్రంథం చదివినవారికి సుస్పష్టమౌతుంది.

డా॥ మసన చెన్నప్ప సంప్రదాయాన్ని జీర్ణించుకున్న ప్రయోగశీలి. ప్రాచ్యవిద్యా పరిజ్ఞానంతోపాటు, ఆధునిక సాహిత్య ప్రక్రియా పరిచయం కలిగిన సమన్వయ వ్యక్తిత్వం అతనిది. ఎం.ఫిల్. పట్టం కోసం ప్రభాకర పండితుల వాఙ్మయ సూచికను రూపొందించిన చెన్నప్ప ప్రస్తుతాంశంపై పిహెచ్.డి. పరిశోధనకు అన్నివిధాలా సమర్థుడు. అతని పరిశోధనా పటిమకూ విశ్లేషణా నైపుణ్యానికీ ఈ గ్రంథమే ప్రత్యక్ష సాక్ష్యం.

కవిగా, సాహిత్య కార్యక్రమ ప్రయోక్తగా రూపుదిద్దుకొన్న డా॥ చెన్నప్ప పరిశోధనారంగంలో ముందంజవేయాలని ఆకాంక్షిస్తున్నాను.

హైదరాబాదు
19.7.1991

# ఆకాంక్ష

ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు
అధ్యక్షులు, తెలుగువిభాగం
హైదరాబాద్ విశ్వవిద్యాలయం.

మిత్రుడు మసన చెన్నప్ప సుమారు నలభైతొమ్మిది ప్రాచీన తెలుగు కావ్యాలను మథించి, పరిశోధించి 'ప్రాచీన కావ్యాలు - గ్రామీణ జీవన చిత్రణ' అన్న ప్రస్తుత సిద్ధాంత వ్యాసాన్ని రూపొందించాడు. కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డి మొదలైన వారి ఒరవడిలో వచ్చిన సిద్ధాంత వ్యాసం ఇది. 'గ్రామం అంటే ఏమిటో నిర్వచించటం మొదలుకొని కావ్యాలలో కనిపించే సాంస్కృతికాంశాలను, సాధారణ జీవనానికి సంబంధించిన అంశాలకు వివరించటం, వరకు ఒక విస్తృతమైన పరిశీలనగా సిద్ధాంత వ్యాసం రూపుదిద్దుకుంది. సాధారణ జీవన చిత్రణకు సంబంధించిన విభాగంలో ఆర్థిక, సామాజికాంశాలను పరిపాలనా సంబంధమైన విషయాలను, ఆహార విహారాదికాలను చెన్నప్ప స్పృశించాడు. వస్తుసంస్కృతి, భావసంస్కృతి, మానవ ప్రవర్తన సంస్కృతి, మానవసంబంధాలు మొదలైనవి కావ్యాలలో చిత్రితమైన విధానం వివరంగా సిద్ధాంత వ్యాసంలో దర్శనమిస్తాయి. ఆటలు, పాటలు, పండుగలు, చౌలోపనయనాది సంస్కారాలు, విశ్వాసాలు, శకునాలు, గృహ నిర్మాణం, గృహాలంకరణలు, పాడి, పంట, వ్యవసాయ విధానం, వృత్తులు, వృత్తికారులు, వైద్యం, మానవ స్వభావాలు, చిత్తవృత్తులు, జానపద కళాకారులు, వారి రూపచిత్రణ మొదలుగా స్థిరరూపంలోను, చల రూపంలోను బహుముఖమైన గ్రామీణ జీవితాన్ని దర్శించి వివరించాడు చెన్నప్ప. చెన్నప్ప వివరించిన గ్రామీణ జీవిత చిత్రణ గ్రామీణ జీవిత స్వభావానికి సంబంధించింది. గ్రామంకాని, నగరం కాని స్థలంతో సంబంధం లేకుండా గ్రామీణ జీవిత స్వభావాన్ని కావ్యాలలో చిత్రించిన తీరుని వివేచించటమే చెన్నప్ప ధ్యేయం. అయితే ఎప్పుడైనా 'ప్రాచీన కావ్యాలలో నగర జీవిత చిత్రణ' అన్న అంశం

పైన పరిశోధన జరిగితే అది ప్రస్తుత సిద్ధాంత వ్యాసానికి ఎంత వరకు భిన్నంగా ఉండగలుగుతుంది అనేది పరిశీలించవలసిన విషయం.

ప్రస్తుత సిద్ధాంతవ్యాసంలో గ్రామ జీవితానికి సంబంధించిన సర్వసమాచారమూ ఉంది. అయితే వస్తు సంస్కృతి, ఆచార వ్యవహారాలు మాత్రమే జీవితం కాదు. జీవితం అంటే మనుష్యుల మధ్య ఉండే సజీవ సంబంధాలు' వివిధమైన సామాజిక శ్రేణులు గల గ్రామ జీవితంలో వివిధ వర్గాల మధ్య పరస్పర సంబంధాలు, వాటివల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు, సామాజిక జీవితానికి ఆధారభూతమైన ఉత్పత్తి సంబంధాలు. ఈ అంశాలు పరస్పరం ప్రభావితమైన తీరును చిత్రించిన పద్ధతులను కూడా గుర్తించ గలిగితే మరింత సమగ్రమైన జీవిత చిత్రణ పరిశీలన అవుతుంది. పరిశీలితాంశాల మధ్య ఏకసూత్రతను కూడా పరిశోధన వివరించ వలసి ఉంటుంది. ప్రస్తుత సిద్ధాంత వ్యాసంలో వింగడించిన సమాచారం ఆధారంగా భవిష్యత్తులో మరింతలోతైన అధ్యయనం చేయగల సామర్థ్యం, ఉత్సాహం, చేయాలన్న తపన చెన్నప్పకు ఉందని నాకు తెలుసు. పరిమితకాలంలో అధ్యయనం చేసి సిద్ధాంత వ్యాసాన్ని నిర్మించటంతో పరిశోధన అంతంకాదు. పరిశోధనకు అది ఆరంభం మాత్రమే. 'అంతంకాదిది ఆరంభం'

ప్రస్తుత సిద్ధాంత వ్యాసంలోని భాష చాలా సరళంగా ఉంది. శైలి సూటిగా నిర్దిష్టంగా ఉంది. సంశ్లిష్ట వాక్యాలు సుమారుగా కనిపించవు. ఇది పరిశోధకుడి పరిపక్వతకు తార్కాణం. 'బడు' ధాతువులు మాత్రం అవసరాన్ని మించి దొర్లి కొంచెం ఇబ్బంది పెట్టాయి. లోతుగా పరిశీలించటం, సరళంగా చెప్పటం పరిశోధన ప్రధాన లక్షణం. మొదటి అంశంతోపాటు రెండవ అంశాన్ని చెన్నప్ప చాలావరకు సాధించాడు. అయితే మొదటి అంశంలో చెన్నప్ప మరిన్ని శిఖరాలను అధిరోహిస్తాడని ఆశిస్తాను. అధ్యయనం అధ్యాపనంతో పాటు పరిశోధన విశ్వవిద్యాలయాలలోని అధ్యాపకులకు ప్రధానంగా ఉండవలసిన లక్షణం. నిరంతర పరిశోధనవల్ల తప్పమరే ఇతర సాధనాలతోను శిఖరాలను అధిరోహించే ప్రయత్నం శిష్యమిత్రుడైన చెన్నప్ప చేయడని నాకు నమ్మకం ఉంది.

హైదరాబాద్
25-7-91

# భూమిక

ఆచార్య వి. రామచంద్ర చౌదరి
అధ్యక్షులు, తెలుగు విభాగం
మద్రాస్ విశ్వవిద్యాలయం.

ప్రాచీన కావ్యాలు అనగానే తెలుగు సాహిత్యంతో పరియం ఉన్న వాళ్ళకు వెంటనే స్ఫురించే అంశాల్లో ముఖ్యమయింది వాటిలోని కథా వస్తువు. సంస్కృతపురా ణేతిహాసాదుల నుండి మాత్రమే కథా వస్తువును గ్రహించాలి. తద్భిన్నమైన వస్తువును గ్రహించిన కవికి ఆనాటి పండితలోకంలో అవమానం తప్పేదికాదు. ఆలంకారికులు సరేసరి. 'కవులు దారి తప్పకుండా తాము చెప్పి నట్లు వ్రాయడం వాళ్ళవిధి' అని భావించారు కొందరు. 'కవిగజాంకుశ'మనీ, "కవి సర్పగారుడ"మనీ తమ గ్రంథాలకు పేర్లు పెట్టి కవులను బెదరించి, వాళ్ళమీద పెత్తనం చలాయింప జూశారు. ఆలంకారికుల ధాటికి బెదరిపోయిన అస్వతంత్రులైన కవులూ కొందరు లేకపోలేదు. అయితే పాల్కురికి సోమ నాథాదులు కొందరు తమ రచనల్లో అన్ని విధాలా దేశీయతను సాధించి చూపారు. అయినా, తెలుగు కావ్యం పూర్తిగా దేశీయం కావడం మన కవుల్లో చాలా మందికిష్టంలేదు. కాల ప్రభావం అటువంటిది. కాకుంటే తెలుగు గడ్డలో ఊరితీరిన తిక్కన మహాకవి కూడా పలనాటివీరుల వృత్తాంతాన్ని వదలి పూరు వంశీయుల యితివృత్తాన్ని గ్రహించ వలసిన అగత్యం లేదు. రాజరాజ నరేంద్రుడు తెలుగు ప్రభువు కాడా? అనవచ్చు. ఆ మాటకొస్తే పలనాటి వీరుల కుదుళ్ళూ ఉత్తరంలో తేలేవే. మొత్తంమీద, ఏ కారణాల చేతనైతేమి, అలనాటి తెలుగు కవుల రచనలు చాలవరకు సంస్కృతం చేత ప్రభావితమైనవే - అని చెప్పాలి. అందుకే స్థానిక పతివ్రతలూ, వీరుల గాథలు కూడా మన కవుల మహాప్రబంధాలకు వస్తువులుగా పనికి రాలేదు.

ఇవన్నీ యెందుకు చెప్పానంటే, డా॥ చెన్నప్ప ఇటువంటి ప్రాచీన కావ్యాల్లోని తెలుగుదేశపు గ్రామీణ జీవన చిత్రణను గురించిన పరిశీలనకు పూనుకొన్నాడుగాబట్టి!

ఎంత సంస్కృత పురాణేతిహాసాది ప్రసిద్ధాలైన కథలను స్వీకరించినా' కవులు మాత్రం తెలుగువాళ్ళే. వాళ్ళలో చాలామంది పల్లెటూళ్ళలో నివసించినవాళ్ళే. లేదా, పల్లెజీవితం అనుభవించిన వాళ్ళే. అందుచేత, కథలో గ్రామీణ జీవన విధానాలకూ, గ్రామీణ ప్రకృతి సౌందర్యానికీ సంబంధించిన, అంశాలు కావ్యాల్లో తటస్థించినప్పుడు, ఆ కవులు కమకు పరిచితమైన ప్రకృతినీ, జీవిత విధానాల్నీ చిత్రింపగలరేకానీ, ఔత్తరాహుల ఆచార వ్యవహారాల్నీ, వాళ్ళ గ్రామాల ప్రకృతి సౌందర్యాన్నీ తమ కావ్యాల్లో వర్ణించలేరు. ఫలితంగా, మన ప్రాచీన కవులు స్వీకరించిన ఆద్య సత్కథలు అస్థిపంజరాలయితే, స్థానికాచార వ్యవహారాలూ, తెలుగుజాతి నాగరికతా సంస్కృతులూ, తెలుగు గ్రామాల ప్రకృతిశోభ ఆ అస్థిపంజరాలకు మాంసలమైన మనోహరాకృతిని ప్రసాదించాయి. మన కవుల బుద్ధి మత్త, గుణ వత్త, మన భాష రసవత్త వాటికి ఊపిరులూదాయి. ఆ విధంగా రూపొందిన మన ప్రాచీన కావ్యాల్లో తెలుగువారి గ్రామీణ జీవన చిత్రణం ఎలా జరిగిందో పరిశీలించడం ఆ కావ్యాల జీవనాడిని పట్టుకోవడమే. అందుచేత, డా॥ చెన్నప్ప ప్రాచీనాంధ్ర కావ్యాల్లోని గ్రామీణ జీవన చిత్రణను గురించి చేసిన యీ పరిశోధన ఆ కావ్యాలను మనకు మరింత చేరువగా తెస్తుంది.

ఇందుకుగాను డా॥ చెన్నప్ప ఎన్నుకొన్న ముఖ్యమైన కావ్యాలు 45. గ్రామీణ జీవన చిత్రణం తక్కిన వాటిలోకంటే యెక్కువగా ఉన్న కారణాన చెన్నప్ప ఆ కావ్యాలనే ఎన్నుకోవడం జరిగింది. అంటే, తక్కిన గ్రంథాల్లో ఈ చిత్రణం అంతగా సాగలేదని నిర్ధారించు కోవడం కూడా చెన్నప్ప పరిశోధనలో ఒక భాగం. మరి, యీ యెన్నుకోబడిన కావ్యాల్లో బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, క్రీడాభిరామం, పల్నాటివీర చరిత్ర, కాటమరాజు కథలు, ద్విపద పరమయోగి విలాసం, ఆముక్తమాల్యద, కళా పూర్ణోదయం,

శుకసప్తతి, మన్నారుదాస విలాసం, హంసవింశతి వంటి కావ్యాలు కథావస్తు స్వభావాన్నిబట్టి గ్రామీణ జీవనాన్ని మరీ యెక్కువగా చిత్రించేవి.

మరి, యీ కావ్యాల నుండి తాను గ్రహించిన విశేషాలు అసలైన గ్రామీణ జీవన విధానానికి సంబంధించినవా కావా ? అనే ప్రశ్న తలెత్తుతుంది. ఎందుకంటే, ఆయా వర్ణనలు చేయబడిన కథా సందర్భాలు అటువంటి సందేహాల్ని రేకెత్తిస్తాయి కాబట్టి. కాబట్టి చెన్నప్ప తాను ప్రాచీన కావ్యాలనుండి గ్రహించిన ఆయా గ్రామీణ జీవన విశేషాలను జానపద వాఙ్మయ నేపథ్యంలో పరిశీలించి, నిగ్గుతేల్చి, నిర్ధారించి చెప్పవలసి వచ్చింది. ఈ శ్రమంతాపడి చి॥ చెన్నప్ప తాను పూనుకొన్న పనిని నిర్దుష్టంగా నెరవేర్చిన తీరు ఈ సిద్ధాంత వ్యాసంలో అక్షరబద్ధమై కనిపిస్తుంది. గ్రహించిన విషయాలను చెన్నప్ప వివరించిన విధానం కూడా మనోహరంగా ఉంది.

ఈ సిద్ధాంత వ్యాసంలోని విషయాలు ఆరు ప్రకరణాల్లో వివరింపబడినవి. హాలుని గాథా సప్తశతి నుండి కూచిమంచి తిమ్మకవి రుక్మిణీ పరిణయం వరకూ పరిశోధించి చెన్నప్ప గ్రామీణ జీవన విశేషాలను గ్రహించడం జరిగింది. గాథాసప్తశతిలో తెలుగువారి ఆచార వ్యవహారాలు కొన్ని చోటు చేసుకొన్న విషయం మనకు తెలుసు. అందువల్ల, ఆ విశేషాలనుకూడా పరిశీలించి, తన సిద్ధాంత వ్యాసంలో పొందుపరచిన చెన్నప్ప విషయ సమగ్రతా సంపాదనంలో ఎంత జాగరూకత వహించాడో తెలుస్తుంది.

గ్రామీణ జీవన విధానాల నెరుగని వారికీ, విధి లేక ఆ జీవితానికి దూరమైన వాళ్ళకీ, గ్రామీణ ప్రకృతి శోభను చూడని వారికీ యీ గ్రంథం ఆ జీవితాన్ని పరిచయం చేస్తుంది, గుర్తుకు తెస్తుంది, హాయిగొలుపుతుంది.

పక్షుల కలకలా రావాలు, పశువుల అంబారవాలు, పైరుపంటల పచ్చదనాలు, పైరగాలుల పరిమళాలు, ప్రకృతి దృశ్యాల భవ్యశోభలూ, వెగటు గొల్పని వేష భాషలూ, వంచనలేని వావివరుసలూ గ్రామసీమలకెంత మనోజ్ఞతను చేకూర్చేవో యీ గ్రంథం చదివిన వారికి స్పష్టమవుతుంది. స్థాలీ పులాకంగా నైనా గ్రంథంలోని విషయాలను చూపి చెబుదామంటే, విషయ

విస్తృతివల్ల అది సాధ్యమనిపించడం లేదు. అందుచేత స్థాలినే సహృదయుల కప్పజెప్పడం తప్ప నేనింకేమీ చెప్పను. చెప్పవలసిందంతా చెన్నప్పే చెప్పాడుగదా!

చెప్పెడిది గ్రామ చరితట
చెప్పించినవాంధ్ర కావ్య చిన్మూర్తులచే!
చెప్పినదే చెన్నప, నే
తప్పుకొనెద మీరె చదివి ధన్యులరగుడీ!

ఈ నాటి పరిశోధన గ్రంథాలలో రేచుక్క పగటిచుక్క లాంటివి కొన్ని, తోక చుక్కల్లాంటివికొన్ని, అరుంధతి నక్షత్రంలాంటివి కొన్ని, సూర్యగోళం వంటివి కొన్ని, ధ్రువ నక్షత్రంలాంటివి కొన్ని, మరేవేవో గ్రహాల్లాంటివి కొన్నిఅయి, సహృదయుల ఆగ్రహానుగ్రహాలను అనుక్షణం పరిశీలిస్తూ, "పరిప్లవిస్తూ, పరిక్లమిస్తూ" ఉన్న యీ రోజుల్లో పున్నమి చంద్రుని వలె వెన్నెలలు విరజిమ్ముతూ, గ్రామ స్వర్గాన్ని సాక్షాత్కరింప జేస్తున్న చెన్నప్ప సిద్ధాంతవ్యాసం నిజంగా ఒక ప్రకృతి శోభావిలాసం. ఒక కచ్ఛపీ శబ్ద విన్యాసం.

డా॥ చెన్నప్ప ఇతోధికమైన సాహితీ సేవ చేసి, సర్వవిధాలా తెలుగు వాఙ్మయం సుసంపన్నం కావడానికి తోడ్పడగలడని విశ్వసిస్తున్నాను.

అతనికి నాయాశీస్సులు.

చెన్నపురి,
29-7-91

# విషయసూచిక

—: o :—

మొదటి ప్రకరణం

# గ్రామం

ప్రవేశిక:

భారతదేశాన్ని ఒకమహాపురుషునితో పోల్చినప్పుడు గ్రామాన్ని ఆత్మగా భావించవచ్చు. భారతీయ సంస్కృతీ సభ్యతలకు గ్రామం పునాది. ప్రాచీన భారతీయ జీవనం అంటే గ్రామజీవనమే.

విశ్వకవి రవీంద్రుడు భారత సంస్కృతిని తెలుసుకోవాలంటే గ్రామాలలోకి వెళ్ళాలంటాడు. గ్రామాలు సుభిక్షంగా ఉన్ననాడే దేశం సుభిక్షంగా ఉంటుందని గాంధీజీ ఉద్దేశం.

ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్న గ్రామాలనూ, గ్రామాలలో నివసించే ప్రజల జీవన విధానాలనూ ప్రాచీన కవులు తమ కావ్యాలలో వర్ణించక పోలేదు.

మన కవులు పురాణకథలను అనువదించినప్పటికీ, స్వతంత్ర కావ్యాలను రచించినప్పటికీ ఆయా సందర్భాలలో గ్రామీణుల జీవన స్థితిగతులను చిత్రించడంలో కృతకృత్యులైనారు.

అష్టాదశవర్ణనలలో గ్రామవర్ణనకు అంత ప్రాధాన్యం లేనప్పటికీ, మొత్తం మీద ప్రాచీన కావ్యాలలో గ్రామజీవనానికి సంబంధించిన అంశాలు పుష్కలంగానే లభిస్తున్నాయి.

ఈ సిద్ధాంత గ్రంథంలో కవి, కావ్యం, యుగం మొదలైన పేర్లతో కాక, గ్రామీణ జీవనాన్ని దృష్టిలో పెట్టుకొని ఆయా అంశాలను ప్రత్యేక శీర్షికలుగా వివరించడం జరిగింది.

ఈ పరిశోధన గ్రంథం ఆరు ప్రకరణాలుగా విభజింపబడింది. మొదటి ప్రకరణంలో గ్రామ స్వరూపస్వభావాలు వివరింపబడ్డాయి. గ్రామీణ జీవనం ప్రతిబింబించిన గ్రంథాలలో గాథాసప్తశతికి ప్రత్యేక స్థానం ఉంది. తెలుగు వారి ఆచార వ్యవహారాలు అందులో ప్రతిబింబించినాయనే అభిప్రాయంతో కొన్ని అంశాలను ఈ ప్రకరణంలో స్వీకరించడం జరిగింది.

రెండవ ప్రకరణంలో సాంస్కృతిక సాధారణ జీవన విధానాలు వివరింప బడ్డాయి. 'సాంస్కృతిక జీవన' విభాగంలో పండుగలు, జాతరలు, సంస్కార విశేషాలు, పెళ్లిపేరంటాలు, ఆటలు పాటలు మొదలైన అంశాలు పేర్కొనడం జరిగింది. 'సాధారణ జీవన' విభాగంలో శిక్షా విధానం, జీత భత్యాలు, క్రయవిక్రయాలు, ఆహార సంబంధమైన అలవాట్లు, ప్రయాణ విశేషాలు మొదలైనవి వివరింపబడ్డాయి.

మూడవ ప్రకరణంలో వ్యవసాయం మొదలైన వృత్తులు పేర్కొనబడ్డాయి. వేట వృత్తిగానూ, ఆటగానూ లెక్కింపబడుతుంది. ఈ ప్రకరణంలో మాత్రం వేటను ఆటవికుల వృత్తిగా వివరించడం జరిగింది.

నాలుగవ ప్రకరణంలో వ్యక్తుల రూపురేఖలు, వస్త్రధారణ, ఆభరణాలు పేర్కొనబడ్డాయి. వీటితోపాటు గృహనిర్మాణపద్ధతులు, గృహాలంకారాలు వివరింపబడ్డాయి. ఎఱ్ఱాప్రెగ్గడ చిత్రించిన 'గొల్లపల్లె'ను ఒక శీర్షికగా గ్రహించడం జరిగింది.

ఐదవ ప్రకరణంలో మానవ మనస్తత్వం, విశ్వాసాలు, శకునాలు వివరింప బడ్డాయి. మానవస్వభావమూలకాలైన కారణంగా విశ్వాసాలను, శకునాలను ఈ ప్రకరణంలో చేర్చడం జరిగింది.

ఆరవ ప్రకరణంలో కవుల ఋతువర్ణనలోని గ్రామీణ జీవన అంశాలు వివరింపబడ్డాయి. ఇట్లే సూర్యోదయ, సూర్యాస్తమయ, చంద్రోదయ,

చంద్రాస్తమయాది వర్ణనలలోని అంశాలుకూడ ప్రస్తావింపబడ్డాయి. కవులు ప్రకృతిని మానవీకరణం చేసిన విధానాన్ని ఈ ప్రకరణంలో చూడవచ్చు.

ఈ గ్రంథంలో గ్రామీణ జీవన అంశాలు కవులయొక్క కాల క్రమాన్ని బట్టి గ్రహింపబడ్డాయి. గ్రామీణ జీవనం విశేషంగా ప్రతిబింబించిన కావ్యాలనే ముఖ్యంగా పరిశీలించడం జరిగింది,

| క్ర.సం. | కావ్యం | కవి | శతాబ్దం |
|---|---|---|---|
| 1. | ఆంధ్రమహాభారతం | నన్నయ | 11 |
| 2. | కుమారసంభవం | నన్నెచోడుడు | 12 |
| 3. | బసవ పురాణం | పాల్కురికి సోమనాథుడు | 13 |
| 4. | పండితారాధ్యచరిత్ర | ,, | ,, |
| 5. | ఆంధ్రమహాభారతం | తిక్కన | ,, |
| 6. | కేయూరబాహుచరిత్ర | మంచన | ,, |
| 7. | రంగనాథరామాయణం | గోన బుద్ధారెడ్డి | ,, |
| 8. | భాస్కరరామాయణం | హుళక్కి భాస్కరుడు | 14 |
| 9. | హరివంశం | ఎఱ్ఱాప్రెగ్గడ | ,, |
| 10. | ఉత్తర హరివంశం | నాచన సోముడు | ,, |
| 11. | క్రీడాభిరామం | శ్రీనాథుడు | 15 |
| 12. | పల్నాటి వీరచరిత్ర | ,, | ,, |
| 13. | కాటమరాజు కథలు | ,, | ,, |
| 14. | శృంగారనైషధం | ,, | ,, |
| 15. | హరవిలాసం | ,, | ,, |
| 16. | భీమఖండం | ,, | ,, |
| 17. | కాశీఖండం | ,, | ,, |
| 18. | శివరాత్రిమాహాత్మ్యం | ,, | ,, |
| 19. | శకుంతలాపరిణయం | పిల్లలమఱ్ఱి పినవీరన | ,, |
| 20. | ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానం | గౌరన | ,, |
| 21. | సింహాసన ద్వాత్రింశిక | కొఱవి గోపరాజు | ,, |

| | | |
|---|---|---|
| భోజరాజీయం | అనంతుడు | 15 |
| సుభద్రాకళ్యాణం | తాళ్ళపాక తిమ్మక్క | ,, |
| ద్విపద పరమయోగివిలాసం | తాళ్ళపాక తిరువేంగళ నాథుడు | 16 |
| ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు | ,, |
| మనుచరిత్ర | పెద్దన | ,, |
| పారిజాతాపహరణం | ముక్కుతిమ్మన | ,, |
| శ్రీకాళహస్తిమాహాత్మ్యం | ధూర్జటి | ,, |
| రాజశేఖరచరిత్ర | మాదయగారి మల్లన | ,, |
| కళాపూర్ణోదయం | పింగళి సూరన | ,, |
| ప్రభావతీప్రద్యుమ్నం | పింగళి సూరన | ,, |
| వసుచరిత్ర | భట్టుమూర్తి | ,, |
| పాండురంగమాహాత్మ్యం | తెనాలి రామకృష్ణుడు | ,, |
| కవికర్ణరసాయనం | సంకుసాల నృసింహకవి | ,, |
| యయాతి చరిత్ర | పొన్నగంటి తెలగన్న | ,, |
| వైజయంతీ విలాసం | సారంగు తమ్మయ్య | ,, |
| చంద్రభాను చరిత్ర | మల్లన | ,, |
| రాధామాధవం | చింతలపూడి ఎల్లనార్యుడు | ,, |
| [illegible] | పాలవేకరి కదిరీపతి | ,, |
| [illegible] | కందుకూరి రుద్రయ్య | 17 |
| [illegible] | చేమకూర వేంకటకవి | ,, |
| [illegible] | రంగాజమ్మ | ,, |
| [illegible] | నారాయణామాత్యుడు | 18 |
| [illegible] | కూచిమంచి తిమ్మకవి | ,, |
| | ,, | ,, |

[illegible] అని అమరకోశం. సంస్కృతంలో ఊరు [illegible] గ్రామం అనే రెండు పర్యాయపదాలున్నాయి.

'సంవసంతి అత్ర' (దీనిలో నివసిస్తారు) అని 'సంవసథ' శబ్దవ్యుత్పత్తి.[1] 'గ్రస్'=అదనే అనే ధాతువుపై 'మన్' ప్రత్యయంచేరి ధాతువులోని 'స' కారానికి 'ఆ' కారం ఆదేశమై గ్రామశబ్దం ఏర్పడింది[2]. గ్రసనం అంటే భోజనం లేదా ఆహారం అని అర్థం. ఆహారానికి ఉత్పత్తి కేంద్రమైన ప్రదేశానికే గ్రామం అని పేరు.

మార్కండేయ పురాణం కృషికి అనుకూలమైన శూద్రాది వర్ణాలు నివసించే ప్రదేశాన్ని గ్రామంగా పేర్కొంటున్నది.

తథా శూద్ర జనప్రాయాః
స్వసమృద్ధ కృషీవలాః ।
క్షేత్రోపభోగ్య భూమధ్యే
వసతిః గ్రామ సంజ్ఞితా ॥ అధ్యాయం 46, శ్లోకం 47.

గ్రామాన్ని సామాన్యంగా పల్లె అని పిలుస్తారు. పల్లీ శబ్దభవమే పల్లె, విల్యమ్స్ నిఘంటువు 'పల్లె'కు కుగ్రామం అనే అర్థాన్ని చూపి, ఆహితాగ్ని, వైద్యుడు, ధనవంతుడు, నది ఇవేమీలేని ఊరు కుగ్రామం అని వివరించింది.[3] దీన్నిబట్టి గ్రామం పల్లెకంటె పెద్దదని తెలుస్తుంది. గ్రామం ఊరు సమానార్థక శబ్దాలు. సుమతి శతకంలో ఊరును గురించి ఒక పద్యం ఉంది:

"అప్పిచ్చువాడు, వైద్యుడు
నెప్పుడు నెడతెగక పారు నేరున్, ద్విజుడున్
చొప్పడిన నూరనుండుము
చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ"

సుమతిశతకకారుని అభిప్రాయం ప్రకారం అప్పివ్వగల్గిన ధనవంతుడూ, వైద్యుడూ, ఎప్పుడూ ప్రవహించే ఏరూ, పురోహితుడూ మొదలైనవారు ఉన్నప్పుడే అది ఊరు. "ఏరు" పేర్కొనబడడంవల్ల సామాన్యంగా

---

1. గురు బాలప్రబోధిక (అమరకోశం) పురవర్గం, పుట. 229.
2. 'గ్రసేరాచ' (ఉణాదిసూత్రం - 144) 'గ్రసు' = అదనే, అస్మాత్ మన్ ప్రత్యయో ధాతో రాకారశ్చ అంతాదేశః.
3. **Sanskrit — English Dictionary, 1963. P. 610**

| | | | |
|---|---|---|---|
| 22. | భోజరాజీయం | అనంతుడు | 15 |
| 23 | సుభద్రాకళ్యాణం | తాళ్ళపాక తిమ్మక్క | ,, |
| 24. | ద్విపద పరమయోగివిలాసం | తాళ్ళపాక తిరువేంగళ నాథుడు | 16 |
| 25. | ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు | ,, |
| 26. | మనుచరిత్ర | పెద్దన | ,, |
| 27. | పారిజాతాపహరణం | ముక్కుతిమ్మన | ,, |
| 28. | శ్రీకాళహస్తిమాహాత్మ్యం | ధూర్జటి | ,, |
| 29. | రాజశేఖరచరిత్ర | మాదయగారి మల్లన | ,, |
| 30. | కళాపూర్ణోదయం | పింగళి సూరన | ,, |
| 31. | ప్రభావతీప్రద్యుమ్నం | పింగళి సూరన | ,, |
| 32. | వసుచరిత్ర | భట్టుమూర్తి | ,, |
| 33. | పాండురంగమాహాత్మ్యం | తెనాలి రామకృష్ణుడు | ,, |
| 34. | కవికర్ణరసాయనం | సంకుసాల నృసింహకవి | ,, |
| 35. | యయాతి చరిత్ర | పొన్నగంటి తెలగన్న | ,, |
| 36. | వైజయంతీ విలాసం | సారంగు తమ్మయ్య | ,, |
| 37. | చంద్రభాను చరిత్ర | మల్లన | ,, |
| 38. | రాధామాధవం | చింతలపూడి ఎల్లనార్యుడు | ,, |
| 39. | శుకసప్తతి | పాలవేకరి కదిరీపతి | ,, |
| 40. | నిరంకుశోపాఖ్యానం | కందుకూరి రుద్రయ్య | 17 |
| 41. | విజయవిలాసం | చేమకూర వేంకటకవి | ,, |
| 42. | మన్నారుదాస విలాసం | రంగాజమ్మ | ,, |
| 43. | హంసవింశతి | నారాయణామాత్యుడు | 18 |
| 44. | నీలాసుందరీపరిణయం | కూచిమంచి తిమ్మకవి | ,, |
| 45. | రుక్మిణీపరిణయం | ,, | ,, |

---

నిర్వచనం :

'సమౌ సంవసథగ్రామౌ' అని అమరకోశం. సంస్కృతంలో ఊరు అనే అర్థంలో సంవసథం, గ్రామం అనే రెండు పర్యాయపదాలున్నాయి.

'సంవసంతి అత్ర' (దీనిలో నివసిస్తారు) అని 'సంవసథ' శబ్దవ్యుత్పత్తి.[1] 'గ్రస్'=అదనే అనే ధాతువుపై 'మన్' ప్రత్యయంచేరి ధాతువులోని 'స' కారానికి 'ఆ' కారం ఆదేశమై గ్రామశబ్దం ఏర్పడింది[2]. గ్రసనం అంటే భోజనం లేదా ఆహారం అని అర్థం. ఆహారానికి ఉత్పత్తి కేంద్రమైన ప్రదేశానికే గ్రామం అని పేరు.

మార్కండేయ పురాణం కృషికి అనుకూలమైన శూద్రాది వర్ణాలు నివసించే ప్రదేశాన్ని గ్రామంగా పేర్కొంటున్నది.

తథా శూద్ర జనప్రాయాః
స్వసమృద్ధ కృషీవలాః।
క్షేత్రోపభోగ్య భూమధ్యే
వసతిః గ్రామ సంజ్ఞితా॥ అధ్యాయం 46, శ్లోకం 47.

గ్రామాన్ని సామాన్యంగా పల్లె అని పిలుస్తారు. పల్లీ శబ్దభవమే పల్లె, విల్యమ్స్ నిఘంటువు 'పల్లె'కు కుగ్రామం అనే అర్థాన్ని చూపి, ఆహితాగ్ని, వైద్యుడు, ధనవంతుడు, నది ఇవేమీలేని ఊరు కుగ్రామం అని వివరించింది.[3] దీన్నిబట్టి గ్రామం పల్లెకంటె పెద్దదని తెలుస్తుంది. గ్రామం ఊరు సమానార్థక శబ్దాలు. సుమతి శతకంలో ఊరును గురించి ఒక పద్యం ఉంది:

"అప్పిచ్చువాడు, వైద్యుడు
నెప్పుడు నెడతెగక పారు నేరున్, ద్విజుడున్
చొప్పడిన నూరనుండుము
చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ"

సుమతిశతకకారుని అభిప్రాయం ప్రకారం అప్పివ్వగల్గిన ధనవంతుడూ, వైద్యుడూ, ఎప్పుడూ ప్రవహించే ఏరూ, పురోహితుడూ మొదలైనవారు ఉన్నప్పుడే అది ఊరు. "ఏరు" పేర్కొనబడడంవల్ల సామాన్యంగా

---

1. గురు బాలప్రబోధిక (అమరకోశం) పురవర్గం, పుట. 229.
2. 'గ్రసేరాచ' (ఉణాదిసూత్రం - 144) 'గ్రసు' = అదనే, అస్మాత్ మన్ ప్రత్యయో ధాతో రాకారశ్చ అంతాదేశః.
3. Sanskrit — English Dictionary, 1963, P. 610

గ్రామాలు జలసమృద్ధి కల్గిన ప్రదేశాల్లోనే అభివృద్ధి చెందుతాయన్న విశేషార్థం అభివ్యక్తమౌతుంది.

పల్లె ప్రజల ప్రధానమైన వృత్తి వ్యవసాయం. వారికి మొదట్లో వ్యవసాయం ద్వారా పొట్ట నింపుకోవడమే తెలుసుకాని, వ్యాపారంచేసి లాభాలు గడించాలన్న దృష్టిలేదు. గ్రామసంపద మతపరమైన ఆచారాలకూ, సంప్రదాయబద్ధమైన బాధ్యతల్ని నిర్వహించడానికీ, విందులకూ వినోదాలకూ ఎక్కువగా ఉపయోగింపబడేది.

పల్లె సమాజాలు సాధారణంగా మార్పును వ్యతిరేకిస్తాయి. కాకపోతే తక్కువ స్థాయిలో ఈ మార్పు అనేది జరుగుతూ ఉంటుంది. దీనికి కారణం వేలాది సంవత్సరాలనుంచి పల్లెప్రజలు ప్రాచీన సంప్రదాయాలకు అలవాటుపడి జీవించడమే. ఏదేమైనప్పటికీ గ్రామాలు ఈనాటికీ తమ సంస్కృతిని పదిల పరచుకోవడం విశేషం.

జీవన చిత్రణ :

సాహిత్యం సమకాలీన సమాజానికి అద్దం వంటిది. ఏజాతి సాంఘిక జీవనాన్ని తెలుసుకోవాలన్నా మొదట ఆ జాతికి సంబంధించిన గ్రంథాలను పరిశీలించవలసి ఉంటుంది. ఏ భాషా సాహిత్యమైనా ఒకే భాషలో వ్రాసిన, ఒకే భౌగోళిక పరిధికి లోనైన పుస్తకాల కలగూరగంప కాదు. అది ఆజాతి మనఃప్రవృత్తులకు సంబంధించిన క్రమాభివృద్ధికి ప్రతిబింబం—అని హడ్సన్ చెప్పిన మాటలను ఈ సందర్భంలో గుర్తించాలి.

**"A nation's literature is not a miscellaneous collection of books which happen to have been written in the same tongue or within a certain geographical area. It is the progressive revelation, age by age, of such nation's mind and character".[1]**

సాంఘిక జీవనం అన్నప్పుడు అన్ని తరగతుల ప్రజల జీవన విధానాలు, పరిపాలనా రీతులు, వృత్తులు, పరిశ్రమలు, విద్యాలయాలు, సైనిక,

---

1. "An Introduction to the Study of Literature" by W. H. Hudson, P. 32.

ఆర్థిక రాజకీయ వ్యవస్థలు గ్రహింపబడతాయి. కాని గ్రామ జీవనంలో వ్యక్తి, ఆహారం, వేషధారణ, ఆభరణాలు, గృహం, వృత్తి, విశ్వాసాలు పండుగలు, జాతరలు, సంస్కారాలు, పెళ్లి పేరంటాలు, ఆట పాటలు, వింతలు వినోదాలు మొదలైన అంశాలన్నీ వస్తాయి.

నన్నయకు ముందున్న సాహిత్యం మనకు లభించకపోవడంవల్ల మనం ఆ కాలం నాటి గ్రామీణ వ్యవస్థను, ప్రజల జీవన విధానాన్ని సంపూర్ణంగా తెలుసుకోలేకపోతున్నాం. ఐతే గాథాసప్తశతిలాంటి గ్రంథాలు తెలుగు వారి సంంస్కృతీ సంప్రదాయాలను తెలుసుకోవడానికి కొంతవరకు ఉపకరిస్తున్నాయి.

నన్నయ అనంతరం తెలుగులో అనేక కావ్యాలు వచ్చాయి. కాని గ్రామీణ వాతావరణాన్ని సంపూర్ణంగా చిత్రించే కావ్యం ఒకటీ లేదు. తెలుగు కావ్యాలలో గ్రామీణ జీవనం ఎక్కువగా ప్రతిఫలింపక పోవడానికి కారణం కథావస్తువు పురాణ సంబంధమైంది కావడమే. వాటియందు సామాన్య ప్రజల స్థితిగతులు వర్ణించడానికి చోటు తక్కువ. ఐనప్పటికీ చాలామంది తెలుగు కవులు తమ కావ్యాలలో సందర్భోచితంగా సమకాలీన ప్రజల జీవన విధానాన్ని కథాగర్భితం చేసి తమ లోకజ్ఞతను చాటుకొన్నారు. ఆయా వర్ణనల కంటె గ్రామ వర్ణనలే కావ్యాలలో ఔచిత్యాన్ని పాటించాయంటే ఆశ్చర్య పడవలసిన పనిలేదు.

తత్వం :

నీరు, గడ్డి, కట్టె సమృద్ధిగా లభించడానికి అనువైన గ్రామమే మానవ జీవితానికి పునాది. భూములు త్రవ్వడం వల్ల నీరు పుట్టి, పశువులకు అవసరమైన గడ్డి లభించి, భూసారం వల్ల వృక్ష సంపద పెరిగిన గ్రామాలలో ప్రజలు స్వయంపోషకత్వం కలిగి జీవిస్తారు. ఇలాంటి ప్రకృతి సంపద కొరవడిన ప్రదేశాలను నివాసయోగ్యాలుగా చేసుకొంటే కష్టాలు తప్పవు. అంతేకాక నిత్యావసరాలు తీరడానికి ప్రజలు కృత్రిమ విధానాలపై ఆధారపడ వలసి వస్తుంది. ఈ రోజు నగరాలలో ఇదే చూస్తున్నాం.

గ్రామాలలో కట్టు బొట్టు జుట్టు విధానాలను బట్టి మనిషి ప్రవర్తన నిర్ధారింపబడేది. స్నాన సంధ్యలు, భోజన పానీయాలను బట్టి క్రమశిక్షణ

గుర్తింపబడేది. అరచెయ్యి, అరికాలు, శరీరాలను బట్టి మనిషి కష్టం తెలుసుకోబడేది. మాటా, దస్తూరీని బట్టి మనిషి విజ్ఞానం గ్రహింపబడేది. సహనం, స్వయంపోషకత్వం, పరోపకారం, ధైర్యసాహసాలను బట్టి యోగ్యత నిర్ణయింపబడేది. తల్లిదండ్రులు, గురువులు, పెద్దలు అన్నదమ్ములు, అతిథి అభ్యాగతుల మీద చూపే ఆదరాన్ని బట్టి పురుష స్వభావమూ; అత్తమామలు, ఆడబిడ్డలు, తోడికోడళ్లు మొదలైనవారిమీద చూపే ఆప్యాయతనుబట్టి స్త్రీ స్వభావమూ తెలుసుకోబడేది. వివాహం ప్రేమబద్ధమైందికాక ధర్మబద్ధమైందిగా ఉండేది.

గ్రామాలలో ఆచారబద్ధమైన సామాజిక ఆర్థిక పరస్పర సహకారం కనిపిస్తుంది. ఒక కులంవారు మరో కులంవారి వృత్తిని స్వీకరించరాదు. కాబట్టి ఒకరు మరొకరిపై ఆధారపడి జీవించవలసివస్తుంది. ఆచారాలతో సమ్మిళితమైన ఈ అన్యోన్య సహకారం కులాల మధ్య బాధ్యతలను కూడా నిర్ణయించింది. కాని ఆధునిక యుగంలో విద్యావిధానం, పారిశ్రామికీకరణం కారణంగా అందరూ అన్ని వృత్తులు చేపట్టడం వల్ల పై విధానంలో మార్పు వచ్చింది. కులవృత్తులు దెబ్బతిన్నాయి. తద్వారా కులాల మధ్యఉన్న అంతరాలు తొలగి సృష్టిధర్మంగా అవి కొత్త రూపాలు ధరించాయి. అయినప్పటికీ ఆయా కులాలవాళ్లు గ్రామాలలో ఈనాటికీ కులాచారాలను పాటిస్తూనే ఉన్నారు.

గ్రామీణులు మతసంబంధమైన ఆచారాలను ఖచ్చితంగా పాటిస్తారు. తమ అలవాట్లనే దేవతలకు ఆపాదించడం కద్దు. వారు ఆయా దేవుళ్ళకు సంబంధించిన గొప్పతనాన్ని తోలుబొమ్మలాటలు, వీధినాటకాల రూపంలో దర్శించి వీరం ఉన్నచోట ఉత్సాహాన్ని పొందారు. శృంగారం ఉన్నచోట రాగోన్మత్తులయ్యారు. దుఃఖ సంఘటనలను చూసి శోకాన్ని అనుభవించారు. ఒక మాటలో చెప్పాలంటే దేవతల కథలు సామాన్యప్రజల హృదయాలమీద చెరగని ముద్రవేశాయి. గ్రామీణులు స్వయంగా మతావేశం ఉన్నవారుకాదు. వారికి మతావేశాన్ని కల్గించినవారు మతగురువులు. కోర్కెలు నెరవేరాలంటే ఆయా పూజలు చెయ్యాలనీ, ఆయా ప్రాణుల్ని బలి ఇవ్వాలనీ ఆదేశించింది

వారే. బలి విధానాలలోని భిన్నత్వంవల్లనే శక్త్యారాధనలో అనేక మార్గాలు ఏర్పడ్డాయి. క్రమక్రమంగా ప్రజలు ఆయా భక్తి మార్గాలను అనుసరించారు.

పురవర్ణనలు :

నగరం, అర్ణవం, శైలం, ఋతువు, చంద్రోదయం, సూర్యోదయం, ఉద్యానం, జలక్రీడ, మధుపానం, రతి, విప్రలంభం, వివాహం, కుమారోదయం, మంత్రాలోచనం, ద్యూతం, ప్రయాణం, యుద్ధం, నాయకాభ్యుదయం అనేవి అష్టాదశవర్ణనలు. విశ్వనాథుడు సాహిత్య దర్పణంలో అష్టాదశవర్ణనలతోపాటు అదనంగా పదకొండు వర్ణనలు చెప్పినాడు. కేశవ మిత్రుడు అలంకార శేఖరంలో ముప్పైనాలుగు వర్ణనలు చెప్పినాడు. విశేషం ఏమంటే ఇతడు పేర్కొన్న వర్ణనలలో గ్రామవర్ణన కూడా ఒకటి.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో అష్టాదశ వర్ణనలు ఎలా చేయాలో వివరిస్తూ నగర వర్ణన ఈ కిందివిధంగా చేయాలని సూచించాడు.

> ''దుర్గమ పరిఖావరణ నిసర్గ బలానీక చాతుర్వర్ణ్యా
> నర్గళ సంపద్వన జలవర్గస్తుతి వలయు నగర వర్ణనమునకున్''
>
> 3-93.

ఈ నగర వర్ణన కేవలం నగరాలకే పరిమితమైంది తప్ప దానిలో గ్రామాల ఊసే లేదు. లాక్షణికులలో ఒక్క కేశవ మిత్రుడు తప్ప ఇతరులు కావ్యంలో గ్రామవర్ణన ఉండాలని చెప్పలేదు. కవులు కూడా గ్రామవర్ణనకు ప్రాధాన్యం ఇవ్వక నగర వర్ణనలకే మొకరిల్లారు.

ప్రాచీన కావ్యాలలో పురవర్ణనలు పనిగట్టుకొని చేసినట్లు కనిపిస్తాయి. ఇవి కూడా ఒకే మూసలో పోసినట్లు ఉంటాయి. ఉత్ప్రేక్షలకూ, అతిశయోక్తులకూ ఇవి ఆలవాలం. కథా ప్రారంభంలో కనిపించే పురవర్ణనలు సామాన్య జన యథార్థ జీవనాన్ని ప్రతిబింబించవు. అందుకే కట్టమంచి రామలింగారెడ్డి గారు అతివేలంగా, అతిశయోక్తులతో వర్ణింపబడ్డ నగర సౌధాలను గూర్చి తమ కవిత్వతత్వవిచారంలో నిశితంగా విమర్శించారు.

ప్రాచీనకావ్యాలలోని పురవర్ణనలను పరిశీలించి వాటిలో ఏమైనా గ్రామీణ వాతావరణం చిత్రింపబడిందేమో చూద్దాం.

కుమారసంభవంలో ఏడవ ఆశ్వాసంలో హిమవంతుని నగరమైన ఓషధీప్రస్థం నలభై పద్యాలలో వర్ణింపబడింది. దాని గొప్పతనం అమరావతికీ అలకా పట్టణానికీ సాటిగా చెప్పబడింది. మనుచరిత్రలో పురవర్ణన కేవలం రెండు పద్యాలలో ఉంది. ఒక పద్యం సౌధాల గురించీ, మరో పద్యం చాతుర్వర్ణ్యాల గురించీ.

పారిజాతాపహరణంలో ప్రత్యేకంగా పురవర్ణన లేదు. ఆముక్తమాల్యదలో మొదటి రెండు ఆశ్వాసాలలో పురవర్ణనలు ఉన్నాయి. మధురాపుర వర్ణన మామూలు నగర వర్ణనల ధోరణిలో కొనసాగగా, విలుపుత్తురు వర్ణన దానికి విరుద్ధంగా కనిపిస్తుంది. విలుపుత్తూరు వర్ణన చదువుతూ ఉంటే మనం నగరంలో కాకుండా గ్రామంలో ఉన్న అనుభూతిని పొందుతాము. వరిమళ్ళూ, నీటికాల్వలూ, బాతులూ, ఆరెకులూ మనం ఎన్నటికీ మరవలేని విషయాలు. అతిశయోక్తులకు దూరంగా విలుపుత్తూరు వర్ణన సాగింది. రాయల సామాన్య జీవన పరిజ్ఞానానికి ఆముక్తమాల్యద కావ్యం చక్కని నిదర్శనం. కళాపూర్ణోదయంలో సుగాత్రీ శాలీనుల కథ గ్రామజీవన వాతావరణాన్ని సంతరించుకొన్నది. వసుచరిత్రలోని అధిష్ఠానపుర వర్ణనం కోటలతో, ఉద్యానాలతో, అంగళ్ళతో, కరి తురగశాలలతో కొనసాగింది. విజయ విలాసంలో మేడలు ఆకాశాన్ని తాకుతున్నట్లు వర్ణింపబడ్డాయి.

ఈ కావ్యాలలోనే కాక ఇతర కావ్యాలలోను ఇంచుమించు ఇదే మాదిరి పురవర్ణనలు కనిపిస్తాయి. గ్రామీణ జీవనాన్ని తెలుసుకోవాలంటే కేవలం పురవర్ణనలమీద ఆధారపడితే లాభం లేదు. కవులు కథాగమనంలో అక్కడక్కడ గ్రామీణ వాతావరణాన్ని చిత్రించారు. ఋతువుల్ని వర్ణించేటప్పుడు, పాత్రల మనస్తత్వాన్ని విశ్లేషించేటప్పుడు, ఉపమాసామగ్రిని గ్రహించేటప్పుడు వారు గామీణ అంశాలను పొందుపరిచారు. ప్రాచీన కవులు తమ కావ్యాలను ఎంత నాగరికంగా రచించినప్పటికీ, వారికి గ్రామాలతోగల అనుబంధంవల్ల రచనా సందర్భంలో గ్రామీణ జీవనానికి సంబంధించిన అనేక అంశాలు చిత్రింపబడ్డాయి.

గా థా స ప్త శ తి :

హాలుడు గాథాసప్తశతిని ప్రజాకవుల నోటినుంచి జారిన గాథలతో సంతరించినాడు. ఈరోజు కూడా పల్లెల్లో కనిపించే గ్రామీణ జీవనాన్ని గాథాసప్తశతిలో చూడవచ్చు. ఈ గ్రంథంలో తెలుగువారి వేష భాషలు, కష్టసుఖాలు, వెళ్ళిపేరంటాలు, వింతలు వినోదాలు సహజమనోహరంగా చిత్రింపబడ్డాయి. స్త్రీ పురుషులు కలిసి వ్యవసాయం పనులు చేసేవారు. సాధారణంగా ప్రజలు పూరిళ్ళలో నివసించేవారు. అగ్ని ప్రమాదాలు జరిగినప్పుడు నగారాలు మ్రోగించేవారు వసంతోత్సవాల్లో స్త్రీ పురుష భేదం లేకుండా అందరూ పాల్గొనేవారు. పుష్పరజాన్ని ఒకరిమీద ఒకరు చల్లుకొనేవారు. బురదను కూడా విడిచేవారుకాదు. తప్పత్రాగి తూలేవారు. నాట్యం చేసేవారు జుట్టుముళ్లు విడిపోతున్నా, పైటలెగిరిపోతున్నా స్త్రీలు మాత్రం వాటినేమీ లెక్కచేయక వసంతాలాడేవారు. ఈ వసంతాలాట ఈనాడు హోళీని జ్ఞప్తికి తెస్తున్నది. మన తెలుగు కావ్యాల్లో కుమార సంభవంలో ఇలాంటి వర్ణనను చూడవచ్చు.

ఆనాటి స్త్రీలు కుసుమ, చెంగావి రంగులుగల చీరలు ధరించేవారు. ఉత్సవానికి తగిన వేషాన్ని ధరించేవారు. కొప్పునిండా పూలు పెట్టుకొనేవారు. చెవులమీదినుంచి నగలు వ్రేలాడుతూ ఉండేవి బహుశా అవి చెంపసరాలో లేదా జుమికీలో అయి ఉండవచ్చు. స్త్రీలు నల్లకలువలు, నేరేడు చిగుళ్ళు, పాద్రిపూలు, ఇప్పపూలు, విరజాజులు, పురువాలు, రేలపూలు మొదలైన వాటిని చెవులసందున పెట్టుకొనేవారు. అప్పుడు వారి చెవుల్లోని పూలు చెంపల అంచాన్ని వంగి త్రాగినట్లుండేవి.

ఆనాడు ప్రతి ఊరు పొలిమేరలో ఒక మర్రిచెట్టు ఉండేది. అది సజ్జనునిలాగా గ్రామ ప్రజలకు ఆనందాన్ని కలిగించేది. సజ్జనుడు మరణిస్తే ఎంత బాధ కలుగుతుందో, మర్రిచెట్టు కూలితే గ్రామ ప్రజలకు అంత బాధ కలిగేది. మర్రాకులమీద కాకులు రెట్టవేసేవి. తెల్లని మరకలయ్యేవి. అవి ఎవరో పిండినో లేదా సున్నాన్నో నీళ్ళలోపోసి చిలకరించినట్లు కనిపించేవి. బహుశా ఎవరూ ఆ ఆకులను కోసుకొని పోకుండా ఉంటానికా అన్నట్లు! మర్రిచెట్టు ఎంత బాగున్నా దానిక్రింద బాటసారులు రాత్రిపూట విశ్రాంతి తీసుకోలేరు. పావురాలు రొదచేయడంవల్ల దేవాలయాల్లోనూ నిద్రించడం కష్టమే!

కాబట్టి షత్రినుంచి ఆలయానికీ, ఆలయంనుంచి ఎవరో ఒకరి ఇంటి అరుగు మీదికి వరిగెత్తేవారు. అక్కడ గృహిణులు దయతలచి బాటసారులు పడు కోవడానికి గడ్డిమోపులు ఇచ్చేవారు. ఇది నాటి ఆచారం. పాడుబడిన ఆల యాల్లో పావురాల రొదలూ, ఇంటి ముందరి అరుగులమీద పడుకొన్న క్రొత్త వ్యక్తులను చూసి కుక్కలు చేసే అరుపులూ సామాన్యమైన విషయాలు.

ఎవరింటిలోనైనా పెళ్ళి జరుగుతున్నప్పుడు ఆహ్వానితులు తమ ఇంటికి అంతకు పూర్వమే అతిథులుగావచ్చినవారిని కూడా తీసుకొని వెళ్ళేవారు. ఈ రోజుల్లో సాధారణంగా శుభలేఖలలో "బంధుమిత్ర కుటుంబపరివారంతో రావలసింది" అని వ్రాయడం ఈ ఆచారాన్నే సూచిస్తుంది.

స్త్రీలు చెవులకు తాటాకు కమ్మలూ, మెడలో గురిగింజదండలూ ధరించే వారు. స్నానమాడేటప్పుడు శరీరానికి పసుపును పూసుకొనేవారు. నుదుట తిల కాన్నీ, కళ్ళకు కాటుకనూ, కాళ్ళకు పారాణినీ, తలలో దాసానిపూలనూ పెట్టుకొని అలంకరించుకొనేవారు. పెళ్ళిళ్ళు అయిదు రోజులు జరిగేవి. పెళ్ళికి ముందు అమ్మాయిని పెళ్ళికూతురును చేసి ముత్తైదువలు మంగళగీతాలు పాడేవారు. ప్రత్యేకంగా పెళ్ళికడాలను తొడిగించేవారు. పెళ్ళి అయిన తరు వాత వరుడు అత్తవారింట్లో నాలుగురోజులుండి శేషహోమం పూర్తయ్యాక స్వగృహానికి వెళ్ళేవాడు. నాగవల్లిచేసుకొని అల్లుడు వెళ్ళేటప్పుడు ప్రస్థాన కలశాన్ని పెట్టడం ఆచారం. అల్లుడివైపు చుట్టాలను ఊరు పొలిమేరదాకా సాగనంపేవారు. నేటికీ ఈ ఆచారం గ్రామాల్లో ఉంది.

సంఘం కట్టుబాటు ప్రకారం అనుమరణం కొనసాగేది. అనుమరణం అంటే మరణించినవారితోపాటు మరణించడం. కొండపైనుంచి కూడా దూకి శక్తిపట్ల తమ భక్తిని ప్రకటించుకొనే జానపదులు ఉండేవారు. ఈ ఆచా రాన్ని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో కనుమారెగా పేర్కొ న్నాడు. గ్రామాల్లో వైద్యుడు తప్పక ఉండేవాడు. ఒకవేళ లేకపోతే ఆ ఊరుకు వెళ్ళడానికి ఇతరులు భయపడేవారు.

రైతులు వరి, సెనగ, చెరకు, జనుము మొదలైన పంటలు పండించే వారు. గానుగల దగ్గర, ఏతాముల దగ్గర స్త్రీలు కూడా పని చేసేవారు.

దట్టంగా వరిచేలూ, నూవుచేలూ పెరిగేవి. దంచిన బియ్యంలా ఉండే వెన్నెల్లో రైతులు గొంతులువిప్పి పాటలు పాడేవారు. పొలాల చుట్టూ కంచెలు నాటుకోవడమేకాక. కుక్కలను కాపలా ఉంచేవారు. బాగా పంటలు పండితే పండుగలు చేసుకొనేవారు. దేవతలకు మహిషబలులు కూడా కొనసాగేవి. కొందరు బుద్ధుని పూజించేవారు. కొందరు హింసాయుతమైన బలివిధానాన్ని పాటించేవారు. కొందరు కాపాలికులను పూజించేవారు. కొందరు విష్ణువును ఆరాధించేవారు. చలికాలంలో ఆలయాలముందు చలిమంటలు వేసుకొని శరీరానికి వేడిని సమకూర్చుకొనేవారు. పిడకలవల్ల పొగచూరిన బట్టలను నిరుపేదలు ధరించేవారు. క్రొత్త జున్నుపాలు త్రాగితే బర్రె దూడకు ఎలాగైతే అనారోగ్యం కలుగుతుందో, చలికాలంలో మధ్యాహ్నంపూట నిద్రపోవడంవల్ల కూడా అలాగే అనారోగ్యం కలుగుతుందని ప్రజలు భావించేవారు. వర్షాకాలంలో వంటచెరకు లభించక పేదలు చాలా బాధపడేవారు. ఇళ్లు పొగచూరి "పొమ్మనలేక పొగ బెట్టినట్లు" అనే సామెతను గుర్తుకు తెచ్చేవి. పై కప్పునుంచి వాననీరు కారుతున్నప్పటికీ ఇంటికి వచ్చిన అతిథులను పొమ్మనక వారికి యజమానులు చక్కని వ్యవస్థ కల్పించేవారు.

దేవాలయాల గోడలమీద ఏవో పాటలూ, సంకేతాలు వ్రాసేవారు. స్త్రీలు ముత్యాలమీదికన్నా గురిగింజలమీదనే ఎక్కువ మోజును చూపేవారు. ధూర్జటి శ్రీ కాళహస్తిమాహాత్మ్యంలోని చెంచుల జీవన చిత్రణంలో ఈ విషయాన్ని గమనించవచ్చు.

వర్షాకాలంలో ఎక్కడ చూసినా బురదే. ఒక్కొక్కసారి నాగళ్లు బురదగుంటలో చిక్కుకొనిపోయేవి. అతికష్టంమీద వాటిని బయటికి తీసి మోసుకొని ఇంటికి వచ్చిన భర్తలకు ఉపచారం చేయడానికి బదులు కాపు స్త్రీలు విరహవేదన అనుభవించేవారు.

గాథాసప్తశతిలో గ్రామజీవనానికి సంబంధించిన అంశాల్లో కొన్నింటిని మాత్రమే ఇక్కడ గ్రహించాను.

రెండవ ప్రకరణం

# జీవన చిత్రణ

జాతి అభివృద్ధి పథంలో పురోగమించిన విధానమే సంస్కృతి. సంస్కృతి నాగరికతలను సమానార్థకాలుగా వాడినప్పటికీ వాటిమధ్య భేదం ఉంది. సంస్కృతి జాతియొక్క అంతర జీవితానికి సంబంధించింది. నాగరికత బాహిరజీవితానికి సంబంధించింది. పల్లెల్లోగాని పట్నాల్లోగాని నివసించే ప్రజల బాహిరజీవితంలో భేదం కనిపిస్తున్నప్పటికీ వారి సాంస్కృతిక జీవితం మాత్రం ఒక్కటే.

తెలుగు ప్రజల సంస్కృతీ సంప్రదాయాలను కావ్యాలెంతవరకు ప్రతిబింబించాయో తెలుసుకునే ప్రయత్నం ఈ ప్రకరణంలో జరిగింది.

ఈ ప్రకరణంలో 1. సాంస్కృతిక జీవనం, 2. సాధారణ జీవనం అని రెండు విభాగాలు ఉన్నాయి.

సాంస్కృతిక జీవనంలో పండగలు, అతిథిమర్యాదలు సంస్కారాలు, పెళ్ళిళ్ళు, కులమతసంబంధమైన ఆచారాలు, ఆటపాటలు, వినోదాలు మొదలైన అంశాలు గ్రహింపబడ్డాయి. సాధారణ జీవనంలో శిక్షా - విధానం, జీతభత్యాలు, క్రయవిక్రయాలు, ఆహార పానీయాలు మొదలైన అంశాలు స్వీకరింపబడ్డాయి.

## 1. సాంస్కృతిక జీవనం

**పండుగలు :**

అన్ని మతాల్లోను పండుగలున్నాయి. ఇతరులకంటే హిందువులకే ఎక్కువ పండుగలున్నట్లు తెలుస్తుంది. తరతరాలుగా ఉన్న సంప్రదాయాలు క్రియా రూపాన్ని ధరించి పండుగలయ్యాయి. సాంఘికసంక్షేమంకోసం ఉద్దేశింపబడినవే పండుగలు. ప్రకృతికి సంబంధించిన పండుగలు వ్యవసాయానికి సంబంధించిన పండుగలు చాలా ప్రాచీనమైనవి. ఒక కాలంలో మత సంబంధంగా ఏర్పడిన పండుగలు తర్వాతికాలంలో ప్రజల ఆనందంకోసం ఆచరించే పండుగలుగా మారాయి. మత సంప్రదాయాలను బోధించిన మహాపురుషుల పేరుమీదకూడ పండుగలు ఏర్పడ్డాయి. సమాజంలోని నలుగురిని ఒక దగ్గరికి చేర్చడమేకాక, సాంస్కృతికమైన స్ఫూర్తిని కల్గించడంలో పండుగలు ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నాయి.

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు పండుగలను కొన్ని విభాగాలు చేశారు.[1] ఆయా విభాగాలలో మహాపురుషుల జన్మదినోత్సవాలను, ఋతు సంబంధమైన పండుగలను, శైవ వైష్ణవ మతసంబంధమైన వ్రతాలను దసరావంటి ఉత్సవాలను స్త్రీలు ప్రత్యేకంగా జరుపుకొనే వ్రతాలను పేర్కొన్నారు.

ఆయా కావ్యాల్లో పండుగలు వర్ణింపబడ్డ విధానాన్ని పరిశీలిద్దాము -

నన్నెచోడుడు తన కుమారసంభవ కావ్యంలో వసంతోత్సవాన్ని వర్ణించినాడు. వసంతోత్సవమే హోళి. ఇది ఋతుసంబంధమైన పండుగ. శివపార్వతుల వివాహానంతరం బంధువులంతా సంతోషంతో వసంతాలాడినట్లు నన్నెచోడుడు వర్ణించినాడు.

> "కనకంపు గ్రోళులగొని ముంచి కాశ్మీర
> జలములొండొరులపై జల్లువారు
> కర యంత్రమాదిగాగల జల యంత్రాలి
> నోలినొండొరులపై నొత్తువారు" 9-51

1 హిందువుల పండుగలు, పీఠిక xxi

చిమ్మన గొట్టాలలో కుంకుమ నీరునింపి ఒకరిమీద ఒకరు చల్లుకొనే వారు. కరయంత్రాలను జల్లులాటకు ఉపయోగించేవారు. ఈ వసంతాలాట పలు చోట్ల ముత్రాటగా పేర్కొనబడింది.

"విరిసెఱివేసలుందడిని వ్రేలకచాంతర పుష్పమాలికల్
దొరగగవల్వలంగములతో కదియన్నునుపూతలిమ్ముగా
తెరల విభూషణౌఘమణిదీప్తులుగ్రాల మహోత్సవమ్ముసన్
పురజనులర్థిమై చెలగిబోరన ముత్తటలాడి రెల్లెడన్" 9-52

స్త్రీలు వసంతాలాడడంవల్ల పూలు ముడిచినవారి సిగలు తడిసి వ్రేలాడాయి. పూలమాలలు జారాయి. ధరించిన దుస్తులు శరీరానికి అతుక్కొని పోయాయి. ఇదెంతో సహజమైన వర్ణన.

మనం హోళీ పండుగను ప్రతి సంవత్సరం ఫాల్గుణశుక్ల పౌర్ణమినాడు దేశమంతటా జరుపుకొంటున్నాము. కామదేవోత్సవమే వసంతోత్సవం అని నన్నెచోడకవిరాజు ధ్వనిగా తెలిపాడు.

"ఓలి తనరారు క్రోళ్ళను నొత్తుకుంకు
మారుణాకీర్ణ జలధారలమరె, చూడ
పికనతనుండు విటవిటీ వితతినేయు
విపుల తపనీయ నారాచవృష్టివోలె" 9-59

కుంకుమవల్ల ఎఱ్ఱబడిన జలధారలు మన్మథునియొక్క బంగరు బాణవర్షాన్ని తలపిస్తున్నాయట! ఇదెంతో మనోహరమైన భావన. కామదేవోత్సవానికి వసంతోత్సవానికి సంబంధం ఉన్నట్లు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు నిరూపించారు. [1]

కుంకుమ నీటితోనేకాక మంచిగంధం నీటితో వసంతాలాడిన ప్రజలు విభూతిధారి అయిన శంకరునితో సమానం అయ్యారని కవి వర్ణించిన తీరు అద్భుతం.

---

1. హిందువుల పండుగలు, పుట 143.

"వరచందన పంకంబున తిరమున ముక్తాఫలాది తెలుపెసగిన
స్ఫురణను ఈశ్వరుతో సహచరులై విమలాత్ములైన వారు సుబోరన్"
9-60

హోళీరోజు సాధారణంగా ప్రజలు కామున్ని దహనంచేసి ఆ తరువాత బూడిదను శరీరానికి పూసుకొంటారు, మీద చల్లుకొంటారు. "ఈశ్వరునితో సహచరు"లవుతారు. ఇంకా ప్రజలు ఆవసిడితో వసంతాలు ఆడేవారని, సంతోషంతో జయజయధ్వనులు చేసేవారని తెలుస్తుంది.[1] వసంతోత్సవాన్ని దీర్ఘంగా చిత్రించిన ప్రప్రథమ కవి నన్నెచోడుడు.

పాల్కురికి సోమనాథుని బసవపురాణంలో నందికేశ్వరవ్రతం వర్ణింపబడింది. నందికేశ్వరుని వ్రతాన్ని ఇష్టసిద్ధికి మూలంగా భావిస్తారు. ఈ వ్రతాన్ని తొమ్మిది సోమవారాలు ఆచరిస్తారు. వ్రతానంతరం నందీశ్వరుణ్ణి స్నానం చేయించి పూలతో అలంకరించి, మెత్తని వస్త్రాలు కప్పి, గజ్జెలు అందెలు సమకూర్చి పులగాన్ని నైవేద్యంగా సమర్పిస్తారు.

''ఇమ్ముల సోమవారమ్మాదిగాగ
తొమ్మిది దినములుత్సుకవృత్తి నోచి
మఱునాడు నందిని మజ్జనంబార్చి
గుఱుతైన చందన కుసుమంబు లిచ్చి
మెత్తనివస్త్రముల్ మెయినిండ గప్పి
యుత్తమాభరణంబులురు గజ్జియలును
నందెలు గంటలు నలవడగూర్చి
..........................
పులగంబు ముందటఁబోవగాబోసి
పులకండమును నెయ్యికలిపి యర్పించి" 1—13, 14.

1. కుమారసంభవం, 10—104.

సంతానంలేనివారు నందికేశ్వరవ్రతాన్ని ఆచరించేవారు. నందీశ్వరున్ని వ్రతానంతరం వినాయకునిలాగ నిమజ్జనం చేయక, ఎక్కడో ఒకచోట పూల చెట్ల మొదళ్ళలో విడిచిపెట్టేవారు. వ్రతాలకు సోమవారాన్ని పవిత్రంగా భావించేవారు ఆనాడు. శివున్ని సోమవారాలు పూజించినట్లు పండితారాధ్య చరిత్రలో వర్ణింపబడింది.

''క్రమమొంద సోమవారము..................

భవుని పూజించుచు బడయుచునుండె" మహిమప్రకరణం, 274.

ఆయా దేవతలను ఆయారోజుల్లో ప్రత్యేకంగా పూజించే ఆచారాన్ని ఆధునికయుగంలోను చూస్తున్నాము.

సంతానప్రాప్తికై ప్రజలనేక వ్రతాలు నిర్వహించినట్లు పల్నాటి వీర చరిత్రలో వర్ణింపబడింది. ఆనాటి ప్రజలు జరిపిన పూజలూ, చేసిన దానాలు విచిత్రంగా ఉన్నాయి. వారు శిథిలమైన ఆలయాలను పునరుద్ధరించేవారు. సత్రాలను కట్టించేవారు. చలిపందిళ్ళను వేయించేవారు. శ్రీశైలం వెళ్ళే భక్తులకు రాగి కమండలాలు, భిక్షాపాత్రలు ఇచ్చేవారు. గుమ్మడిపళ్ళను దానం చేసేవారు. విష్ణుకాంత, సంధ్యావర్తి మొదలైన నోములు నోచేవారు. నందీశ్వరునికి పులగాన్ని అర్పించేవారు. ఇంకా కనిపించిన గుడికల్లా మొక్కేవారు. శివరూప దేవతలను ఆరాధించేవారు.[1]

శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రలో ఎన్నో నోములు పేర్కొన్నాడు. వాటిలో గజనిమ్మనోము ఒకటి. సంతానంకోసం ఐతమ్మ ఎన్నో నోములు నోచింది. అయినా సంతానం కలగలేదు. చివరికామె గమజనిమ్మనోము నోచింది. దీన్ని ఒక సంవత్సర కాలం పాటించాలి. ఈ నోము ప్రభావంచేతనే బాలచంద్రుడు ఆమెకు జన్మించినాడు.

క్రీడాభిరామంలో సంక్రాంతి పండుగ వర్ణింపబడింది. పామర స్త్రీలు పండుగరోజు ఉదయాన ఇళ్ళముందు పేడముద్దలు పెట్టేవారు. వీటినే ఈ రోజు మనం గొబ్బెమ్మలంటున్నాము.

---

1. పల్నాటి వీరచరిత్ర, పుట 52.

"కందుకి దేశి సర్వేడు ప్రకారమునన్ పురుషాయిత క్రియా
తాండవరేఖ చూపెడు విధంబున పాపురభామలేరయా
రెండ ప్రధారవే రచియించె నితంబభరంబు చన్నులున్
కుండలముల్ పరుల్లవల గోమయపిండము లింబిమునంగిటన్" —82

శివరాత్రి మాహాత్మ్యంలో సంక్రాంతితోపాటు నాగుల చవితి, రథసప్తమి మొదలైన పండుగలు ప్రస్తావింపబడ్డాయి.

"చలి ప్రవేశించు నాగుల చవితినాడు
మెఱయువేసవి రథసప్తమీదినమున
అచ్చనీరు ప్రవేశించు పెచ్చుపెరిగి
మార్గశిర పౌష్యమాసాల మధ్యవేళ" 4—25

"ఇండ్ల మొదలను సిరెండ సిడికలను
అనుగుచమ్మ్రుడు సన్నియు నాటలాడు
అత్తయును కోడలును గుమ్మలాడుకుమ్మ
గాచుచోటికి మకరసంక్రాంతివేళ" 4—27.

పాములవల్ల ఏకీడూ కలగరాదని జానపదులు ఏర్పరచుకొన్న పండుగే నాగులచవితి. ఈ పండుగకే నాగుల పంచమి అని కూడ పేరుంది.[1] నాగుల పంచమిని శ్రావణశుద్ధ పంచమినాడు జరుపుకొంటారు. ఈ పండుగరోజు ప్రజలు చలిమిడి తయారుచేసి నాగరాజుకు పెడతారు. ఇల్లలికి పండుగ చేసుకోవడంతో సరిపెట్టక నాగరాజున్న పుట్టలను వెదుకుతూ పోతారు స్త్రీలు.

సూర్యున్ని ఉద్దేశించి జరిపే పండుగ రథసప్తమి. దీన్ని మాఘశుక్ల సప్తమినాడు జరుపుకొంటారు. ఇది ఎక్కువగా బ్రాహ్మణులకు సంబంధించిన పండుగ. ఇక సంక్రాంతి. ఇది మార్గశిరం లేదా పుష్యమాసంలో వస్తుంది. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిన సందర్భంలో జరుపుకొనే పండుగ ఇది.

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం, డా. ఆర్వీయస్ సుందరం, 303.

సంక్రాంతి చలికాలంలో వచ్చే పండుగ కాబట్టి ఈ సందర్భంగా అన్న దమ్ములు నీరెండలో ఆటలాడుకోవడాన్ని, చలిని పోగొట్టుకోదలచిన అత్తా కోడళ్ళు కుమ్ముదగ్గర చేరి పోట్లాడుకోవడాన్ని శ్రీనాథుడు చక్కగా వర్ణించి నాడు.

ఆముక్తమాల్యదలో ఏకాదశివ్రతం పేర్కొనబడింది "తొలేకాదసికి పండుగలు తోసుకొస్తాయి" అని సామెత. ఆషాఢ మాసంలో శుక్లపక్షంలో వచ్చే ఏకాదశికి ఒక ప్రత్యేకత ఉంది. దీన్నే తొలి ఏకాదశి అంటారు. ఆషాఢ శుద్ధ ఏకాదశి మొదలుకొని కార్తిక శుక్ల ఏకాదశి వరకు చాతుర్మాస్యంగా వ్యవహరింపబడుతుంది. ఈ నాల్గు నెలలలోని ఏకాదశులు చాలా పవిత్రంగా భావింపబడుతాయి.

పాండ్యరాజు శైవుడు. అతని రాణి వైష్ణవ భక్తురాలు. ఆమె ఏకాదశి వ్రతాన్ని జరిపిన విధానాన్ని రాయలు కన్నులకు కట్టినట్లు చిత్రించినాడు. అందమైన ముంగిట్లో ఉన్న తులసి వనంలో ముగ్గులు పెట్టి, దశమినాడు ఒక్కపొద్దూ, ఏకాదశమినాడు ఉపవాస జాగరణాలూ ఉండి, ద్వాదశినాడు పారణచేసి విష్ణు స్తోత్ర పాఠాలతో కాలం గడిపి, మూడు రాత్రులు పతితో సంభోగాన్ని కోరక నియమ నిష్ఠలతో ఏకాదశి వ్రతాన్ని పాండ్యరాజు పట్ట మహిషి జరుపుకొన్నది. వ్రతానంతరం ముఖాన నిలువు కస్తూరి బొట్టు స్థానంలో చుక్కబొట్టు పెట్టుకొని ఆమె భర్త దగ్గరికి చేరేది. ఈ వర్ణనను బట్టి భార్యాభర్తలు ఎవరి విశ్వాసాన్ని బట్టి వారు శివకేశవులను ఆరాధించే వారనీ, అందువల్ల వారి దాంపత్య జీవితానికి ఎలాంటి విఘాతం కలిగేది కాదనీ తెలుస్తుంది.

రాయలు ప్రతి సంవత్సరం వసంతోత్సవాలను స్వయంగా జరిపించే వాడు. పారిజాతాపహరణంలో ఈ విషయం ప్రస్తావింపబడింది.

"ప్రతివర్ష వసంతోత్సవ కుతుకాగత సుకవినికర గుంఫిత కావ్య
స్మృతిరోమాంచ విశంకిత చతురాంతఃపుర వధూప్రసాదసరసిరా"
1-139

వసుచరిత్రలో భట్టుమూర్తి కొమ్ములలో నీరునింపి చల్లుకోవడాన్ని, చిమ్మనగ్రోవిలో పూదేనెను నింపి పిచికారీ చేయడాన్ని వర్ణించినాడు.

''శృంగములు వట్టి నీరాడ చేరునపుడు'' 3-155

''చిగురుంజిమ్మనగ్రోవితో నొకతె రాజీవాసంబుంచి'' 3-158

పుణ్యక వ్రతాన్ని సత్యభామ ఆచరించినట్లు పారిజాతాపహరణంలో వర్ణింప బడింది [1]

పుణ్యక వ్రతాన్ని జరిపేవారు నదికి వెళ్ళి స్నానంచేసి, పరిశుభ్రమైన వస్త్రాలు ధరించి, ఆభరణాలు పెట్టుకొని, గంధం పూసుకొని, పూలతో కొప్పును అలంకరించుకొని భర్త పాదాలకు నమస్కరించి, పేరంటాండ్రను సత్కరించాలి. ఇలా నెలరోజులు చేస్తే ఈ వ్రతం స్త్రీలకు కోరిన కోరికలను తీరుస్తుంది. పెళ్ళయిన స్త్రీలే యీ వ్రతాన్ని ఆచరిస్తారు.

వైజయంతీ విలాసంలో లక్ష్మీదేవి పండుగ వర్ణింప బడింది. శరదృతువు ప్రవేశిస్తున్నప్పుడు వచ్చే ఈ పండుగ నాటి విశేషాలను సారంగు తమ్మయ్య చక్కగా వర్ణించినాడు. ఎక్కడ చూసినా కర్పూరం, కస్తూరి ముదలైన వాటి పరిమళాలు వ్యాపించాయి. నూనె, నెయ్యి — వీటిని ఉపయోగించి పిండివంటలు చేశారు. కమ్మగా కూరలను తాళింపు పెట్టారు. సామాన్య ప్రజలు గొట్టె పొట్టేళ్ళ మాంసాన్ని వండుకొన్నారు. పార్వతీదేవిని పూజించి మద్యంతో సాక పెట్టారు :

''ప్రచురమై యొకచోట పాటీర కర్పూర
కస్తూరి కాదుల కమ్మతావి
దండిగా నొకచోట పిండివంటల వెంట
ప్రభవించు తైలాజ్య పరిమళములు
రహినొకచోట కూరల తాళిపోతల
తోరంపు సంభార సౌరభములు

1. పారిజాతాపహరణం, ముక్కుతిమ్మన, 5—56.

రమణ నొక్కొక్కచో సురభ్రాది మస్తముల్
కమలించు మాంసంపుగములకమరు
క్రమ్మికొని యొక్కచో సంబికాసమర్చ
నాసముద్భూత మైరేయ వాసనలును
లంకెదోదూపులాడంగ లక్ష్మిదేవి
పండు గేతెంచె కన్నులపండువగుచు'' 3-80.

లక్ష్మిదేవి పండుగనాడు పార్వతీదేవిని పూజించినట్లు చెప్పడం వల్ల ఈ పండుగ అమ్మవారి పండుగేమో అనిపిస్తుంది. లచ్చుమ్మ దేవతగా లక్ష్మిదేవి గ్రామాల్లో పూజలందుకోవడం చూస్తాము. గ్రామీణులు గొర్రెల్ని బలి ఇచ్చి మాంసాన్ని వండుకొని తిన్నట్లు చెప్పడం వల్ల లచ్చుమ్మ గ్రామదేవత అనీ, ఆమెపేర జరిగేది లక్ష్మిదేవి పండుగ అనీ ఊహించవచ్చు. ఉదాహరణకు పేరంటాండ్ర కథల్లో లక్ష్మమ్మదేవత ప్రస్తావన ఉంది. పార్వతి లక్ష్మమ్మకు కూతురు. పార్వతి పెళ్ళి విషయంలో తగాదా ఏర్పడి లక్ష్మమ్మ మరణించి శిలగా మారుతుంది. నూటొక్క గుడులలో పూజలందుకొంటుంది.[1] ఈ కథను బట్టి లక్ష్మిదేవి పండుగను గ్రామదేవత పండుగగా నిర్ధారింపవచ్చు.

సారంగుతమ్మయ్య ఇంకా ఈ పండుగనాటి విశేషాలను వర్ణిస్తూ ఈ రోజు విటులు వేశ్యలకు కానుకలు పంపేవారనీ, డబ్బు లేకపోతే అప్పు చేసీ లేక దొంగతనం చేసైనా వేశ్యలను సంతృప్తి పరిచేవారనీ తెలిపినాడు.[2] ఈ వర్ణనను బట్టి ఈ పండుగ దీపావళి పండుగగా తోస్తుందనీ, ఈ నాటికీ భోగం స్త్రీలు ఈ పండుగనాడు ధనవంతుల ఇళ్ళకు పొద్దున్నే వెళ్ళి మంగళ హారతులిచ్చి కానుకలు తీసుకొంటారనీ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వివరించినారు.[3]

---

1. తెలుగు జానపద సాహిత్యం — పురా గాథలు,
   డా॥ రావి ప్రేమలత, 240.
2. వైజయంతీ విలాసం, సారంగుతమ్మయ్య, 3-82.
3. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, 261.

శివరాత్రి మాహాత్మ్యం తరువాత సంక్రాంతిని విశేషంగా వర్ణించిన కావ్యాలు శుకసప్తతి, హంసవింశతి. ఈ పండుగ తెలుగువారికి అత్యంత ప్రీతిపాత్రమైంది. ఈ పండుగకు పంటలు పండి ధాన్యం ఇళ్ళకు వస్తుంది. కర్షకులు ఘనంగా జరుపుకొనే పండుగ ఇది. దీన్ని మూడురోజులు జరుపు కొంటారు. మొదటి రోజు భోగి, రెండవ రోజు సంక్రాంతి, మూడవ రోజు కనుమ. పశువులను అలంకరించే పండుగ కాబట్టి దీన్ని పసులపొంగలి అంటారు. తెలంగాణాలో దీనికే కనుము అని పేరు. రాయలసీమలో పసుల పొంగలి అని పిలుస్తారు. ఈ పేరుతోనే సంక్రాంతి శుకసప్తతి, హంసవింశతి కావ్యాల్లో చిత్రింపబడింది.

కదిరీపతి శుకసప్తతిలో సంక్రాంతిని సహజ మనోజ్ఞంగా వర్ణించినాడు. ఆ రోజు అంగడిలో అన్ని వస్తువులకూ మంచి గిరాకీ ఉంటె. తయారు చేసిన పదార్థాలన్నీ చిటికలో అమ్ముడు పోయాయి. అమ్మకందార్లు అయ్యో ఇంకా తయారు చేయలేదే అని బాధపడుతారు. ముఖ్యంగా కుమ్మరులు తాము తయారు చేసిన పాత్రలు పూర్తిగా అమ్ముడు పోయేసరికి ఇంకా నాల్గు ఆవములు పెట్టి ఉంటే ఎంతో దబ్బు వచ్చేది కదా అని బాధ పడ్డారు. వెల కూడా చెప్పకముందే కొనుగోలుదార్లు కుండలూ, కుడుములూ, పసుపూ, గొర్రెలూ మొదలైనవాటిని కొనుక్కొని పోయారని పండుగనాటి అంగడి విశేషాలనూ, ప్రజల వేగిరపాటునూ, వస్తువులను అమ్మేవార్కి మనస్తత్వాన్ని కవి చక్కగా చిత్రించినాడు.

''ఇంక నాల్గావంబు లిడనైతిగా యంచు
కుమ్మరి నెమ్మది కుందికొనగ
కుడుము రూకలకెల్ల గొననైతిగా యంచు
చేరతేరని యూరివేరమొంద
గొరియమందల నించుకొననైతిగా యంచు
గొల్లవాడూరక కుళ్లుకొనగ
పెను పసుపునే విత్తుకొననైతిగా యంచు
కాపు నిద్దురలేక కళవళింప

మొనసి వెలజూపి చూపకమునుపె వారి
సరుకు లమ్ముడు పోయెనే జాతి వారి
కేని పాటింప వలసి పేరెక్కినట్టి
యాదినంబుననంబురుహాయతాక్షి" 2-564

"ఏ జాతివారికేని పాటింపవలసి పేరెక్కినట్టి యాదినంబున" అనడం వల్ల అన్ని జాతుల ప్రజలూ సంక్రాంతిని ఘనంగాజరుపుకొనేవారనీ, అందరికీ ఆ రోజు అంగడిలో సరుకులను కొనుక్కునే అవసరం కలిగేదనీ తెలుస్తున్నది.

దేవతలను అలంకరించడానికి పసుపునూ, దేవతలకు బలి ఇవ్వడానికి గొర్రెలనూ ప్రజలు విపరీతంగా కొనేవారు. సంక్రాంతినాడు బోనాలను ఎత్తుకోవడం కూడా జరిగేది. పొంగళ్ళకు బియ్యాన్ని ఎక్కువగా అంగళ్ళలో అమ్మేవారు. ఒక రూకకే కావలసిన బియ్యం వచ్చేవి.

"పొంగలికైన బియ్యంబుదెమ్ము శీఘ్రమున నంచు నొకరూక
చేతికిచ్చి" 2—565.

శుకసప్తతిలో విత్తునాటి పండుగ ప్రస్తావింప బడింది. ఇది పూర్తిగా కర్షకుల పండుగ. జొన్నలు విత్తేనాడు పురోహితుల్ని పిలిచి, ముహూర్తాన్ని నిర్ణయించి ఫలాఫలాలు చూసుకొనే ఆచారం ఈ రోజుల్లోలాగా ఆనాడూ ఉండి.

"వచ్చిన పెద్దరెడ్డి సుగవాసిలి మేలిపుడైన నీడకున్
వచ్చితెయంచు బావయనువాని ప్రదస్తరలాడి బావడా
యిచ్చట చల్లు విత్తు ఫలియించునె వేళగుణం బెరింగి నా
యిచ్చకు మెచ్చగావదరు మిప్పుడనన్ వినియాతడుబ్బునన్." 2-444

జానపదులు ఏకులం వారైనప్పటికీ చుట్టాలవలె వరసలు పెట్టుకొని పిలుచుకోవడం కద్దు. ఒకరినొకరు ఎగతాళి చేసుకోవడం, ప్రశంసించు

కోవడం వారికే తగింది. పెద్దరెడ్డి బ్రాహ్మణున్ని 'బావా' అనడం వారి ఆత్మీయతనే సూచిస్తుంది.

రాధామాధవ కావ్యంలో నాగళ్ళ పండుగ ప్రస్తావింపబడింది. ఈ నాగళ్ళ పండుగే కనుము. సంక్రాంతి సందర్భంగా పశువులను అలంకరించడమేకాక నాగళ్ళను పూజిస్తారు రైతులు.

''దున్నకయె యెల్ల సస్యము
లన్నగరి పొలాలపండ హాలికులతి సం
పన్నులయి కాపులనియెడి
చిన్నెలకింటింట పూజసేతురు హలముల్" 3_88

హంసవింశతి కావ్యంలో సంక్రాంతి పొంగలి పండుగగా పేర్కొనబడింది. ''............ పండుగలకు నలపబ్బములకు పొంగలికిని దేవరకు.... కొఱతపడకుండ కుండలాకుమ్మరిచ్చు.'' 5_14

పాలు పొంగించడానికి కుమ్మరి చాలినన్ని కుండలు ఇచ్చే ఏర్పాటు ఈనాటికీ ఉంది.

నీలాసుందరి పరిణయంలో నీల తనపై కృష్ణుడు తలంబ్రాలు పోసినట్లైతే వినాయకునికి తరగని ఉండ్రాళ్లు సమర్పిస్తానని మ్రొక్కుకొన్నది.

''తన తలపైవడి బల్లిదు
డనుపొప్పగ క్రొత్త ముత్తియపు తలబ్రాల్పో
సిన తఱుగని యుండ్రంబులు
వెనకయ్యరో నీకు బోతువెరవుదలిర్పన్'' 1_116

వినాయకచవితి పండుగనాడు తప్పనిసరిగా ఉండ్రాళ్లువండి గణపతికి సమర్పించడం తెలుగువారి ఆచారం.

ఈ విధంగా గ్రామీణుల సంస్కృతీ సంప్రదాయాలను ప్రతిఫలించే పండుగలు మన ప్రాచీన కావ్యాల్లో చిత్రింపబడ్డాయి.

జా త ర లు:

యాత్రా శబ్దభవం జాతర. సంస్కృతంలో యాత్రాశబ్దానికున్న అర్థం కంటె తెలుగులో తద్భవరూపమైన ఈ శబ్దానికి ఒక ప్రత్యేకమైన అర్థం కనిపిస్తుంది. ఊరేగింపుతో కూడిన పండుగ జాతర. "దేవత, తీర్థము, పర్వతము, సముద్రము మొదలైన వాటిని గూర్చి చేసే ప్రయాణమే జాతర" అని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొంటున్నది.[1] యుద్ధమల్లుని శాసనంలో "కుమారస్వామి చేబ్రోలునుండి కాలినడకన జాతరవచ్చి" అని చెప్పబడింది. శక్తి మొదలైన వాటి పేరుమీద గ్రామీణులు సామూహికంగా జరుపుకొనే ఉత్సవాలే జాతరలు. ముఖ్యంగా గ్రామ దేవతల్ని ప్రసన్నం చేసుకోవటం కోసం ఈ జాతరలు జరుపుకోవటం ఈనాటికీ గ్రామాల్లో చూస్తాము.

భారతదేశంలో నగరాలకంటె గ్రామాల సంఖ్యే ఎక్కువ. గ్రామాలు వ్యవసాయానికి కేంద్రాలు. అటువంటి గ్రామాలను దేవతలు రక్షిస్తారన్న విశ్వాసమే అనాదిగా పల్లీయులచేత ఉత్సవాలు జరిపిస్తున్నది. దేవతల అనుగ్రహం ఉంటే పశుధాన్య సంపదలతో గ్రామాలు కళకళలాడుతాయనీ, లేకుంటే అనావృష్టి, అంటువ్యాధులు, ఆకస్మిక మరణాలు సంభవిస్తాయనీ గ్రామీణులు భావిస్తారు. ఆ కారణంగా దేవతల ప్రీతికొరకు జాతరలుచేసి బలులు, సమర్పణలు సాగించడం జరిగింది.

గ్రామీణుల మత విశ్వాసాలకు జాతరలు దర్పణాలు. జాతరల సందర్భంలోగాని, పండుగల సందర్భంలోగాని ఆటలు ఆడుతూ, పాటలు పాడుతూ ప్రజలు సంతోషంగా ఉండడం ఇప్పటికీ చూస్తాం. గొల్లలు ఆటలతో, పాటలతో ఉల్లసిల్లుతూ రైవతకాద్రికివచ్చి పూజలు చేసినట్లు నన్నయ భారతం ఆదిపర్వంలో వర్ణించినాడు.

"పొలుపుగ పూసికట్టి తొడి భూరి విభూతి ప్రకాశితంబుగా
కలయగ తత్పురీజనులు కాంస్య మృదంగ ముకుందవేణుకా
హళపటహధ్వనుల్ చెలగనాటలు పాటలునొప్ప నెల్లవా
రలు జనిచేసిరర్చనలు రైవతకాద్రికి నుత్సవంబుతోన్" 8-174

1. మూడవ సంపుటం, పు. 380.

కేవలం వాద్యాలు మ్రోగిస్తూ పాటలు పాడినట్లు మూలంలో ఉండగా నన్నయ తనకాలంలో ప్రచారంలో ఉన్న వాద్య విశేషాలను పేర్కొనడం గమనించదగిన విషయం. కొండలనూ, గోసంతతినీ ఆరాధించడం అనాదిగా వస్తున్న ఆచారం.

"గురుకుచయుగ్మముల్ కదల క్రొమ్ముడులందుల పుష్పముల్ పయిం
దొరగనిదాఘ బిందు వితతుల్ చెదరన్ మదిరామదంబునన్
పరవశులయ్యు నింపెసగ పాడుచు తాళము కూడ మెట్టుచున్
తరుణియ లొప్పనాడిరి ముదమ్మున తమ్మ జనాలిమెచ్చగన్."

8-175.

పాలిండ్లు కదలాడగా, పూలు కొప్పులనుండి జారిపడగా, చెమట బిందువులు రాలగా, కల్లు త్రాగిన మైకంలో పాటలు పాడుతూ, తాళానికి అనుగుణంగా స్త్రీలు ఆడినట్లూ, వారిని చూసి ప్రేక్షకులు మెచ్చుకున్నట్లూ నన్నయ చేసిన వర్ణన ఈ నాటికీ జాతరలందు గ్రామీణ స్త్రీలు ఆడే ఆటలనూ పాడే పాటలనూ స్మృతికి తెస్తున్నాయి.

పాల్కురికి సోమనాథుని కాలంలో వీరభద్రుని పేర జాతరలు జరిగేవి. ఈ జాతరలకు ప్రజలు బండ్లమీద వెళ్ళేవారు. గొడగూచికథలో ఈ విషయం చెప్పబడింది. గొడగూచి శివున్ని పాలు ఆరగించమని వేడుకొనే సందర్భంలోని పద్యాన్ని చూడండి.

"వీరభద్రుని జాత్రవేళ నిన్నుండి
యే రొప్పబనిచెద నా ప్రాలుద్రావు
యెడమడుగేమిటికేపాలలోని
కడుకులు తెచ్చెద నట్లైనజెపుమ."[1]

శివున్ని తనతోపాటు బండి ఎక్కించుకొని వీరభద్రుని జాతరకు తీసుకొని పోతానని గొడగూచి పలికిన పలుకుల్లో శిశు హృదయం ప్రస్ఫుటమౌతుంది.

1. బసవ పురాణం, ఆ. 3, పు. 71.

ఎట్టిన కాలంలో ఆయా దేవతల పేరుమీద జాతరలు జరిగేవి. జాతర లకు వెళ్ళే ప్రజలు ఇంటిదగ్గరే అనేక రకాలైన వంటకాలు తయారు చేసు కొని వాటిని కావళ్ళలోను, బండ్లలోను తీసుకొని వెళ్ళేవారు. వాయిద్యాలు మ్రోగించేవాళ్ళూ ముసలివాళ్ళూ వెంటరాగా జాతరలకు వెళ్ళే ప్రజలతో రహ దార్లు క్రిక్కిరిసిపోయేవి.

''కావళ్ళ బండ్లను వలయు భంగినిడి
యథోచిత జనము లింపెసగ నడువ
వివిధ వాద్రిత్రములు మ్రోయ వృద్ధగోపులోలి
నడిపింప జాతర యొప్పు మిగిలె.'' 7-114.

క్రీడాభిరామాన్ని బట్టి కాకతీయులు ఓరుగంటిని పాలిస్తున్న కాలంలో పామరజనులు ఏకవీరాదేవినీ, మైలారు దేవునీ పూజించేవారని తెలుస్తున్నది. ఏకవీరను కాకతి దేవతతోపాటు పూజించినట్లే మైలారుదేవుని భైరవునితోపాటు పూజించే ఆచారం ఆనాడుంది.

''కాకతమ్మకు సైదోడు యేకవీర.'' - 128.

కాకతి జైనదేవత అని పరిశోధకులు నిరూపించినారు. పరశురాముని తల్లి ఐన రేణుక ఏకవీరాదేవి. ఏకవీరాదేవి పేరుమీద ఉత్సవాలు జరిగేవి. ఆకాలంలో ప్రజలు వీరగాథలంటే ఇష్టపడేవారు. పరశురాముని కథల్ని చెప్పుకొనేవారు. బవనీల జాతివారు పరశురామునిమీద పాటలల్లి పాడేవారు.

ఏకవీరకే 'ఎల్లమ్మ' అని పేరు. మాత, మాహురమ్మ అని కూడ ఆమెను పిలుస్తారు. ఏకవీరను గూర్చి శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఇలా వ్రాసినారు. ''ఈ దేవత శైవ దేవతయై యుండును. 'కాకతమ్మకు సైదోడు ఏకవీర' అని వర్ణించిన పద్యమును బట్టి యీ దేవత రేణుక (పరశురాముని తల్లి) యని స్పష్టము ఈమె మాహురము అను గ్రామమున నెలకొన్నదగుటచే మా ఊరమ్మ అనియు పిలువబడెను. ఈ దేవత నగ్న దేవత. ఈమెనే ఇప్పుడు తెలంగాణములో, రాయలసీమలో ఎల్లమ్మ దేవర యని యందురు''[1]

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, 26.

ఎల్లమ్మ కథను రేణుకాదేవి కథగా ఈనాటికీ రాయలసీమ పల్లెల్లోనూ, మహబూబ్‌నగర్ జిల్లాలోనూ బవనీండ్లు (మాదిగ జాతివారు) జమడిక అనే చర్మవాద్యాన్ని వాయిస్తూ రెండురోజులు వరుసగా వినిపిస్తారని శ్రీ సురవరం వారు వివరించినారు.[1]

కాకతి, ఏకవీరలతోపాటు భైరవుడు, మైలారుదేవుడు క్రీడాభిరామంలో పేర్కొనబడ్డారు.

> "భైరవునితోడిజోడు మైలారు దేవు
> డోరుగంటి నివాసి మేలొసగుగాత." - 145.

ఇంకా ఈ కాలంలో చముడేశ్వరి, వీరభద్రుడు, కుమారస్వామి, పాండవులు, స్వయంభూదేవుడు, ముసానమ్మ మొదలైన దేవతలు పూజింపబడేవారు. వీరితోపాటు కలనిపోతులయ్య, గురిజాల గంగమ్మ అనే గ్రామ దేవతలూ, మాచర్ల చెన్నకేశవస్వామి మొదలైనవారూ ఆరాధింపబడినట్లు క్రీడాభిరామాన్ని బట్టి తెలుస్తున్నది.

ఏకవీరాదేవిని ముఖ్యంగా పామరులు పూజించేవారు. చండాల స్త్రీలు ఏకవీరనుగూర్చి పాడేటప్పుడు అకలంకస్థితిని పొందేవారు. బ్రహ్మానందాన్ని అనుభవించేవారు. ఆకాలంలో ఆదేవతకు పెద్దపీటవేసి గౌరవించినవారు పల్లె ప్రజలే.

> "అకలంక స్థితిగోరి కొల్చెదరు బ్రహ్మానంద భావంబునన్
> సకలానందమయైక మాతలగుచున్ సంతోష చిత్తంబునన్
> తక దుమ్ముల్ యకతాళముల్ జవనికల్ తందానలమ్మయ్యకున్
> ఎకవీరమ్మకు మాహురమ్మకు నభో హ్రీంకార మధ్యాత్మకున్."
> — 132.

నేటికీ ఏకవీరాదేవి ఎల్లమ్మ దేవతగా పూజలు అందుకొంటున్నది. ఎల్లమ్మ జాతరలు కూడ జరుగుతున్నాయి. తెలంగాణా ప్రాంతంలో స్త్రీలు శ్రావణ మంగళవారాల్లో ఉపవాసముండి ఈ దేవతను పూజిస్తారు. గ్రామాల్లో

---

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, 27.

దాదాపు అందరి ఇళ్ళల్లో పసుపు కుంకుమలతో అలంకరింపబడ్డ ఎల్లమ్మ గుళ్ళు ఉన్నాయి. అవి ఆ దేవత పట్ల గ్రామీణులకున్న భక్తి ప్రపత్తులను తెలియజేస్తున్నవి. చర్మవ్యాధులూ, జ్వరాలూ వచ్చినప్పుడు ఎలమ్మకు మొక్కుకోవడం జానపదులకు అలవాటు. వారిని కరుణించి కాపాడే చల్లని తల్లి ఆమె. తెలంగాణాలో పాములను కూడా ఎల్లమ్మదేవతగా పూజించే సంప్రదాయం ఉంది.[1] క్రీడాభిరామంలో వర్ణింపబడిన మైలారు భటుల సాహస కృత్యాలు పరిశీలిస్తే ఆనాటి ప్రజల పూజా విధానం కొంత వరకు అర్థమౌతుంది. ఆపదలు వచ్చినప్పుడు మొక్కుకొని, ఆ తరువాత ఉత్సవాల్లో మొక్కులు తీర్చుకోవడం గ్రామీణులకు అలవాటు. ప్రాణ త్యాగానికైనా సిద్ధపడే మొక్కులు వారివి. వారి విశ్వాసాలు వారివే. తమవి మూఢ విశ్వాసాలన్న ఆలోచనే వారికుండదు. లేకపోతే మండుతున్న నిప్పుల్లో ఎందుకు నడుస్తారు? సిడి ఎందుకు వ్రేలాడుతారు?

మైలారు భటుల ఆగడాలను కవి ఈ పద్యాలలో చిత్రించిన తీరును చూడండి.

"అవ అవమండు నెఱ్ఱని చంద్ర మల్లెల
చోద్యంపు గండాలు చొచ్చువారు
కరవాడి యలుగుల గనప పాతర్లలో
నుఱ్ఱి చేరులు గోసి యుఱుకువారు
గాలంపుకొంకి కంకాళ చర్మము గ్రుచ్చి
యుడు పెధ నుయ్యెల లూగువారు
కటికి హొన్నాకంబు గండకత్తెర బట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు
సందులను నారసంబుల సలుపువారు
మెదడు కుడిచేత నారతులిచ్చువాడు

1. తెలుగు జానపద గేయ సాహిత్యము, డా॥ బి. రామరాజు, 466.

సాహసము మూర్తిగైకొన్న సరణివారు
ధీర హృదయులు మైలారు వీరభటులు'' - 142.

మైలారు భటుల సాహస కృత్యాలు ఒళ్లు జలదరింప జేసేవిగా ఉంటాయి. వారు ఉత్సవాల సందర్భంలో దేవతల సంతృప్తికోసం ప్రాణాలను విడవడానికి కూడా వెనుకాడరు. వారు కణకణలాడే చంద్ర నిప్పుల గుండాల్లో నడిచేవారు. ఎత్తైన ప్రదేశాలనుండి దూకేవారు. శూలాలతో శరీరానికి గ్రుచ్చు కొనేవారు. ఎత్తుగా కట్టిన ఉట్లను ఛేదించి ప్రాణత్యాగం చేసేవారు. నాలుక్ల లను కత్తిరించుకొనేవారు. గండ కత్తెరలతో గొంతులు తురుముకొనేవారు. అరచేతుల్లో హారతులను వెలిగించుకొనేవారు. నిప్పులపై నడవడాన్ని గుండాలు త్రొక్కడమని వ్యవహరిస్తారు. ఇటువంటి హింసాపూరితమైన మ్రొక్కుబళ్ళనే తెనాలి రామకృష్ణుడు పాండురంగమాహాత్మ్యంలో పేర్కొన్నాడు.

ఉత్సవాలు జరిగే సమయాల్లో మైలారు భటులు సింహధ్వజాలను పైకెత్తేవారు. వేపాకు తోరణాలు కట్టేవారు. వీథుల్లో పిల్లలూ, ముత్తైదువలూ రంగురంగుల పూర్ణకుంభాలు పెట్టేవారు.

''అదిగో ! ఎత్తినవారు పట్టణము మ
ధ్యక్షోణి సింహధ్వజం
ఇదిగో ! కట్టినవారు నింబదళమా
ల్యాతోరణ వ్రాతముల్
విదితంబయ్యె మహోత్సవంబు నెఱయన్
వీథీవిటంకంబులం
పదిగో ! నిల్పినవారు పూర్ణకలశం
బాబాల వృద్ధాంగనల్'' — 146

పాలకుల ధ్వజాలను ప్రజలు గౌరవించడం అనాదిగా వస్తున్న ఆచారమే. కాకతీయరాజులది వరాహ ధ్వజం. వారు ఆ ధ్వజాలనే నిల్పినారు. గ్రామదేవతల ఆరాధనలో వేపకొమ్మలకు ప్రాధాన్యం ఎక్కువ. ఉదాహరణకు అమ్మవారి జాతరలో సిగం ఊగేవారు వేపమండలను శరీరానికి కట్టుకోవడం,

చేతుల్లో పట్టుకోవడం చూస్తాము. వేపమండలను తోరణాలుగా కట్టడం నేటికీ ఉన్న ఆచారమే. బాగా పరిశీలిస్తే ధ్వజాలూ, తోరణాలూ, పూర్ణకలశాలూ మన సంస్కృతీ సంప్రదాయాలకు గుర్తులు. వీటితో అలంకరింపబడ్డ ప్రదేశాన్ని చూస్తే అక్కడ ఏదో ఉత్సవం జరుగుతుందనే భావన వెంటనే కలుగుతుంది.

గ్రామదేవతలను పూజించేవారు కొందరు ఉత్సవ సమయంలో మద్యం సేవించి ఉండడం చూస్తాము. వీరిని గూర్చి క్రీడాభిరామ కర్త సహజ మనోహరంగా వర్ణించినాడు.

"అలంకస్థితి శీధుపానరుచులై యాసాదులుప్పొంగి యో
యకరో యమ్మకరో యమక్కరాయ దీ యట్టట్టకోయంచు బా
యక తప్పెట్లును తక్కితాళములునింపై సొంపు రంజిల్లగా
జకజుంజుం జకజుంజు జుమ్మమనుచున్ సాగుంగడున్ వాద్యముల్"
— 147.

త్రాగిన మైకంలో ఏమేమో మాట్లాడుతూ, తప్పెట్లూ, తాళాలు ప్రయోగించడం సహజమే. పళ్ళాలను కూడా ప్రయోగించడం జానపదులకు అలవాటే. కల్లువల్ల మత్తెక్కి మాట్లాడినప్పుడు మాటలు మారడం జరుగుతుంది. 'అ'కారాది పదాలు 'య'కారాది పదాలయ్యాయి. కొన్ని పదాలు ఆమ్రేడితాలై భిన్న రూపాలు ధరించాయి. పదాలకు తోడు వాద్యాలహోరు : కవి ఆ కాలం నాటి జానపదుల జాతర సంబరాన్ని కళ్ళకు గట్టినట్లుగా చిత్రించినాడు.

శ్రీకాకుళాంధ్రదేవుని పేర ఆ కాలంలో జాతరలు జరిగేవని క్రీడాభిరామాన్ని బట్టి తెలుస్తున్నది. ఇవి వసంత పున్నమినాడు జరిగే వేడుకలు.

"దవనపున్నమ కాకుళాధ్యక్షుడైన
తెలుగురాయడు దేవతాధీశ్వరుండు
భువన హితముగ నుత్సవం బవధరింప
నందుబోయితి మీపోయినట్టి యేడు" — 204.

దేవతల అనుగ్రహాన్ని సంపాదించడానికి ఉత్సవాల్లో బలులిచ్చే ఆచారం ప్రపంచమంతటా కనిపిస్తుంది. గ్రీక్, ఇరాన్, ఈజిప్ట్ పురాగాథల్లోను

జంతు బలుల ప్రస్తావన ఉంది. గ్రీకు దేశానికి చెందిన **Zewsly Kagos, king ly Kaan** అనే పురాగాథల్లో రాజు తన కుమారుని వధించి అతని మాంసాన్ని **Zeus** అనే దేవతతో కలిసి ఆరగించినట్లు చెప్పబడింది.[1] తెలుగులో చిరుతొండనంబి కథ ఇలాంటిదే.

అత్యంత ప్రాచీనకాలంలో ఉన్న నరబలి విధానం క్రమంగా తగ్గింది. దాని స్థానంలో ఇతర జంతువులను బలి ఇచ్చే ఆచారం మొదలైంది. అంతే కాక జంతుమాంసాన్ని వండి లేదా రకరకాలైన ఆహార పదార్థాలను తయారు చేసి దేవతలకు అర్పించడం జరిగింది. పల్నాటి వీరచరిత్రలో భూతేశునికి అర్పించిన నైవేద్యాలను శ్రీనాథుడు చక్కగా వర్ణించినాడు.

"మైసాక్షి గుగ్గులు సహిత ధూపంబు
అర్పించి ఆటమీద ఆరగింపంగ
మృగముల మాంసంబు మెప్పుగావండి
పంచామృతమ్ములు పాయసాన్నములు
పేరైన పచ్చళ్ళు పిండివంటలును
భూతరాట్టున కష్ట భోజనంబిచ్చి
అఖిలభూతంబుల కాచారముగను
ఘనమైన పోతుల కావుచెల్లించి" పుట. 15

మైసాక్షినీ, గుగ్గిలాన్నీ కణకణమండే నిప్పుల్లోవేసి పొగపెట్టడంవల్ల భూతాలూ, దయ్యాలూ తొలగిపోతాయని గ్రామీణుల విశ్వాసం. పంచామృతాలూ, పాయసాన్నాలూ సాత్విక పూజావిధానాన్నే సూచిస్తున్నాయి. పచ్చళ్లు పిండివంటలు సరేసరి. ఇక మేకపోతులను కావు చెల్లించే విధానమే భయంకరమైంది, హింసాపూరితమైంది. జాతరలో చివరిరోజున దేవతకు ఇచ్చే బలి విధానాన్నే 'కావు' అంటారు.[2] బలిసిన మేకపోతుకు స్నానం చేయించి, పసుపుకుంకుమలతో పూజించి, కాళ్ళను తాళ్ళతో బంధించి ఆ తరువాత దాన్ని ముగ్గురు వ్యక్తులు పైకెత్తి పట్టుకొంటారు. బాగా కల్లు

---

1. **Encyclopedia of Religion and Ethics, Edited by James Hastings, Vol. XI, 1961.**
2. అనుభవ పశువైద్య చింతామణి, శ్రీ యేజెళ్ళ శ్రీరాములు చౌదరి, పుట. 14.

త్రాగి, పులివేషంతో గుడిసెలో దీని కోసమే ఉంచబడిన వ్యక్తి ఆ మేక దగ్గరికి వచ్చి దాని నోటిని పగలదీసి, నాలుకనులాగి ఒక పళ్ళెంలో పెడతాడు. అందరూ అతన్ని వీరుడని పొగడుతారు. దీన్నే 'కావు' తీయడం అంటారు. బలిగా సమర్పించిన మేకను మేళతాళాలతో ఊరేగిస్తారు.

కావు మొదలైన బలులవల్ల దేవతలు తృప్తి చెందుతారనీ, తద్వారా వారి అనుగ్రహాన్ని పొందవచ్చుననీ జానపదుల నమ్మకం. ఈకావు విధానం మన ఆంధ్ర దేశంలో 18వ శతాబ్దందాకా ఉన్నట్లు ఆకాలంనాటి నీలసుందరీ పరిణయం కావ్యాన్ని బట్టి తెలుస్తున్నది. కృష్ణుడు తనకు భర్త కాగలిగితే గంగమ్మకు మేకపోతులను 'కావు' పెట్టిస్తానంటుంది నీలాసుందరి.

"గొప్ప చింబోతు కదుపుల గూర్చి నీకు
కావు బెట్టింతు చుమ్మియో గంగనమ్మ" - 1.114.

గంగమ్మ పేర జాతరలు వైభవంగా జరగడం ఈనాటికీ గ్రామాల్లో చూస్తాం. గంగమ్మ గ్రామ దేవత - చైత్ర వైశాఖమాసాల్లో ఒక మంగళవారం రోజు ఈ జాతరను జరుపుతారు.

శ్రీనాథుని వీథి నాటకంలో కాళికాదేవికి బలిఇచ్చే జంతువులు ప్రస్తావింపబడ్డాయి. "గొఱియల మేకపోతులను కొమ్ము పోటేళ్ళను గావు కొందువు" భీమఖండం రచననుబట్టి ఆకాలంనాటి ప్రజలు గోగులమ్మ అనే దేవతను పూజించేవారని తెలుస్తున్నది. ఈ గోగులమ్మ కూడ గంగమ్మ లాగ గ్రామ దేవత. పార్వతి అపరావతారం.

"........... దక్షవాటిక పశ్చిమ ద్వారభూమి
ప్రతివసించును సర్వాంగరమ్యయగుచు
కోమలార్ధేందుధరు కొమ్మగోగులమ్మ" 1-98.

శ్రీనాథుని భీమఖండంలో ఆయా తీర్థస్థలాల్లో జరిగే జాతరల ప్రస్తావన ఉంది. భీమేశ్వరంలో ప్రసిద్ధి చెందిన పన్నెండు తీర్థాలకు జాతరలు చేయడానికి స్వర్గంనుంచి సాక్షాత్తు ఇంద్రుడే అప్సరసలతో వచ్చేవాడని

వర్ణింపబడింది.[1] జాతరలందు ప్రజలు నేతితో వసంతాలాడినట్లు పోతన వర్ణించినాడు. "నేతి వసంతములాడుచు జాతర చేసెదము భక్తి చాతురి తోడన్."[2] కృష్ణుడు తమ భర్త కాగలిగితే నేతితో వసంతాలు ఆడుతూ ఉత్సవం జరుపుతామని గోపికలు పార్వతికి మ్రొక్కుకొన్న సందర్భం అది

జాతరలందు గొర్రెలను కోసే ఆచారాన్ని పినవీరభద్రుడు శకుంతలా పరిణయంలో వర్ణించినాడు.

"అస్త్రులద్రెంచి దానవుల నాహవభూమి విభుండు గూల్చినన్
గొఱ్ఱెల దెచ్చి జాతరకు గోసిన పోలికనుండె," 3-130

ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానంలో 'బాఃటిగొఃటియల' ప్రస్తావన ఉంది,[3] బలి ఇవ్వడానికి తెచ్చే గొఱ్ఱెలే బారిగొరియలు. వేమన పద్యాల్లోనూ వీటి ప్రసక్తి కనిపిస్తుంది.

"కడుపులో రగిలించి కన్నులు ముకుళించి
బిఱ్ఱ బిగుసుకొన్న బీదయోగి
యముని బాఃటిగొఱ్ఱె అతడేమిచేయును
విశ్వదాభిరామ వినురవేమ."

ఎక్కువగా గొఱ్ఱెలనే బలి ఇచ్చే ఆచారం ఉన్నట్లు ఈ 'బాఃటి గొఱ్ఱె' లనే మాట సూచిస్తుంది.

ఎంతకూ సంతానం కలగకపోతే ఆత్మాహుతికైనా వెనుకాడని స్త్రీలగురించి పల్నాటి వీరచరిత్రలో వర్ణింపబడింది. దేవతానుగ్రహంకోసం వారు పడరాని పాట్లు పడేవారు. కత్తులను వక్షస్థల్లాలో దూసుకొని రక్తం చిందించేవారు.

"ఈ జీవనంబేల ఈ దేహముల నీకైన ప్రాణముల్ నీకె అర్పింతు
అబలలమని యెంచ స్వర్గంబుకాదు నెత్తురు నీమీద నిండజల్లెదము

---

1. భీమఖండం. 3 - 35.
2. శ్రీమదాంధ్ర మహాభాగవతం, దశమస్కంధం, పూ.భా - 809.
3. పుట. 386

చూడు మా సాహస స్ఫూర్తులనుచు ఆగక రోష సమావేశ మెసగ
ఒరలమట్టుకు కత్తులురవడిదూసి వక్షస్థలంబుల వదలకయుంచి.''
పుట. 57

దీన్నే 'అతిసాహసాలభక్తి' 'రాక్షసభక్తి' అని అన్నమయ్య తన పాటల్లో పేర్కొన్నాడు.

పల్నాటి వీరచరిత్రలోనేకాక పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోను అతి సాహసభక్తి ప్రస్తావింపబడింది. నాలుకలు కోసి, చేతులు నరికి, చన్నులు కోసి, తలలు కోసి, ఆత్మార్పణం చేసేవారు ఆకాలంలో ఉన్నారు.[1] ఇంకా కంఠాలు, కర్ణరంధ్రాలు, కడుపులు, మెడలు, వక్షస్థలాల్లోను బాణాలను చొప్పించుకొనే వాళ్ళున్నారు.

''గళములజిహ్వల కర్ణరంధ్రముల
కడుపుల మెడల వక్షముల పుక్కిళ్ళ
నలరంగ పెను దిలియలు నారసములు
గలయంగ నిరుమెయిగాడ సంధించి.'' పుట, 409

పండితారాధ్య చరిత్రనుబట్టి భక్తులు ప్రాణత్యాగం చేయడానికి కనుమారి అనే పద్ధతి అనుకూలంగా ఉన్నట్లు తెలుస్తున్నది.

''కరమర్థిజేసి యాకర్మారినురుకు ననఘుల భవపరిత్యక్త మానసుల
అరిమూరి నవలి కర్మరీశ్వరమును నురుకుపుణ్యులజూచి........''

'కర్మారి పదమే తెనుగున కనుమారి యయినది' అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వివరించినారు.[2] కనుచుండగానే మారికి (మరణానికి) బలి కావడాన్నిబట్టి కనుమారి పదం సార్థకమైంది.

నిధి దొరికినప్పుడు శాంతి చేయడమనే ఆచారం ప్రాచీనమైంది. భోజునికి భూనిక్షిప్తమైన సింహాసనం దొరికినప్పుడు సురాసురులకు సంతోషం

1. పండితారాధ్య చరిత్ర, పుట 407
2. తెనుగు మెఱుగులు, గ్రంథగ్రంథులు, 112

కలిగే విధంగా గొర్రెలను బలిచేసినట్లు సింహాసనద్వాత్రింశికలో గోపరాజు వర్ణించినాడు.

"అనవుడు విభుడది చేయుద
మని గొఱియల చెరవువెట్టి యనువగుబలిభో
జనములనసురులు సురలును
దనియంగా భూతతృప్తి తగనొనరించెన్" 1-189

బాలెంతలు పోలేరమ్మను పూజించిన విధానాన్ని గోపరాజు తెలిపినాడు.

"మూడు నెలల చెలులు ముద్దలు వెట్టిరి
యలరకుడుములైదునెలలబెట్టి
రేడునెలలమ్రొక్కి రెజ్జపోలమ్మకు
సతికి చూలువేళ జరుపుకొనుచు" 3-33

పోలమ్మనే పోలేరమ్మ అంటారు. 'పొలిమేర'నుంచి వచ్చిందే పోలేరమ్మ పదం. ఊరు పొలిమేరలో రక్షగా వెలసిన గ్రామదేవత పోలేరమ్మ.. పోలేరమ్మను పూజిస్తే చక్కని సంతానం కలుగుతుందని జానపదుల నమ్మకం. అందుకే నెల తప్పిన స్త్రీలు మూడు నెలలకు అన్నం ముద్దలనూ, ఐదు నెలలకు కుడుములనూ, ఏడు నెలలకు కానుకలనూ పోలేరమ్మకు సమర్పించుకొంటారు.

తెలుగులో ప్రథమ కవయిత్రి అయిన తాళ్ళపాక తిమ్మక్క సుభద్రా కళ్యాణంలో ఉత్సవాల సందర్భంలో చేసే చాటింపు విధానాన్ని ప్రస్తావించింది. గ్రామాధికారులు గ్రామ రక్షకులచేత ప్రజలకు తెలియవలసిన విషయాలను చాటింపు వేయిస్తారు. ఆనాటి ప్రజలకు వార్తలు తెలియాలంటే అదొక్కటే మార్గం.

"..........వాలాయముగను రైవతమహోత్సవము
జరుపంగవలెనని శారికాక్షణమె
సమరసమ్మున పురిసాటింపుకునిరి" పుట. 13.

డప్పులు వాయిస్తూ చాటింపుచేసే విధానం ఈనాటికీ గ్రామాల్లో ఉంది. అయితే ఈరోజు ఆధునిక ప్రచారసాధనాలైన పత్రికలూ, రేడియో, టీవీలు ప్రముఖ వార్తలను చేరవేయడంలో ప్రజలకు ఎంతో తోడ్పడుతున్నాయి.

జాతర జరిగే సందర్భంలో గ్రామీణుల ఉత్సాహం కట్టలు త్రెంచు కొంటుంది. వనమహోత్సవాలు (తెలంగాణాలో కొన్నిచోట్ల చెట్లల్లకు వెళ్ళడం అంటారు) పర్వతపూజలూ సామూహికంగా గ్రామీణులు జరుపుకొనే ఉత్స వాలు. తిమ్మక్క రైవతమహోత్సవానికి యాదవులు ఎలా వెళ్ళినారో వర్ణిం చిన తీరును పరిశీలిస్తే ఆనాటి ప్రజల ఉత్సవ సంరంభం తెలుస్తుంది.

"సకలపౌరులు నొప్ప సాటించిరెలమి
పప్పుబూరెలునెయ్యి పాయసాన్నములు
కాయగూరలు పెక్కు కలవంటకాలు
ఊరుగాయలు నెయ్యి వొబ్బట్లు వడలు
గారెలు బూరెలు కండ మండిగెలు
అరటిపండులును రాజాన్న రాసులును
పిండి కూరలు మొదల్ పెద్దకుడుములును
గరగల ఘటములు గంపలనునిచి
ముందర నడిపించె మురజనాదములు
సంతోష ఘోషముల్ సంకులమ్ముగను
పడుచులు పెద్దలు బాలింతరాండ్రు
కొడుకులు కోడండ్లు కూతులల్లుండ్లు
తో తొక్కలాడుచు త్రోవ కిక్కిరిసి
చనిరి యాదవులంత సంభ్రమమునకు.'' పుట. 14.

జాతరకు వెళ్ళేటప్పుడు గ్రామీణులు వెంట తీసుకొనిపోయే ఆహార పదార్థాలను తిమ్మక్క కళ్ళకు కట్టినట్లు వర్ణించింది. అమ్మవారి జాతరలో తలమీద పెట్టుకొని ఆడే కుండలు గరగలఘటాలు. వీటికే గ్రామదేవత ఘటాలని పేరు. వీటిని జాగ్రత్తగా గంపల్లో పెట్టుకొని వెళ్ళేవారు. బాలెంతలు కూడ జాతరకు వెళ్ళేవారని చెప్పడంవల్ల ఆబాలగోపాలానికి జాతరలు ఎంత ప్రీతిపాత్రమైనవో గ్రామీణ వ్యవస్థలో వాటికెంతటి ప్రాధాన్యం ఉందో అర్థ మౌతుంది.

పాండురంగ మాహాత్మ్యంలో తెనాలి రామకృష్ణుడు జాతరలనూ, గ్రామ దేవతలకు ఇచ్చే బలులనూ విస్తారంగా వర్ణించినాడు. ఆ రోజుల్లో

గాలికుంటు తెవులు సోకిన పశువులను క్షుద్రదేవతలకు బలి ఇవ్వడానికి అధికారులు జాతర చాటింపు చేసేవారు.[1] జాతరకు వెళ్ళే స్త్రీల అలంకరణను రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యంలో సహజమనోహరంగా చిత్రించినాడు. పడతులు ఉదయాన్నే లేచి వెచ్చని చమురు తలకు రాసుకొని స్నానం చేసి నలుచదరపుగళ్ళ వస్త్రాలను ధరించేవారు. కళ్ళకు కాటుక పెట్టుకొని కొప్పుల్లో పూలు ముడుచుకొని వేపచిగుళ్ళదండలను మెడలో వేసుకొనేవారు. రెడ్లు తమ భార్యలు ముందర నడుస్తుండగా తాము వారిని అనుసరిస్తూ హొలాలగట్లగుండా జాతరకు చేరుకొనేవారు.

''ఎడ్డెతనపుకై సేతల రడ్డులునడచిరి పురస్సరద్భార్యముగా
గుడ్డెంబుచక్కిగట్టం బడ్డమహాశక్తిదివ్యభవనంబునకున్'' 3-75.

తమలపాకులు నములుతూ జాతరకు వచ్చే పామరులనూ, దేవతలకు బలి ఇవ్వడానికి తెచ్చిన మేకపోతులనూ రామకృష్ణుడు వర్ణించినాడు. ''అమ్మహోత్సవం బజప్రధానంబగుట'' అనడంవల్ల బలి ఇవ్వడానికి తెచ్చిన మేకలతో జాతర నిండిపోయిందనే భావం స్ఫురిస్తుంది. సిడిప్రేలడం, నిప్పులో నడవడం, నిప్పుల గుండాల్లో దూకడం, అరటాకులపై నృత్యం చేయడం మొదలైన సాహసకృత్యాలను నిర్వహించి తమ భక్తిని నిరూపించుకొనేవారు ఆనాటి స్త్రీలు.[2] ఇంకా ఆనాటి ప్రజలు శక్తి అనుగ్రహాన్ని పొందడానికి మారుగాళ్లు, మారుతలలు, మారుచేతులు ఇచ్చే విధానం హింసాత్మకమైన భక్తిని సూచిస్తుంది. ఇదే రాక్షస భక్తి అంటే. మూపునుకోసి మాంసాన్ని ఇవ్వడం. నోటితాళాలివ్వడం సాహస భక్తిని సూచిస్తున్నాయి.

''కాంతయొకర్తుమూపున కండలిచ్చె
మారుగాలిచ్చె నొక సుధామధురవాణి
లలన. యొకర్తునోరి తాళంబులిచ్చె
శక్తి జాతర సద్భక్తిశక్తులెసగ.''

---

1. పాండురంగమాహాత్మ్యం, 3-73.
1. పాండురంగమాహాత్మ్యం, 3-77.

మనిషి వీపున గాలాన్ని గ్రుచ్చి లేదా ఆ మనిషిని గంపలోకి కూర్చుండ పెట్టి త్రిప్పే దూలాన్ని 'సిడి' లేదా 'సిడిమ్రాను' అని వ్యవహరిస్తారు. నోరి తాళాలను నోరి బిగాలని పిలుస్తారు. దేవతలకు మ్రొక్కుబడిగా మౌన వ్రతాన్ని పాటించడంకోసం దవడలందు బిగించుకొనే లోహం కడ్డీనే 'నోరి తాళం' అని వ్యవహరిస్తారు. గణపవరపు వేంకటకవి ప్రబంధ రాజవేంకటేశ్వర విజయవిలాసంలో వీటిని పేర్కొన్నాడు. ''కొందఱు నోటి బీగముల దాసళ్ళ పెల్లున నోరుల పూరులు గఱచువారు.'' 7-88.

నోటిబిగాలవంటివే గంత కత్తెరలు. వీటి ప్రసక్తి కళాపూర్ణోదయంతో వచ్చింది. మెడలు కత్తిరించుకోవడానికి ఉపయోగించే సాధనాలే గంత కత్తెరలు. ఈ పనులన్నీ మూఢభక్తిని సూచిస్తున్నాయి.

> ''ఈ మెఱుగు గంత కత్తెర
> చేమిడి దలయిచ్చు సాహసికుడు శిరంబ
> ప్లే మగుడగనదుకుకొనం
> గామని చంపుదును చంపగడిగిన వానిన్.'' 6-43,

జాతరలందు పశువుల తలలు నరికి రక్తం ప్రవహింప జేసేవారని తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యంలో వర్ణించినాడు. జాతరలో జంతుబలులు సర్వసాధారణమైనవి. క్షుద్రదేవతోపాసనలో బలులకు చాల ప్రాధాన్యం ఉంది. జాతరలందు స్త్రీలు మద్యం సేవించినట్లు రామకృష్ణుడు వర్ణించినాడు.

విజయనగరరాజుల కాలంనాటి జాతరలనూ, జాతరలందు ఇచ్చే జంతు బలులనూ తెలుసుకోవాలంటే పాండురంగమాహాత్మ్యం ఎంతో ఉపయోగ పడుతుంది. విజయనగరరాజుల కాలంనాటి బలి విధానం ఇలా తెలుపబడింది. ''విజయనగరంలో జరిగే మహానవమి ఉత్సవాలు విదేశీ యాత్రికులను బాగా ఆకర్షించేయి. ఆ తొమ్మిది రోజులూ చక్రవర్తి మంటపానికి ఉదయమే వస్తాడు. దుర్గాపూజ చేస్తాడు. తరువాత దుర్గాదేవికిచ్చే జంతుబలుల్ని చూస్తాడు. 'నన్నీజు' ఈ తొమ్మిది రోజులలో మొత్తం 13797 దున్నలు,

మేకలు, గొర్రెలు బలియవుతాయన్నాడు. పయస్‌లెక్క 6316 జంతువులు"[1] నన్నీజు, పయస్ విదేశీ యాత్రికులు.

పోర్చుగీసు యాత్రికుడు బార్బోసా 'సిడి' ఆచారాన్ని ఈ క్రింది విధంగా వివరించినాడు.

"మొక్కు తీర్చుకొనేరోజు వారు బాజాభజంత్రీలతో పెద్ద ఊరేగింపుగా బయలుదేరుతారు. దేవాలయంముందు ఒక కొయ్య పాతి ఉంటుంది. దానిని సిరిమాను అంటారు. ఆ కొయ్యపైన ఏతాంకర్రవంటిది అడ్డంగా అమర్చుతారు. ఆ కర్రకు ఒక వేపున గేలం ఉంటుంది. రెండో వైపున తాడుకట్టి గేలం భాగాన్ని పైకి ఎత్తేందుకు ఏర్పాటు చేస్తారు. మొక్కుకున్న మనిషి మక్కులవద్ద మాంసంలోకంటాగేలం గ్రుచ్చి పైకి ఎత్తుతారు. ఆ మనిషి మొక్కునుబట్టి గేలం కర్రను కొన్ని చుట్లు తిప్పడమూ, చచ్చిపోయే వరకూ తిప్పడమూ ఉంటుంది. చూస్తున్న ప్రజలు హర్షధ్వానాలు చేస్తుంటే, మొక్కు తీర్చుకొనేందుకు గేలాన వున్న మనిషి సంతోషంగా వేలాడుతాడు."[2] జాతరలందు ఒక వైపున బలులివ్వడం, మరొక వైపున సిగాలూగడం కనిపిస్తుంది. తాళాలు, మద్దెలు మ్రోగుతుండగా వాటి కనుగుణంగా సిగాలూగడం రాధామాధవంలో ప్రస్తావింపబడింది.

"కరతాళగతులనాడున్
మురిపెంబులు చూపు వికటముగ నవ్వోలయన్
బొరిసి పములాదు సంగర
ధర పెంపుడు క్రోతివిధము తళుకొత్తంగన్" 5-113.

తిరుమల యాత్రకు బయలుదేరిన భక్తుల చేష్టలను మల్లన కవి చంద్రభాను చరిత్రలో స్పష్టంగా చిత్రించినాడు.

"అనశన వ్రతముచే నతుల కార్శ్యంబున
కనుపట్టునోరె బీగములవారు

---

1. ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర సంపుటం-II
కంభంపాటి సత్యనారాయణ, 72.
2. అదే ,, 74.

్రమొక్కు దీర్చుటకునై మూకమూకలు గూడి
యేతెంచు తలమోపుటిండ్లవారు
ప్రాణముల్ పిడికిట పట్టుక యిట్టట్టు
తెమలని శిరసు కొండెములవారు
వైహికా యాసంబు దలపక నోర్చుచు
నడతెంచు పొరలు దండములవారు

నామటామట మ్రొక్కువారడుగు నడుగు
దండములవారు మిగుల సందడి యొనర్ప
నడరి పన్నగ సార్వభౌమాచలేంద్రు
గొలువ కోటానుకోట్లు పెన్గూట మమర'' 5-41

ఉపవాసాలుండడం, పొర్లుదండాలు చేయడం, అడుగడుగున దండాలు పెట్టడం మొదలైన ఆచారాలు ఈనాటికీ తిరుమలలో చూస్తాం. ప్రత్యేకంగా దాసర్లు తిరుమల యాత్రకు వెళ్ళేటప్పటి దృశ్యాన్ని మల్లన సహజ మనోజ్ఞంగా చిత్రించినాడు.

''చేమాకు తాళముల్ చెలగ రొండులచేతు
లుంచి యందఱ వెక్కిరించుకొనుచు
పజ్జధూపమున దీపపుకోల రాజహ
స్తము సాచి చేగంట చఱచికొనుచు
తలయోరగిల క్రుంగి తప్పెట గతికివా
యించి గంగెద్దు నాడించుకొనుచు
తిరువడిసానుల బెరసి గంటలు మ్రోయ
బోడచపురముల నాడికొనుచు
త్రోవగూర్చుండి బొంతలు మోలబఱచి
ముదురుటెండల కోరగా ముసుగుజేర్చి
పట్టెదండలు మొరయించి పాడుకొనుచు
నలరు దాసళ్ళ వీక్షించి యాక్షణమున'' 5-45.

కవి ప్రత్యక్షంగా చూసి వ్రాసినట్లే ఉంది ఈ చిత్రణ.

యాత్రికులలో ఎదుటివారు తాళాలు కొడుతూ ఉంటే, కొందరు తమ చేతులను నడుములకు రెండు వైపుల ఉంచి తాళాలకు తగినట్లుగా మోరలు చూపుతూ వెక్కిరించేవారు. ఒక చేతితో దీపం కోలలు పట్టుకొని మరొక చేతితో గంటల చప్పుడు చేసేవారు. తప్పెట్లు మ్రోగిస్తూ గంగిరెద్దు లాడించేవారు.

మన్నారుదాస విలాసంలో రంగాజమ్మ రాజగోపాలస్వామి రథోత్సవాన్ని పెద్ద వచనంలో వర్ణించింది.[1] రథోత్సవానికి చుట్టుపక్కల గ్రామాల నుంచి భక్తులెందరో వచ్చేవారు. స్త్రీలు ఒడ్డాణాలనూ, జంటగంటలనూ, ముల నూలునూ, అందెలనూ ధరించేవారు. రథం వెళ్ళే మార్గంలో భక్తులు రెండు వైపుల బారులు తీర్చి నిలిచేవారు. రథానికి దండప్రణామాలు చేసేవారు. రథాన్ని లాగుతూ అలసిపోయిన వారికి ఉపచారాలు చేసేవారు. విసనకర్రలతో గాలిని ఊపేవారు. చందనం, పూలు మొదలైనవి ఇచ్చేవారు. చల్లని నీళ్ళతో పాటు నిమ్మరసం కల్పిన నీరు మజ్జిగలను త్రాగడానికి అందజేసేవారు. చక్కెరపానకం, శొంటిచూర్ణం, తియ్యని పానీయాలు కూడ ఇచ్చేవారు. రథాన్ని నడిపే వారికి ఆ సమయంలో ఇతరులు చేసే సత్కారాలు అలాంటివి. జాతరలో దేవుని రథాన్ని నడిపేటప్పుడు తప్పని సరిగా ఆ దృశ్యాన్ని చూడటానికి గ్రామీణులు వచ్చేవారు. సూర్యోదయానికి ముందే రథాలను లాగడం ఈనాటికీ ఆచారంగా ఉంది. ఈ రథోత్సవంలో భాగవతముద్రలున్న భక్తులు చిటి తాళాలను ఎగరవేస్తూ కీర్తనలను పాడేవారనీ, పొర్లు దండాలు అర్పించేవారనీ రంగాజమ్మ వర్ణించింది. తడిబట్టలను ధరించి పొర్లు దండాలు చేసే సందర్భంలో మార్గంలో పడి ఉన్న రాళ్ళను ఇతరులు ప్రక్కకు తొలగించేవారని శుకసప్తతిలో వర్ణింపబడింది.

> "కటిఘటితార్ద్ర వసన ఖండములతో పొర్లుదండంబులిడువారలకు
> మార్గక్షుద్ర శిలాకలాపంబులవ్వలంద్రోచివైచి" 2-10

హంసవింశతిలోను పొర్లుదండాల ప్రస్తావన ఉంది.[2] లావుగా ఉన్నవారు తడబడుతూ, తమను తామే తిట్టుకొంటూ పొర్లుదండాలు అర్పించేవారని ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయవిలాసంలో వర్ణింపబడింది.

---

1. 4. 67. 2. 4. 213.

"కొందరు బిరబిర పోలేక పొట్టిపొట్టల బరువున బుసకొట్టుచు
నడుగులు తడబడ బోరగిలబడి యతని భక్తుల సూటిపొర్లు
దండంబుల వగల పొర్లిపొర్లి పోవువారును" – 788.

శుకసప్తతిలో గంగగుళ్ళ ప్రస్తావన ఉంది. గ్రామీణులు జాతరను సాధారణంగా గుడుల దగ్గరే జరుపుకొంటారు. గంగగుడి దగ్గరి జాతరను కదిరీపతి వర్ణించినాడు. 16, 17 శతాబ్దాలలో తెలుగునాట గ్రామదేవతల పేరు మీద జరిగే జాతరల స్వరూపాన్ని తెలుసుకోవడానికి శుకసప్తతి ఎక్కువగా ఉపయోగ పడుతుంది. గంగమ్మ జాతరలో కాపు స్త్రీలు పొంగళ్లు పెట్టి ఆ పాలను దేవతకు సాకపోసేవారు. బలిగా ఇచ్చిన పొట్టేళ్ళ నెత్తురు వల్ల నేల బురద అయ్యేది. కోళ్ళను కూడా బలి ఇచ్చేవారు. మంత్రగాళ్ళ జోరు చెప్ప నలవికాదు. ఎక్కడ చూసినా గుగ్గిలం, అగరు, ధూప పరిమళాలే. భక్తులు అవయవాలను నరుక్కొని మొక్కులు చెల్లించుకొనేవారు. గ్రామీణుల మూఢ భక్తికీ, ఆచార వ్యవహారాలకూ కదిరీపతి వర్ణించిన గంగమ్మ జాతర చక్కని దృష్టాంతం.

"కాపుగుబ్బెతలు పొంగళ్లు వెట్టిన పాల
కడవచాటికల పొక్కళ్ళ జాలు
దొరలు తెప్పించి బంతులు గట్టి యర్పించు
పొట్టేళ్ళ నెత్తురు బురద రొంపి
కోర్కి చెల్లిన భుజంగులొసంగ బెటికిన
కుక్కుట పటలంపు తెక్కగుంపు
మంత్రముల్ ఫలియింప మాంత్రికుల్ పయిజోతి
వన్నెయుంచిన పంచవన్నె కోళ్లు
పరగ గుగ్గులగరు ధూప పరిమళంబు
శాకినీ డాకినీ భూత సంభ్రమంబు
చరదితప్రాణ మృత్తికా తురగచయము
నలమ నాగంగ గుడిజేర నరుగునపుడు" 2-76.

ఉత్సవాల్లో పాలు పొంగించడం ఆచారం. జాతరకు వచ్చిన ప్రజలు అన్ని చోట్ల పాలు పొంగించడం వల్ల పొయ్యిరాళ్లు పాలచారికలతో కనిపిస్తున్నా

యట ! ఇది సహజమైన వర్ణన. ఈ కాలంలోను జాతరలందు ప్రజలు అన్ని చోట్లా పొయ్యిరాళ్లు పెట్టుకొని వంట చేసుకోవడం, పాలు పొంగించడం చూస్తాము. పొయ్యిరాళ్ళే పొక్కళ్లు. అంతటా పాలు పొంగించడం వల్ల చారికలేర్పడిన పొయ్యిరాళ్ళతోనూ, గొర్రెపోతులను బలి ఇవ్వడం వల్ల రక్తంతో బురదగా మారిన నేలతోనూ, కోళ్ళ ఈకలతోనూ జాతర యావత్తూ ఎంతో సందడిగా ఉంది. గంగగుడుల దగ్గర బాస చేయడం ఆనాటి ఆచారం. ఒక స్త్రీ తన భర్తను గంగగుడికి తీసుకొని వచ్చి ''పర నీరజనేత్రల పొందనంచు నింపున చనుదెంచి గంగగుడి ముందర బాస మొసంగు మిత్తరిన్''[1] అంటుంది. అందుకు అవమానంతో ఆమె భర్త తన తలను నరుక్కొంటాడు. దీన్ని బట్టి తప్పు లేదని నిరూపించుకోవడానికి ఒక్కొక్కసారి పల్లీయులు తమ ప్రాణాలను కూడా తీసుకొనేవారని తెలుస్తుంది.

అమ్మవారి జాతరలందు శివమాడడం సాధారణమైన విషయం. దీన్నే సిగమూగడం అంటారు. సిగం ఊగి చెప్పిన విషయాలను నిజమని నమ్మే అమాయకులు గ్రామీణులు. ఒక చెలికత్తె తన దొరసానితో శివమాడి భర్తను ఇంట్లోకి రాకుండా చేసుకొమ్మని సలహా ఇస్తుంది: ''కడపకడ్డముగాగబడి సివ మాడుము, కొదమ కార్యము చూచుకొనగ వచ్చు''[2] శివమాడి పల్కిన పల్కులను ఆమె భర్త తప్పక విశ్వసిస్తాడనీ, ఆ తరువాత దొరసాని తన కోరికను నెరవేర్చుకోవచ్చుననీ చెలికత్తె అభిప్రాయం.

గ్రామీణులు తాము సంవత్సరమంతా కష్టపడి సంపాదించిన ధనంలో కొంత భాగాన్ని తిరునాళ్ళ సందర్భంలో ఖర్చు చేస్తారు. తమకు కావలసిన వస్తువులను కొనుక్కొంటారు. "తిరునాళ్ళకై పోయి తిరుపతిలో కొన్న నొక్క పూసలపేరు టెక్కుసూప''[3] గంగమ్మతో పాటు ఏకవీరాదేవిని పూజించే ఆచారం అనాడుంది. ఒకరి బదులు మరొకరు దేవతలను ఆరాధించే విధానం కూడా ఆ కాలంలో ఉంది. ''ఎప్పుడు మేలుగోరి మరి యెక్కలిదేవికి గ్రామగంగకున్ చప్పిడిదించు మ్రొక్కుకొను జాడ లెరుంగవె''[4] అని బ్రాహ్మణుడు రెడ్డితో పల్కిన పల్కులు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

---

1. శుకసప్తతి, 2–74. 2.అదే 2-350. 3.అదే 2–411. 4.అదే 2-445.

ఆకాలంలో శివమాడేవారిని దేవతా స్వరూపులుగా భావించేవారు. శివమాడి కానుకగా ధాన్యాన్ని తీసుకొనే విధానం కూడా ఆనాడుంది. ''సివము పుట్టించి యపుడు చేచేత దీసికొనియె పుట్టెడు విత్తులు''[1]

ప్రాచీన కాలంలోని గంగజాతరలను గూర్చి డా॥ తంగిరాల సుబ్బారావుగారు ఎన్నో విషయాలు తెలియ జేశారు. ''యాదవుల కులదైవము గంగ. ఈమె శక్తి స్వరూపిణి. ప్రధాన గ్రామదేవతలలో నీ గంగ యొకతె. ఆంధ్రదేశమున అనేక గ్రామాలలో ఈ గంగకు దేవాలయాలున్నవి. నెల్లూరు. ప్రకాశం, కర్నూలు, కడప మండలములలో ఈ గంగ గుడులు హెచ్చు. ఈ గంగకు ప్రతి సంవత్సరమును గొప్ప యుత్సవములు చేయుదురు. యుత్సవములను గంగజాతర లేక గంగ తిరునాళ్లు అందురు. ఈ జాతరలలో కాటమరాజు కథలు పాడింతురు.[2]

తిరుపతి వేంకటేశ్వరుని దర్శించడానికి మొక్కులు తీర్చుకోవడానికి వెళ్ళే గొల్లల ప్రయాణ విశేషాలను కదిరీపతి శుకసప్తతిలో కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు.

''తులసిపూసలు బోడితలయునడ్డాదిడ్డ పట్టెనామములు సంభ్రమమునొప్ప
బరువులెత్తిన యెద్దుపై నొంటితముకురావములును వేణునాదములు పొసగ
రచియించు తప్తముద్రలును పైపైబల్కు గోవిందలును హాస్యమావహింప
నతిరసంబులబుట్టి యవనతులైనవారల కొసంగెడు దీవనలు సెలంగ
కొలమువారెంచగల గొల్లకొడుకుగనగబంటులునుబోలెచుట్టము ల్వెంటనంట
కోర్కిమ్రొక్కులు చెల్లించుకొఱకుగాగ నాతడేపేట తిరుపతి కరిగివచ్చు''
2—549

మెడలో తులసిపూసలతో, బోడితలతో, అడ్డదిడ్డమైన పట్టెనామాలతో, వేణునాదాలతో, తప్తముద్రలతో, గోవిందనామాలతో యాదవబాలుడు తన వెంట చుట్టాలు రాగా, మ్రొక్కులు చెల్లించడానికి తిరుపతికి వెళ్ళేవాడు. గొల్లలు సాధారణంగా వైష్ణవులు. అందుకే వారెక్కువగా తిరుపతి వంటి

1. శుకసప్తతి, 2—450, 2. కాటమరాజు కథలు, మొదటి సంపుటం, ప్రచు, 1976, పీఠిక ii, పు ccixiv.

వైష్ణవ క్షేత్రాలకు యాత్రలు చేస్తారు. వారు విష్ణు చిహ్నాలైన చక్రాదులను లోహాలతో చేయించి అగ్నిలో కాల్చి శరీరంమీద ముద్రలు వేయించుకొనే వారు. ఈ ముద్రలనే తప్తముద్రలంటారు. శైవులైతే శివచిహ్నాలైన శూలా దులను తప్తముద్రలుగా వేయించు కొంటారు. నేటికీ ఇలాంటి ఆచారం అక్కడక్కడ కనిపిస్తుంది.

ఆ కాలంనాటి ప్రజలు ధర్మరాజును కూడా ఆరాధించేవారు. భక్తుల కోరికలు తీరకపోతే దేవతలకు దూషణలు తప్పవు. అవమానాలకు గురైన ఒక వేశ్య దేవతలను దూషించిన తీరును శుకసప్తతిలో చూడండి —

''పుట్టలమ్మయటన్న పోయెంతలేదను సందివీరులటన్న జాముగొనగు
నెక్కలమ్మయటన్న నొక్కటికొదవనుపోతురాజులటన్న బూతునుడువు
ధర్మరాజులటన్న దబ్బఅలేదిట్టు శంబయ్యయటన్న గ్రాసియుమియు
గ్రామగంగయటన్న కాదా మరోయనుదేవాదులన్న గద్దించి చూచు.
ఇన్ని దేవుళ్ళగొలిచి నేనేమి గంటి..............................'' 3–49.

పైన పేర్కొనబడిన పుట్టలమ్మ, సందివీరుడు, ఎక్కలమ్మ, పోతు రాజు మొదలైనవారు గ్రామదేవతలు. వారి పేరు మీద జాతరలు కూడా జరిగేవి.

హంసవింశతిలోను, ఆయా గ్రామదేవతల పేరుమీద జరిగే జాత రలు వర్ణింప బడ్డాయి. దేవతల ఊరేగింపులో ప్రజలు కాగడాలను, బంజా యీలను, మొంబత్తులను, చంద్రజ్యోతులను, హారతులను, దివిటీలను వెలి గించేవారు. చిటితాళాలను, చిటికెలను, సింగినాదాలను, పిల్లనగ్రోవులను, పీకలను మ్రోగించేవారు. ఊరేగింపులో అన్ని కులాలవారూ, అన్ని జాతుల వారూ నేల ఈనినట్లూ, ఉసుళ్ళలాగా, మిడతలదండులాగా పాల్గొనేవారు. తుర కలు, పింజారీలు, పరంగులు. ఇంగిలీసులు మొదలైన అన్య దేశీయులు కూడా ఊరేగింపులంటే ఇష్టపడేవారు.[1] హంసవింశతి రెండువందల ఏళ్ళ క్రితం నాటిది కాబట్టి అందులోని ఈ విషయాలు ఆధునికంగా కనిపించడంలో ఆశ్చర్యం లేదు.

---

1. హంసవింశతి, 3–29

జాతరలు అనాదిగా జరుగుతున్నాయి. ప్రతి పల్లెలో ఏదో ఒక సందర్భంలో జాతర జరుగుతుంది. పండుగలకూ జాతరలకూ భేదాన్ని చూపడం కష్టం. జాతరలందు బలి విధానం కనిపిస్తుంది. రాముడూ, కృష్ణుడూ మొదలైన వారి పేరుమీద చేసే పండుగలు ఒక రకం కాగా, దేవతలకు సంతోషం కలగాలనీ, దేవతల కోరిక నెరవేర్చాలనీ, రోగాలు మొదలైనవి నిర్మూలం కావాలనీ చేసే జాతరలు మరో రకం. ఉదాహరణకు హైదరాబాదుకు అరవై కిలో మీటర్ల దూరంలో ఉన్న కొల్కులపల్లి దగ్గర నేటికీ ప్రతి సంవత్సరం నరసింహుల జాతర జరుగుతుంది. ఈ జాతరకు చుట్టుప్రక్కల గ్రామాల నుంచి ప్రజలు తండోపతండాలుగా వస్తారు. ఇది నా స్వానుభవం.

జాతరలు గ్రామీణులకు యజ్ఞయాగాదులతో సమానం. యజ్ఞయాగాదులను శిష్టులు ఆచరిస్తే, జాతరలను జానపదులు ఆచరిస్తారు. మానవాతీత శక్తులమీద మనిషికి ఉండే నమ్మకాలను జాతరలు ప్రతిబింబిస్తాయి. సాంస్కృతిక వికాసంలో పండుగలతో పాటు జాతరలకు ప్రాధాన్యం ఉంది.

సంస్కారాలు :

సంస్కారాలు ప్రాకృత దశనుంచి సామాజికపరంగా మనిషిని సంస్కారవంతుని చేయడానికి తోడ్పడతాయి. సంస్కారాలు పరకర్మలనీ, అపరకర్మలనీ రెండు విధాలు. షోడశకర్మలలో పెళ్ళికి ముందున్నవి పరకర్మలు. ఆ తరువాతవి అపరకర్మలు. జాతకకర్మాదులన్నీ పరకర్మలే. కర్మకాండవిధులు అపరకర్మల్లో చేరుతాయి. నామకరణం, అక్షరస్వీకారం, చేలం, ఉపనయనం, వివాహం మొదలైనవి పరకర్మలుగా లెక్కింపబడతాయి.

జనన సంస్కారాలకు సంబంధించిన విషయాలు ప్రాచీన కావ్యాల్లో కనిపిస్తున్నాయి. సమాజంలో మాతృమూర్తికి విశిష్టమైన స్థానం ఉంది. స్త్రీ జీవితంలో సంతానానికిగల ప్రాముఖ్యాన్ని ఎవరూ కాదనలేరు. సంతానం కోసం స్త్రీలు పడేతపన, చేసే పూజలు పల్నాటి వీరచరిత్ర మొదలైన కావ్యాల్లో విస్తారంగా వర్ణింపబడ్డాయి.

అ క్ష ర స్వీ కా ర ం :

నన్నెచోడునికాలంలో అక్షర స్వీకారం 'ఓం నమశ్శివాయ'తో ప్రారంభమయ్యేది. 'ఓనమాలు' అనేమాట 'ఓం నమశ్శివాయ'నుంచే వచ్చిందని విజ్ఞుల అభిప్రాయం. నేటికీ మంచి ముహూర్తాన్ని నిర్ణయించి "అక్షర స్వీకార" కార్యక్రమాన్ని నిర్వహించడం మన అనుభవంలోని విషయమే. గిరికుమారి అయిన పార్వతియొక్క అక్షరస్వీకార సంస్కారాన్ని నన్నెచోడుడు కుమారసంభవంలో వర్ణించిన తీరు చూడండి.

"గిరిసుత తొలిపలుకుల సుస్వరమొదవగ నోం నమశ్శివాయసదాస్మ
ద్వరదాయ నమఃశంకర శరణుమహాదేవనీవశరణనజొచ్చెన్" 3-34

'ఓం నమశ్శివాయ' శైవ సంప్రదాయాన్ని సూచిస్తుంది. ఇట్లే అక్షర స్వీకారం 'సిద్ధం నమః'తో కూడా ఆరంభింపబడుతుంది. ఇది జైన సంప్రదాయం. కొందరు "శ్రీ" అక్షరంతో అక్షర స్వీకారం చేయిస్తారు. పదేపదే అదే అక్షరాన్ని దిద్దిస్తారు. ఈ కాలంలో అక్కడక్కడ జరిగే అక్షర స్వీకారోత్సవాల్లో 'శ్రీ'ని పలకమీదరాసి ఆ తరువాత ఓం నమశ్శివాయ, సిద్ధం నమః అని వ్రాసే సంప్రదాయం కూడా ఉంది. పిల్లవాడు భవిష్యత్తులో విద్యావంతుడు కావాలన్న అభిప్రాయంతోనే ఈ అక్షరస్వీకార సంస్కారం ఏర్పాటు చేయబడింది.

జా త క ర్మ లు :

రంగనాథరామాయణంలో జాతకర్మలు పేర్కొనబడ్డాయి. పురుడు అనంతరం దశరథుడు తన కుమారులకు నామకరణమహోత్సవం జరిపించినట్లు వర్ణింపబడింది.

"పురుడు దీరినయంత పుణ్యాహవేళ వరుసనాసుతులకు వంశోన్నతులకు
నామకరణములు నలువురకిప్పుడేమఱకీవు సేయింపు వసిష్ఠ" బాల, పు. 20

పురుడు దేశీయమైన సంస్కారం. నామకరణం ఆర్యుల పద్ధతి. శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యంలో పురుడుపోసే విధానాన్ని సహజ మనోహరంగా చిత్రించినాడు.

"తలయంపి ధవళ నిద్రాకుంభమిడువారు రక్షాభసితరేఖ వ్రాయువారు
గౌర సర్షపరాజికలయజల్లెడివారు బలివిధానంబులబరగువారు
లవణంబు నింబ పల్లవముద్రిప్పెడివారు ప్రేముమంచంబుతో పెనుచువారు
గవలధూపంబు సంఘటియించువారును మంచిమట్టెడదయోజించువారు
కదిసిదీవించువారును గండతైలమందు కొనువారు కాయంబులలదువారు
పాడువారును పరిహాసమాడువారు నెరి శుద్ధాంతసతులరిష్టాలయమున."
2_70.

అరిష్టాలయం అంటే పురిటిల్లు. పురిటింటిలో స్త్రీలు శిశువుకు తలవైపు నిద్రాకుంభాన్ని అమర్చేవారు. రక్షగా భస్మరేఖలను రాసేవారు. అంతటా తెల్లని ఆవాలను చల్లేవారు. దేవతలకు బలులిచ్చేవారు. ఉప్పునూ, వేపాకునూ తిప్పేసేవారు. బెత్తం మంచంమీద శిశువును పడుకోబెట్టేవారు. ఎద్దుకొమ్ముతో ధూపం వేసేవారు. తల్లిబిడ్డల మంచి మర్యాదను ఆలోచించేవారు. శాంతికోసం గండదీపాలను వెలిగించడానికి నూనెను తెచ్చేవారు. బాలెంతరాలు ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకొని మందులను సమకూర్చేవారు. ఇంకా సంతోషంతో పాటలు పాడేవారు. పరిహాసాలాడేవారు. ఉప్పూ, వేపాకూ తిప్పేయడం, గండదీపాలు వెలిగించడం, బాలెంతలకు మందులు సమకూర్చడం మొదలైన ఆచారాలు ఈనాటికీ గ్రామాల్లో ఉన్నాయి.

అప్పుడే పుట్టిన శిశువుకు బొడ్డుమీద బంగారు నాణాన్ని ఉంచి ఆ తరువాత కోయడం, కోసిన బొడ్డును చేటలో వేయడం, మొదట కలినీళ్ళతో కడిగి తరువాతనే తిని మాడకు రాయడం మొదలైన ఆచారాలు సింహాసన ద్వాత్రింశికలో ప్రస్తావింపబడ్డాయి.

"నిలువు బొడ్డుమీద పసిడిటంకంబిడి యొయ్య నాభినాళముత్తరించి
ముత్తియములచేటముంచి యందిడికనుదమ్ములందుసమ్మదమ్మునిగుడ"
3_42

"కలిగడిగి నూనెవ్రేలిడి తలపుర్రియ యందునేతి తైలంబును జొత్తిలరాచి మెత్తగా పొదుగలరించి కుమారునునిచిరా దాదులటన్."
3_43.

పురిటింటిలో పసికందుకు చక్కగా స్నానం చేయించి, కాటుకా చుక్క బొట్టూ పెట్టి, పురిటింటి గడపకు రెండు దిక్కుల తవుడూ, నిప్పులూ, పత్తి గింజలూ పోసి, అడ్డంగా తవుడు కలిపిన సన్నని ఊకను చల్లి, వేపాకులు వేసిన కుండలను సిద్ధపరిచి వాయనాలు ఇవ్వడానికి తీసుకోవడానికి ముత్తైదువ లను సిద్ధపరిచినట్లు గోపరాజు ఆకాలంలో గ్రామీణులు పాటించే ఆచారాలను చక్కగా వర్ణించినాడు.

"క్రమమున దాదులక్కడను ముప్పటిలినజలకంబు దేర్చియాచెలువసుతుని
కొనరగాకాటుకయును చుక్కబొట్టునుపాటించి యాగడపకు వెలుపట
పొదికిళ్ళ తవుడునిప్పులు ప్రత్తిగింజలు నిడియడ్డముగచిట్టుపడిసివైచి
వేపరెమ్మలు నీళ్ళవెసలలోపలనించి కాపులు పురిటింటగట్టిచేసి
వాయనములకెల్ల వనితలరప్పించి వారు దెచ్చినయవి వరుసనంది
పచ్చకప్పురంపుపలుకులు వెట్టివిడియములిచ్చిరింపునయముగలుగ"

3-45.

ఆయా సంస్కారాలను నిర్వహించడానికి ప్రజలు పురోహితులను ఆశ్రయించేవారు. వారు పంచాంగంచూసి ముహూర్తాలను నిర్ణయించేవారు. గ్రామాల్లో ఎలాంటి శుభకార్యంగానీ, అశుభకార్యంగానీ నిర్వహించడానికి తప్పనిసరిగా పంచాంగాన్ని చూడవలసిందే. తిథి వార నక్షత్రాలనుబట్టి దిన ఫలాలను నిర్ణయించడంలో పంచాంగాలకు ప్రాధాన్యం ఉంది.

"అలకేలిముష్టి పంచాంగంబుగాగ తెలిసి నాకిప్పుడు తిథివారసరణి
దినయోగములు తేటతెల్లంబుగాగ ననయంబు పరికించి యానతీవలయు"

7-509.

బాలెంతలకు పురిటినొప్పులు కలుగగానే వేగంగామంత్రసానిని పిలవడం, మందులను సిద్ధంచేయడం, పుట్టిన శిశువుకు స్నానం చేయించేటప్పుడు ఆ నీళ్ళు పడడానికి చిన్నగుంటను (కొలను) త్రవ్వడం, బాలెంతరాలిని అటు ఇటూనడిపించడం మొదలైన పనులను ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలో కడుసుందరంగా వర్ణించినాడు. పనుల వేగాన్ని పద్య శైలి చెబుతుంది.

''చెలువకు బిడ్డకుట్టు విలసిల్లగ భల్లపురంధ్రు లంతలో
పిలువరె మంత్రసాని తలపెట్టరె కాయము గూర్చ లేమకున్
జలకముగాపరే కొలనుచయ్యన ద్రవ్వరె మందగామినిన్
నిలువగనీకురేయనుచు నేర్పరులై కడు సంభ్రమింపగన్'' 3-26.

కాళహస్తి మాహాత్మ్యంలో పుట్టిన శిశువుకు బొడ్డుకోయడంలాంటి దేశీయాచారాలు ప్రస్తావింపబడ్డాయి.

''.... సంసారమోహపాశము గోసినటువలె బొడ్డుగోసిరి పిన్నబిడ్డనికిని
సర్వేశభక్తి లక్షణములు తెల్పెడురీతి పెట్టిరి భూతితో పట్టెపట్టి
పాపకదంబ జంబాలంబు గడిగెడుపగిది నీళ్ళార్చిరి పాపనికిని
అంతరంగమాలాపహంబైన చిత్సుధారసమువోని చిట్టాముదమ్ము తెచ్చి
బాలకు కడుపునకుపెట్టి పద్మముఖులు పవ్వళింపంగజేసిరి పాన్పుమీద''
3-27

పుట్టగానే బిడ్డకు బొడ్డుకోయడం, స్నానం చేయించడం, చిట్టాము దాన్ని త్రాగించి పడుకోబెట్టడం మొదలైనవి ఈనాటికీ ఉన్న ఆచారాలే. కుమార ధూర్జటి రచించిన ఇందుమతీ పరిణయంలోనూ ఇలాంటి ఆచారాలు ఎన్నో కనిపిస్తాయి.[1] పాండురంగమాహాత్మ్యంలో అక్షర స్వీకారం మొదలైన సంస్కారాలు వర్ణింపబడ్డాయి.[2]

## పెళ్ళి:

పెళ్ళికి మానవజీవితంలో అత్యంత ప్రాధాన్యం ఉంది. అందుకే మన పెద్దలు 'పెళ్ళంటే నూరేళ్ళపంట' అన్నారు. మనకున్న షోడశ సంస్కారాలలో పెళ్ళికున్న ప్రాముఖ్యం మరేదానికిలేదు. కారణం, పెళ్ళి సాంస్కృతిక వ్యవస్థగా అన్ని సమాజాల్లోనూ గుర్తింపబడడమే. అయితే వివాహ సంబంధమైన ఆచారాలు ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క కులానికి ఒక్కొక్క రీతిగా మార్పులు చెందుతాయి.

---

1. 2 – 5 2. 3–178

స్త్రీ పురుషులమధ్య సన్నిహిత సంబంధాన్ని నెలకొల్పడమే వివాహం యొక్క లక్ష్యం. స్త్రీ పురుష సంబంధం ప్రకృతి సిద్ధమైందని **తాపీధర్మా రావు** పేర్కొంటాడు.[1] సమాజంలో పెళ్ళి, కుటుంబం, బంధుత్వం అనేవి ఒకదానితో ఒకటి పరస్పర సంబంధం కల్గి ఉన్నాయి. వివాహం సక్రమ సంతానాన్ని పెంచడానికి వీలు కలిగించేదిగానేకాక భార్యాభర్తలమధ్య బంధువుల మధ్య నైతిక, సాంఘిక, ఆర్థిక సంబంధాలను నెలకొల్పే వ్యవస్థగా గుర్తింపబడింది. వివాహ నియమాలు లేకుంటే సమాజంలో గందరగోళ పరిస్థితులేర్పడి ఎవరికెవరేమవుతారో గుర్తించడం కష్టం.

వివాహానికి సంబంధించిన దాక్షిణాత్యాచారాలను సోమేశ్వరదేవుడు (క్రీ.శ. 1130) 'అభిలషితార్థ చింతామణి' అనే సంస్కృత గ్రంథంలో వివరించినాడు. ఆరాజు కర్ణాటకుడైనప్పటికీ అతడు చెప్పిన ఆచారాలు తెలుగు ప్రాంతంలోను ఉన్నాయి. కళ్యాణ మండపాన్ని తోరణాలతో, పూలతో అలంకరించాలనీ, కళ్యాణవేదికపై బియ్యం పొయ్యాలనీ, వధూవరులను కూర్చోబెట్టి వారిచేతుల్లో జీలకర్రతో కలిపిన బియ్యాన్ని ఉంచాలనీ, వధూవరులు పరస్పరం తలంబ్రాలు చల్లుకోవాలనీ, పెళ్ళి సంబరం నాల్గురోజులు జరపాలనీ, చివరిరోజున వధూవరులను ఊరేగించాలని సోమేశ్వరదేవుడు తెలిపినాడు.

తెలుగు కావ్యాల్లో పెళ్ళి ఆచారాలు ఎలా వర్ణింపబడ్డాయో తెలిసికొందాము. నన్నయ భారతం ఆదిపర్వంలో మేనమరదలిని వివాహమాడే ఆచారం ప్రస్తావింపబడింది. ''నీకు తెలియకుండా అర్జునుడు సుభద్రను ఎలా తోడ్కొని వెళ్ళగల''డని బలరాముడు కృష్ణుణ్ణి ప్రశ్నించగా అతడు అన్నకిచ్చిన సమాధానం చూడండి.

> ''భరత కులాగ్రణి పాండవసింహంబు సర్వధర్మజ్ఞుఁడాసవ్యసాచి
> తన మేనమరదలి ధవళాక్షి తోడ్కొనిచనియె నాతనికది చనదెచెపుడ''
>
> 8-208

---

1. తాపీ ధర్మారావు, పెళ్ళి - దాని పుట్టుపూర్వోత్తరాలు, పుట. 24.

మేనమరదలిని పెళ్ళాడే ఆచారం తెలుగువారిలో ఈనాటికీ ఉంది. కొన్ని ప్రాంతాల్లో మేనకోడలిని పెళ్ళాడే ఆచారం కూడా ఉంది.

పెళ్ళికిముందు వధువును పెద్దలువచ్చి చూడడం, పెళ్ళి నిశ్చయించడం, నిశ్చయతాంబూలాలు తీసుకోవడం ఆచారం. దీన్నే నిశ్చితార్థం అంటారు. ఈ సమయంలో పెళ్ళి నిశ్చయమైందనడానికి గుర్తుగా వధువు తలమీద పేలాలుంచడం ఆచారం. దీన్నే ముద్రారోహణం అంటారు. శివుడే పార్వతికి భర్త అని నిశ్చయించి మునులు ఆమె తలమీద పేలాలుంచినట్లు నన్నెచోడుడు కుమారసంభవంలో వర్ణించినాడు.[1]

బసవపురాణంలో కట్నాల ప్రసక్తి ఉంది. వివాహం చేసుకొని కళ్యాణ కటకానికి వచ్చిన బసవేశ్వరుడు ఎన్నో కానుక లందుకొంటాడు. అందులో వస్త్రాలు కూడా ఉన్నాయి. "వచ్చువారును జూచువారును కట్టనిచ్చువారును జూచి యేగెడువారు."[2] మడివేలుమాచయ్యకథలో కట్నం అనే పదం కనిపిస్తుంది. "అట్టిచో జంగమంబరుదెంచి యడగ నెట్టి కట్ణంబైననిచ్చి మ్రొక్కుచును."[3] శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు బసవపురాణం పీఠికలో కట్నం అంటే ఏమిటో వివరించినారు. "కట్టనిచ్చు, కట్టగనిచ్చు. ఇట్టి వ్యవహారము నేడు లేదు. నేడు 'కట్నమిచ్చుట' అనియే కలదు. సోమనాథుడు 'కట్నమిచ్చుట' కూడ ప్రయోగించెను. సత్కరించి యొసగెడు వస్త్రమునకు కట్నమని తొలుత పేరై నేడది వస్త్రము లేకపోయినా సత్కరించి యొసగు భూమ్యాభరణాదులకు కూడ వాచకమైనది. సోమనాథుడు కట్నమును వస్త్ర సామాన్యవాచకముగా కూడ వాడినాడు."[4] కట్టునది (వస్త్రము) కట్టము, కట్టనము, కట్నము అనే రూపాలు చెందిందనీ, కట్న మనేమాటకు ఉదికిన గుడ్డ అనే అర్థం కూడ ఉందనీ శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వివరించినారు. ఒక నాడు వస్త్ర వాచిగా ఉన్న కట్నానికి ఈరోజు అర్థమే మారింది.

---

1. 7. 141. 2. పాల్కురికి సోమనాథుడు, బసవపురాణం, ఆ 2, పుట 29. 3. అదే. ఆ 4, పుట 101. 4. పుట 101.

తెలుగువారి ఇళ్ళలో పెళ్ళిళ్ళు నాలుగురోజులు జరుగుతాయి. ఐదవరోజు ఎక్కడి బంధువులక్కడికి వెళ్ళిపోతారు. ఉత్తరాభిమన్యుల వివాహం జరిగాక బంధువులు వెళ్ళిపోయినట్లు భారత ఉద్యోగ పర్వంలో తిక్కన వర్ణించినాడు.

''ఎలమి నభిమన్యు పెండిలి యివ్విధమునజేసి యుల్లాసలక్ష్మికై సేసిమత్స్య
మనుజపతియన్వయంబు పావనముచేసి దినచతుష్టయానంతరమున్నప్రియమున''
1—3.

పెళ్ళి సమయంలో సీతారాములకు నలుగుబెట్టి, స్నానం చేయించి, పేరంటాండ్రు పాటలు పాడినట్లు రంగనాథ రామాయణంలో గోన బుద్ధారెడ్డి వర్ణించినాడు.

''....ఎల్లవాద్యముల — పాటలు పాడుచు పరగనంగనలు
తేటగానందరు తెచ్చి పీటలను — కూర్చుండ తలలంటి కుదురుగ వార
లేర్చి నల్వులుపెట్టి యెంతయుప్రీతి - స్నానముల్ సేయించి....''
బాల — పుట 73.

వధూవరులను పెళ్ళిపీటల మీదికి తీసుకొని వచ్చే సందర్భంలో వాయిద్యాలు మ్రోగిస్తారు. బాగా అలంకరింపబడ్డ వధువును చూసి ఆశ్చర్యంతో అమ్మలక్కలు ముక్కున వేలేసుకోవడం సహజం. పెళ్ళికూతురైన సీతను చూసి ''అమ్మక్కయని సతులక్కజంబంది''నట్లు కవి వర్ణించినాడు.[1] సీతారాముల కల్యాణం జరిగేటప్పుడు తలంబ్రాలను బంగారు తబుకులతో తెచ్చినట్లు చెప్పబడింది. "తలంబ్రాలు బంగారు తబుకుల నునిచి''[2] తబుకు తెలంగాణా మాండలికం. ఈనాటికీ ప్రజలు చిన్న పళ్ళాలను 'తబుకు' 'తప్క' అని పిలవడం కద్దు. జిల్కర బెల్లాన్ని తలమీద పెట్టించడం, తెర తీయడం, చేతిని పట్టించడం మొదలైన ఆచారాలను గోన బుద్ధారెడ్డి ప్రస్తావించినాడు. గోవులు తాళిబొట్టు ఆకారంలో గుండ్రంగా నిలబడ్డాయని హరివంశంలో ఎఱ్ఱన ఒకచోట వర్ణించినాడు.

---

1. గోన బుద్ధారెడ్డి, రంగనాథరామాయణం, బాల. పుట 75.
2. అదే. పుట 76.

''శృంగారంబులు సేసి గోపికలు భాసిల్లంగ గోపాలురు
తుంగాంగంబులతోడ నెల్లకడలంద్రుళ్ళంగ గోబృందముల్
మాంగల్యాకృతిగ్రాల నెంతయును సామగ్ర్యంబునన్ బంధులు
ప్పొంగం బల్లె సముజ్జ్వలోత్సవములంబొంగారె నానాటికిన్''[1]

తాళిబొట్టు స్త్రీ కెంతటి సౌభాగ్యమో గోసంతతి గోకులానికి అంతటి సౌభాగ్యమని కవి ఉద్దేశం. కుంభకుడు నీల పెళ్ళిలో గోవులను అరణంగా ఇచ్చినట్లు హరివంశంలో చెప్పబడింది.

''వేలు పదివేలు లక్షలు, నీలకు నరణంబుగాగ నీయింటికి నే
మేలుగనిచ్చెద గోవుల, నేలాయివియనకు మిది యభీష్టము నాకున్''

పెళ్ళిలో వరునికి కట్నంగా పశువులను, మేకలను, గొర్రెలను ఇవ్వడం ఈనాటికీ గ్రామాల్లో ఉన్న ఆచారమే. 'ఏలా యివి యనకు మిది యభీష్టము నాకున్' అని కుంభకుడు పలికిన పలుకులు — ఇస్తే కట్నకానుకలను ఇష్టంతో ఇవ్వాలనీ, అలా ఇచ్చినప్పుడే తీసుకోవాలనీ అర్థాంతరాన్ని బోధిస్తున్నాయి. మేనమరదలిని వివాహమాడే పద్ధతి హరివంశంలో ప్రస్తావింపబడింది. కుంభకుడు కృష్ణునితో పలికిన సందర్భాన్ని చూడండి -

''కన్నియచేయి చేతగొని కౌతుకవేష మనోజ్ఞుడైన యా
వెన్నుని జేరదెచ్చి యిది వీరభవద్భుజ వీర్యశుల్కయై
మిన్నక కాదు నీదయిన మేనమఱందలు నీకచేరె నీ
కన్నె పరిగ్రహింపుమని కాంతకరంబు కరంబు చేర్చినన్''[2]

పల్నాటివీర చరిత్రలోను మేనమరదలని పెళ్ళాడే ఆచారం పేర్కొన బడింది. దీంతో పాటు 'ఓలి' ఆచారం ప్రస్తావింప బడింది. ఆ కాలంలో అమ్మాయి పుట్టింటివారు వరుని నుంచి ఓలిమాడలు తీసుకొనేవారు. ఓలికి మరో పేరు కన్యాశుల్కం.

''నీ మేనకోడలిన్నీ వడిగినప్పుడు నా మేనమామలు నాపెండ్లినాడు
మాకులంబున ఓలిమాడలుగలవు తగినధనంబీక తామీయమనిరి''[3]

---

1. ఎఱ్ఱన, హరివంశం, 6.27. 2. అదే 6.170. 3. శ్రీనాథుడు, పల్నాటి వీరచరిత్ర, పుట 12.

బాలచంద్రునికి మేనకోడలినిచ్చి పెళ్ళి చెయ్యాలని ఐతాంబ తన అన్నలను కోరింది. వారు కులాచారం ప్రకారం 'ఓలి' అడిగారు. ఓలి ఇవ్వకపోతే పెళ్ళి జరగదు. మేనపిల్లలను పెళ్ళి చేసుకొనేవారుకూడ ఆనాడు 'ఓలి' చెల్లించవలసిందే. ఈరోజు వరశుల్కంలాగా ఆరోజుల్లో 'ఓలి' ఇవ్వడం తప్పనిసరి. ఈకాలంలో వరాన్వేషణ ముఖ్యమైతే శ్రీనాథునికాలంలో కన్యాన్వేషణ ముఖ్యంగా కనిపిస్తుంది. అబ్బాయి వైపువారు అమ్మాయిని అడగడానికి తప్పక రావలసిందే. హిమవంతుడు పార్వతిని శివునికివ్వాలని నిశ్చయించుకొంటాడు. కాని "తన్నడగరాని శివునకు కన్నియ నెట్లెత్తు"[1] నని బాధపడతాడు. శ్రీనాథునికంటె ముందు మంచన తనకేయూర బాహుచరిత్రలో వైశ్యకన్యాన్వేషణకు సంబంధించిన విషయాన్ని ప్రస్తావించినాడు. ఐతాంబ తన అన్నలతో మేనకోడలిని బాలచంద్రునికిచ్చి పెళ్ళి చేయమని కోరడం ఈ విషయాన్నే బలపరుస్తుంది. అల్లుని కాళ్ల కడిగి కన్యాదానం చేయడం, వధూవరులమధ్య తెరగట్టడం, తలంబ్రాలు పోయడం మొదలైన ఆచారాలు హరవిలాసంలో వర్ణింపబడ్డాయి. "ఇట్లెదుర్కొని తుషారగిరీశ్వరుండు మేనకాదేవి పసిడి పాత్రంబుల జలంబువోయ పురాసురాంతకుని పదంబులు కడిగి కన్యాదానంబొనరించె."[2] భార్య నీళ్ళు పోస్తుండగా భర్త అల్లుని పాదాలు కడిగి, కూతురును ధారవోయడం నేటికీ ఉన్న ఆచారమే. ఇకమీద వధువు బాగోగులన్నీ వరుడే చూసుకోవాలన్న అభిప్రాయానికిది సంకేతం. తెరగట్టడం, మంత్రపూర్వకంగా తలంబ్రాలు పోయడం మొదలైన ఆచారాలు అనాదిగా ఉన్నవే.

"పట్టుతెర చీరచాటున బ్రహ్మమంత్రవాద పూర్వకమున తలంబ్రాలు హస్తకమలములు దోయిలించి శ్రీకంధరుండు గౌరిశిరసున పూన్చెను కౌతుకమున"[3]

వివాహానంతరం వధూవరులకు అరుంధతీ నక్షత్రాన్ని చూపించడం ఈరోజు కూడా ఆచారంగా ఉంది. "....... అరుంధతీదేవికను నాపుణ్యదంపతులఖిలలోకములకు నొనరించి రవలోకనోత్సవంబు"[4]

1. శ్రీనాథుడు, హరవిలాసం, 3-28. 2. అదే. 4-94.
3. అదే. 4-95. 4. అదే. 4-97.

తెలుగువారి వివాహ వ్యవస్థలో నాగవల్లికి అత్యంత ప్రాధాన్యం ఉంది. పెళ్ళిలో నాల్గవరోజుచేసే సంస్కార విశేషం నాగవల్లి. నాగపూజే నాగబలి. నాగబలి క్రమంగా నాగవల్లి అయింది. ఇదొక సంస్కార విశేషంగా ఆపస్తంబుని సూత్రాల్లో కనిపిస్తుంది. నాగవల్లినాడు వధూవరులకు శోభనం ఏర్పాటుచేసే ఆచారాన్ని తాళ్ళపాక తిమ్మక్క తాను రచించిన సుభద్రా కళ్యాణంలో ప్రస్తావించింది.

"...కావించవలెనంద్రు ఘనశాసనమున
నాల్గవదినమున నాగవల్లికిని, శోభనంబుగదే సుదతి ఇద్దరకు
పానుపుటింటికి పరగబొమ్మలను కడువేగమంపుడకమలాయతాక్షి." [1]

అత్తవారింటికి వెళ్ళేటప్పుడు నూతన వధువు తల్లిదండ్రులకూ, అన్నా వదినలకూ పాదాభివందనం చేయడం ఆచారం. రుక్మిణి తన పాదాలకు నమస్కరించిన సుభద్రను కౌగలించుకొని "అత్త మేనత్తకదా అదరిపోనేల" అని ధైర్యం చెబుతుంది.

"పుత్తడిబొమ్మోయెలె పొలతిసుభద్ర వదిన పాదములపై వ్రాలుచు మొక్క మ్రొక్కిన మరదల్ని మొగి కౌగిలించి, అక్కునచేర్చుకొని అతివయిట్లనెను అదలనేమిటికి మాయమ్మసుభద్ర, అత్తయునీకు మేనత్తగాన...."[2]

ఇట్లే సత్యభామ తన కాళ్ళకు మ్రొక్కిన సుభద్రార్జునులకు వీరపుత్రుని కనమని ఆశీర్వదిస్తుంది. కొత్తగా అత్తవారింటికి వెళ్ళే వధువు పెద్దల ఆశీస్సులను తనకు కొండంత అండగా భావిస్తుంది. మరదలిని మేనబావ తీసుకొని పోవడంలో తప్పేమిలేదని తిమ్మక్క రాసింది. అయితే ఆ కవయిత్రి బావను పెళ్ళాడడానికి మేనమరదలుచూపే సాహసాన్ని ఆదికవి నన్నయ కంటె ఒక అడుగు ముందుకేసి సమర్థిస్తుంది.

"ఎదిగిన కన్య మన యింటిలోననున్న
మనము చేయకయున్న మగువ పెండ్లాడె."[3]

---

1. తాళ్ళపాక తిమ్మక్క, సుభద్రాకళ్యాణం, పుట 18.
2. అదే. పుట 40. 3. అదే. పుట 44.

కృష్ణుడు బలభద్రునితో పలికిన ఈ పలుకులు బావను వరించడంలో మేనమరదలికి గల అధికారాన్నీ స్వేచ్ఛనూ స్పష్టం చేస్తున్నాయి. తల్లిదండ్రులూ, అన్నలూ అంతా ఉన్నప్పటికీ ఎదిగిన ఆడపిల్లలు కొందరు స్వతంత్రించి మేనబావలను పెళ్ళాడడమేకాక పేదతనంవల్ల కానుక లేమీలేకుండానే అత్తవారింటికి వెళ్ళిన విషయాన్ని తిమ్మక్క ప్రస్తావించింది.[1] తన కాలంనాటి అనేక దేశీయాచారాలను తిమ్మక్క తన సుభద్రా కళ్యాణమనే చిన్న ద్విపద కృతిలో సహజమనోహరంగా చిత్రించి తెలిగింటి ఆడపడుచు అనిపించుకొన్నది.

ఇదే కాలానికి చెందిన తిరువేంగళనాథుని ద్విపదపరమయోగి విలాసంలో వివాహానికి సంబంధించిన అనేక ఆచారాలు పేర్కొనబడ్డాయి. అవి మామ అల్లునికి మధుపర్కాన్ని ఇవ్వడం, కూతురును ధారవోయడం, మొదట వరుని తలమీద వధువు జీలకర్ర ఉంచడం, చేతులకు కంకణాలను కట్టుకోవడం, హోమం నిర్వహించడం, బాసింగం కట్టడం, సప్తపది మొదలైనవి.

''దినకరచంద్రులు తెరవట్టిరపుడు, తనుజాతనయ్యోగిధవుడుతోతెంచి
మకరకుండలునకు మధుపర్కమొసగి, సుకుమారినిచ్చె కృష్ణునకు నవ్వేళ
జలజాక్షిమున్నుగా సుగుడజీరకము, చెలగిరంగేశ్వరు శిరమున నిడియె
ము త్తెంపుపొగడల మొనయుబాసికము, నత్తఱినజాడుకాయ జుడుకట్టంగ''
5 - 431.

సుగుడజీరకం అంటే బెల్లంతోకూడిన జీలకర్ర. దీన్ని జిలకర బెల్లం అని వ్యవహరిస్తారు. పెళ్ళిలోనూ, ఇతర శుభకార్యాల్లోనూ కూతుళ్ళకు ఒడిబియ్యం పోయడం ఆచారం. విష్ణుచిత్తుడు భార్యతో కలసి గోదాదేవికి ఒడిబియ్యాన్ని పోసినట్లు పరమయోగి విలాసంలో వర్ణింపబడింది.

''అమృతంపు బెల్లంపుటచ్చులుమంచి, యమరేంద్రునెలదోటయరటిపండులను
కడుమించు నపరంజి కమ్మదోపులును నొడిబియ్యమిడి కూర్మి యొలయ.''
5 - 438

---

1. తాళ్ళపాక తిమ్మక్క, సుభద్రాకళ్యాణం, పుట 45.

చెరుకురసాన్ని కాచి అచ్చుపోసిన బిల్లలూ, అరటిపళ్లూ కలిపి ఒడిబియ్యం పోయడం ఆనాటి ఆచారం. తెలంగాణా ప్రాంతంలో సామాన్యంగా ఒడి బియ్యంలో దానిమ్మపళ్లు, జామపళ్లు వాడుతారు. అరటిపళ్లు వాడరు.

ఆముక్తమాల్యదలో బాసింగాల ప్రసక్తివచ్చింది. విలుపుత్తూరు గృహ ద్వారాలకు కట్టిన మణితోరణాలు, ఆ గృహాలు ఇతర నగరాల్లోని గృహాలను వివాహమాడడానికి కట్టిన బాసింగాలలాగా ఉన్నాయని రాయలు వర్ణించినాడు.

''పెఱపురాళి గృహశ్రీల పెండ్లియాత, భవనరాజులుకట్టిన బాసికమన
తనరుమణితోరణములతో ద్వారవితతి, బరగువీడులు పురిసూత్రపట్టినట్లు''
1 - 53.

బసవపురాణంలో పాల్కురికి సోమనాథుడు బాసింగాల ప్రసక్తి తెచ్చి నాడు.[1] తనకాలంలో వృషభాలను బాసింగాలతో అలంకరించేవారని తెలిపి నాడు. అతడు బాసింగాలను 'బాసికలుగా' పేర్కొన్నాడు. పెద్దన మను చరిత్రలో తెలుగువారి పెళ్ళి ఆచారాలను సమగ్రంగా చిత్రించినాడు. అతడు చేసినవివాహవర్ణన ఆకాలంనాటి ఆచారాలను ప్రతిబింబిస్తుంది. లగ్నముహూ ర్తాన్ని నిర్ణయించడం, శుభలేఖలు పంపడం మొదలైన ఆచారాలు ఆకాలంలో పాటించేవారు. శుభలేఖలను పెద్దన 'విజ్ఞాన పత్రికల'ని పేర్కొన్నాడు. పెళ్ళికి ఆహ్వానించడానికి స్వయంగా వెళ్లేవారు. లేదా తమ వారిద్వారా పెళ్ళి పత్రికలను పంపేవారు. ''లగ్నంబు నిశ్చయించి .... వినయపూర్వకంబుగా విత్తాధిపతికి విజ్ఞాపన పత్రిక లిఖియించి''[2] ముత్తైదువులు వధూవరులకు లగ్నా నికి ముందు పసుపుతో నలుగుపెట్టి స్నానం చేయించడం, పాటలు పాడడం ఆచారం.

---

1. బసవపురాణం, ఆ 7 పుట 153.
2. మనుచరిత్ర, పెద్దన, 5–55.

"పసుపుల నలుగిడి రైదువ బిసరుహలోచనలు పెండ్లిపెద్దల యాజ్ఞన్
వసుధాధ్యక్షుఋక్షున కసితాలకభరకు పేరటాండ్రౌగి పొసఁగన్"[1]

పెళ్ళి ముహూర్తం సమీపిస్తుండగా పెద్దలు మంగళ వాయిద్యాలతో వెళ్ళి అప్పటికే బస చేసిన పెళ్ళికొడుకును విడిదింటి నుంచి ఏదైనా వాహనం మీద వివాహ వేదిక దగ్గరకు తీసుకొని రావడం ఆచారం. గంధర్వరాజు కోరిక ననుసరించి అతని మంత్రులు వెళ్ళి ఐరావతం మీద స్వరోచిని దీసుకొని వచ్చినట్లూ, గంధర్వరాజు కాబోయే అల్లుడు స్వరోచికి మధుపర్కాన్ని ఇచ్చి నట్లూ పెద్దన వర్ణించినాడు.[2] పెరుగు. నెయ్యి, నీరు, తేనె, పంచదార కలిపి తయారుచేసిందే మధుపర్కం. కన్యాదాత ఇంటికి పెళ్ళికొడుకు వచ్చిన తర్వాత అతనికి ప్రప్రథమంగా ఇచ్చే మధురమైన ఉపాహారమే మధుపర్కం.

వధూవరుల మధ్య తెరగట్టడం ఒక ఆచారం. అలా తెరగట్టి తలల మీద జిలకర బెల్లం పెట్టించి, ఆ తరువాత వధూవరులను ఒకరినొకరు చూసు కొనేటట్లు చేస్తారు. ఒకరి గుణశీలాదులను మరొకరు అంతకు పూర్వమే తెలిసి ఉండీ, ఒకరి నొకరు చూసుకోవాలన్న ఆకాంక్షతో ఉన్న యువతీ యువకు లకు పెళ్ళినాటి తెరకట్టు విధానం భలే ముచ్చట. ఈనాడిది కేవలం ఆచా రంగా మిగిలింది.

"అప్పుడు తూర్యముల్ మొరయనమ్మిథునంబు విలోకన స్పృహం
దెప్పలదేలవంపబడు తెల్లని చీర తెరంగ్రమంబునం
గొప్పు, మొగంబు, నట్టు, చనుగొండలుదోవ లతాంగిపోలెచె
ల్వొప్పతిలన్ సుధారస పయోనిధి పెందెరపుట్టు నిందిరన్"[3]

మనుచరిత్రలో మంగళసూత్రధారణ, తలంబ్రాలు పోసుకోవడం, పెళ్ళి పనులకు పేరంటాండ్రను నియమించడం, వధూవరులచే సన్నెకల్లు త్రొక్కించడం, అరుంధతీ నక్షత్రానికి మ్రొక్కించడం, కాన్కలు చదివిం చడం మొదలైన ఆచారాలు పేర్కొనబడ్డాయి.[4] వధూవరులకు కాన్కలు

---

1. పెద్దన, మనుచరిత్ర, 5-56. 2. అదే 5-77. 3. అదే 5-80.
4. అదే. 5-96.

చదివించడం ఈ రోజు కూడా చూస్తాము. పల్లె ప్రాంతాల్లో పెళ్ళిళ్ళలో కట్నాలు చదివించే ఆచారం ఉంది. కట్నాలను అందజేసిన వారి పేర్లను పురోహితుడు కాని మరొకరు కాని అందరూ వినేటట్లు చదువుతారు. దీన్నే చదివించడం అంటారు.

వసుచరిత్రలో బాసింగాల ప్రసక్తి వచ్చింది. వసురాజు గిరికకు బాసింగాన్ని కట్టినట్లు భట్టుమూర్తి వర్ణించినాడు.[1] గ్రామీణుల దృష్టిలో బాసింగాలు కట్టుకోకపోతే పెళ్ళేకాదు.ఇలాంటిదే తాళిబొట్టు ఆచారం.తాళిబొట్టును స్త్రీలు ప్రాణప్రదంగా భావిస్తారు. కళాపూర్ణోదయంలోని సుగాత్రీ శాలీనుల కథను చదివితే మనకీ విషయం తెలుస్తుంది. శాలీనుడు తనపట్ల అంతగా ప్రేమను చూపక పోవడం వల్ల సుగాత్రి బాధపడుతుంది. అతన్ని ఏమైనా అంటే ఇంకేమైనా జరుగుతుందని భయపడుతుంది. మంగళసూత్రం భద్రంగా ఉంటే చాలను కొంటుంది.[2]

పెళ్ళిలో వధువును తూర్పుముఖం చేసి కూర్చుండ బెట్టడం ఆచారం. వధువుకు ఎలాంటి అలంకరణ గాని, ఎలాంటి పెళ్ళి వేడుక గాని నిర్వహించడానికి ఇద్దరు ముత్తైదువలు ఎప్పుడూ దగ్గరుండడం ఆచారంగా వసుచరిత్రలో వర్ణింపబడింది.

''.......పెండ్లికూతు కాంతలిర్వురు తూర్పుమొగంబుగాగ
పెండ్లిపీఠపై కూర్చుండబెట్టి నేర్పునెరయ సంపెంగనూనెయంటిరి ముదమున''
7-63

రాజశేఖర చరిత్రలో శుభలేఖలను పంపి బంధువులను రప్పించడం, మంచి ముహూర్తాన్ని చూసి నగరాన్ని అలంకరించడం మొదలైన రాజుల ఇళ్ళలో జరిగే పెళ్ళి ఆచారాలు వర్ణింప బడ్డాయి. ఐతే సామాన్య ప్రజలు మాత్రం స్వయంగా వెళ్ళి తమ బంధుమిత్రులకు ఆహ్వానాలు అందజేసేవారు. ఇంకా రాజశేఖర చరిత్రలో పెళ్ళి నాల్గవరోజు జరిగే నాగవల్లి వర్ణింప బడింది. ఆ కాలంలో ఐరేనికుండలను పెళ్ళిచవికె దగ్గర ఉంచేవారు. ఐరేనిమండలకు

---

1. వసుచరిత్ర, 5-117, 2. కళాపూర్ణోదయం, 4-73,

తెల్లని సున్నం పూసేవారు.[1] పాణిగ్రహణం, సప్తపది మొదలైనవి ఆర్యుల ఆచారాలు. మంగళసూత్రధారణం, ఐరేనికుండలను నిలపడం మొదలైనవి దేశీయమైన ఆచారాలు. మల్లన అనుభవం ఉన్న వృద్ధులైన ముత్తైదువలే పెళ్ళి తంతు నిర్వహించాలంటాడు.[2] గ్రామాల్లో నేటికీ ముసలివారైన ముత్తైదువలే పెళ్ళి పనులు నిర్వర్తిస్తారు.

కవికర్ణ రసాయనంలో పెళ్ళికొడుకు చేతిలో 'అడకత్తెర'ను పట్టుకొన్నట్లు వర్ణింపబడింది. ఆ కాలంలో 'అడకత్తెర'ను చిలుక ఆకారంలో తయారు చేసేవారు. వక్కలు కత్తిరించడానికి ఉపకరించే ఈ అడకత్తెర వేడుకలు పూర్తి అయ్యే వరకు పెళ్ళికొడుకు చేతిలో ఉండడం నేటికీ ఉన్న ఆచారమే. కుంతలేశ్వరుడు విమలాంగిని మాంధాత కిచ్చి పెళ్ళి చేసినప్పుడు అరణంగా వారి వెంట ప్రత్యేకమైన చిలుక ఆకారంలోని అడకత్తులను, పగడాల గిండ్లను, గిన్నెలను, మానికలను, చదరంగాలను పంపినట్లు వర్ణింపబడింది.[3]

చంద్రభాను చరిత్రలో మల్లన పెళ్ళి ముహూర్తాలకు సంబంధించిన సమాచారాన్ని తెలియజేసినాడు. బాసింగాలను సరస మనోజ్ఞంగా వర్ణించినాడు.

''చెలిమోమను కలువల చెలియలకావళిపేరి రజనినలమికొన కరం
బులు సాచెనో యనంగా కలికియొకతెయునిచె బాసికపు పూదండల్''
5-168

ముఖం అనే చంద్రుడు ముంగురులు అనే చీకట్లను తన చేతులతో తొలగిస్తున్నాడా అన్నట్లు పెళ్ళికూతురు నుదుట చెలికత్తె బాసింగాన్ని కట్టిందని భావం. వివాహ సమయంలో ముత్తైదువలు ధవళాలు పాడినట్లూ, వధూవరుల తలలమీద 'గుడజీరకాల'ను ఉంచినట్లూ మల్లన వర్ణించినాడు.[4]

---

1. రాజశేఖరచరిత్ర, మాదయగారి మల్లన, 3-177. 2. అదే. 3-179
3. కవికర్ణ రసాయనం, సంకుసాల నృసింహకవి, 3.194.
4. చంద్రభానుచరిత్రం, 5-178.

శుకసప్తతిలో కదిరీపతి ఎన్నో పెళ్ళి ఆచారాలను తెలిపినాడు. బ్రాహ్మణులు ఆ కాలంలో జన్మనక్షత్రం, రాశి, గణం మొదలైనవి అనుకూలంగా ఉన్నప్పుడే వివాహాన్ని నిశ్చయించుకొనేవారు, రాశికూటాలు కుదరకపోతే మానుకొనేవారు. "వివాహవాంఛాధీనుండై కన్యార్థియైపోయి యొక్కచోట నక్షత్రానుకూల్యంబులేక మనోవైకల్యంబు నందుచు నొక్కయెడ జాతివిరోధంబైన వెలవెలంబాఱుచు నొక్కచాయరాశి మిత్రత్వంబు చాలకుండినం బెండుపడుచు నొక్కదారి గణవైపరీత్యంబైన నత్యంతంబనుతాపించుచు పుడమియెల్ల"[1]

యయాతి చరిత్రలో తెలుగువారి పెళ్ళి వేడుకలు రమ్యంగా వర్ణింపబడ్డాయి. తెలగన్న దేవయానిని తెలుగింటి ఆడపడుచుగా చేశాడు. అందు కవి చేసిన వర్ణనలు పరిశీలిస్తే గ్రామాల్లో జరిగే పెళ్ళిళ్ళకు సంబంధించిన పరిజ్ఞానం అతనికేపాటి ఉందో అవగత మౌతుంది. సాధారణంగా గ్రామాల్లో పెళ్ళి కాగానే భోంచేసి వెళ్ళడం ఈ రోజుల్లో లాగా ఆచారం కాదు. చుట్టాలు ఒకటి రెండు రోజులు పెళ్ళివారింట ఉంటారు. పేరంటాండ్రు తమ ఇంట్లోనే పెళ్ళి జరుగుతుందన్నంతగా సంబర పడతారు. వారు చేయని పనులుండవు. ప్రతి మంగళకార్యంలో వారి పాత్ర ఉంటుంది. ఒకరు వధువుకు నూనెతో తల అంటితే మరొకరు పసుపుతో నలుగు పెడతారు. ఒకరు జలకాలాడిస్తే మరొకరు శుభ్రమైన వస్త్రంతో తుడుస్తారు. ఒకరు చెంగావి చీర కట్టిస్తే మరొకరు జడవేసి జాజిపూలతో అలంకరిస్తారు.[2] ఈ చెంగావి చీరల ప్రసక్తి గాథాసప్తశతిలోనూ ఉంది. లగ్నం సమీపిస్తుంటే వాయిద్యాలను మ్రోగించడం, ముత్తైదువలు పెళ్ళిలో ధవళాలు పాడడం నాటి ఆచారం. ఒక్క పెట్టున వాద్యాలు మ్రోగుతుంటే దేవయాని మెడలో యయాతి మంగళసూత్రాన్ని కట్టినాడు.

"తాళిగట్టినపుడు తలిరాకుబోడికి పుడమితేడు వేడ్కకడలుకొనగ
దనరు పెక్కువాయిదమ్ముల మ్రోతలు చెలగి ముజ్జగములు చెవుడుపరుప"[3]

---

1. కదిరీపతి, శుకసప్తతి, 2–160. 2. తెలగన్న, యయాతిచరిత్ర, 4-49.
3. అదే. 4-110.

ఈ విధంగా వాద్యాలను ఒక్కసారే ప్రయోగించడం మనకీనాడు ప్రత్యక్షానుభవమే. వధూవరులు తలంబ్రాలు పోసుకొన్న విధానాన్ని కవి కమనీయంగా వర్ణించాడు.

''చెలియొకతె యెత్తిపట్టిన తలిరాకుంబోడిజేనితలముత్తియపుం
దలబ్రాలు వోసిన తుదన్నెలతుక తలబ్రాలువోసెనేర్పుదలిర్పన్''[1]

పెళ్ళి సమయంలో వధువు సాధారణంగా తలవంచుకొని ఉంటుంది. సిగ్గుతో తలవంచుకొన్న దేవయాని చేతులను చెలి ఎత్తిపట్టగా ఆమె యయాతి తలపై తలంబ్రాలు పోసింది. వెంటనే యయాతి కూడ ప్రతిస్పదించాడు. ఇలా మొదట వధువే వరునిపై తలంబ్రాలు పోయడం ఆచారంగా అనేక కావ్యాల్లో వర్ణించబడింది. లగ్నం కాగానే వధూవరులను ఆయా దేవతలకు మ్రొక్కిస్తారు. ''వేల్పులకున్ మ్రొక్కించిరి పాల్పడి యల పెండ్లికూతుపజ్జ కడకన్''[2] ఇతర కావ్యాల్లోలాగా యయాతి చరిత్రలోనూ నాగవల్లి పెళ్ళి నాల్గవ రోజు జరిగినట్లు వర్ణించబడింది. కాని ముత్తైదువులకు సన్మానాలు జరగడం ఒక్క యయాతి చరిత్రలో తప్ప మరే ఇతర కావ్యాలలోనూ చూడం. ముత్తైదువులను వారి భర్తలతోపాటు కూర్చుండబెట్టి నూతన వధూవరుల చేత వారికి లేత తమలపాకులూ, వక్కలూ ఇప్పించడం తెలగన్న దర్శకత్వంలో జరిగిన సత్కారం. ఈనాటికీ పెళ్ళిళ్ళలో ముత్తైదువలు చీరలో, రవికలో కట్నాలుగా తీసుకోవడం కద్దు.

''తెలనాకులు బాగాలును నలమినపెనిమిటులగూర్చి యైదువయలనా
గలకెల్ల నిడిరి పీడ్యమ్ములు తగనప్పుడమితేడు ముదితయుకడకన్''[3]

పెళ్ళికివచ్చిన చుట్టాలు వధూవరులకు రకరకాల కానుకలను చదివించినట్లు తెలగన్న వర్ణించినాడు. కులం, అందం, సంపద ఉన్న వానికే పిల్లనివ్వాలని తల్లిదండ్రులు భావించినట్లు కవి తెలియజేసినాడు.

''ఇలువడియు చెలువు కలిమియుగలవానికి కన్నె నొసగగాకోరుదురట్లిలువడియుచెలువుకలిమియు గలవానికి కన్నె నొసగగాంచితి మింతీ''[4]

---

1. యయాతి చరిత్ర, 4-111, 2. అదే 4-114, 3. అదే 4-119
4. అదే 4-126.

ఇలువడి అంటే మంచికులంలో పుట్టడం అని అర్థం. మంచి కులం అంటే సదాచార సంపన్నమైన కులమని భావం. గ్రామాల్లో వివాహానంతరం కూతురిని అల్లుని వెంట అత్తగారింటికి మధ్యాహ్నం కంటే ముందే పంపడం ఆచారం. రాత్రిపూట లగ్నాలు జరిగేవి కాబట్టి ఆ ఏర్పాటుండేది. అంతేకాక గ్రామీణులు పొద్దుటిపూట ప్రయాణాన్ని శుభప్రదంగా భావిస్తారు.

''ఒండు కొదలేదు తూరుపుకొండపయింబ్రొద్దువొడిచెకొమ్మా ! యికనే
డెండ బడకుండ కూతుంగొండిక యనకంపవలయు కూరిమి ననుడున్''[1]

శుక్రాచార్యుడు తన భార్యతో దేవయానిని చిన్నపిల్ల అని చూడక ఎండ రాకముందే భర్తఅయిన యయాతితో పంపమని చెప్పిన సందర్భమది. వధువును అత్తవారింటికి పంపేటప్పుడు ఆ తల్లిదండ్రులూ, చుట్టాలూ ఊరి బయటిదాకా కాకుంటే పొలమేరదాకా తోడుగా వెళ్ళడం ఆచారం. 'సాగనంపడం' అనే తెలంగాణా మాండలిక పదానికి ఇదే అర్థం. అలా పొలిమేరదాకావెళ్ళి వధువును అక్కడ సిద్ధంచేసిన పల్లకిలోనో, బండిలోనో పంపించడం జరుగుతుంది.

''అనుచు గారవించి యనుగు కూతును తోడు కొనుచు చెలులు తానుకొంతదవ్వు
వచ్చియంతనిల్చి పచ్చల పల్లకిలోన కొమ్మనునిచిమేనునిమిరి"[2]

ముదటిసారి కన్న కూతురు అత్తవారింటికి వెళ్లేటప్పుడు తన్ను సాగనంపడానికి వెన్నంటి వచ్చేవాళ్ళను విడిచి వెళ్ళలేకపోతుంది. 'ఇక మీరు ఉండండి' అని కూడా చెప్పలేక పోతుంది. ఇంత మందిని విడిచి ఎలా వెళ్ళడమా అన్నబాధ ఆమె మనసులో నిండి ఉంటుంది. తోడుగా అందాకా వెళ్ళిన వాళ్లకూడ 'ఇంక ఉంటాం' అనలేని స్థితిలో ఉంటారు. వాళ్ళకూ బాధే. ఇన్నాళ్లు పెంచిపెద్దచేసిన ముద్దుల కూతురు పుట్టింటినుంచి తరలి పోతుందని. ఇవన్నీ అభిమానం ఆప్యాయతకు సంబంధించిన విషయాలు. ఇలాంటి పరిస్థితుల్లో తల్లిదండ్రులు దుఃఖాన్ని దిగమ్రింగుతూ కూతురుతో 'ఇక మమ్మల్ని ఉండమని చెప్పమ్మా' అని అంటారు. కన్నకూతురు ఆగమని చెబితేగాని ఆగలేని క్లిష్ట పరిస్థితి తల్లిదండ్రులదీను. ఆగడానికి తల్లిదండ్రులు నిశ్చయించు

1. యయాతి చరిత్ర, 4–127. 2. అదే 4. 142.
3. 4,, -127 4. ,, 4. 142.

కొంటే గాని ఆగమని చెప్పలేని పరిస్థితి కన్నకూతురిదీను. రక్త సంబంధంలో ఇంతటి ఆప్యాయత, అనురాగం గూడుకట్టుకొని ఉంటాయి. వివాహ సందర్భంలో తల్లిదండ్రుల మనస్తత్వానికీ, కన్నకూతురి మానసిక పరిస్థితికీ ప్రతీకగా నిల్చిన సాగనంపడం అనే ముచ్చటను రమ్యంగా, వేదనాభరితంగా వర్ణించడంలో తెలగన్న ధన్యుడయ్యాడు.

''ఉండు మనుమమ్మ క్రమ్మఱి
పొండను నీ చెలుల తోడబుట్టువులగు నీ
చండుని మార్కొని ననుపుము
నిండుగ తగనొండు నీవు నీ పెనిమిటితోన్'' 4.143

ఉంటామని తల్లి అనలేదు. ఆగండి అని కూతురు అనలేదు. ఇలాంటి స్థితిలో శోకమూర్తి అయిన తల్లి ఎట్టకేలకు దేవయానితో 'మమ్మల్ని ఉండమని చెప్పు' అంటుంది. చెలులకు 'పొండని చెప్పు' అంటుంది. 'భర్తతో సుఖంగా ఉండు' అంటూ దీవిస్తుంది. గ్రామాల్లో వివాహ సందర్భాల్లో ఈ దృశ్యాన్ని చూసినపుడు మన కళ్ల చెమ్మగిల్లకపోవు.

విజయవిలాసంలో పెండ్లి చవికెదగ్గర కులదేవతను నిలపడం, ఐరేని కుండలు పెట్టడం, ముత్తైదువలు పాటలు పాడడం, బాసింగాలు, తలంబ్రాలు సిద్ధం చేయడం మొదలైన విషయాలు వర్ణించ బడ్డాయి.

''కుల దేవతనుదెచ్చి నిలిపిరి మాణిక్య
 చకచకల్ గల పెండ్లి చవికె దండ
నైరేని గొనివచ్చి రైదువుల్ పాటలు
 పాడుచు శుభవేళ వేడుకలర
పులు గడిగిన ముత్తెముల బాసికంబులు
 సరవి గట్టిరి నేర్పు సంపుటిల్ల
తలబ్రాలకేర్చి ముక్తామణుల్ నించిరి
 పసిడి పళ్ళెముల సంభ్రమముమీఱ....'' 3-95.

శుక సప్తతిలో వరదక్షిణ అనే ఆచారం ప్రస్తావింపబడింది.

''ధరణీసుర మాత్రుడు పే రరయక యరుదెంచి పెండ్లియాడిన జాలున్
వరదక్షిణతో నిచ్చెద తరళేక్షణ ననుచు తండ్రి తలచున్మదిలోన్.''2-156.

ఒక బ్రాహ్మణుని కూతురుకు యుక్తవయస్సు వచ్చినా ఎన్నాళ్ళకీ పెళ్ళి కావడం లేదు. విసిగిపోయిన తండ్రి తన కూతురిని చేసుకొన్న వ్యక్తికి వర దక్షిణ ఇస్తానని ప్రకటిస్తాడు. అట్లైనా వచ్చి పెళ్ళి చేసుకొంటారని ఆ తండ్రి ఆశ.

పెళ్ళి సమయంలోకొట్నం పెట్టే ఆచారం తెలుగువారికుంది. మన్నారుదాస విలాసంలో రంగాజమ్మ ఈ ఆచారాన్ని పేర్కొన్నది

''కాళ్ళ గోరులు దిద్దించి క్రమముతోడ
చెలులు కొట్నంపు సుంకులుచెరిగిరపుడు[1]
కుసుమ గంధులచేత కొట్నంబు పెట్టించి
సుంకులు చెరిగించి పొంకముగసు''[2]

బసవ పురాణంలో 'కొట్నం' పెట్టే ఆచారం. ప్రస్తావించబడింది.
''కొట్నంబు దినము పుట్టెడు దంపంగ బోలక'' ఆ. 4, పు. 316.
''కొట్టము, కొట్టనము, కొట్నము = ధాన్యము'' అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు కొట్నం గురించి విశదపరిచినారు.[3]

వడ్లు మున్నగు వాటియొక్క దంపును కొట్నంగా సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొన్నది.[4] కొట్నం పెట్టే సమయంలో స్త్రీలు పాడే పాటల్ని కొట్నం పాటలు అంటారు. పైడిమర్రి వేంకటపతి 'చంద్రాంగద చరిత్ర' లోను, గోగులపాటి కూర్మదాసుని 'మృత్యుంజయవిలాసం'లోను కొట్నం పాటలు పేర్కొనబడ్డాయి. కన్నడంలో కొట్టణ, కొట్ట అనే పేర్లతో ఈ ఆచారాన్ని వ్యవహరిస్తారు.

పెళ్ళిలో వధూవరులకు నలుగు రాసి మంగళస్నానం చేయించడం ఆచారం. సూనె మొదలైనవి పోవడానికి దేహానికి రాసుకొనే పిండి నలుగు.

---

1. మన్నారుదాసవిలాసం, 5-11 2. అదే 5-251.
3. బసవపురాణం పీఠిక, 113. 4. ద్వితీయ సంపుటం, పుట 413.

ఇది పసుపు లేదా కుంకుమ చందనం కావచ్చు. కొట్నం పెట్టించి, తాంబూల ఫలాలతో ఒడినించి, నలుగురాసి వధువుకు స్నానం చేయించినట్లు మన్నారు దాస విలాసంలో వర్ణించబడింది.

''తాంబూల ఫలముల తనయకు నొడినించి-సేసలు వెట్టుచు భాసురముగ
నలుగు పెట్టించి మంగళ స్నానమపుడు-సంతసంబున నొనరించి....'' 5-26

హరవిలాసంలో కుంకుమతో నలుగుపెట్టిన విషయం ప్రస్తావించ బడింది.''కమనీయలోధ్రవల్కంబునలుంగుననభ్యంగ తైలంబు పనయించి.''[1]

మన్నారుదాస విలాసంలో తెలుగువారి పెళ్ళి ఆచారాలు చాలావరకు వర్ణించబడ్డాయి. కవయిత్రి రంగాజమ్మ వధువు చెంపమీద పెట్టే నల్లని చుక్క బొట్టు ఆచారాన్ని కూడా విడవలేదు. ఆమె పేర్కొన్న ఆచారాలను నేటికీ చూస్తాము. పెళ్ళి పీటలమీద వధువును కూచోబెట్టి కాళ్ళగోళ్లు తీయడం, లత్తుక పూయడం, ముత్తైదువలు కొట్నం పెట్టడం, తమలపాకులు పోకలతో ఒడినింపడం, తలమీద అక్షంతలు చల్లడం, నలుగు పెట్టించి స్నానం చేయించడం, చెంపమీద దిష్టిబొట్టు పెట్టడంతోపాటు వధువుచేత తాళి, ముక్కెర, కంటె, కడాలు ధరింప జేయడం, బాసింగాలు కట్టించడం,వాయిద్యాలను ప్రయోగించడం, ముత్తైదువలు ధవళాలు పాడడం. కన్నవారు వరదక్షిణతో పాటు కూతురిని ధారవోయడం, కొంగులు ముడివేయడం, అరుంధతీ నక్షత్రాన్ని దర్శింపజేయడం మొదలైన ఆచారాలను రంగాజమ్మ తన కావ్యంలో సహజ మనోజ్ఞంగా వర్ణించింది.[2] ప్రాచీన కవయిత్రులలో తిమ్మక్క తర్వాత రంగాజమ్మ పెళ్ళి ఆచారాలను వర్ణించడంలో తన ప్రత్యేకతను నిరూపించు కొన్నది.

లగ్నాన్ని నిశ్చయించి పెళ్ళి పత్రిక రాసుకోవడం ఆచారం. కూచిమంచి తిమ్మకవి ఈ ఆచారాన్ని పేర్కొన్నాడు.

---

1. హరవిలాసం, 4-78, 2. మన్నారుదాసవిలాసం, 5-50.

''నెమ్మియగు పెండ్లి లగ్నంబు నిర్ణయించి కమ్మవ్రాయించి''[1]

పెళ్ళి పత్రికను ఆకాలంలో 'కమ్మ' అని పిలిచేవారు. గ్రంథాలవలె పెళ్లి-పత్రికలను కూడా తాటికమ్మలమీదనే రాసేవారని దీనిమూలంగా తెలుస్తుంది

పెళ్ళిలో వధువు తండ్రికి నూతన వస్త్రాలను ఇవ్వడం ఆచారం. నీలా సుందరీ పరిణయంలో ఈ విషయం ప్రస్తావించబడింది. నీలను కృష్ణునికిస్తే నీకు మంచి బంగారు జరీపని గలిగిన వస్త్రాలు లభిస్తాయని బ్రాహ్మణుడు నీల తండ్రి అయిన ధర్మునితో అంటాడు. ''కెందలిరుబోడి పెండిలి పొందుగ నొనరింపు పసిడి పుట్టము దొరకున్.''[2]

పెళ్ళి జరిగే ఇంటి ముందు పెళ్ళి పందిరి వేయడం, తోరణాలుకట్టడం ముగ్గులు పెట్టడం, గోడలకు సున్నంవేసి చిత్తరువులు దిద్దడం, నేలను అలకడం, కల్లాపి చల్లడం మొదలైన పనులు నేటికీ గ్రామాల్లో చూస్తాము.

నీల పెళ్ళి సమయంలో కూడ ఇలాంటి వనులు చకచకా సాగినాయి. అయితే నీల పెద్దింటి అమ్మాయి కాబట్టి అవి ఆడంబరంగా ఉన్నాయి.

''తెలి ముత్తియపు పందిరుల నెల్లెడల నిల్పి
నలువొప్ప తొాగ తోరణములు గట్టి
ముంగిళ్ళ కపురంపు ముగ్గు లిమ్ముగ బెట్టి
తనరారు గోడలకు చిత్తరులు దిద్ది
పసిడి తీవియల సొంపెసగ కస్తురి అల్కి-
క్రంతల పన్నీరు కలయజల్లి
పట్టు పుట్టముల మేల్కట్టు లమర్చి తీ
విని బైళ్ళనెల్ల గొల్లెనలు పన్ని .... .... ...." 3.48

గొల్ల పెద్దలు నీలాకృష్ణులకు పెళ్ళి చేయాలని బాపనయ్యతో ముహూర్తం పెట్టించారు. తరువాత వధూవరులకు కాళ్ళగోళ్లుతీసి తలలకు చమురంటినారు. నలుగుపెట్టి ఐరేని కుండల నీటితో స్నానం చేయించినారు.

---

1. రుక్మిణీ పరిణయం, 2-20. 2. నీలాసుందరీ పరిణయం, 2-8.

ముహూర్తం దాటకుండా వారిని పెళ్ళి వేదిక మీదికి తీసుకొని వచ్చినారు. బ్రాహ్మణులుమంత్రాలు చదువుతుండగా సన్నని వస్త్రాన్ని తెరగట్టి వధూ వరులచే కాలు తొక్కించినారు. ముత్తైదువలు ప్రేమతో స్పృశించి ఇచ్చిన తరువాత వరునిచేత వధువుమెడలో మంగళ సూత్రం కట్టించినారు. తలంబ్రాలు పోసుకొన్న తర్వాత వధూవరుల చీరల కొనలను కలిపి కట్టి, చిటికెనలు పట్టించినారు. అరుంధతిని దర్శింపజేసినారు. ఆ పిమ్మట నీల తండ్రి కట్నాలు చదివించినాడు. వాటిలో పట్టెమంచాలు, పరుపులు, పెట్టెలు, గద్దెపీటలు, ఆవులు, మేకలు, బఱ్ఱెలు, ఎడ్లు మొదలైనవి ఉన్నాయి.[1]

వివాహాల సందర్భంలో బువ్వంబంతి అనే ఆచారం పాటించబడేది. వివాహానంతరం చుట్టాలంతా కలిసి భోజనం చేయడాన్ని బువ్వం అంటారు.

పారిజాతాపహరణంలో ముక్కు తిమ్మన బువ్వంబంతి విందును పేర్కొన్నాడు.[2] కులం వారంతా కలిసి భోజనం చేయడం ఈ ఆచారం ప్రత్యేకత.

పండు వెన్నెల అనే వెండి పళ్లెరంలో ఇల్లాండ్లు వడ్డించగా చెలులూ, తామూ వేడుకతో బువ్వం సాగించినట్లుగా చక్రవాకాలు ప్రకాశించాయని పొన్నగంటి తెలగన్న యయాతి చరిత్రలో వర్ణించినాడు.

"పండు వెన్నెలనెడు వెండి పళ్లెరముల
చెలగి యిల్లాండ్రు వడ్డింప చెలులు తాము
వేడుకలు మీఱ బువ్వంపు కూడు గుడిచి
పొదలు తమితోడ వెన్నెల పులుగు లమరె" 2.83.

పేరంటం

వివాహం మొదలైన శుభకార్యాల్లో ముత్తైదువలు నిర్వహించే మంగళ కృత్యం పేరంటం. పెళ్ళి పేరంటాలు అనే పదబంధం మనం వింటుంటాం.

---

1. నీలా సుందరీపరిణయం, 3-78 నుంచి 3-87 వరకు.
2. పారిజాతాపహరణం, 2-49.

పెండ్లి ఆచారాలు చాలవరకు ఈ పేరంటాళ్ళ మూలంగానే నిర్వహించ బడ తాయి. నలుగునుంచి నాగవల్లిదాక పేరంటాలు చేయని పనిలేదు. చివరికి బువ్వంబంతిలోకూడ పేరంటాళ్ళయొక్క ప్రమేయం కన్పిస్తుంది. పేరం టానికి వచ్చే ముత్తైదువను పేరటాలు, పేరంటాలు అని పిలుస్తారు. తమ ఇంట్లో పేరంటం అంటూ కన్నెపిల్లలూ, ముత్తైదువలూ ఇల్లిల్లూ తిరగడం చూస్తాం.

పండితారాధ్యుని శివతత్వసారంలో 'పేరంటం' పేర్కొనబడింది.

''మారారి ద్రోహునింటికి పేరంటము వచ్చి తనుచు పెలుచన్ గోసెన్
వైరమున నదితి ముక్కును భారతి నాసికము వీరభద్రుడు రుద్రా'' - 309

తగని చోటికి పేరంటానికి రావడం వల్లనే వీరభద్రుడు అదితికీ, భారతికీ అగౌరవం కల్గించాడు.

పేరంటాళ్ళు పెళ్ళిళ్ళలో పాటలు పాడుతారు. రంగనాథ రామా యణంలో గోన బుద్ధారెడ్డి ఈ విషయాన్ని ప్రస్తావించినాడు.

''పేరటాంద్రొగి పాడు పెండ్లి పాటలకు
శారికా కీరముల్ సందడిసేయ....'' పుట. 74

శచి మొదలైన దేవపురంధ్రులు పేరంటం చేసినట్లు ఎఱ్ఱన హరి వంశంలో వర్ణించినాడు. ''కైసేసి శచి లోనుగాగల దేవపురంధ్రీ వర్గములు పేరటము సేయ'' ఉ. భా. 8.242

శ్రీనాథుని కాలంలో పేరంటాళ్ళను ఆరాధించే ఆచారం ఉన్నట్లు కాశీఖండంలోని శివశర్మోపాఖ్యానాన్నిబట్టి తెలుస్తుంది.

''కట్టింప లేనైతి కమల కాసారంబు
నిలుపంగ లేనైతి తులసి వనము
పేరటాంద్రను నర్చింప నేరనైతి
సలిల సత్రంబు సాగింప జాలనైతి....'' 3.81

శుభకార్యాలు జరిగేటప్పుడు గృహద్వారాల్లో పేరంటాళ్ళు పూర్ణ కుంభాలు నిల్పేవారని శ్రీనాథుడు నైషధంలో వర్ణించినాడు.

''పేరటాంండ్రును హస్త పంకేరుహముల
పూచి యెత్తిన కనకంపు పూజెకుండ
లున్నత స్తనములుకాగ నొప్పు మిగిలె
తరుణియును బోలె నృప గృహ ద్వారభూమి'' 6.82

పూర్ణకుంభాలతో ద్వారాలు స్తనభారంతో విరాజిల్లే తరుణీమణుల్లా ఉన్నాయని కవి ఉపమించినాడు.

పేరంటాళ్ళను పెద్ద పూబోండ్లుగా సూరన కళాపూర్ణోదయంలో వర్ణించినాడు.

''పెండ్లి నృపాలు నింటనని పేరటముల్ ప్రియమొప్పజెప్ప నిం
డ్లిండ్లకు శోభనాక్షతలు హేమపుపాత్రలగొంచు పెద్ద పూ
బోండ్లు చరించి రాకులును పోకలు కుంకుమ పొళ్ళు నూనెయున్
పండ్లును గొంచు వాద్యపు శుభధ్వనితో తనువార వెంటరాన్'' 7.59

ముత్తైదువలు పేరంటానికి పిలువడానికి ఇల్లిల్లు తిరిగినారు. వారి చేతుల్లో పళ్ళాలున్నాయి. వాటిలో అక్షంతలు, ఆకులు, పోకలు, కుంకుమ, నూనె, పండ్లున్నాయి. నూనెను పేర్కొనడంవల్ల పళ్ళాల్లో హారతులు కూడ ఉన్నట్లు భావించవచ్చు. వారివెంట బంధువులున్నారు. వాద్యాలు మోగిస్తున్న వాళ్ళున్నారు. పేరంటానికి పిలవడమనే ఆచారం అలాంటిది. పింగళి సూరన ఈ దృశ్యాన్ని కళ్ళకు కట్టినట్లుగా చిత్రించినాడు.

సంతోషంతో పేరంటాళ్ళు పెళ్ళిలో ఒకరిమీద ఒకరు హాస్యోక్తులు విసురుకోవడమే కాకుండా అక్షంతలు కూడా వేసుకొనేవారని సూరన వర్ణించినాడు.

''చెలరేగి రెండు తోయంబుల పేరంటాండ్రు చిత్తముల నెంతయు వే
డ్కలు మీఱ జల్లులాడిరి తలకక యభినవ శుభక్షతవ్రాతములన్'' 7.70

పిలవని పేరంటానికి వచ్చిన స్త్రీలను గూర్చి చేమకూర వేంకటకవి వర్ణించినాడు.[1]

కలలో పేరంటాలు కనిపించి పూజలు చేయమని కోరినట్లు బ్రాహ్మడు రెడ్డితో చెప్పిన ప్రస్తావన శుకసప్తతిలో ఉంది.

''నిన్నటిరేయి నాయెదుట నిల్చె చుమీ కలలోన మీకు మేల్
పన్నెడు పేరటాల్ నిలిచి బాపడ! రెడ్డికి దెల్పరావె న
న్నెన్నడు తిన్నె బెట్టి నుతియించుచు గొల్వరటంచుబల్కె ....2.445

పేరంటాలు అంటే గ్రామీణుల దృష్టిలో ఒక దేవతే. చనిపోయిన కొందరు పతివ్రతలే గ్రామ దేవతలు అన్న భావన ప్రజల్లో ఉంది.

''జానపద సాహిత్యంలోని పేరంట్రాండ్రు పురాణ పతివ్రతలతో సమాన ప్రతిపత్తి కల్గినవారు. పాతివ్రత్యంవల్ల మరణానంతరం వారు మహిమలు చూపి దేవతలయ్యారు. ఇలా ఐన వారిలో బతకమ్మ కూడ ఒకతి. ప్రతి సంవత్సరం తంగెడు పూలతో బతుకమ్మను పేర్చి గౌరమ్మతో పూజించి చెఱువు గట్టున ఆడి నీళ్ళలో విడిచి పెడుతారు.''[2]

పింగళి సూరన కళాపూర్ణోదయంలో వర్ణించినట్లే పొన్నగంటి తెలగన్న తన యయాతి చరిత్రలో పేరంటాన్ని చక్కగా వర్ణించినాడు.

''ఎల్లియసోకుటొజ్జయతదేపునజేయును కూతుపెండ్లియం
చల్లన పైడి పళ్ళెరములందున గంధముపూలు పచ్చబ్రాల్
పెల్లుగనించి పొల్తుకలు పేరటముల్ తగ జెప్పి వీటిలో
నెల్లెడ ద్రిమ్మరం దొడగి రింపుగ వాయిదముల్సెలంగగన్'' 4.84

పెళ్ళి రేపనగానే మంగళహారతులు పట్టుకొని స్త్రీలు ఇంటింటికి తిరిగి పేరంటం చెప్పడం ఆచారం. తెలగన్న దేవయాని వివాహ సంరంభాన్ని ప్రత్యేకంగా పేరంటంతో ఆరంభించినాడు.

---

1. విజయ విలాసం, 1.13
2. డా. రావి ప్రేమలత, తెలుగు జానపద సాహిత్యము-పురా గాథలు, పుట. 236

ఈ విధంగా పెళ్ళి పేరంటానికి సంబంధించిన అనేక విశేషాలను చిత్రించడంలో రంగనాథరామాయణం, సుభద్రాకళ్యాణం, మనుచరిత్ర, యయాతి చరిత్ర, మన్నారుదాస విలాసం, నీలాసుందరీ పరిణయం మొదలైన కావ్యాలు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి.

అ తి థి మ ర్యా ద లు :

ఇంటికి వచ్చిన వ్యక్తిని అన్నపానాదులతో సంతృప్తి పరచడాన్ని లతిథి సత్కారం అంటాము. యజమాని నిత్యకర్మానుష్ఠానం ముగించుకొని గోదోహనమాత్ర కాలం [ఆరు నిముషాలు] ఇంటిముందు అతిథికోసం నిరీక్షించాలని మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఇంటికి వచ్చిన వారిని మిత్రామిత్ర భేదం చూపక, కులమూ స్థలమూ అడగక సత్కరించాలనీ, భిక్షపెట్టిందే గృహస్థుడు భోజనం చేయరాదనీ, అతిథి ఎవరి ఇంటినుంచి ఆతిథ్యం పొందకుండా వెళ్ళిపోతాడో ఆ ఇంటి యజమాని పుణ్యం అతిథికిన్నీ, అతిథి చేసిన పాపం యజమానికిన్నీ సంక్రమిస్తాయనీ భారతీయుల విశ్వాసం.

తెలుగు కావ్యాల్లో అతిథి సత్కార విశేషాలు అక్కడక్కడ వర్ణించబడ్డాయి. శ్రీనాథుని హరవిలాసంలోని చిరుతొండనంబి కథ అతిథి సత్కార ప్రాముఖ్యతకు సంకేతం. విష్ణుచిత్తుడు మొదలైన భాగవతులు అతిథులను ఎదుర్కొని తీసుకొని వచ్చి చేసిన మర్యాదలను రాయలు ఆముక్తమాల్యదలో రమణీయంగా చిత్రించినాడు.

ఎదురేగి సాష్టాంగమెరిగి పాద్యంబిచ్చి
నారికేళకటాసనములనునిచి
నునుపోక పొత్తిగట్టిన దొప్పగమితోడ
రంభవిశాల పర్ణములు పరిచి
శాల్యన్న సూపాజ్యకుల్యా బహువ్యంజ
నక్షీరదధులర్పణంబు జేసి
వార్చిన పిదప సంవాహన మంత్రముల
కొనరిచి తాంబూలమొసగి కుశల

మడిగిపోయెదమన్న దవ్వనిచి సిరికి
తగిన సత్కృతిజేసి ఖేదమున మగిడి
యర్చగావింతురెపుడు నిట్లతిథులైన
భాగవతులకు నప్పురి భాగవతులు. 1-76

భాగవతులు ఇంటికి వస్తే గృహస్థులకు చెప్పలేని ఆనందం. దండ ప్రణామాలు చేసి, పాదప్రక్షాళనం గావించి, కొబ్బరి చాపలమీద కూర్చుండబెట్టి, అరటాకు విస్తళ్ళలో దొప్పలతో అన్నం వడ్డించి, నెయ్యి పాలు పెరుగు సమర్పించి భోజనానంతరం కాసేపు విశ్రమింపజేసి, తాంబూలం ఇచ్చి, కుశల ప్రశ్నలు వేసి, వెళ్ళిపోయే వారిని కొంతదూరం సాగనంపి, తమ ఐశ్వర్యానికి తగినట్లు అతిథి మర్యాదలు చేసే కుటుంబాలు పదహారవ శతాబ్దిలో చాలా వరకు ఉండేవని పై వర్ణననుబట్టి తెలుస్తున్నది.

అతిథి సేవాతత్పరుడైన విష్ణుచిత్తుని ఇంట్లో అర్ధరాత్రి కూడా విష్ణు గాథలే వినిపించేవి. వాటికితోడు కూరలు లేవు, అన్నం వేడిగా లేదు, భక్ష్యాలు ఒప్పిదంగా లేవు దయతో ఆరగించాలని భోక్తలతో విష్ణు చిత్తుడు చెప్పే ఉపచార వాక్యాలు కూడా వినిపించేవి. ఏ వేళకు వచ్చినా అతిథిని నొప్పించకుండా సత్కరించడం గృహస్థుని ప్రథమ కర్తవ్యం.

"అనిష్ఠానిధి గేహసీమనడురేయాలించి నన్మోశ్రియు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలుం దివ్యప్రబంధాను సం
ధాన ధ్వానము నాస్తిశాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పోనాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య మన్మాటలున్" 1.84

ఆముక్త మాల్యదలోని విష్ణుచిత్తునివలె మనుచరిత్రలోని ప్రవరుడు అతిథి సేవాతత్పరుడుగా చిత్రింపబడ్డాడు. కేవలం భాగవతులకే విష్ణుచిత్తుడు అతిథిమర్యాదలు చేయగా, ప్రవరుడు తీర్థయాత్రాభిలాషతో సిద్ధుని సేవించినట్లు వర్ణించబడింది. అతిథి సత్కారాలు చెయ్యాలన్న అభిలాష యజమానుల కెంత ఉన్నప్పటికీ గృహిణుల తోడ్పాటు లేనిదే అది జరగదు. ప్రవరుని భార్య సోమిదమ్మ గొప్ప ఇల్లాలు. సాక్షాత్తు అన్నపూర్ణాదేవి. ప్రబంధ కాలంనాటి గృహిణులకు ప్రతీక. సనాతన సంస్కృతికి పట్టుగొమ్మ. అర్ధ రాత్రి వెయ్యి

మంది అతిథులు వచ్చినా వారికి కావలసిన భోజన పదార్థాలను వడ్డించగల్గిన మహాసాధ్వి.

"వండనలయదు వేపురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథులేతేర నడికిరేయైన బెట్టు
వలయు భోజ్యంబులింట నవ్వారిగాగ" 1.56

అతిథి మర్యాదల విషయంలో ప్రవరుడూ సోమిదమ్మా ఒకరినొకరు మించిపోయారు. తీర్థసంవాసులు నగరానికి వచ్చారని తెలియగానే ప్రవరుడు ఎంతదూరమైనా ఎదురేగి వారిని తోడ్కొని వచ్చేవాడు. తీర్థయాత్రలంటే ఇష్టం కల్గిన ప్రవరుడు సిద్ధునితో వాటికి సంబంధించిన విశేషాలను వెంటనే అడగక భోజనానంతరం అడగడం అతని సమయజ్ఞతను నిరూపిస్తుంది.

"ఇట్లు చనుదెంచు పరమయోగీంద్రుగాంచి
భక్తి సంయుక్తి నెదురేగి ప్రణతుడగుచు
నర్ఘ్యపాద్యాది పూజనం బాచరించి
యిష్టమృష్టాన్నకలన సంతుష్టుజేసి" 1.60

గృహస్థ ధర్మాల్లో అతిథి పూజాసత్కారాలు ముఖ్యమైనవని శాస్త్రాలు చెబుతున్నాయి. అందుకే పెద్దన సిద్ధుని నోట ఇలా అనిపిస్తాడు.

"బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజికాతిథి క్షపణ కావ
ధూత కాపాలికాద్యనాథులకు కాన
భూసురోత్తమ; గార్హస్థ్యమునకుసరియె" 1.66

అతిథులను సపరివారంగా ఎదుర్కొని తీసుకొనిరావడాన్ని పింగళి సూరన తన ప్రభావతీ ప్రద్యుమ్నంలో పేర్కొన్నాడు. ఇంద్రుడు తనను చూడడానికి వస్తున్నాడని తెలిసిన కృష్ణుడు అతని నెదుర్కొవలసిందిగా సాత్యకిని పంపుతాడు.

''సాత్యకింబిలపించి యద్దివిజవల్లభునెదుర్కొని తోడితెచ్చుటకు
నియోగించిన నతండు సముచిత పరివార సమన్వితుండై యెదుర్కొని
తోడ్కొని చనియెను.'' 1.67.

అతిథికి స్వాగతం చెప్పడంలో చూపే శ్రద్ధ సాగనంపే విషయం లోనూ ఉండటం అత్యవసరం. ఇంటికి వచ్చిన అతిథిని తిరికి సాగనంపే టప్పుడు ఊరు పొలిమేరదాకా తోడుగా వెళ్ళడం గ్రామీణ సంప్రదాయం.

ప్రభావతీ ప్రద్యుమ్నంలో 'పోయివత్తునా' అని చెప్పి వెళ్ళిపోతున్న హంసిని సాగనంపడానికి ప్రభావతి కొన్ని అడుగులు ముందుకు నడిచినట్లు పింగళిసూరన వర్ణించినాడు.[1]

గ్రామీణులు నిష్కళంక హృదయులు. వేళకు వచ్చిన వారిని ఏదో విధంగా సంతృప్తి పరచందే తాము సంతృప్తి చెందరు. అతిథి అభ్యాగతులనూ, దుఃఖపీడితులనూ చూసి తమకేమీ పట్టనట్లుండరు. నిగమ శర్మ కొన ప్రాణంతో కొట్టుమిట్టాడుతుండగా చూసిన ఒక కాపు అతన్ని ఇంటికి తీసుకొని వస్తాడు. అతని పరివారమంతా నిగమశర్మకు అతిథి మర్యాదలు చేస్తుంది. ఎటువంటి వాడైనప్పటికీ అతిథిని సత్కరించడం, గురువుగా దేవునిగా భావించడం ఆనాటి వారికే చెల్లుతుంది.

''జానపదాగ్రామి తన జాతియు నాతియు గూడి దేవునిం
గా నిజదేశికోత్తమునిగా పరమాప్తునిగా దలంచుచున్'' 3.58

ఈ పద్యం ఒక్కటి చాలు మన పూర్వీకుల అతిథిమర్యాదలెలాంటివో తెలుసుకోవడానికి: మన సంస్కృతిలో అతిథి మర్యాదలకు గొప్ప స్థానం ఉంది. యాంత్రిక జీవనానికి అలవాటుపడ్డ నేటి సమాజంలో వీటికి అంతగా ప్రాముఖ్యం కనిపించదు. ఈ అతిథి మర్యాదలు పాశ్చాత్య సంస్కృతిలోనూ

---

1. 4.69.

ఉన్నాయి. పాశ్చాత్యులు అతిథుల క్షేమాన్ని కోరి దేవతలను ఆరాధిస్తే మన వాళ్లు అతిథులను ప్రత్యక్ష దైవాలుగా చూశారు.

''గ్రీకులు, రోమన్‌లు అతిథి సత్కారమును మతసంబంధమైన పవిత్ర సంప్రదాయముగ భావించటమేకాక అతిథుల క్షేమ లాభముల కోసము తమ దేవతలను కొలుచుకొని ప్రార్థిస్తే, భారతీయులు 'అతిథి దేవోభవ' అని అతిథిని ప్రత్యక్ష దైవముగ భావించి అర్చించేవారు.''[1]

ఆ ట లు :

ఆటలు పండుగలవలె ప్రజల ఆచార వ్యవహారాలనూ, సంస్కృతీ సంప్రదాయాలనూ ప్రతిబింబిస్తాయి. శారీరక దృఢత్వంతోపాటు మానసికోల్లాసాన్ని కల్గించడంలో ఆటలకు ప్రత్యేకమైన స్థానం ఉంది. వాఙ్మయం వాగ్రూపమైతే ఆట క్రియారూపమైంది. మనకు వారసత్వంగా అబ్బిన అమూల్య సంపద క్రీడ. ఆట ఆడేవారిదికాగా వినోదం చూసే వారిది. ఈ కారణంగానే ఆటలను వినోదాలుగా అభివర్ణిస్తారు.

ఆట అనేది మానవుల్లో ఉండే స్వభావాభివ్యక్తి ప్రక్రియ అనీ, అది అన్ని సంస్కృతుల్లో కనిపిస్తుందనీ రాబర్ట్ ఎ. జార్జెస్ చెప్పాడు. భాషనూ కళనూ, మతాన్ని నిర్వచించడం కష్టమైనట్లే ఆటను నిర్వచించడం కూడా కష్టమేననీ పలువురు భావించారు. సంకీర్ణ స్వభావం కల్గిన ఆటలను విభజించడం అంత సులభంకాదని స్మిత్ అభిప్రాయపడ్డాడు. శ్రీ నేదునూరి గంగాధరంగారు ఆటలను ఆరు విధాలుగా విభజించారు. 1. ఇంట, బయట ఆడేవి 2. స్త్రీలు, పురుషులు ఆడేవి 3. బాలికలు, బాలురు ఆడేవి 4. అందరూ ఆడేవి 5. శాస్త్రానుభవంతో ఆడేవి (చదరంగం మొదలైనవి) 6. నిషిద్ధాలైనవి. (జూదం మొదలైనవి)

---

1. విజ్ఞాన సర్వస్వం, 10వ సంపుటం, 'ఆతిథ్యం' — ఇంద్రసేన్, పుట. 185.

మన ప్రాచీన కావ్యాలను పరిశీలించినప్పుడు ఈ ఆరురకాల ఆటలూ కనిపిస్తాయి. అయితే నేను ఈ ఆటలను స్థూలంగా రెండు రకాలుగా విభజిస్తున్నాను. అవి 1. పిల్లలు ఆటలు 2. పెద్దల ఆటలు.

పి ల్ల ల ఆ ట లు :

కుమారసంభవ కావ్యంలో బాలికలు ఆడుకొనే ఆటలు పేర్కొనబడ్డాయి. నన్నెచోడుడు పార్వతిశైశవక్రీడలను వర్ణిస్తూ ఆమెతోటి బాలికలతో కలిసి ఆడిన గుజ్జనగూళ్ళను ప్రస్తావించాడు.

> ''తరుణులు చిల్కబొమ్మలును దంతపు బొమ్మలు మేలిగాజు బ
> న్నరులును మ్రాని చొప్పికలు నల్లడనోలిన పేర్చి లీలచే
> కుర బొమరిండ్ల జేయనగు కూళ్ళను వండుచు బొమ్మ పెండ్లి మా
> సరముగజేసియాడ నగజాత శివార్చల సేయనయ్యెడన్'' 3.36

ఈ పద్యంలో నాలుగు రకాలైన ఆట వస్తువులు పేర్కొనబడ్డాయి. అవి చిల్కబొమ్మలు, దంతపు బొమ్మలు, గాజుతో చేసిన గురుగులు, కొయ్యతో చేసిన గురుగులు. బాలికలు బొమ్మరిళ్ళలో వాటిని నాలుగు వైపుల పేర్చి గుజ్జెనగూళ్ళు వండేవారు, బొమ్మల పెళ్ళిళ్ళు చేసేవారు.

బొమ్మరిళ్ళను నిర్మించుకోవడం, వాటిని బొమ్మలతో అలంకరించుకోవడం, గుజ్జనగూళ్ళు వండడం, బొమ్మలను వధూవరులనుచేసి పెళ్ళిళ్ళు చేయడం మొదలైన బాలక్రీడావిశేషాలు అనంతర కావ్యాల్లో బాగా వర్ణించబడ్డాయి. పాల్కురికి సోమనాథుని బసవపురాణంలో పన్నారులు, బొమ్మలు ప్రస్తావించబడ్డాయి. పన్నారులంటే గురుగులు. వీటితో గొడగూచి ఆడుకొనేది. వాటిలో పోలెలు దాచుకొనేది. తల్లిదండ్రులామెకు పిడతలూ, గురుగులూ బహుమతిగా ఇచ్చేవారు.

> ''మూల పన్నారులయాలోవిలోన పోతెలున్నవి పంపుపోయితెచ్చెదను
> పిన్న పన్నారులు సిన్ని బొమ్మలును నిన్నికూడడుకులు నెన్నెనిపండ్లు
> వాకెల్లిమావారు నలిదెత్తురపుడు నీకునిచ్చెదగాని నీయానద్రావు"
>
> ఆ. 3, పు. 71.

పండితారాధ్య చరిత్రలోనూ చిన్న పిల్లల ఆటలు ప్రస్తావించబడ్డాయి.

పొందంగ రాగుంజు పోగుంజులాట
కుందెనగుడి గుడి గుంజంబులాట
యప్పల విందుల యాటపల్మారు
చప్పట్లువెట్టుట సరిగుంజులాట
సేరబొంతలమాట సిట్ల పొట్లాట
గోరంటలాట దాగుడుమూతలాట''

పురాతన ప్రకరణం, పు. 106.

ఉత్తర హరివంశంలో నాచన సోమన గాలిపటాల ఆటను వర్ణించి నాడు. గాలిపటాలను ఆకాలంలో గాలిపడగలని పిలిచేవారు. పడగ శబ్దానికి పాము పడగ అనీ, పతాక అనీ అర్థాలున్నాయి. ఈ రెంటినీ సమన్వయించి చెప్పవచ్చు. పాము పడగలాగ పైకి లేస్తుంది కాబట్టి పడగ అనే అర్థమూ, పతాకలాగ ఆకాశంలో ఎగురుతుంది కాబట్టి పతాక అనే అర్థమూ గాలిపటానికి సార్థకమవుతున్నాయి.

''ఆలజాలంబునీటిపై నాడుజాడ
గాలిపడగ ఆకసమున గ్రాలుత్రోవ
నిదురలోపల కలతోచు నీడ పిదప
కానవచ్చునె యప్పుడ కన్నగాక'' 5.110.

గాలిపటాలను ఎగురుతున్న సమయంలో తప్ప ఆకాశంలో ఎత్తుకు వెళ్ళిన తరువాత చూడలేమని పద్యభావం. గాలిపటాల ప్రసక్తి కేయూరబాహుచరిత్రలోనూ, చంద్రాంగద చరిత్రలోనూ, శుకసప్తతిలోనూ వచ్చింది.

పల్నాటి వీరచరిత్రలో పికిలిపిట్టల ఆటలు ప్రస్తావించబడ్డాయి.

''గద్రున దేన్నుచు గరములపైని
పిగిలిపిట్టలునుండ పెద్ద సావళ్ల
చేరి భాషించుచు చెలగి దుప్పటుల
సొగసొప్పగప్పుక సూరెలనుండ'' పు. 28.

పికిలి పిట్టలాటను గూర్చి శ్రీ వడ్డా సుబ్రహ్మణ్యంగారు "బాలురు పికిలి పిట్టలను పట్టుకొని వాటిమధ్య కొట్లాట పెట్టించి పోరు నడిపించి వాటి గెలుపు ఓట

ములను చూచి ఆనందిస్తూ ఆడుకొనే ఆట అయివుండవచ్చు''[1] నని తెలిపారు.

పల్నాటి వీరచరిత్రలో బొంగరాలాట విస్తారంగా వర్ణించబడింది. బాలచంద్రుడు స్వయంగా తోటి బాలురకు బొంగరాలు ఇచ్చి వారితో కలిసి ఆడినాడు. అతడు అన్ని కులాలకు చెందిన బాలురకు బొంగరాలిచ్చినాడని చెప్పడంవల్ల ఈ ఆటను అందరినీ సమైక్యపరచే సాధనంగా గుర్తించే అవకాశం కలుగుతుంది.

''మంగలియైనట్టి మాధవు కిచ్చె
కుమ్మరిపట్టికి గురుతుగా రెండు
వేలకు చేయించి వేగమె యొసగె
సరిమూడువేలతో చాకలిచందు
బొంగరంబమరించి పొసగనిప్పించె....'' పు. 44.

జానపదులు వలసపోయినప్పుడూ, కష్టాల్లో ఉన్నప్పుడూ బొంగరాలాట ఆడేవారు కాదు. ఐతాంబ బాలచంద్రునితో పలికిన పలుకులు చూడండి.

"వలసలోనున్నాము వడబొంగరాల
నాడిన చేతప్పి అతివలకైన
తగు బాలురకునైన తాకునుపోయి....'' పు. 39.

బొంగరాలాట ఆడేటప్పుడు స్త్రీలకూ, చిన్న పిల్లలకూ అవి తగలకుండా జాగ్రత్త పడేవారు. బొంగరాలాటకు బాలచంద్రుడు పొట్టేళ్ళ మీదెక్కి వెళ్ళేవాడు.

''పట్టు జాలెలు తెచ్చి పరువడి కప్పి
ముందర నిలిపిరి ముద్దు పొట్టేళ్ళు
బాలచంద్రుడు ఛాత్ర సంచయము
వేడ్కమీఱగ వాని వీపులనెక్కి'' పు. 45.

1. తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు, పు. 448.

ఈ ఆటను చూడడానికి కోడళ్ళు అత్తా మామలకు చెప్పకుండా వెళ్ళేవారు. బొంగరాలాట ఊరుకు దూరంగా రావిచెట్లక్రింద ఆడబడేది. పిల్లలు అర చేతుల్లో బొంగరాలను ఆడించే వారు.

> ''బొంగరంబరచేత బూనుకయుండి
> తిరిగింతు చేతిలో దీటు లేనట్టు
> లవనిపై బడకుండ అంతరమందె
> పట్టి ఆడించెద బహువిధగతుల" పు. 46.

కాటమరాజు కథలోనూ ఈ ఆట రావిచెట్లక్రింద ఆడబడినట్లు వర్ణించబడింది. మొత్తంమీద బొంగరాలాటను సర్వసమగ్రంగా చిత్రించిన కావ్యం పల్నాటి వీరచరిత్ర. సర్వజన రంజకమైన ఈ ఆటను గూర్చి డా. బి. రామరాజు గారు ''బొంగరములాట తెలుగు జాతీయ క్రీడ''[1] అన్నారు.

ద్విపద పరమయోగి విలాసంలో చిన్న పిల్లల ఆటలు మనోహరంగా వర్ణించబడ్డాయి. బాలికలు గుజ్జనగూళ్ళు వండిన విధానాన్ని అలంకారమయం చేశాడు తిరువేంగళనాథుడు.

> ''అంతంత చిత్రంబులగునజాండములు
> దొంతులటంచు సంతోషించుకొనుచు
> వరుస గుజ్జనగూళ్ళు వండుదమనుచు
> నరవిరి దాసనంబసలంబు గాగ
> పూనిక నొకకల్వ ప్రోయి యమర్చి
> పూనీట యెసరునం బొలుపారుచున్న
> యొక తమ్మిపూగుండ యునిచి సన్నంపు
> టకరువులను బియ్యమందులోనునిచి
> కన్నెగేదంగిని కలయబెట్టుచును
> కన్నియల్ పొగడ నిక్కరణినాడుచును
> పురుడింపదగు రెండు బొమ్మలు దెచ్చి
> హరియని వైదర్భియని సమకట్టి

1. జానపదగేయ సాహిత్యము, పు. 744.

కూరిమినే పెండ్లి కూతురి దాస
కోరిమీరలు పెండ్లికొడుకు వారనుచు.'' 5-3/9.

దాసాని పువ్వును నిప్పుగాను, కల్వను పొయ్యిగాను, పూలను వంటపాత్రలు గాను, పూనీటిని ఎసరుగాను చేసి గుజ్జనగూళ్ళు వండారు. రెండు బొమ్మలను రుక్మిణీ కృష్ణులను చేసి ఆడపెళ్ళివారనీ, మగపెళ్ళివారనీ రెండు పక్షాలుగా విడిపోయి వివాహ శుభకార్యాన్ని జరిపిన తీరు అద్భుతంగా ఉంది.

పెద తిరుమలాచార్యుల శృంగార సంకీర్తనల్లోనూ బాలబాలికల ఆటలు ప్రస్తావించబడ్డాయి.

''కాళ్చిసబొడ్డు దమ్మిని గుంతపోకలాడెనట
రచ్చనాచన్నులు బొమ్మరాలు తానాడేనంట
అరసినా పేరు దిద్ది ఆడె చక్రపు బిళ్ళంట
గరిమం దొడలుముట్టి కంబాలాటలాడెనంట
అలనాకౌగిట నప్పలప్పలాడెనంట
అలమిశ్రీ వెంకటేశుడాలిమగనాటలంట'' -సంపు. 23, కీ. 173.

పై కీర్తనను వివరిస్తూ డా. వేటూరి ఆనందమూర్తిగారు తమ సిద్ధాంత గ్రంథంలో ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క ఆటను గుర్తించారు. అవి క్రమంగా వామన గుంటలు, బొంగరాలాట, గిల్లిదండె, నాలుగు స్తంభాలాట, అప్పాలాట, పెండ్లియాట అనేవి.[1]

పోతన భాగవతంలోనూ ''బొమ్మరిండ్ల'' ఆట పేర్కొనబడింది. కుమారసంభవంలో పార్వతిలాగా రుక్మిణి బొమ్మల పెళ్ళిళ్ళుచేసి, గుజ్జనగూళ్లు వండించి చెలికత్తెలకు పెట్టింది.

''వేర్వేర బొమ్మలపెండ్లిండ్లుసేయుచు సబలలతోడ వియ్యంబులందు
గుజ్జనగూళ్ళను కొమరొప్పవండించి చెలులకు పెట్టించు చెలువుమెఱయ''
దశమస్కంధం (పూ.భా.) 1687.

1. తాళ్లపాక కవుల పదకవితలు, భాషాప్రయోగ విశేషాలు (ద్వి. భా.) పు. 539.

శ్రీ కాళహస్తిమాహాత్మ్యంలో ధూర్జటి చెంచుబాలకులతో కలిసి తిన్నడు రకరకాల ఆటలాడినట్లు వర్ణించినాడు.

"చిట్లపొట్లకాయ సిరిసింగణావత్తి
గుడిగుడి గుంచాలు కుందెనగుడి
డాగిలి మ్రుచ్చులాటలు గచ్చకాయలు
వెన్నెల కుప్పలు తన్నుబిల్ల
తూరన తుంకాలు గీరనగింజలు
పిల్లదీపాలింకి బిల్లగోడు
చిడుగుడువ్వలపోటీ చెండుగట్టినబోది
యల్లి ముప్పెనబట్టె లప్పలాలు
చిక్కనాబిల్ల లోటిల్లు చిందరాది
యైన శైశవ క్రీడావిహారసరణి
చెంచు కొమరులతోడ నుద్దించుకాడు
తిన్నడభినవబాల్య సంపన్నుడగుచు" 3.33.

ఇందులో పేర్కొనబడిన దాగిలిమూతలు, కచ్చకాయలు, వెన్నెలకుప్పలు మొదలైన ఆటలను బాలికలు కూడా ఆడుతారు. ఉప్పెన బట్టెలాటలు ఉత్తర హరివంశంలోనూ, అప్పలాలు శృంగార సంకీర్తనల్లోనూ, హంసవింశతిలోనూ ప్రస్తావించబడ్డాయి. పాండురంగ మాహాత్మ్యంలో తెనాలి రామకృష్ణుడు కృష్ణునితో తెలుగు పిల్లల ఆటలాడించినాడు. వాటిలో దాగుడు మూతలు, బంతులాట, స్తంభాలాట, తన్నుబిల్ల మొదలైన ఆటలున్నాయి.

యయాతి చరిత్రలో బాలికలు ఆడుకొనే అచ్చనగండ్లు, ఓమన గుంటలు మొదలైన ఆటలు వర్ణించబడ్డాయి. దేవయాని చెలికత్తెలతో కలిసి అచ్చనగండ్లు మొదలైన ఆటలను ఆడుకొనేది. ఎప్పుడైతే కచుడు తనను తిరస్కరించి దేవలోకానికి వెళ్ళాడనే వార్త విన్నదో అప్పుడామె ఎంతో వేదనకు గురైంది. అప్పటికే ఆడుతున్న ఆటమీద కోపం వచ్చింది. అచ్చనగండ్లు పారేసింది. ఓమన గుంటలను విడిచిపెట్టింది. గుజ్జనగూళ్లను తిరస్కరించింది. బొమ్మల పెళ్ళిళ్ళను మధ్యలోనే ఆపింది.*

*. పొన్నగంటి తెలగన్న, యయాతి చరిత్ర, 3-152.

ఇట్లే ధరణిదేవుల రామయమంత్రి దశావతార చరిత్రలో బాలికల ఆటలు ప్రస్తావించబడ్డాయి.* ఇందులో బాలికలు బొమ్మల పెళ్లిళ్లు చేయడమే కాకుండా అత్తాకోడళ్ళ ఆట ఆడడం విశేషం. నారాయణామాత్యుని హంస వింశతిలోను బాలబాలికల ఆటలు పేర్కొనబడ్డాయి. ఆటపాటలతో పొద్దు గడిపే ఒక బాలికకు తెలియకుండానే వయసు పైబడిందని కవి చమత్కారంగా చెప్పిన ఈ పద్యాన్ని చూడండి.

"బొమ్మల పెండ్లిండ్లు బువ్వపుబంతులు
పుణికిళ్ళ నిట్టుక్క బొమ్మరెండ్లు
గుజగుజరేకులు గొబ్బిళ్ళ సిగలు
బుడిగించు జాబిల్లి పుక్కటిల్లు
గుజ్జనగూడులు కోటకోలన్నలు
గిరనగింజలు పార్రుపట్లు
పిప్పిళ్ళ త్రొక్కిళ్ళ బేడిసెతిరుగుళ్ళు
నచ్చనగండ్లు దాయాలుపొళ్ళు
లడరు వామనగుంటలాదైన దట్టి
యాట పాటల బ్రొద్దువో నసుగు జెలుల
బాయక చరించు బాలకీ ప్రాయమేల
వచ్చె విరహాగ్ని యిటులేల హెచ్చెననుచు" 5.155

పెద్దల ఆటలు :

బసవపురాణంలో కోలాటం మొదలైన ఆటలు వర్ణించబడ్డాయి. ఈ ఆటలు బసవేశ్వరుని పెళ్ళి సమయంలో ఆడినట్లు చెప్పబడింది. పండుగల సమయాల్లోనూ, జాతరల్లోనూ, వెన్నెలరాత్రుల్లోనూ నేటికీ గ్రామ ప్రాంతాల్లో కోలాటాలాడడం చూస్తాము. బసవపురాణంలో కోలాటంతోపాటు గొండ్లి, పేరణి, కేళిక, జోక మొదలైన నృత్య విశేషాలుకూడ ప్రస్తావించబడ్డాయి.

"కోలాటమును బాత్రగొండ్లి పేరణియు
కేళిక జోకయు లీలనటింప

---

* 9.81.

బాయక చాగు! బళా! యను శబ్ద
మాయతినాకసంబంది ఘూర్ణిల్ల'' ఆ. 1, పు. 22.

కోలాటం నృత్యవినోదం. కోలల సహాయంతో ఆడుతారు కాబట్టి కోలాటం అయింది. 'గొండ్లి' అనే ఆటను త్రుళ్ళాటగా ఆంధ్ర భాషార్ణవం పేర్కొన్నది.♦ మండలాకారంగా నిల్చి చేసే నృత్యం గొండ్లి, పేరణి, కేళిక, జోక మొదలైనవి నృత్య ప్రధానమైన ఆటలు. ఈ ఆటలాడే సమయంలో ప్రేక్షకులు చాగుబళా అని అరిచేవారు. ఆధ్వనులు ఆకాశంలో ప్రతిధ్వనించేవి. ఇట్లే త్రిపురాంతకుని ఉత్సవాల్లోను కోలాటాలు ఆడినట్లు సోమన పేర్కొన్నాడు.

''పంబిన వివిధ వాద్యంబులు దమ్మటంబులు నిస్సహాణంబులు సెలగ
నందంద చాగుబళా యంచునేగు నందికోలలవారు ముందటిగములు
నెల్లవెల్లెల్లులకెల్లయైపరుగు నల్లహయారూఢ మవ్వీర గణము
చక్కగా నాత్రేలి చక్కటినడుమ పెక్కువిధంబులందక్కజంబగుచు
వేడుక కోలాట మాడెడువారు కూడలి త్రిపురాంతకుని కొల్వువారు.''
ఆ. 2, పు. 29.

కోలాటానికి ఉపయోగించే కోలలు నంది కోలలు. వాటిని నందివృక్షం కట్టెతో తయారుచేసి ఉండవచ్చు. లేదా నందీశ్వరుని పేరుమీద వ్యవహరించవచ్చు. నందికోలలతో ఆడే వారిని 'నందికోలలవారు' అంటారు. బొమ్మలకు దారాలుకట్టి నాటకాలను ప్రదర్శించేవారు ఆకాలంలో ఉన్నారు. బొమ్మలను ఆడించే వ్యక్తిని వెండీడని పిలుస్తారు.

''ప్రకటిత కపట నాటక సూత్రములను
వికృతి ప్రకృతులార్చు వెండీడునతడు'' ఆ. 4, పు. 103.

ఈ బొమ్మలాటలు తోలు బొమ్మలాటలే. జానపదులు ఆనందించే ఇలాంటి నాటకాలేకాక పండితులు కూడా అభిమానించే ఆటలు ఆకాలంలో ప్రదర్శించబడేవి.

---

♦. నుదురుపాటి వేంకనార్యుడు, ఆంధ్రభాషార్ణవం, 1-140.

"అటుగాక సాంగభాషాంగక్రియాంగ
పటునాటకంబుల నటియించువారు" ఆ. 4, పు. 124.

ఉత్తర హరివంశంలో పేరణి, కోలాటం, గొండ్లి మొదలైన నృత్య విశేషాలు ప్రస్తావించబడ్డాయి.

"వడకు పన్నగరాజు పడగలమీద స
ర్వంసహాకాంత పేరణముసూప
ఉబ్బూతలూగెడు నుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాటమాడ
తెరలెత్తి సప్తసాగరములు బొరలంగ
వరుణుండు గొండిలి వరిఢవింప
......................................." 4.216.

'గొండ్లి' పదాన్ని 'గొబ్బి' అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్యవహరించినారు. 'గొబ్బి' గోపిశబ్ద భవమని కూడా వారు నిరూపించినారు.[1] నాచన సోమన ఈ నృత్య విశేషాలతోపాటు 'ఉప్పనబట్టె' ఆటను పేర్కొన్నాడు. అతడు వడతిచూపులను ఈ ఆటతో పోల్చినాడు.

"వడతి నీ చూపులుప్పెనబట్టెలాడించి చెలులవక్త్రముల
పూజించుగాక" 5.139

ఈ 'ఉప్పెనబట్టె' ఆటకు ఉప్పటీలు, చక్ర, ఉప్పుచక్ర, ఉప్పు బందరు, ఉప్పుబలి, చర్పట్టి మొదలైన పేర్లున్నట్లు శ్రీ నేదునూరిగంగాధరంగారు తమ "ఆటలు - పాటలు" అనే పుస్తకంలో పేర్కొన్నారు.[2] దీన్ని ఆడడానికి పది మొదలు ఎంతమంది అయినా ఉండవచ్చు. రెండు దిక్కుల వారు సమానంగా ఉజ్జీలు వేసుకొని ఆడే ఆట ఇది. ఈ ఆటవల్ల శరీరలాఘవం నేర్పరితనం అలవడుతాయి. ఇట్లే నాచన సోమన పాచికలాటను పేర్కొన్నాడు.[3] పాచికలాటను వినోద క్రీడగా భావించవచ్చు.

1. "తిరుప్పావై - సప్తపదులు" పీఠిక, ప్రచు. 1950, పు. 1.
2. పు. 101. 3. నాచన సోమన, ఉత్తర హరివంశం, 3-120.

క్రీడాభిరామంలో రకరకాల వినోద క్రీడలు వర్ణించబడ్డాయి. అవి పొట్టేళ్ల పందాలు, కోడి పందాలు, పాములాటలు, గడాటలు, గంగిరెద్దులాటలు, తోలుబొమ్మలాటలు మొదలైనవి. ముఖ్యంగా జాతరలు, పండుగలు జరిగేటప్పుడు ప్రజలు పందాలను ఏర్పాటు చేసేవారు. వాటివల్ల వారు చెప్పలేనంత ఆనందాన్ని అనుభవించేవారు. పందెంలో పాల్గొనడానికి ఉద్దేశించిన పొట్టేళ్ళు బలిష్ఠంగా ఉండేవి. మెడలో గంటలు మ్రోగుతుండగా అవి తమ యజమానులవెంట పందెం జరిగే చోటుకు వచ్చేవి. రక్తం ప్రవహించేవిధంగా పోట్లాడేవి. ప్రేక్షకులకు కేవలం వినోదం తప్ప వాటి దయనీయ స్థితితో పనిలేదు.

వ. ''తమ యేలిలలవెంట కంఠగ్రైవేయ ఘంటికాటంకారంబులును
విషమవిషాణ కోటి ఘటిత కపాలాయాసాశ్వత్థ పల్లవ
గుళుచ్ఛరించోళికా ఘణఘణాత్కారంబులు చెలంగ యుద్ధ
క్రీడా సన్నద్ధంబులై'' ప. 227.

పొట్టేళ్ళు ఒకదాన్ని మరొకటి ఢీకొనడంవల్ల సుదురుచిట్లి నెత్తురు ఒలికేది. అయినప్పటికీ అవి ప్రేక్షకుల వినోదంకోసం పోరాడేవి. పొట్టేళ్ళతోపాటు కోడి పందాలు జరిగేవి. కోడిపుంజులు ఒకదానిమీద మరొకటి పడి పోరాడేవి. అప్పుడు వాటి జుట్లు నిక్కపొడిచేవి. కవి ఈ దృశ్యాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు

''పారిజాతపుపూవు నాబరగుజూడు
తామ్రచూడంబు చూడాపథంబు జొత్తు
దర్పభరమున బ్రహ్మరంధ్రంబు నడుము
చించి వెడలిన క్రోధాగ్ని శిఖయుబోలె'' ప. 234.

కోడిపుంజు జుత్తును పారిజాత పుష్పంతోనూ, యోగీశ్వరుని బ్రహ్మరంధ్రాన్ని చీల్చుకొని పైకి వచ్చిన అగ్ని శిఖతోనూ పోలుస్తూ కవి చేసిన వర్ణన అద్భుతంగా ఉంది. ఈ కోళ్ల పందాలు ఒకవైపు వినోదాన్ని కలిగిస్తూనే మరోవైపు రెండుజట్ల ప్రజలమధ్య ఈర్ష్యాద్వేషాలను ప్రజ్వలింపజేసేవి. పల్నాటి యుద్ధా

నికే కారణమైన ఈ పందాలు సామాన్య ప్రజలకు భేదం కలిగించకుండా ఉండవన్న సత్యాన్ని ఈ పద్యం తేటతెల్లం చేస్తుంది.

''ఆరువెల్లినాయినారి దుర్మంత్రంబు
కోడి పోరు చాపకూటికుడుపు
ప్రథమ కారణములు పల్నాటియేకాంగ
వీరపురుష సంప్రహారమునకు'' పు. 119.

క్రీడాభిరామంలో పాములాటలు వర్ణించబడ్డాయి. వీటివల్ల జానపదులు ఎంతో వినోదాన్ని పొందేవారు.

"నాగస్వర సుషిరసరన్నాగవరాళ్యాది వివిధ నానారాగ
ప్రాగల్భ్య ప్రకటఫణాభోగములైయాడజొచ్చె భోగీంద్రంబుల్''
ప. 220.

పల్నాటి వీరచరిత్రలోనూ పాములాటలు ప్రస్తావించబడ్డాయి. వీటితోపాటు గంగిరెద్దుల ఆటలు, తోలుబొమ్మలాటలు పేర్కొనబడ్డాయి. బ్రహ్మనాయుడు యుద్ధభూమిలో నాటకంలో బొమ్మలను ఎలా ఆడిస్తారో అలా వీరులను పురికొల్పినట్లు వర్ణింపబడింది.

"ప్రతిమలనాడగ బట్టినయట్ల
నాటకవిధమున నాయుడుచేసె" పు. 26.

గుమ్మడికాయలతోనూ, చెరుకుగడలతో పందాలు కాస్తూ వినోదించే ప్రజలు ఆనాడున్నారు. ఇట్లే పొద్దుపోనివారు జంతువులను గుడులముందుకు తెచ్చి ఆటలాడించేవారు.

''కుటిలజంతులదెచ్చి గుడిలోననుంచి
విడిపించి పోరాడు విధమునుచూడు" పు. 38.

ఆకాలంలో గడలమీదెక్కి, తాళ్ళమీదనడిచి దొమ్మరాటలు ప్రదర్శించే విధానం ఉంది. తాడూ, గడా వీటిమీద ఎక్కి ఆటా డే వాని తల్లికి కలిగే బాధ వినో

దాన్ని అనుభవించే ప్రేక్షకులకుండదు. అందుకే ఐతాంబ శూరునికన్న తల్లిని ఆ తల్లితో పోలుస్తుంది.

''తాడెక్కు-పురుషుని తల్లికి యస్లె
గడమీదనాడు కర్కా-శుని తల్లికిని
శూరుని తల్లికి సుఖమేమిలేదు........" పు. 39.

ఆముక్తమాల్యదలో ఇంద్రజాలమనే వినోదం వర్ణించబడింది. భస్మం, గడ్డి, నెమలి పింఛం మొదలైన వాటితో ఇంద్ర జాలికులు తమ ఆటలను ప్రదర్శించి ప్రజలకు వినోదం కలిగించేవారు.*

కవికర్ణరసాయనంలోను పల్నాటి వీరచరిత్రలోలాగా చెరుకుగడల ఆటలు, బొమ్మలాటలు ప్రస్తావించబడ్డాయి.

''చెఱకు పన్నిదమాడు తెఱగున గొడ్డండ్ల
నడుములు రెండుగా నఱికినఱికి
యంత్రమాడెడు భంగినట్టులు తలలును
విడనసిధారలు వ్రేసివ్రేసి" 2.170.

వైజయంతీ విలాసంలో ప్రజల వినోదాలు వర్ణించబడ్డాయి. ఆకాలంలో కోడిగుడ్లను పణంగాపెట్టి పాచిక లాడేవారు. డబ్బుపెట్టి కోడిపందాలాడేవారు. పందెం గట్టి చెరుకు మోపులు నరికేవారు. నిర్ణీత సమయంలో పరిగెత్తి, తిరిగి వచ్చేలోపల ఇవ్వబడిన పిండి పదార్థాలు తినేవారు.

"కచ్చించి సొగటాలు గఱకలతోకుక్కు-
టాండముల్ పణముగా నాడువారు
ద్రవిణముపై పన్నిదము లొడ్డి మాత్సర్య
గతి కోడి పందెముల్ గట్టువారు
వైచిత్రిగా కోలకాచి పన్నిదమాడి

*. రాయలు, ఆముక్తమాల్యద, 4.112.

చెఱుకుమోపులు లీల నఱుకువారు
గుఱిచూపి యటకేగి పఱతెంచు నందాక
నొసగిన భక్ష్యముల్ మెసగువారు...." 3.69.

శుకసప్తతిలో కొఱవంజీలు ప్రదర్శించే నృత్యాభినయ క్రీడలు పేర్కొన బడ్డాయి.

"ఏయే భూములు చూచినావె కొఱవంజీ రూపలావణ్య
రేఖాయుక్తిం దగు కొమ్మ లెందుగలరీక్ష్మామండలిన్" 1.101

హంసవింశతిలో గంగిరెద్దులాటలు, స్తంభాలాటలు, చిమ్మనగ్రోవులు (హోళీ సందర్భంలో ఆడే ఆటలు) విల్లమ్ములాటలు, చదరంగాలు, పులి జూదాలు, కోలాటాలు మొదలైన దేశీయమైన క్రీడలు పేర్కొన బడ్డాయి.[1]

నారాయణామాత్యుడు కోడిపందాలకు సంబంధించిన అనేక విషయాలు తెలిపినాడు. కోడి పందాలంటే ఆనాడు ప్రజలు కూడ బాగా ఆసక్తి చూపేవారు. కోళ్ళ పందాలవాళ్లు క్రీడాభిరామంలో పేర్కొన్నట్లు ప్రత్యేకంగా ఉండేవారు. పందెంలో కోళ్ళకు గాయాలు తగిలితే చికిత్స చేసేవారు. పందెం కట్టేవారు ముందుగా కొంత సామగ్రిని సమకూర్చుకొనేవారు. వాటిలో గుడ్డ పేలికలూ, దారాలూ, కట్టుముళ్ళూ, నీళ్ళముంతలూ, మూలికలూ (కోళ్ళకు ఉద్రేకం కల్గించే తాంత్రికుల మూలికలు) గాయాలకు మంత్రం వేసి పూసే పసర్లూ ఉండేవి.[2]

నారాయణామాత్యుడు వర్ణించిన ఆటలనూ, వినోదాలనూ పరిశీలిస్తే అతనికిగల దేశీయ క్రీడా పరిజ్ఞానం వ్యక్తమౌతుంది. గ్రామాల్లో ఏ పండుగ వచ్చినా చిన్నలు, పెద్దలు ఏదో ఒక ఆట ఆడడం చూస్తాము. తీరెక వేళల్లో స్త్రీలు ఇంట్లో ఏ పచ్చీసో ఆడటం కద్దు. మొత్తంమీద ఆటలు ఆనందోత్సాహాలను కల్గించడంలో వాటికవేసాటి.

1. నారాయణామాత్యుడు, హంసవింశతి, 3-147,
2. అదే 3-212

జ ల కా లా ట లు :

పై ఆటలతోపాటు జలకాలాట కూడ ప్రాచీన కావ్యాల్లో వర్ణించబడింది. ఈ ఆటను ఓలలాడటం అంటారు. ''అతడు సంతోషంలో ఓలాడుతున్నాడు" అన్న వాక్యం మనం వినే ఉంటాం. ఆ వాక్యానికి సంతోషంలో మునిగి తేలుతున్నాడని అర్థం. గ్రామీణ వాతావరణంలో ఓలాటకు ఒక ప్రత్యేకత ఉంది. నగరాల్లో వంట చేసుకోవడానికే నీళ్ళు దొరకనప్పుడు ఇంక జలకాలాడడం ఎలా కుదురుతుంది? గ్రామీణులు జలాధారం కల్గిన పంటలమీద ఆధారపడి జీవించడంవల్ల బావులతో, చెరువులతో, నదులతో వారికి సాన్నిహిత్యం ఏర్పడింది. సాధారణంగా గ్రామాల్లో స్త్రీ పురుషులు ఈత నేర్చుకొని ఉంటారు. ఈత కొట్టడం సామాన్యమైనా, ఓలాట అనేది ఒక క్రీడగా లెక్కించబడింది. స్త్రీ పురుషులెవరైనా ఓలలాడవచ్చు.

జలక్రీడా సమయంలో 'పట్టుకో చూద్దాం' అని ఇంకొకరిని ప్రేరేపించడానికి పలికేశబ్దం 'ఓల'. ఈ శబ్దాన్నిబట్టి 'ఓలాట' అనే పేరు వచ్చింది. ఓలాటను ఎందరైనా ఆడవచ్చు. ఓలలాడేవాళ్ళు నీళ్లలో మునిగి ముందుకు వెళ్ళి మరోచోట తేలగల్గాలి. ఓలాటను వర్ణించిన మొట్టమొదటి తెలుగు కావ్యం కుమార సంభవం.

> ''తనముఖమంబు జాతమని దండడి మూవు నలివ్రజంబుతో
> పెనగువిదగ్ధమ్రోల నొకబేలసతింగని 'యోల' బెట్టి పి
> ల్చిననది తన్ను పట్టనని చేరినతేటుల దానిమూవి కొం
> డనుచును క్రుంకి పోయి చదురాలయి నవ్వుచులేచెనొక్కెడన్" 9-287

జలకాలాడేసమయంలో తన ముఖాన్ని పద్మంగా భావించి తుమ్మెదలు ముసురుకోగా ఒక స్త్రీ చాల బాధపడింది. అదే సమయంలో మరో స్త్రీ ఆమెను 'ఓల' అని పేర్కొన్నది. వెంటనే మొదటి స్త్రీ తనను బాధపెడుతున్న తుమ్మెదలకు ఎదురుగా ఉన్న స్త్రీ ముఖాన్ని ఆశ్రయించాలని చెబుతున్నట్లు నీళ్ళలో మునిగింది. అంతేకాదు మరోచోట చతురతతో తేలింది. నన్నెచోడుడు వర్ణించిన విధానం ఓలాట స్వరూపాన్ని తెల్పుతున్నది.

ఎఱ్ఱన హరివంశంలో ఓలాటను సహజమనోజ్ఞంగా వర్ణించినాడు.

"ఒండొండ నిద్దరినుండి యద్దరిదాక
　　నేపారు పురుడున నీదియాది
మునిగిలోలోనస చనిదవ్వుదవ్వుల
　　ననువున నెగసి పెల్లార్చియార్చి
కడగానరాని పెన్మడవుల పఱతెంచి
　　యుఱికి వేకడుదేలి మెఱసి మెఱసి
యొండొరుపేర్కొని యోలయోలనిరేచి
　　యదుటునజల్లు పోరాడియాడి
వాద్యభంగిజలము వాయించివాయించి
పాడిపాడి కెరలి యాడియాడి
తనిసి మూడుజాల తఱిప్రొద్దొకించుక
చల్లపడిన నల్ల నల్లవెడలి"　6-101

తనకాలంలో గ్రామాల్లో గోపాలురు ఓలలాట ఎలా ఆడేవారో ప్రబంధ పర మేశ్వరుడు కళ్లకు కట్టినట్లు వర్ణించినాడు. గొల్లలు పసులు మేపటానికిపొలాలకు వెళతారు. బావులు, చెరువులు పొలాలకు అంటుకొనే ఉంటాయి అక్కడే వారికి స్నానమూ, తిండీ. గోపాలురు బావుల్లోగాని, చెరువుల్లోగాని మూడు జాములవరకు అంటే మధ్యాహ్నం దాటి ఎండ చల్లబడేవరకూ ఆడుతారు.

ఓలలాడేటప్పుడు స్త్రీలు శరీరానికి పూసుకొనే పసుపునే 'ఓలగంధం' అంటారు. కాశీఖండంలో శ్రీనాథుడు ఓలగంధాన్ని ప్రస్తావించినాడు. పసుపును శరీరానికి రాసుకొని స్నానం చేయడంవల్ల నునుపెక్కి చర్మం కాంతివంతమౌతుంది. శ్రీనాథుని శృంగార నైషధంలోని ఈ పంక్తులు చూడండి.

"పరిపాటలోష్ఠ బింబములు తేనియతొలల్
తను కాంతి యోలగంధంపు పసుపు"　6-68

పసుపు పూసుకొని స్నానం చేయడమే కాకుండా దాన్ని బొట్టుగా కూడ పెట్టుకొంటారు. అదే ఓలగంధం బొట్టు. క్రీడాభిరామంలో దీని ప్రస్తావన ఉంది.[1]

1. శ్రీనాథుడు, క్రీడాభిరామం, ప. 134.

ఓలలాడేటప్పుడు 'ఓల' 'ఓల' అని అరుస్తారు. పింగళిసూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఓలలాటను వర్ణించినాడు.

"జలఖేల దంగనాకల కలంబులకు మి
క్కిలి దవ్వువాఱక నిలిచినిలిచి
పడతులొక్కరొకళ్ళపై జల్లు జలబిందు
లొడలు సోకిన పోక యోర్చియోర్చి
యోలలాటలతమినొండొరు తఱుము చె
ల్వాల ఢాకకులుకక మెలగి మెలగి...." 2-106.

'ఓల' 'ఓల' అంటూ జలకాలాడిన విధానాన్ని మల్లన చంద్రభాను చరిత్రలో వర్ణించినాడు.

"కల్లోలమున నన్ను కదిసి యీదుటకు
నో యుద్వేల కచజాల యోలయోల
సూటికొమ్మ్మని నాసాటిద్రేయుటకు
నో యుల్లోల కరనాళ యోలయోల
చేపట్టినావెంట చేరి పట్టుటకు
నో యుద్దామకటిసీమ యోలయోల
తగలేకనాతోడ తడవు గ్రుంకుటకు
నో యుజ్జృంభ కుచకుంభ యోలయోల

యో యువిద యిందు రాకున్న యోలయోల
యో చెలియ యూరకుండిన నోలయోల
యో సఖియ యెందుబోయిన నోలయోల
యనుచు సుదతులు గూడి పోరాడినపుడు" 4-35

ఓలలాడేటప్పుడు 'ఓల' 'ఓల' అని పలకడం సామాన్యమైన విషయంగా ఈ పద్యంలో చెప్పబడింది. అయితే ఓలలాడే స్త్రీల ఆకార చేష్టలను ఉద్వేలకచజాల వంటి విశేషణాలతో కవి రూపు కట్టించాడు.

యయాతి చరిత్రలో ఓలలాట చెప్పబడింది.

''ఓలలిడి పట్టనరిగిన నొయ్యనీట
మునిగి దవ్వున లేతురు ముదితలు'' 3-64.

'ఓల' అని పట్టడానికి వచ్చిన వారిని తప్పించుకొని మునగడం, కొంత దూరం నీళ్ళల్లోనే ఈదుతూ మళ్ళీ లేవడం నాటి గ్రామీణ స్త్రీలకు సాధ్యమే. ఆధునికకాలంలోను స్త్రీ పురుషులు ఈత పందాల్లో పాల్గొనడం చూస్తున్నాము. అంతేకాక ఆధునిక క్రీడా ప్రపంచంలో అన్ని దేశాల్లోనూ జలక్రీడల్ని ప్రోత్సహించడాన్ని విశేషంగా చెప్పవచ్చు.

పా ట లు :

ఏరుల పుట్టుక పాటల పుట్టుక ఎప్పుడు జరిగిందో తెలియదు. మనిషి మాట్లాడడం నేర్చినప్పటి నుంచి పదమో పాటో పాడుతూనే ఉన్నాడు. అందమైన దృశ్యాన్ని చూసినప్పుడు కానీ, ఆనంద విషాదాలను వ్యక్తపరచాలనుకొన్నప్పుడు కానీ, అలసిపోయిన మనస్సుకు కాస్త ఆహ్లాదం సమకూర్చుకోవాలనుకొన్నప్పుడు కానీ అతడు పాటపాడి ఉంటాడు. నన్నయకు ముందు శాసనాల్లో కనపించే తరువోజను జానపదుల రోకటి పాటకు పండితులు తీర్చిన ప్రతిరూపంగా భావించ వచ్చు. నన్నెచోడుని కాలంలో అంకమాలికలూ, ఓయల పాటలూ, గౌడు గీతాలూ ప్రచారంలో ఉన్నాయి. పాల్కురికి సోమనాథుడు గ్రామీణులు పాడుకొనే పదాలను పేర్కొన్నాడు. ఉదాహరణకు బసవచరిత్ర, సిరియాళుని చరిత్ర, పల్నాటి వీరగాథ మొదలైనవి ప్రజల నోళ్ళల్లో పాటలుగా రూపు దాల్చినవి. చాలావరకు ఈ పాటలకు కర్తలెవ్వరో చెప్పలేముకాని వాటిని ప్రచారానికి తెచ్చినవారు మాత్రం క్రింది జాతులవారేనని డా. తూమాటి దొణప్పగారు ''జానపద కళా సంపద''లో చెప్పిన మాటలు అందరికీ ఆమోదయోగ్యమైనవే. ఇట్టిపాటలు ఏయే కావ్యాల్లో ప్రస్తావించబడ్డాయో చూద్దాము.

అ ం క మా లి క లు :

నన్నెచోడుని కుమారసంభవంలో పార్వతి అంకమాలికలు పాడినట్లు వర్ణించబడింది. ఇవి స్తోత్రరూపమైన పాటలు.

"లీలనీశ్వరు నంకమాలికల్ పాడుచో
గీత భేదంబుల రీతులెరిగె'' 3-38

ఓయల పాటలు : - నన్నెచోడుడు ఓయల పాటలను పేర్కొన్నాడు.

> "ఉవిదలింపు మిగులనోయలపాటలు
> పాడమధుమదమున పాడెనలులు" 4-89

ఈ పాటలను శ్రీ మానవల్లిరామకృష్ణకవిగారు పుష్పాపచయ గీతాలుగా పేర్కొన్నట్లు తెలుపుతూ డా. నేలటూరివారు 'ఓయల'కు 'ఓయిల్' అని వివరించారు.

> **'Dancing of Persons on festival occasions by moving round and round in a circle to the accompaniment of song, bowing to the ground and waving little towels or hand kerchiefs'-Tamil Lexicon, Vol I, See** ఓయిల్.[1]

'ఓయల' పాటను స్త్రీలు పాడుకొనే ఒకానొక శృంగారం పాటగా సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొంటున్నది. ఆయా ఉత్సవాల సందర్భంలో నృత్యం చేస్తూ పాడుకొనేవే ఓయల పాటలు.

గౌడు గీతాలు: కల్లు దింపేవారి పాటలు గౌడు గీతాలు. కొన్ని జాతుల స్త్రీలు కల్లు త్రాగి ఈ పాటలు పాడినట్లు నన్నెచోడుడు వర్ణించాడు. ఇవి అచ్చంగా దేశీయమైనవి.

> "చీఱిక కల్లుద్రావి మదసింధురగామినులిన్ని కేఱియల్
> వాఱుచు గౌడు గీతములు పాడుచు బొల్పుగ గ్రాలియాడు...."6 - 45

పాల్కురికి సోమనాథుడు దేశికవి. ప్రజలలో ద్విపదకు గల పట్టు అతనికి తెలిసినంతగా ఇతరులకు తెలియదు. బసవ పురాణంలో ద్విపదను గూర్చి అతడిలా అన్నాడు.

> "ఉరుతరగద్య పద్యోక్తులకంటె సరసమై పరిగిన జాను తెనుంగు
> చర్చింపగా సర్వసామాన్యమౌట గూర్చెద ద్విపదలు కోర్కెదైవార"
> ఆ 1. పు. 5

గ్రామీణుల పాటలన్నీ ఎక్కువగా ద్విపద ఛందస్సులో నడచినవే. కొన్ని అచ్చంగా ద్విపదలే. ఆ కారణంగానే పాల్కురికి సోమనాథుడు తన సాహిత్యాన్ని ప్రజలకు చేరువగా ద్విపదల్లో చూపించాడు. బసవేశ్వరుని పెళ్ళి

---

1. కుమార సంభవం (వ్యాఖ్యానసహితం) ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ప్రచు: 1978—పు. 299

సమయంలో భక్తులు కోలాటాలు ఆడుతూ శంకర గీతాలు పాడినట్లు బసవ పురాణంలో చెప్పబడింది.

> "ఆనంద గీతములగ్గించువారు పూనిశంకరగీతములు పాడువారు
> జగతీతలము మీద చప్పటులిడుచునతిశయ శివభక్తినాడెడువారు"
> ఆ 1. పు. 23.

పండితారాధ్య చరిత్రలో పేర్కొనబడిన పదాలు ఆ కాలంలో జన సామాన్యంలో బాగా ప్రచారంలో ఉన్నవే. శ్రీశైల యాత్రకు వెళ్ళే భక్తులు ఆలాపించిన పదాలను కవి చక్కగా వర్ణించినాడు.

> "మదినుబ్బి సంసారమాయాస్తవంబు పదములు తుమ్మెద పదముల్ప్రభాత
> పదములు పర్వత పదము లానంద పదములు శంకర పదములు గొబ్బి
> పదములు వెన్నెల పదములు సంజవర్ణన మరి గణవర్ణనపదము
> లార్ణవ ఘోషణఘూర్ణిలుచుండ పాడుచు నాడుచు పరమ హర్షమున"
> పు. 513.

గొబ్బిపాటలను సంక్రాంతి సమయంలో గానం చేస్తారు. ఉత్తర భారత దేశంలోని గర్బో (గొండ్లి) నృత్యమే తెలుగులో గొబ్బిగా వ్యవహరించబడుతున్నట్లు శ్రీ చిలుకూరినారాయణరావుగారు తమ గుజరాతీ వాఙ్మయ చరిత్రలో తెలిపినారు. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు "తిరుప్పావై - సప్తపదులు"కు వ్రాసిన పీఠికలో గొబ్బెమ్మ గోపమ్మ శబ్దభవమని నిరూపించినారు[1]. శాస్త్రిగారి నిర్ణయాన్ని హంసవింశతిలోని పద్యం బలపరుస్తుందని డా. బి. రామరాజు గారు తెలిపినారు.[2]

సంక్రాంతి రోజు స్త్రీలు పొద్దున్నే లేచి ఇళ్ళ ముందు ముగ్గులు వేస్తారు. ఆ తరువాత ఆవు పేడతో చేసిన గొబ్బెమ్మలను పెట్టి పూజిస్తారు. గొబ్బి పాటలు పాడుతారు. శుకసప్తతిలో వీటి ప్రస్తావన ఉంది.

---

1. తిరుప్పావై - సప్తపదులు. టి. టి. డి. ప్రచురణ, 1950 పు.1
2. తెలుగు జానపద గేయ సాహిత్యము, పు. 511

''బెళుకు నందములు గొబ్బిళ్ళ పాటలు కొప్పు
సవరించు నేర్పుచేసన్నవగలు....'' 2- 434

జానపదులకు గొబ్బిళ్ళన్నా, గొబ్బిపాటలన్నా చాలా ఇష్టం. ఒకపాట చూడండి.

''సుబ్బి గొబ్బెమ్మా సుఖమూలియ్యావే
తామర పువ్వంటీ తమ్ముణ్ణియ్యావే
చేమంతీ పూవంటీ చెల్లెల్నియ్యావే''

రోకటిపాటలు :

పాల్కురికి సోమన కాలంతో శివభక్తుల కథలు పాటలుగా ప్రచారాన్ని పొందాయి. బసవని చరిత్రను, పండితారాధ్యుని చరిత్రను సోమన ద్విపదల్లో రచించడం వల్ల ఆనాటి ప్రజలకవి గాన యోగ్యాలయ్యాయి.

ఆ కాలంలో ''కరమర్థినూరూర సిరియాలు చరిత, మేటియై చను భక్త కూటువులందు పాటలుగా కట్టి పాడెడివారు.'' ఉన్నారు. సిరియాలుని కథనే కాక ఇతర భక్తుల కథలను కూడా స్త్రీలు రోటిలో ధాన్యాన్ని నింపి రోకళ్ళతో దంచుతూ గానం చేసేవారు. ఈ సందర్భంలోని పాటలే రోకళ్ళ పాటలుగా ప్రశస్తి వహించాయి. సోమనాధుడు వీటిని వేదాలతో పోల్చినాడు.

"మునుమాడి వీరువారననేల కూడికనుగొన త్రోళ్లరోకళ్లపాడి" ఆ. 4. పు. 124

తిరుపాటలు :

తమకిష్టమైన దేవుళ్ళమీదా, భక్తులమీదా, వీరులమీదా ఇంకా తమకు నచ్చిన నాయకుల మీదా పాటలూ పదాలూ కట్టి పాడుకొనే స్వేచ్ఛ ఆనాటి జానపదులది. ఆ కాలంలో తిరుప్రబంధాలవలె తిరుపాటలు బహుళ ప్రచారంలో ఉండేవనీ తిరుపాటలను ప్రజలు రాగయుక్తంగా గానం చేసేవారనీ బసవ పురాణాన్ని బట్టి తెలుస్తుంది. దేవతాస్తుతి గీతాలే తిరుపాటలు.

"తాళముల్ క్రంగన ధ్వనియించి మ్రొక్కి వేళానుకూలవిలోల రాగముల
పరగు మహాభక్త చరితలు నాదభరితమైచన తిరుపాటలు చేసి
పాడుచు నొక్కొక్క భక్తునిచరిత........." ఆ. 4, పు. 133

వీ ర గా థ లు :

పల్నాటి యుద్ధానికి కారణమైన నాగమ్మ దుర్మంత్రం, కోళ్ళపోరు, బ్రహ్మనాయుని చాపకూడు మొదలైన సన్నివేశాలను పాటలుగా అల్లి పాడి నట్లు క్రీడాభిరామాన్ని బట్టి తెలుస్తుంది.[1]

ఇంకా ఆత్మశుద్ధికై బాలసాని నిప్పులేటిలో దూకడం, సవతుల పిల్లలు యుద్ధంచేసి వీరమరణం పొందడం మొదలైన చారిత్రకాంశాలు పాటలుగా పల్లె ప్రజల నోటికెక్కాయి.

"ఇచ్చోట భుజయించి రేకకార్యస్థులై
    సామంత నృపపతులు చాపకూడు
ఇచ్చోట చింతించె నిచ్చెనుపాయంబు
    నళినాక్షి యార్వెల్లి నాయురాలు
నిజమనుశుద్ధికై నిప్పులయేటిలో
    నోలాడె నిచ్చోట బాలసాని
ఇచ్చోట పోరిరి యిలపణమ్ముగ గొల్ల
    సవతి తల్లుల బిడ్డలవని పతులు

ధీరులగు వారలేవురు వీరపురుషు
లైమదోద్ధత నిచ్చోట నాజిబడిరి
యనుచు చెప్పుదురైతిహ్య మచటనచట
జనపపెద్దలు పల్లెదేశములయందు" ప. 122

పల్లె ప్రాంతాల్లో ఈనాటికీ వీరగాథలు గానం చేసేవారిని చూస్తాము.

---

1. క్రీడాభిరామం, ప. 119

పరశురాముని పాటలు కూడ వీరగాథల్లోనే చేరుతాయి. వీటిని బవనీలు ఏకవీరాదేవి విగ్రహంముందు నిల్చి పాడినట్లు క్రీడాభిరామంలో వర్ణించబడింది. రేణుకాదేవిని ఏకవీరగాను, పరశురాముని వీరునిగాను జానపదులు ఆరాధించినారు. నిజానికి ఎక్కడ ఎలాంటి సాహసంగానీ, అద్భుతంగానీ జరిగినా ఆ సంఘటన పల్లెల్లో పాట రూపంలో అవతరించేది.

> ''....వాద్యమై ఖరి కడు నెఱవాది యనగ
> నేకవీరా మహాదేవి యెదుట నిల్చి
> పరశురాముని కథలెల్ల ప్రౌఢి పాడె
> చారుతరకీర్తి బవనీల చక్రవర్తి'' ప. 130.

తెలంగాణాలో బవనీలను షైండ్లవారనీ, పంబాలవారనీ పిలుస్తారు. రేణుకాదేవి కథ పామరుల్ని బాగా ఆకర్షించింది. వారి దృష్టిలో రేణుకాదేవి కేవలం పరశురామునికే తల్లికాదు, సమస్తలోకాలకు తల్లి.

చండాలస్త్రీ ఏకవీరను గూర్చి శ్రావ్యంగా పాడినట్లు క్రీడాభిరామకర్త వర్ణించినాడు.

> ''అలరుంబోడి జనంగమప్రమదమధ్యానద్ధఘంటాధ్వనుల్
> చెలగంబాడె సమస్తలోక జననిన్ శ్రీ యేకవీరాంబికన్
> వలరాజొక్కఁక మూర్ఛనాస్వరమునన్ ప్రాణంబు కల్పింపగా
> కలకంఠీకలకంఠ కోమలకుహూకారంబుతోరంబుగాన్'' ప.133.

మాతంగస్త్రీ పరశురామునిమీద పాటలు పాడినట్లు శుకసప్తతిలోనూ వర్ణించబడింది.

> ''..................................
> పరశురామునిపై పాట పాడికొనుచు
> సొంపుమీఱంగ నెక్కలో జోగటంచు
> ముంగిటికి వచ్చి నిలిచె మాతంగి యొకతె'' 2.425

పెం డ్లి పా ట లు:

రంగనాథరామాయణంలో పెండ్లి పాటలు పేర్కొనబడ్డాయి. వీటిని పేరటాళ్ళు గానం చేశారు.

"పేరటాండ్రాగి పాడు పెండ్లి పాటలకు
శారికాకీరముల్ సందడిసేయ" బాలకాండ, పు. 74.

ద్విపద పరమయోగి విలాసంలో "పల్లాండ్లు" పేర్కొనబడ్డాయి. ద్రావిడ పాశురాలను పల్లాండ్లని వ్యవహరిస్తారు. ఇవి ఆశీర్వాదపూర్వకమైన పాటలు.

పల్ ఆండ్ లే (పలువర్షాలు) పల్లాండ్లు.

"చేడియకూర్మి నాచేత పల్లాండ్లు
పాడించుకొన్న శ్రీపతిసొంపుమీఱు" 5.393

భల్లాణచరిత్రలో నాపసానులు పెళ్ళి సమయంలో పాటలు పాడినట్లు వర్ణించ బడింది. నాగవల్లిని నడిపే ముత్తైదువనే నాపసాని అంటారు.

"అప్పుడు నాపసాని చతురశ్రికమండలి హేమకుంభికల్
ముప్పదిమూటి చుట్టునిడి ముత్తియముల్ ఘటియించి తంతులం
దొప్పగ జుట్టి దేవతతి నుత్కటభక్తిని పాడుకొంచు తా
జెప్పినరీతి దంపతుల జేయగజేసె తదర్హకృత్యముల్"

కళాపూర్ణోదయంలోను నాపసాని ప్రస్తావన ఉంది.

"వెలయ వియ్యాలంది వీడుకోళ్ళు గుడిచి
నరపువుల్ ముడిచిన నాపసాని" 7.83

దేవుళ్ళమీద కళ్యాణం పాటలు పాడడం మనుచరిత్రలో ప్రస్తావించ బడింది. పురాణ పురుషులమీద పెళ్ళి పాటలు పాడడం ఈనాటికీ ఆచారంగా ఉంది. చింతలపూడి యెల్లనార్యుని శ్రీరాధామాధవంలో పెళ్ళి పాటలు పేర్కొనబడ్డాయి. ముత్తైదువలే పెండ్లి పాటలు పాడాలన్న నియమం ఆనాడు లేనట్లుంది. స్త్రీలెవరైనా పాడవచ్చు.

"వీనులకు చల్లగా నొక్కవెలది పాడె
కాంత యొక్కతె కరతాళగతులు చూపె

నంగవిన్యాస లీలల హస్తగతుల
మించినటియించె నొకమించు మెఱుగులాడి''  2.167.

బహుళాశ్వ చరిత్రలో ధవళాలు పేర్కొనబడ్డాయి. యయాతి చరిత్రలో పెళ్ళి సందర్భంలో ముత్తైదువలు ధవళాలు పాడినట్లు వర్ణించబడింది శుకసప్తతిలోను వీటి ప్రస్తావన ఉంది.

''ఆ లలనామణికా గయ్యాళి యొకానొక్కవేళ నక్కరతో సు
వ్వాలున్ శోభనములు ధవళాలున్ మొదలైన పాటలందగ నేర్పున్''
1- 523

బాపనమ్మలు చెప్పిన పాటలకు ఆకాలంలో పేరు ఉన్నట్లు తెలుస్తున్నది.

''బాపనమ్మలు చెప్పిన పాటమేలె
యనుచు నేనుందు నినుదూరుకొనగవెఱచి''  3- 148

పూర్వకాలంలో ముత్తైదువలచేత పెళ్ళి పాటలు పాడించడం మంగళకరంగా భావించేవారు. ఐరేని కుండలు పెట్టేటప్పుడు ఐదువలు పాటలు పాడినట్లు చేమకూర వేంకటకవి వర్ణించినాడు.

''ఐరేని గొనివచ్చి రైదువుల్ పాటలు
పాడుచు శుభవేళ వేడుకలర''  3-95.

పెళ్ళి జరిగే సమయంలో ప్రతి చిన్న మంగళకార్యానికి ముత్తైదువలు పాటలు పాడడం తెలుగువారి పెళ్ళిళ్ళ ప్రత్యేకత.

కొట్నం పాటలు పెళ్ళి పాటలే. కొట్నం అంటే ధాన్యం. పెళ్ళి సమయంలో వరి ధాన్యం కుదురులో పోసి దంచుతారు. ఆ సమయంలో పాడే పాటలు కొట్నం పాటలు. బసవపురాణంలో కొట్నం పెట్టే ఆచారం ప్రస్తావించ బడింది.[1]

1. బసవపురాణం ఆ. 4, పు. 316.

పైడిమర్రి వేంకటపతి రచించిన చంద్రాగద చరిత్రలోను కొట్నం పాటలు పేర్కొనబడ్డాయి.

'చెలసెన్ మాధవ కాననేందిరల పెండ్లిందీవపూబోడులు
తక్శికన్ కొట్నము తేట పాట లెసగంగా దంచురీతిం జెలీ" 4.215

గోగులపాటి కూర్మదాసుని మృత్యుంజయవిలాసంలో కొట్నం పాటలు ప్రస్తావించ బడ్డాయి.

"చెలియరావె చేడెరావె చిన్నెరావె పొన్నరావె
వెలదిరావె కొట్నములు వేగదంచుము
గరుడ వాహనములు మంచి గౌరి కుంకుమములు
రత్న సరులు పచ్చగన్నెరులు సన్న దినుసులు" 3.60.

గరుడ వాహనాలు, గౌరి, కుంకుమాలు మొదలైనపేర్లు గల్గిన వడ్లను కుదురులో పోసి, కొట్నం పాటలు పాడుతూ దంచేవారు. కన్నడంలో కొట్టణ కొట్ట అనే పేర్లతో ఈ ఆచారం ఉంది.

వేడుకపాటలు :

యాదవ బాలురు పొలాలకు వెళ్ళి చెట్లెక్కుతూ పాటలు పాడినట్లు ఎఱ్ఱన వ్రాసినాడు.

"వృకముల దోలియార్చుచును వేడుక పాడుచు కూతవైచుచున్
ప్రకట మహీరుహాగ్రములు ప్రాకుచు జున్నులురేచితేనెగో
పకులకు పోయుచున్...."[1]

సామాన్యంగా గ్రామీణులు పొలాల్లో పనిచేస్తున్నప్పుడు ఏవో పాటలు పాడుతూనే ఉంటారు, ఎఱ్ఱన్న పేర్కొన్న పాటలు ఎటువంటివో కాని అవివారి స్వచ్ఛ హృదయాలకు మణిదర్పణాల వంటివని ఊహించవచ్చు.

---

1. హరివంశం, పూర్వభాగం 5-256

జా జ ర పా ట లు :

నాచన సోముని వసంత విలాసంలోనిదంటూ శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఉత్తర హరివంశ పీఠికలో (పు.8) జాజర పాటను పేర్కొన్నారు

"వీణాగానము వెన్నెలతేట
రాణమీరగా రమణులపాట
పాణిమైన పినబ్రాహ్మణువీట
జాణలు మెత్తురు జాజరపాట"

దేశీయాలైన జాజర పాటలే సంస్కృతంలో చర్చరీ గీతాలైనట్లు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వెల్లడించినారు.[1]

భీమ ఖండంలో శ్రీనాథుడు వసంతఋతు వర్ణన సందర్భంలో జాజర పాటలు పేర్కొన్నాడు.

''జాదుర జాదురంచు మృదు చర్చరి గీతులు వారుణీరసా
స్వాద మదాతిరేకముల చంద్రిక కాయగ దక్షవాటికా
వేదుల మీదటన్ కనక వీణలు మీటుచు పాడిరచ్చరల్
మోదమెలర్పగా భువన మోహన విగ్రహుభీమనాథునిన్'' 5- 103

పై పద్యాన్ని బట్టి జాజర పాటలు వెన్నెలలో పాడేవారని తెలుస్తుంది.

''పుష్పొడి మున్నగువాని పొడి జాజర. దానిని చల్లుకొనుచు ఆడునట్టి యాట జాజరాట''[2] అని డా॥ బి. రామరాజుగారు తెలిపినారు. తాళ్ళపాక వారి జాజర పాటలను బట్టి వసంతోత్సవాల్లో స్త్రీలు పుప్పొడినీ, కస్తూరినీ తమ ప్రియులమీద చల్లుతూ ఆడుకొంటూ పాడే పాటలే జాజర పాటలని వేడా॥ .టూరి ఆనందమూర్తిగారు తెలిపినారు.[3]

---

1. డా॥ వేటూరి ఆనందమూర్తి, తాళ్ళపాక కవుల పద కవితలు, (ద్వి. భా) పు.345
2. తెలుగు జానపద గేయ సాహిత్యము, పు. 799
3. తాళ్ళపాక కవుల పదకవితలు, (ద్వి. భా) పు. 346

జ క్కు ల పా ట లు :

క్రీడాభిరామంలో జక్కుల స్త్రీ కామవల్లీ మహాలక్ష్మి కైటభారుల మీద పాటలు పాడినట్లు చెప్పబడింది.

''కామవల్లీ మహాలక్ష్మి కైటబారి
వలపు పాడుచు వచ్చె జక్కులపురంధ్రి''

జక్కులు ప్రదర్శించే నాట్య విశేషాన్ని పండితులు యక్షగానంగా గుర్తించినారు. కామవల్లీ మహాలక్ష్మి మీద పాడే పాట కామేశ్వరిపాట.

వె న్నె ల గు డి పా ట :

కొరవి గోపరాజు సింహాసనద్వాత్రింశికలో వెన్నెలగుడి పాటను ప్రస్తావించినాడు. పొలంలో పనిచేసి అలసిపోయిన పల్లీయులు గంజో, అంబలో త్రాగి ఎక్కడో ఒకచోట ఒరిగి ఈ పాట పాడేవారు. ఒకరు పాడుతుంటే మరొకరు ఆనందించేవారు.

''పనిచేసి గంజియైనను నంబలైనను
నెదచల్లగా త్రాగి యెచటనైన
పడి యుండి వెన్నెల గుడిపాట పాడగా
పేదల కాత్మ సంప్రీతి గలుగు'' 9. 15

నెలరాజే వెన్నెల రాజు. వెన్నెల(కు) గుడి- చంద్రుడు. వెన్నెలనూ, చందమామనూ, సంబోధిస్తూ పాడే పాటలు వెన్నెల గుడి పాటలు. పాటలు పేదలకు ఆనందం కల్గిస్తాయనడంలో ఆశ్చర్యం లేదు. చందమామను చూస్తూ భోజనం చేసేటప్పుడు గుటకలు వేయడం సహజమే. పాల్కురికి సోమనాథుడు వెన్నెల పదాలను పేర్కొన్నాడు. ప్రతి చరణం చివర 'వెన్నెలా' అనే పదం ఆవృత్తి **(Refrain)** కావడం వెన్నెల పాటలక్షణం.

పిల్లలు కొంచెం పెద్ద వాళ్ళయిన తరువాత తల్లులు వాళ్ళను ప్రేమతో తమ తొడలమీద కూర్చుండ బెట్టుకొని చందమామను చూపిస్తూ గోరుముద్దలు

తినిపిస్తారు. ఒకవేళ పిల్లవాడు మారాము చేస్తే ఆ సమయంలో వారు ఏం పాట పాడుతారో మనకు తెలుసు : అదే చందమామ పాట.

''చందమామ రావే - జాబిల్లి రావే
కొండెక్కిరావే కోటిపూలు తేవే
పరుగెత్తిరావే - పాలుపెరుగు తేవే
అన్నిటిని తేవే - అబ్బాయికీవే''

ఈ పాటలోని భావాన్నే తిరువేంగళనాథుడు తన ద్విపద పరమ యోగ విలాసంలో అలంకారంగా గ్రహించాడు.

''ఇలలోన పసిబిడ్డ లెఱుగమి పిలిచి
యల చందమామ వెన్నడిగినట్లయ్యె" 3 -249

శ్రీరంగనాథుడే తనకు భర్తకావాలని తన కూతురు కోరగా రాజు పలికే సందర్భం అది.

ఏడుస్తున్న పిల్లలను ఓదార్చడానికి ఆకాశంలోని చందమామను చూపిస్తారు పెద్దలు. లోకంలో ప్రచారంలో ఉన్న జానపదుల పాటను అలంకారంగా తీసుకోవటం కవి లోకజ్ఞతను తెలియజేస్తుంది.

కూచిమంచి తిమ్మకవి రుక్మిణీ పరిణయంలో "చందమామరావె -జాబిల్లి రావె'' పాట ప్రస్తావించబడింది.

పిల్లలను రంజించడానికి చందమామను సంబోధిస్తూ అల్లిన పాటలు ఇతర భాషల్లోనూ ఉన్నాయి.

''Newmoon come out give water for us
New moon thunder down water for us
New moon shake down water for us''
-- C. M Boura, Primitive song P. 79.[1]

---

1. డా॥ ఆర్వీయస్. సుందరం, తెలుగు- కన్నడ జానపద గేయాలు. పిల్లల పాటలు, పు. 138.

ఏ ల పా ట లు :

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఏలపాటలను శృంగార హాస్య రసో పేతాలుగా పేర్కొన్నారు.

"ఏలపాటలంటే నానా రసాలతో, నానా రాగాలతో, నానా ఫణతులతో పాడే చమత్కారపు పొడి మాటలన్నమాట. ప్రాచీన గ్రంధాలు పరిశీలిస్తే ఈ విషయమలాగే తేలుతుంది. మరిన్నీ ఆరంభ కాలంలో యేలలనే పేరుతో పేర్కొనబడుతూ వచ్చిన చమత్కారపు పాటలే తర్వాత జోలలనీ, సువ్వాల లనీ, ఓలలనీ ఇంకా యేమో అనీ విభాగములతో పేర్కొన బడుతూవచ్చినవి"[1]

వీటినే డా॥ ఆర్వీయస్. సుందరంగారు తమ సిద్ధాంత గ్రంథంలో యౌవనానుభవాన్ని సూచించే భావాలు కలిగిన పదాలుగా పరిగణించినారు.[2] ఉదాహరణకు అన్నమాచార్యులు రచించిన ఏలపదం గమనించండి. ఇది శృంగారమయం.

"బొండుమల్లె పానుపుపై నుండి నిన్ను పాడి పాడి
నిండు జాగరములుంటిరా- వేంకటేశ! యెండలాయె వెన్నెలయురా"[3]

చింతలపూడి ఎల్లనార్యుని శ్రీ రాధామాధవంలో ఏలపాటలు ప్రస్తావింప బడ్డాయి. ఇవి హాస్యస్ఫోరకాలని తెలుస్తుంది.

ఏలపాటలనెల్ల నించుకించుక పాడు
తగవు మాటల జాణ తనములాడు" 5-112

విటులు ఏల పాటలు పాడినట్లు శుకసప్తతిలో చెప్పబడింది.
"వీథినేగెడు ప్రౌఢవిటుడు పాడెడు వింత
యేలపదాలట్టె ఆలకించు" 2.172

ఏలలు శృంగార పదాలనడానికి పై పంక్తులను ఉదాహరణగా చూప వచ్చు. శుకసప్తతిలో మరోచోట ఏలలను బ్రాహ్మణేతరులు పాడినట్లు వర్ణించ బడింది.

---

1. ఏలపాటలు (తెలుగు నుడికారపు సొంపు) ఆంధ్రపత్రిక, 11-6-1944
2. తెలుగు కన్నడ జానపద గేయములు, పు. 185
3. తాళ్ళపాక కవుల పదకవితలు- భాషాప్రయోగ విశేషాలు (ద్వి. భా) పు. 306

వెన్నెలకంటి సూరన విష్ణుపురాణంలో ఈ పదాలను పేర్కొన్నాడు.

'గుజ్జు దాగిలి మ్రుచ్చులు గోడిపట్టె
లేలపాటలు సరి బేసులేకకూత
లాదిగా శైశవ క్రీడలాడిరచట
రామకృష్ణులు గోపదారకులగూడి'' 7. 202

ఇందులో 'ఏలలు' శైశవ క్రీడలుగా పేర్కొనబడడం విశేషం. కూచిమంచి తిమ్మకవి అచ్చ తెనుగు రామాయణంలో ఏలలను ప్రస్తావించినాడు. యుద్ధ సందర్భాల్లో కూడ ఏలలు పాడేవారని ఇందలి ఉదాహరణను బట్టి తెలుస్తున్నది.

"కోయని మార్చుచు గుప్పించి దాటుచు
నేలలు పాడుచు నీలలిడుచు'' -90

జోలపాటలు : జోలపాట అనగానే తాళ్ళపాక అన్నమయ్య జ్ఞాపకం వస్తాడు. అతని జోలపాటను గమనించండి-

"జో వచ్యుతానంద జో జో ముకుంద
రావె పరమానంద రామగోవింద
అంగజుని గన్న మాయన్నయిటురారా
బంగారు గిన్నెలో పాలుపోసేరా
దొంగనీవని సతులు పొంగుచున్నారా
ముంగిట నాడరా మోహనాకారా''

అన్నమాచార్యుల సంకీర్తలనుంచి ఈ పదాన్ని సేకరించి దానిని జోల పాటగా తొలుత గుర్తించిన వారు శ్రీ వేటూరిప్రభాకర శాస్త్రిగారు.[1]

ఈ జోలపాట జానపదుల గృహాల్లో ఎంతో ప్రచారాన్ని పొందింది. ప్రధానంగా తల్లి తన సంతానాన్ని గూర్చి ఎలాంటి కలలు కంటుందో, బసి

1. అన్నమాచార్యచరిత్ర పీఠిక, పు. 61

ష్యత్తును గూర్చి ఏమని ఆలోచిస్తుందో అన్నీ ఈ జోలపాటలో అమృతసదృశంగా వర్ణించబడ్డాయి.

మాతృహృదయం కరిగి వెలువడే భావాలు లాలిగా, జోలగా గేయాకృతి దాల్చి ఉయ్యాలలోని పసివాణ్ణి వటపత్రశాయిగా మర్చివేస్తాయి.

తాళ్లపాక తిరువేంగళనాథుని ద్విపద పరమయోగి విలాసంలో జోల పాటలు ప్రస్తావింపబడ్డాయి.

''వేడుకనిడి జేసి వీవనిజోల
పాడుచు రాతికి ప్రాణంబుదెచ్చి'' 3. 236

గోదాదేవిని ఉయ్యాలలో పడుకోబెట్టి నిదురబుచ్చడానికి ఆమె తల్లి పాటలు పాడింది. ఆ పాటలకు గోదాదేవి నిదురపోలేదు. పైగా రోదించడం మొదలుపెట్టింది. వెంటనే తల్లి పసిదాని హృదయాన్ని పసిగట్టిందో ఏమో కృష్ణుని మీద జోల పాడింది. గోద కిలకిల నవ్వింది.

''ఒయ్యేన నుయ్యాల లూగుచున్నెడను
నెయ్యంబు మైతల్లి నిదురబొమ్మనుచు
పాటించి వేఱొకపాట పాడినను
పాటించి వినక యెప్పాట పోరిడుచు
బల సోదరుని మీద పాట పాడినను
కిలకిల వాయెత్తి కేరినవ్వుచును'' 5. 377

జోల పాటలకు ఆ కాలంలో ఎక్కువగా ప్రచారం ఉన్నట్లు ఈ ఉదాహరణను బట్టి తెలుస్తుంది.

వసుచరిత్రలో జోలపాట పేర్కొనబడింది. శుక్తిమతి తన కూతురికీ, కుమారునికీ, స్నానం చేయించి, తామరాకు పుట్టాలు కప్పి తేనె ఉగ్గుపెట్టి, కలువలనే తొట్టెల్లో పడుకోబెట్టి జోల పాట పాడింది.

''జలకములార్చి పొందు జలజచ్ఛద పాళికగప్పి తమ్మిసం
కుల తెలితేనె లుగ్గులిడి క్రొందరగల్ కదిలించు కల్వతా
ట్టెలల కుమారు కూతును ఘటించి భజించు నదీలలామకో
మల కుముదాగతాళికుల మంజురవంబున జోలపాడుచున్'' 3. 27

'లాలి' అంటూ జోలపాటలు పాడినట్లు మల్లనకవి చంద్ర భాను చరిత్ర లో వర్ణించినాడు.

''లాలిత్యంబున నిద్రపొమ్మనుచు తొట్లంబెట్టి జోకొట్టుచున్
లాలోలాలియటంచు నూపుదురు జోలల్పాడి లీలావతుల్'' 1. 106

లాలిపాటలే జోలపాటలు. ఉయ్యాలలూపుతూ జోలపాటలు పాడేతల్లులు గ్రామాల్లో ఈ నాటికీ ఉన్నారు.

కూచిమంచి తిమ్మకవి రచించిన రుక్మిణీ పరిణయంలో జోలపాటలు పేర్కొనబడ్డాయి. సామాన్యంగా పసికందు తలకు నూనెరాసి, శరీరానికి పసుపు పట్టించి, జలకమార్చి కాటుకబెట్టి, పాలుత్రాగించి ఉయ్యాలలో పడుకో బెడుతారు. వెంటనే పడుకొంటే సరి! లేదా కొంతసేపు ఉయ్యాల నూపుతూ జోలనందుకొంటారు తల్లులు.

''నూనె తలయంటి పసుపున మేనునలచి
చలువ పన్నీటితో గూర్చి జలకమార్చి
కజ్జలంబిడి దూపముల్ కడునొసంగి
పాలు ద్రావించి బాల నుయ్యాలనునిచి'' 1.77

తిమ్మకవి జోలపాటలను ఎన్నోసార్లు విని ఉంటాడు. అందువల్లనేఅన్న ముయ్యాలాగ ఆ కవి జోలపాటను ఒక కంద పద్యంలో సుందరంగా సాక్షాత్క రింపజేశాడు.

''జో జో ముద్దులగుమ్మా
జోజో కపురంపు దిమ్మ జోజోకొమ్మా

జోజో బంగరుబొమ్మా
జోజో వెలలేని సొమ్మ జోజోయనుచున్" 1. 78

గొ న బు పా ట లు :

వసుచరిత్రలో భట్టుమూర్తి గొనబు పాటలు పేర్కొన్నాడు.

"గొనబు పాటలు నేర్పు కుముదరసామోద
సామోద మధుపషడ్ధాంత సమితి" 2.28

గొనబు శబ్దానికి శ్రావ్యం, మధురం అనే అర్థాలున్నాయి. జానపదులు పాడుకొనే తీయని పాటలే గొనబు పాటలు.

వింత పాటలు :

తంబుర సహాయంతో వీటిని గానం చేస్తారు. శుకసప్తతిలో వీటి ప్రస్తావన ఉంది.

"చేరితంబుర మీటి సారసుధాసూక్తి తేటలూరగ వింతపాటపాడు." 3. 14

విడుపు పాటలే వింత పాటలు కావచ్చు. పొడుపు కథలు వింతగా ఉంటాయి. వాటిని ఆ కాలంలో గానం చేసేవారని భావించవచ్చు.

అల్లో నే రే ళ్ళు :

భాస్కర రామాయణంలో 'అల్లోనేరేళ్లు' పేర్కొనబడ్డాయి. చిన్నపిల్లలు వెన్నెల రాత్రులందు గంతులు వేస్తూ పాడుకొనే పాటలే అల్లోనేరేళ్లు.

"ఎల్లసుఖంబులుజేకొనజెల్లుట యౌవనమునందచిక్కినమరిపా
టిల్లునె? వెన్నెలదినముల నల్లోనేరేళ్లుగాక యావలగలవే?"-సుందరకాండ,180

ఏ సుఖమైనా యౌవనంలోనే అనుభవించాలి. వెన్నెల రాత్రుల్లో అల్లో నేరేళ్ళుగాని ఆ తరువాత ఏముంది అని పద్యం యొక్క భావం. వెన్నెల పోయిన తరువాత ఆ పాటలు పాడరు. 'అల్లోనేరేళ్ళలో' అనే పల్లవితో పాడేవి కనుక వాటికాపేరు వచ్చినట్లు ప్రౌఢ్యం చెబుతుంది. కాని పెళ్ళిలో సుంకులు పెరిగే సమయంలోను ఈ పాటలను ముత్తైదువలు పాడినట్లు ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసంలో పేర్కొనబడింది.

"పల్లవపాణులు కొందరు వల్లెరములబూని లపబ్ ఉంగేటుగాజుల్
ఘల్లురన సుంకుచెరిగిరి యల్లోనేరేడటంచు నయ్యింపెరపన్" ప.571

ఈ విధంగా ఆయా కావ్యాల్లో రకరకాల పాటలు పేర్కొనబడ్డాయి. ఎక్కువగా ఈ పాటలు ఏదో ఒక ఆటకు సంబంధించి కూడ ఉండవచ్చు. ఆటపాటల అనుబంధం అలాంటిది.

కు లం - మ తం :

నన్నయ భారత రచన చేయడానికి ముందే తెలుగునాట జైనబౌద్ధ మతాలు సామాన్యజనామోదాన్ని పొందాయి. ప్రజలకు తెలిసే భాషలో ఆ మతాలకుసంబంధించిన పాటలూ, గాథలూ ప్రచారంలో ఉన్నాయి. ఇట్టి సందర్భంలోనే రాజరాజ నరేంద్రునికి వైదిక మతాన్ని పునరుద్ధరించాలన్న కోరిక కలిగింది. తత్ఫలితంగా దేశభాషలో భారతం అవతరించింది.

నన్నయ కాలంలో వర్ణాశ్రమ ధర్మాలకు పెద్దపీట లభించింది. బ్రాహ్మణులకు అధిక ప్రాధాన్యం ఇవ్వబడింది. "మూలంలో ఉన్నా లేకపోయినా బ్రాహ్మణులకు దానాలిప్పించడం, దక్షిణలిప్పించడం నన్నయగారికి సరదా"1 అన్న ఆరుద్రగారి మాటలు సత్యదూరమైనవి కావు.

బ్రాహ్మణ కన్యను రాజు పెళ్ళి చేసుకోవడం భారతంలో ఉంది. నన్నయ్యకిది నచ్చలేదు. అందుకే యయాతి చరిత్రలో జనమేజయునిచేత ఇలా అనిపిస్తాడు.

"వర్ణ ధర్మముల్ గాచుచు వసుధయెల్ల
ననఘచరితుడై యేలిన యయ్యయాతి
భూసురోత్తమ భార్గవ పుత్రియైన
దేవయానిని తానెట్లు దేవిజేసెః" ఆది, 3-97

1 సమగ్ర ఆంధ్ర సాహిత్యం, (మొ. సం) చాళుక్యయుగం, పు. 143

యయాతి వర్ణాశ్రమ ధర్మరక్షకుడుగా పేర్కొనబడిన విషయం మూలంలో కనిపించదు.

పాల్కురికి సోమనాథుని సాహిత్యం వీరశైవ మతానికి పట్టుగొమ్మగా నిలిచింది. ఒక్కమాటలో చెప్పాలంటే వైదిక మతంమీద సోమనాథుడు తిరుగుబాటు చేశాడు. వర్ణాశ్రమ ధర్మాలను నిరసించాడు. ఏ కులం వారైనా శైవాన్ని స్వీకరించి మోక్షాన్ని పొందవచ్చునని ఉద్బోధించాడు.

శివభక్తులైతే ఏ కులం వారినైనా చేతులెత్తి మ్రొక్కాలనీ కానివారిని బ్రాహ్మణులైనా మ్రొక్కరాదనీ సోమనాథుడు బసవపురాణంలో వ్రాశాడు.

"శూలిభక్తులకెత్తు కేలది త్రాటి
మాలలకెత్తుట మఱితప్పుకాదె" ఆ. 1, పు.19

అతని దృష్టిలో శివభక్తులు కానివారు జందాలు ధరించిన మాలలు. సోమనాథునిలాగా వర్ణవ్యవస్థను తీక్షణంగా నిరసించినవారు ప్రాచీన సాహిత్యంలో లేరు, ఒక వేమన తప్ప. శివుని ఆరాధించేవాడు ఏ కులస్థుడైనా అతడు శివునిలాగా ఆరాధనీయుడేనని సోమనాథుని భావన.

''జాతిగోత్రాతీతు సద్గురుజాతు
జాతిగోత్రక్రియాశ్రయుజేసెదెట్టు
లకులస్థుడైయున్న యభవుని భక్తు
నికి నేకులంబని నిర్ణయించెదవు'' ఆ. 1, పు. 16

పాల్కురికి సోమనాథుని మీద బసవేశ్వరుని ప్రభావం ఉంది. సద్గురువు జాతికీ, గోత్రానికీ అతీతుడనీ, ఒక కులం అంటూలేని శివభక్తునికి కులం అంటగట్టడం ఎంతవరకు సమంజసమని అతని ప్రశ్న.

పండితారాధ్య చరిత్రలోనూ ఏ కులం వారైనా శివున్ని ఆరాధించవచ్చునని సోమనాథుడు చెబుతాడు.

''సద్రతి బ్రాహ్మణ క్షత్రియవైశ్య
శూద్రాది సత్కులజాలును దుష్కులజు

లెట్టి మానవులైన నీశ ! మన్నగము
మెట్టినంతనజేసి మిక్కిలి కూర్మి" పర్వత, పు. 219

సోమనాథుడు బ్రాహ్మణులను మొదలుకొని చెండాలుర వరకు అందరినీ వీరశైవంలోకి ఆహ్వానించాడు. కులాతీతమైన వ్యవస్థగా శైవ మతాన్ని రూపొందించడంలో సోమనాథుడు కృతకృత్యుడయ్యాడో లేదో కాని అతడు శైవేతరులను నిందించిన తీరు మాత్రం అంత బాగాలేదు. శైవుడు కాని వానిని చూడడమే అతని దృష్టిలో పాపం! వైష్ణవుల మీద అతడు విరుచుక పడ్డాడు.

''అటుగాన శంకచక్రాంకితులైన
కుటిలాత్ములను జూడ గూడునె? యట్టి'' దీక్షా, పు.10

సోమనాథుని వ్రాతలవల్ల సామాన్యులు ఆ కాలంలో శైవాన్ని స్వీకరించి నట్లూ, శివభక్తులు గౌరవార్హులైనట్లూ, కులాలమధ్య హెచ్చుతగ్గులు క్రమంగా తగ్గినట్లు ఊహించవచ్చు. అయితే శైవ వైష్ణవులమధ్య మాత్రం పచ్చగడ్డివేస్తే భగ్గుమనేది.

వీరశైవులు ఏ విధంగా కర్మకాండనూ, వర్ణాశ్రమ ధర్మాలనూ కాద న్నారో అదే విధంగా అదే కాలంలో మహారాష్ట్రలోని నాథ సంప్రదాయవాదులు కూడా కర్మకాండనూ, వర్ణాశ్రమ వ్యవస్థనూ తిరస్కరించడం జరిగింది.[1]

నాచన సోముని ఉత్తర హరివంశ కావ్యంచూస్తే ఆకాలంలో శైవ వైష్ణ వుల మధ్య ద్వేషభావం తీవ్రంగా ఉన్నట్లు తెలుస్తుంది.

"పరివాదాస్పద వాదమోదమదిరాపానంబుచే మత్తులై
హరిమేలంచు హరుండు మేలనుచు నాహాకొందరీ హొందెరుం
గరుకైలాసనగంబునందుమునులేకత్వంబుభావించిరా
మురవైరింబురవైరి బాపుటమహామోహంబుద్రోహంటగున్" 2- 68

1 తెలుగులో తొలిసమాజకవులు, సంపాదకీయవ్యాసం, XXIV

శైవవైష్ణవుల మధ్య చెలరేగిన పోరును మాపడానికే తిక్కన భారతంలో హరిహరాద్వైతం ప్రతిపాదించడం జరిగింది. నాచన సోమన కూడా తిక్కన మార్గాన్నే అనుసరించాడు. అందుకే శివకేశవులను విడదీయడాన్ని ఖండించాడు.

విగ్రహారాధన మూలంగా వివిధ సంప్రదాయాలేర్పడి హిందువులలో అనైక్యతను సృష్టించాయనీ, సామాన్య ప్రజలు అంటుజాడ్యాలకు కూడా ఆయా దేవతలను ఏర్పర్చుకొని పూజించారనీ సురవరం ప్రతాపరెడ్డిగారు చెప్పిన మాటలను ఈ సందర్భంలో గ్రహించవచ్చు.1

పల్నాటి వీరచరిత్ర మూలంగా ఆ కాలంలోని ప్రజల ఆచార వ్యవహారాలేకాక మత పరిస్థితులు కూడా తెలుస్తున్నాయి. శైవవైష్ణవాలమధ్య విద్వేషాలు పెరగడం, పల్నాటి యుద్ధంలో ప్రముఖపాత్ర వహించిన బ్రహ్మన్న వైష్ణవాన్ని స్వీకరించగా, అతని ప్రత్యర్థి నాగమ్మ శైవాన్ని అవలంబించడం, వారి ప్రాతినిధ్యంతో ప్రజలు రెండు వర్గాలుగా చీలిపోవడం మొదలైన మత చారిత్రకాంశాలు పల్నాటివీర చరిత్రలో చోటు చేసుకొన్నాయి. బ్రహ్మన్న కులభేదం పాటించక "చాపకూడు"పద్ధతిని ప్రోత్సహించాడు. కన్నడ దేశంలో బసవేశ్వరుని ప్రభావంవల్ల వీరశైవం ఏ విధంగా కులభేదాలు పాటించక ప్రచారాన్ని పొందిందో, అదే విధంగా ఆంధ్రదేశంలో బ్రహ్మనాయకుని ప్రభావంవల్ల వైష్ణవం క్రమక్రమంగా కులభేదాలను నిరసిస్తూ ముందుకు సాగింది. సహపంక్తి భోజనాన్ని ప్రవేశపెట్టిన బ్రహ్మన్నను నాటి సంఘసంస్కర్తగా గుర్తించవచ్చు.

నాల్గవ జాతిగా పిలవబడే శూద్రులు బ్రాహ్మణులను సేవించి విజ్ఞానాన్నీ వైశ్యులను సేవించి ఐశ్వర్యాన్నీ రాజులను సేవించి పరాక్రమాన్నీ పొందినట్లు బాలచంద్రునితో పలికిస్తాడు కవి. దీన్ని బట్టి విజ్ఞానం కల్గిన వాడు బ్రాహ్మణుడనీ ఐశ్వర్యం ఉన్నవాడు వైశ్యుడనీ, శౌర్యం ఉన్నవాడు క్షత్రియుడనీ కవి అభిప్రాయంగా భావించవచ్చు.

"విప్రుల సేవింప విజ్ఞాన మొదవు
క్షత్రియ సేవచే శౌర్యంబు గలుగు

1 ఆంధ్రుల సాంఘికచరిత్ర, పు. 26

కడువైశ్యసేవచే గలుగు సంపత్తి
శస్త్రధరులకెల్ల సమరంబుకూడు" పు. 60

బ్రాహ్మణక్షత్రియ వైశ్యాది జనుల సాహచర్యంవల్ల శూద్రులకు వారి ధర్మాలు అలవడి సంఘంలో వారితో సమానమైన గౌరవాన్ని కలిగించాయనీ వర్ణాశ్రమ ధర్మాలు రానురాను సడలి పోయాయనీ భావించవచ్చు. పల్నాటి వీరచరిత్ర కాలం నాటికే పల్లెల్లో రెడ్ల ఆధిపత్యం చూస్తాము. గ్రామాధికారులుగా వారికెంతో గౌరవం. వారితోపాటు వైశ్యులు కూడ గౌరవించ బడేవారు. యుద్ధానికి పోతున్న నలగామ రాజుతో రెడ్లూ, వైశ్యులూ కలహం మంచిది కాదని ఉద్బోధించడాన్ని బట్టి వారికి గ్రామ సమాజంలో ఉన్న పలుకుబడిని తెలుసుకోవచ్చు.

"పేరైన పల్లెల పెద్దలౌరెడ్లు
కోమటి జనములు కూడియేతెంచి" పు. 32

శ్రీనాథుడు శృంగార నైషధంలో తన కాలంనాటి మత ప్రచారకులను గూర్చి చక్కగా వర్ణించాడు.

బౌద్ధుల పాటించు పరమబంధులపోలె
 చార్వాకులకు కరాంజలి ఘటించు
జైనులంబొదగన్న సంతోషమునదేలు
 జేయని మ్రొక్కు లోకాయుతులకు
వైతండికుల కభివాదనం బొనరించు
 పాషండులకు చాల భక్తిసేయు
కాపాలికులకు సత్కారంబు గావించు
 పరిచుంబించును దిగంబరులతోడ

పాశుపతకక్ష పాలికాభస్మధూళి
పాళియుద్ధూళన క్రియావేళయందు
గాలి వెంబడి భైరాల కళవళించు
కలియుగముపాపక పాస్పులింగంబులనుచు" 7. 128.

బౌద్ధులు, జైనులు, లోకాయుతులు (నాస్తికులు) వైతండికులు, పాషండులు, కాపాలికులు, దిగంబరులు మొదలైనవారు తమతమ మతవిశ్వాసాలను ప్రజల్లో వ్యాప్తిచేసి, వారిని ఆకట్టుకోవడానికి ప్రయత్నించేవారు.

బసవపురాణంలో శివభక్తుల కథలున్నట్లే, ద్విపద పరమయోగి విలాసంలో వైష్ణవుల కథలున్నాయి. రెండింటిలోను బ్రాహ్మణేతరులే భక్తులుగా ఉన్నారు. రెండు గ్రంథాలూ ద్విపదల్లో రచింపబడ్డాయి. ఆయా కాలాల్లో శైవ వైష్ణవ మత ప్రాశస్త్యాలను తెలియజేసి ప్రజలను ఆకర్షించడానికి ఉద్దేశింపబడ్డ గ్రంథాలవి. విశేషం ఏమంటే బసవ పురాణంలో కన్నడదేశం కథలు ప్రాధాన్యం వహించగా, పరమయోగి విలాసంలో తమిళదేశం కథలు ప్రాముఖ్యం వహించాయి.

ఎంత భక్తులైనప్పటికీ చండాలురు మాత్రం ఆ కాలంలో సమాజానికి దూరంగానే ఉన్నట్లు తెలుస్తున్నది. తన భుజాలమీద ఎక్కించుకొని దైవ దర్శనం చేయించడానికి వచ్చిన లోకసారంగ మునితో పంచముడైన తిరుప్పాణ్ ఇలా అంటాడు.

> ''ఎక్కడ వచ్చెద వెరుగవే నన్ను
> రాకురాకు మటంచు రయమున కదల-
> బలుషిడువడి కూడ పరతెంచి యాతని
> వలపట్టి పట్టి భుజంబుమీదటను
> ఎక్కించుకొని....'' 3. 256

తిరుప్పాణ్ శ్రీరంగని భక్తుడు. పరమ భాగవతుడు. ''శ్రీరంగని వీడు తొక్కరాదని తలపోసి"నాడు. సంస్కరణ భావాలు కల్గిన వారు ముట్టుకొన్నా వద్దనే వారున్నట్లు పై పద్యంవల్ల తెలుస్తుంది. ఆ కాలంలో దోషాన్ని బట్టి కాక కులాలను బట్టి శిక్ష అమలయ్యేది. ఆలయంలోని అర్చకులమీద దేవుని గిన్నె అపహరణకు సంబంధించిన నేరం ఆరోపించబడగా వారు అధికారులతో ఇలా విన్నవించుకొంటారు.

> ''....దృష్టిశోధనముమ్మ తెలిసికొమ్మయ్య

యాయెడ మేము చీమంత యోడినను
సెయింపు శూద్రుల చేయించునాజ్ఞ''  4- 322

ఆ కాలంలో బ్రాహ్మణులకో శిక్ష, శూద్రులకో శిక్ష ఉన్నట్లు తెలుస్తుంది. తప్పు ఋజువైతే శూద్రులకు విధించబడే శిక్షను తమకు వర్తింప జేయవల సిందిగా బ్రాహ్మణులు కోరడం జరిగింది.

బసవపురాణం, పండితారాధ్య చరిత్రలలో శివునికంటె శివభక్తుడే గొప్ప వాడైనట్లు, ద్విపద పరమయోగి విలాసంలోను హరికంటె హరి భక్తుడే గొప్ప వాడుగా చిత్రించబడినాడు-

"వేసర కరువది వేలేండ్లు భక్తి
సేసేత హరి పూజ సేయుటకంటె
నొక భాగవతునకు నొకమాఱు పూజ
యకలంక మతిజేయనదియు మిక్కుటము''

దేవుళ్ళకంటె భక్తులే గొప్పవాళ్ళని ప్రచారం చేయడం అమాయకులైన ప్రజలను తమతమ మతాల్లోకి లాక్కోవడానికి మతప్రచారకులు వేసిన ఎత్తు.

ఆముక్తమాల్యదలో లింగధారుల ప్రస్తావన ఉంది. రాయల కాలంలో జన్మభూమి మీద ప్రేమ కలిగిన శైవ బ్రాహ్మణులు విభూతి పూసుకొని రుద్రాక్షమాలలు ధరించి చంకలో సూత సంహితను పెట్టుకొని తిరిగేవారు.

''అప్పుడిచ్చకులగు బ్రాహ్మణౌఘమెల్ల
ఆత్మజనిభూమి విడువలేకలికభూతి
గడ్డములనాన రుదురాకలిడ్డసంది
సూత సంహిత లిఱికించి చొఱ దొడగిరి''  4-46

వైష్ణవుడైన రాయలు శైవ దీక్ష వహించిన వారు కొందరు గంజాయిని సేవిస్తూ భ్రష్టులయ్యారని చెప్పాడు.

"శీలము బట్టియు గంజాహారులు పొంసన ఘజించుసభములబైటం
జాలడువైవన్ విప్రస్ఖాలిత్యము బైలుసేసికనుగిలుపు సభన్" 4-47

శైవుడైన పాండ్యరాజు శైవబ్రాహ్మణులు భ్రష్టులు కావడం నచ్చక వారిని అవహేళన చేయండని సభలో సభ్యులకు కనుసైగ చేశాడు. దీనివల్ల శైవబ్రాహ్మణులు ఇష్టపాత్రులే అయినప్పటికీ రాజుకు వారి చేతలు మాత్రం నచ్చేవి కావని తెలుస్తుంది. బ్రాహ్మణ్యం వైష్ణవం చేతనే ప్రశస్తి పొందుతుందని అముక్తమాల్యదలో చెప్పబడింది. "ఇట్లు భాగవత పరిచయ ప్రభావంబున బ్రాహ్మణ్యంబెకాక భాగవత శ్రీయునుంగలిగి యుప్పుచింది యినుమడియగు చందంబునం బరమహర్ష భరితుండై స్వరూపానురూపంబుగా నతనికి పూజ కావించి"[1]

రాయలు వైష్ణవుడు కాబట్టి అలా వ్రాశాడని భావించవచ్చు. దారిద్ర్యం కులాచారాలు తప్పడానికే కాకుండా కులం నశించడానికి కూడా కారణమౌతాయని రాజశేఖర చరిత్రలో వర్ణించబడింది.[2]

ఇతర ప్రబంధాలతోపాటు పాండురంగ మాహాత్మ్యంలోనూ కులవ్యవస్థ మీద ప్రజలకున్న గౌరవ భావాలు వ్యక్తమౌతాయి. కులాను గతమైన ఆచారాలను విడిచి పెడితే గేలి చేయడం కూడా కనిపిస్తుంది. బ్రాహ్మణ వంశంలో జన్మించిన నిగమశర్మ కులాచారాలకు వ్యతిరేకంగా నడుచుకోవడం, భ్రష్టుడై పోవడం ఎందరికో బాధ కలిగించింది.[3] ఎన్నో జన్మలు ఎత్తితేకాని బ్రాహ్మణుడై పుట్టడనే విశ్వాసం ఆనాటి ప్రజలది.

## 2. సాధారణ జీవనం :

### శిక్షా విధానం :

సామాజిక వ్యవస్థ ఒడుదుడుకులు లేకుండా కొనసాగడానికి సమాజానుగుణమైన శిక్షా విధానం తప్పనిసరి అవసరం. కుమార సంభవంలో నేరస్థులను

---

1. ఆముక్త మాల్యద, 6-88 2. రాజశేఖర చరిత్ర, 3-14
3. పాండురంగమాహాత్మ్యం,3-94

శిక్షించే పద్ధతులు పేర్కొనబడ్డాయి. నన్నెచోడుని కాలంలో అనుమానం ఉన్న వారిని బంధించి వారినుంచి రహస్య సమాచారాన్ని రాబట్టడానికి నాల్గురకాలైన శిక్షాపద్ధతులను అనుసరించేవారు. ప్రమథగణాలు దక్షుని సమాచారాన్ని తెలియ జెప్పమని మునులనూ, దేవతలనూ హింసించినట్లు నన్నెచోడుడు వర్ణించాడు.

> "ముని మనుజాసురాహిసురముఖ్యుల వీపులతోళులెత్తగా
> మునుగుది కట్టిమోదియును ముందలకుట్టులు గట్టికొట్టియున్
> చనపెడకేలు గట్టియును చర్మపటంబులు డిగ్గనొల్చియున్
> పెనకిమసంగి కారసము చేసిరి తత్ప్రమథాది నాయకుల్" 2- 78

వీపుమీది చర్మం లేచేటట్లు కొట్టడం, పరస్పరం జుట్లు ముడివేసి కొట్టడం చేతులు విరిచికట్టి కొట్టడం, శరీరంమీద ఎక్కడైనా బాదడం మొదలైన శిక్షాపద్ధతులు 12వ శతాబ్దంలో ఉన్నట్లు తలంపవచ్చు.

కేయూరబాహు చరిత్రలో ఆరెకుల ప్రస్తావన ఉంది. వీరు గ్రామ రక్షకులు. 'ఆరక్షిక' శబ్దమే ఆరెకుడయ్యింది. నేరస్థులను బంధించడం వీరిపని. వీరు సాధారణ జనులను ఏ చిన్న తప్పు చేసినా బంధించేవారు. కాని దొర బిడ్డలు కోళ్ళ పందాలతోనూ, వేటకుక్కలతోనూ, ప్రజలకిబ్బంది కల్గించినప్పటికీ ఏమీ అనే వారు కాదు.

దోషులను ప్రజలు తన కాలంలో బహిరంగంగా దూషించడాన్ని కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికలో ప్రస్తావించాడు. నేరస్థుని తిత్తి తియ్యాలనీ, కాళ్ళు చేతులు నరకాలనీ, శరీరాన్ని గానుగలో వేసి మర్దించాలనీ, శరీరాన్ని గడ్డి తాళ్ళతోకట్టి నిప్పంటించాలనీ తలా ఒకమాట అనేవారు. నిజానికి వారన్న మాటలు కేవలం తిట్లే కావు, అవి ఆ కాలంలో ఉన్న శిక్షా పద్ధతులు.

> ''అనుడు నారాయణా యని వీనిబట్టితి
> తొలిపింపదగునని పలుకువారు
> కాళ్ళను చేతులు గనియలుగాబట్టి
> చిదిమింప దగునని పదరువారు

---

1. మంచన, కేయూరబాహు చరిత్ర, 3-294

కాయంబునుగ్గుగా గలగానుగలబెట్టి
త్రిప్పుట తగునని తెలుపువారు
మేసవెంటులు చుట్టి పైనగ్గి తగిలించి
మిడిపింప దగునని నొడువువారు

నగుచు జనులు దుర్వ్యధార్తుండువీడగు
ననుచు విన్నవింప నవనివిభుడు
తనయ దుఃఖవహ్ని తనలోన గ్రాగుచు
చంపబూని తనదు తెంపుదలచి'' 3- 60

శిశు హంతకుడైన బ్రాహ్మణున్ని ప్రజలు నానా మాటలు అన్నప్పటికీ రాజు అతన్ని శిక్షించడు. కారణం అతడు బ్రాహ్మణుడు కావడం. బ్రాహ్మణ హత్య పాపమనే విశ్వాసం ఆ కాలంలో ఉంది.

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానంలో ఆ కాలంనాటి శిక్షా పద్ధతులు తెలుపబడ్డాయి. చంద్రమతిని, లోహితాస్యుని వెలగట్టి కొనుక్కొన్న కాలకౌశికున్ని వడుగులు చీకాకు పరుస్తారు. వసిష్ఠుడు హరిశ్చంద్రున్ని సత్యవంతుడని నిరూపించే సందర్భంలో అతడు చేసిన ప్రతిజ్ఞనుబట్టి ఆ నాటి శిక్షా విధానం కొంతవరకు బోధపడుతుంది.

"విపులవల్కలములు విడిచినెన్నుదుట
అపవిత్రమైనట్టి అంకంబుదాల్చి
ఘనగార్ధభమునెక్కి కష్టమానవుని
పునుకలో మద్యంబు బోసిత్రావుచును
జనులెల్ల నేవగింపగ తలవాల్చి
కొనిదక్షిణాభిముఖుండనైచనుదు'' --280 - 288 పంక్తులు

కౌపీనం మాత్రమే ధరించి అందరూ చూస్తుండగా గాడిదనెక్కి, పుత్రెలో కల్లు త్రాగుతూ ప్రజలసహ్యించుకొనే విధంగా దక్షిణ దిక్కుకు వెళ్లడం ఆ కాలంలోని ఒక రకమైన శిక్షాపద్ధతి.

ద్విపద పరమయోగి విలాసంలో శిక్షాసంబంధమైన విషయాలు అనేకం వర్ణించబడ్డాయి. ఆ కాలంలో అపరాధుల మెడలో పొగడ దండలు వేసి వీపు మీద రాళ్ళెత్తించి ఎండలో మోయించేవారు. నేరం నిరూపించబడినప్పుడు దోషుల మెడకు తగిలించే దండ సాధనమే పొగడదండ.

''ఇడుమగట్టిన వేడియెండలో మిగుల
జడియ వీపులమీద చాపరాలెత్తి
పొగడదండలు వైచి పోనీకయెదుట" 4. 324

శ్రీనాథునికి అవసాన దశలో ఇలాంటి శిక్షే పడింది.

"కవిరాజ కంఠంబు కౌగిలించెనుగదా
పురవీథి నెదురెండ పొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెను గదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
సార్వభౌముని భుజస్తంభమెక్కెనుగదా
నగరి వాకిట నుండు నల్లగుండు

కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె తిలలుపెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి మోసపోతి
నెట్టు చెల్లింతు టంకంబు లేడు నూర్లు?"

మెడలో పొగడదండలు, కాళ్ళకు సంకెళ్ల, చేతులకు వెదురుగొడియలు, భుజాలమీద నల్లగుండు మొదలైనవి ఆ కాలంలో నేరస్థులకు విధించబడే శిక్షలు.

గ్రామాల్లో ప్రజలమధ్య వచ్చే తగవులు విచారించడానికి రచ్చబండ లుండేవి. తమ తగవులు పరిష్కరించుకొంటానికి ప్రజలు ఈ నాటి న్యాయ స్థానాల్లో లాగా ఆ నాడు గ్రామసభలకు విన్నవించుకొనేవారు. ఆ సభల్లో గ్రామ పెద్దలు సభ్యులుగా ఉండేవారు. వారు ప్రతిఫలాపేక్ష లేకుండానే తగవులు

తీరుస్తారు. సభ గ్రామాధికారి ఇంటి ముందో, దేవుని గుడిలోనో, ఊరిమధ్య ఉండే రచ్చబండ మీదనో జరిగేది. ఈ నాటి కోర్టులే ఆ నాటి రచ్చబండలు.

న్యాయశాస్త్రంలో చెప్పిన విధంగా ఆయా నేరాలకు శిక్షలు పడేవి.

"ఈ చోరునకు నాజ్ఞ యేది శాస్త్రంబు
చూచి సేయింపు డచ్చుగ మీరటంచు
తెలియ విద్వాంసుల దిక్కు వీక్షించి" 4. 340

గ్రామ పెద్దలే కాక శాస్త్రం తెలిసిన విద్వాంసులు కూడ గ్రామసభల్లో ఉండేవారు. పన్నులు చెల్లించని వారు రకరకాల శిక్షలకు గురి అయ్యేవారు.

"హరువు గైకొనుడు లేదనిన నాగడను
గుదియంగగట్టి తోకొని రండటన్న" 6. 460

పన్నులు చెల్లించని వారిని గడలాంటి సాధనాన్ని మెడకు కట్టి ఈడ్చుకొని రావడం ఆ నాటి ఆచారం. తగవులు విచారించుకోవడానికి వచ్చిన ప్రజలు గ్రామసభలకు కానుకలు ఇచ్చే విధానముండింది. అయితే అది వారి ఇష్టం మీదనే ఆధారపడి ఉంటుంది. విచారణకు ముందే కానుకలూ, డబ్బూ ఇచ్చే పద్ధతిని తిరువేంగళనాథుడు పేర్కొన్నాడు.

"తగవు వారలతోడ తమపనుల్నొడివి
కట్ట కానుకలిడి కడపట నిలువ" 7.532

అధికారులు ఈ కానుకలనూ, ధనాన్నీ గ్రామాభివృద్ధికి వెచ్చించేవారు. ప్రాచీన కాలంలో ఎక్కువ తగాదాలు భూమి సంబంధమైనవే. భూములను గుత్తకు తీసుకొని పన్ను చెల్లించక పోవడం వల్లనే శ్రీనాథునికి శిక్షపడింది కదా.

"పుడమివారలనెల్ల బ్రోచిమాతాత-గడియించినట్టిదీ కాణాచినేల
యన్యాయమేటికి నడుగుమునాదు- మాన్యంబుగాని సామాన్యంబు గాదు"
7. 532

అని పరకాలుడు అప్పటికే భూమిని సాగుచేస్తున్న రెడ్డితో అంటాడు.

సాక్షి పత్రాలు కూడ ఆ కాలంలో ఉండేవి. తీర్పు సందర్భంలో సభలోని పెద్దలు వాటిని పరిశీలించేవారు. పెద్దల ప్రశ్నలనూ, సాక్షుల సమాధానాలను చూడండి.

''అరయంగ నీమాన్యమైన యందులకు
పరగంగ సాక్షి సంబంధంబుగలదె
అనిన నెక్కడి సాక్షు లలనాడె పోయి
రనిన పత్రము కలదాయని యనిన
నడర మాతోడి యేడవ పెద్దతాత
కిడిన పత్రము చెడకిన్నాళ్లదాక
తరుచునుండంగ తామ్రశాసనమె'' అ. 7. పు. 533

తాగపునాటికి సాక్షులు జీవించిఉండకపోతే సాక్షి పత్రాలే ప్రమాణంగా తీసుకొనే వారు. సాక్షి పత్రాలు తామ్రశాసనాలవలె కలకాలం ఉండేవి. కావు కాబట్టి, ఒక్కోసారి వాద బలాన్నిబట్టి లేదా ప్రమాణాలను బట్టి తీర్పు ఇవ్వబడేది. ఆ తీర్పు గ్రామ పెద్దల ఇష్టానిష్టాల మీద కూడా ఆధార పడి ఉండేది.

పరాంతకుడు అనే వ్యక్తి రెడ్డికీ తనకూ వచ్చిన భూమి తగాదాలో—సాక్షులు జీవించి లేరనీ, సాక్షి పత్రాలు చెడిపోయినాయనీ చెప్పి తన వాదానికి బలంగా బంధుత్వాన్ని కల్పించి ఆ మడిని సాగు చేసిన తండ్రి తాతలగోత్రం వాడినని చెబుతాడు. దేవుని మీద ఒట్టు తింటాడు. ఆ కారణంగా భూమికి తానే యజమాని అవుతాడు.

''పలుమాటలేల తప్పదు శౌరిసాక్షి
యని సత్యమొనరించి యలవానిగెలిచి" అ. 7. పు. 533

ఈ రోజుల్లో న్యాయస్థానాల్లో దేవునిమీద ప్రమాణం చేసి వాదాలను ప్రారంభించే విధానం ఉండగా, ప్రాచీన కాలంలో వాదోపవాదాలు జరిగిన తరువాత వాది ప్రతివాదులు దేవుని మీద చేసే ప్రమాణాలు, వాటి ఆధారంగా తీర్పులు వెలువడడం విశేషం.

సాక్షులకంటె, సాక్షి పత్రాలకంటె ప్రమాణాలకు (ఒట్లు) ప్రాధాన్యం ఇవ్వడం గమనార్హమైన విషయం. ఆధునిక కాలంలో మత గ్రంథాలమీద ప్రమాణం చేసి నిజమే చెబుతానని పలికినప్పటికీ 'తీర్పుమాత్రం' సాక్షాల మూలంగానే వస్తుంది.

కులదైవం, సంతానం, గురువు, తల్లిదండ్రులు మొదలైనవారి మీద ఒట్టు పెట్టుకొంటే నమ్మే సమాజం ఆ నాటిది. గ్రామీణుల మనఃప్రవృత్తికి ఇది ప్రబల నిదర్శనం. తప్పుడు సాక్ష్యాలనూ, దొంగపత్రాలనూ సృష్టించడానికి వీలుండి ఆయావ్యక్తుల కనుకూలంగా తీర్పులిచ్చే న్యాయస్థానాల కంటె, కేవలం ప్రమాణాల ఆధారంగా తీర్పుచెప్పి ఆయా వ్యక్తులను పాపానికో, పుణ్యానికో వదిలేసి ఆత్మ పరిశీలనకు అవకాశం కల్పించే రచ్చబండలే మేలనిపిస్తుంది!

రాయలు ఆముక్త మాల్యదలో రచ్చబండలను పేర్కొన్నాడు.

"రయమునవృష్టికై యొదిగిరచ్చలపై విధియింతురుగ్రతన్
హయపతిమీద దంతిపతినాతనపై నృపతింగజాది ని
ర్ణయముల మొత్తులాడుదురు ప్రమబ్బొకయించుక విప్పవచ్చు మొ
గ్గయి మఱిపాఱిపోదురు సమస్తదిశాగతులైన యధ్యగుల్" 4-131

వైజయంతీ విలాసంలో గ్రామసభలు, బ్రాహ్మణ సభలు పేర్కొనబడ్డాయి. ఆ కాలంలో దొంగతనాలకు సంబంధించిన కేసులు పరిష్కరించడానికి తలారి మంటపాలుండేవి. అవి ఈనాటి పోలీసుస్టేషన్లలాంటివి. తలార్ల చేతుల్లో కట్టెలుండేవి. అవి ఈనాటి లాఠీలవంటివి. ఆ కట్టెలకు ఇనుముతో తయారు చేసిన బిల్లలు కట్టేవారు.

"చలదయః పత్రికోజ్వల దండకాండముల్
ఘల్లుఘల్లనుచు ముంగల చెలంగ" 4. 78

కట్టెలు కదిలినప్పుడల్లా ఆ బిల్లలు ఒకదానికొకటి తాకి చప్పుడయ్యేది. ఆ చప్పుడువల్ల తలార్లు వస్తున్నారని ప్రజలు తెలుసుకొనేవారు.

శ్రీరంగేశుని ఆలయంలో దేవుని గిన్నె కనిపించకుండా పోవడం, దాన్ని విప్రనారాయణుడే దొంగిలించి దేవదేవి అనే వేశ్యకు పంపినాడన్న అభియోగం ఆనాటి పంచాయతీ వ్యవస్థ తీరుతెన్నులు తెలుసుకోవడానికి అవకాశం కలిగిస్తుంది. అర్చకులు ఆలయంలో గిన్నె పోయిన విషయాన్ని జియ్యరు (ఆలయాధికారి)కు నివేదిస్తారు. అతడు ఆలయంలోని వారిని అనుమానించి, నరసింహావతారం ఎత్తినట్లు అందరినీ హడలెత్తిస్తాడు.

"బడి పనుల వారి గొల్లల గుడినంబుల జంగ వరుస గొనిచేకొలదిన్
బడిమారు త్రిదండంబున నెడమ గుడి న్నారసింహమెత్తినకతిన్ 4.65

చిన్న చిన్న పనులు చేసేవారిని, గొల్లవారిని, గుడి పూజారులను విచారిస్తాడు. అయినా దోషిని పట్టుకోలేక తలారి కొట్టుకు వెళతాడు. తలారి నాయకునికి తీర్థప్రసాదాలిచ్చి గిన్నె పోయినట్లు తెలియజేస్తాడు. తలార్లు ఆ కాలంలో దైవభక్తి కలిగి ఉండేవారు. దోషులను పట్టుకోవడం, గ్రామరక్షణ చేయడం వారి విధులు. కోవెలలోని సొమ్ములే పోయాయంటే ఇక వారుండి లాభమేమి? దోషులను పట్టకపోతే చెడ్డపేరు వస్తుంది. లోకులు అపహాస్యం చేస్తారు

"ఆసన్నత స్వామికి నిజదాసుడవైనట్టి నీవు తలవరిపని యా
జ్ఞాసిద్ధిజేయ కోవెలలో సొమ్ముటులైన నిన్ను లోకులు నగరే" 4.70

ఆ కాలంలో తలారులు చోరు లూరు దాటకముందే మేల్కొనే వారు. అన్ని జాగ్రత్తలు తీసుకొనేవారు. గిన్నె పోయిన సంగతి తెలియగానే తలారి పంచాణం వారిని పిలిపించాడు. వారు ఒకరికొకరు తెలియకుండా పిలువబడ్డారు. కంసలి, కమ్మరి, కంచరి, కాసె, వడ్లవారిని పంచాణం వారని వ్యవహరిస్తారు. దేవాలయాల్లోగాని ప్రజల ఇండ్లలోగాని బంగారు నగలు లేదా విలువైన పాత్రలు దొంగిలించ బడ్డప్పుడు తలారులు ఈ పంచాణం వారిమీద ఓ కన్నేసి ఉంచేవారు. ఎందుకంటే సాధారణంగా దొంగలు తాము దోచుకొన్న నగలను వారిఇండ్లకే అమ్ముకోవడానికి తెస్తారని వారి నమ్మకం.

"కంచును, రాగియు వెండియు కాంచనమును మౌక్తికాదికములగుమణులుం
బంచాణము వారింట్లకు కొంచక కొనివత్తు రమ్ముకొనుటకు చోరుల్" 4-73

ఆ కాలంలో నేరస్థులను పట్టిచ్చిన వారికి బహుమానాలు ఇచ్చే వారు. తలారులు తాము ధరించిన దుప్పట్లను బహుమానాలుగా ఇచ్చిన సందర్భాలున్నాయి. మరో విశేషమేమంటే నేరస్థులకు సంబంధించిన వారి పేర్లనురహస్యంగా ఉంచేవారు.

"అట్టియది మాకునెవ్వడు నెట్టననెరిగించు నాతనికి నిచ్చెదనే
గట్టిన యా దుప్పటినే నెట్టియెడంబ్రచురమతని నెన్నడుసేయన్" 4-74

న్యాయ విచారణ జరపకుండానే దోషిని శిక్షించే విధానం ఆ కాలంలో లేదని తెలుస్తుంది. ఒక వ్యక్తిని నేరస్థుడని భావించినప్పుడు అతన్ని తలారులు మొదట న్యాయాధికారి దగ్గరికి తీసుకొని వెళ్ళేవారు. న్యాయాధికారి ధర్మసభను ఏర్పాటుచేసి బహిరంగంగా న్యాయ విచారణ జరిపేవాడు. న్యాయకోవిదులు దోష నిరూపణతోపాటు శిక్షా విధానాన్ని కూడా సూచించేవారు. ఆ నాటి శిక్షా పద్ధతిని అనుసరించి ఒక్కోసారి దోషినుంచి నష్టపరిహారంగా ధనాన్ని కూడా స్వీకరించేవారు. అలా జరగనప్పుడు శిక్షగా తలగొరగడంగానీ, గ్రామం నుంచి బహిష్కరించడంగాని అమలయ్యేది. ఇక బ్రాహ్మణుడే చంపదగినంత నేరం చేసినా అతన్నిమాత్రం "బ్రాహ్మణో న హంతవ్యః" అనే శాస్త్రి వచనాన్ని బట్టి హింసించేవారు కాదు.

"ధనము గొనుటయొండెతలగొఱుగుటయొండె
ఆలయంబు వెడలనడచుటొండె
కాని చంపదగిన కార్యంబు చేసిన
చంపదగదు విప్రజాతి పతికి' 4.111

ఆ నాటి శిక్షా విధానంలో ఒక లోపం స్పష్టంగా కనిపిస్తుంది. అది బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు వేర్వేరుగా శిక్షలు అమలు చేయడం.

గిన్నెనపహరించిన విప్రనారాయణుడు దోషిగా నిలబడ్డాడు. కాని అతని దగ్గర ధనంలేదు. తల మొదలే కొరిగించుకొని ఉన్నాడు. కాబట్టి ఊరువిడిచి వెళ్ళవలసిందిగా ధర్మసభ తీర్పు చెప్పింది.

వైజయంతీ విలాసాన్ని పరిశీలిస్తే 16వ శతాబ్దం నాటి గ్రామ సమాజం లోని న్యాయ వ్యవస్థ తీరుతెన్నులు చక్కగా అవగతమౌతాయి. విప్రనారాయణుని కథలో-

పూజారులు గిన్నె పోయిందని జియ్యరుకు చెప్పడం, అతడు ఆలయంలో వెదికించి పూజారులను ప్రశ్నించడం-ఇదంతా ప్రాథమికవిచారణ (మొదటిదశ). దోషి దొరకలేదు కాబట్టి జియ్యరు తలారి నాయకునికి దొంగతనాన్ని వివరించడం,అతడు పంచాణం వారిని పిలిపించి దోషిని పట్టుకొని జియ్యరుకు గిన్నెతో పాటు అప్పగించడం విచారణలో రెండవ దశ. జియ్యరు చట్టాన్ని తనచేతుల్లోకి తీసుకోకుండా ధర్మసభను ఏర్పాటు చేసి, పండితులిచ్చిన తీర్పునుబట్టి దోషిని శిక్షించడం మూడవ దశ.

అప్పు తీసుకొని తిరిగి ఇవ్వని వారిచుట్టూ ఒకగీత గీసి ఆ ఆగీతదాటి రాకూడదని నిర్బంధం పెట్టే విధానం ఆ కాలంలో ఉన్నట్లు వైజయంతీ విలాసాన్ని బట్టి తెలుస్తుంది.1

శుకసప్తతిలో బొండకొయ్య అనే శిక్షా సాధనాలు ప్రస్తావించబడ్డాయి

"వినవచ్చి దొంగగాయని
యొనరగనిట బొండకొయ్యనుంచిరి" 3- 204

తప్పు చేసినవారి కాలు నేతులకు తగిల్చెడి దారుయంత్ర విశేషమే బొండకొయ్య.2 రెండు పలకలు తొలిచి దాంట్లో దొంగల రెండు కాళ్లు పెట్టించి ప్రక్క భాగాల్లో కట్టెకొయ్యలు దిగగొడుతారు. అదే విధంగా చేతులకు తగిలిస్తారు. ఇది బొండకొయ్య స్వరూపం.

---

1. వైజయంతీ విలాసం, 2- 143
2. సూర్యరాయాంధ్రనిఘంటువు, 5వ సంపుటం, పు. 1089

శుకసప్తతిలో- రచ్చబండలు ఊరువెలుపల ఉన్నట్లు పేర్కొనబడింది. అప్పటికే తురక జవానులు వచ్చారు. ఒక తురక జవాను రచ్చబండ దగ్గరకువచ్చి తలారికి బులావ్‌ధగిడికే అని అరిచినట్లు కవి వర్ణించినాడు.

''అమరు ముస్తైదు తేజితోనరుగుదెంచె
దారుణాకారుడైన యుద్దారుడొకడు
వచ్చియయ్యూరి వెలుపల రచ్చరావి
క్రేవదుర్వారుడై 'తలారికిబులావు
ధగిడికే' యను మాటకు తలకిరెడ్డి
తోడివారలతో చేని త్రోవబట్టె'' 4- 28

ఆ కాలంలో మంచి చెడ్డలకూ, మానావమానాలకూ రచ్చబండలు ఆటపట్టులుగా ఉండేవి. సాధారణ జనజీవనానికి సంబంధించిన ఈ శిక్షావిధానం రచ్చబండల మీదనే రూపొందిందని చెప్పడానికి ప్రాచీన సాహిత్యంలో ఎన్నో ఉదాహరణలు లభిస్తున్నాయి.

**జీ త భ త్యా లు :**

ఏదో ఒక పనిచేస్తేనే కాని పొట్ట గడవని పరిస్థితి సామాన్యులది. ప్రజలు రోజు కూలికేకాక, నెలజీతానికి పని చేసే విధానం ప్రాచీన కాలంలో ఉంది.

జీతం ఇచ్చి సేవకులను నియమించుకొనే విధానం నన్నయ కాలంలో ఉంది. భారతారణ్య పర్వంలో పర్ణాదుడనే బ్రాహ్మణుడు బాహుకుని గూర్చి దమయంతితో మాట్లాడిన సందర్భంలో ఈ విషయం ప్రస్తావించబడింది.

'ఒక్క పురుషుండు కుఱుచ చేతులవాడు ఋతుపర్ణు నొద్దనూఱు గద్యాణంబులు జీవితంబు వాడు' 2- 159

మూలంలో గద్యాణాల గురించి, జీతాల గురించి పేర్కొనబడలేదు. గద్యాణం ఆ నాటి నాణాల చెలామణిని సూచిస్తుంది. గద్యాణం అంటే వరహా, ఒక బంగారునాణెం.

నన్నెచోడుని కాలంలో రాజు తన సేవకులకు జీతం ఇచ్చే పద్ధతి అమలులో ఉంది. కోశాగారం నుంచి ధనాన్ని తెప్పించి కుప్పగాపోసి, ఎవరెవరికి ఆనాడు ఎంతెంత ఇవ్వాలో చూసి ఇచ్చేవారు.

"భావజవిభుడలి శుకపిక
సేవకతతి కెడరుదీర జీతముసేయం
గా వెలిబోసిన పసిడుల
ప్రోవులుగా తమ్మివెలమి పూచె బెడంగై' 4-92

మన్మథుడు తన సేవకులైన తుమ్మెదలు, చిలుకలు, కోకిలలు మొదలైన వాటికి జీతాలివ్వడానికి కుప్పవోసిన బంగారు నాణాలవలె తామరపూలు పూచాయని పద్యంయొక్క భావం. 'ఎడరుదీర' అనడంవల్ల సకాలంలో జీతాలు అందక బాధపడే సేవకులున్నారనీ, అలాంటివారు జీతాలందినరోజు ఈ కాలంలోని వారిలాగా ఆనందించేవారనీ భావించవచ్చు.

నన్నెచోడుని కాలంలో జీతంగా జొన్నలిచ్చే విధానం ఉంది.
''ముసుమిడి వైరి వాహినుల ముట్టియు జొన్నలు'' 11-240

పాల్కురికి సోమనాథుని బసవపురాణంలోను జొన్నలు జీతంగా ఇచ్చే పద్ధతి ప్రస్తావించబడింది.

''తప్పని దండింప తగవగుగాక
ఇప్పర దైవంబు లిండ్లిండ్లకడకు
నేలరావచ్చునే పతివీవు
జోళవాళికకాక వేళవాళికిని" ఆ. 6, పు.195

ఇందులోని చోళవాళిక, వేళవాళిక అనే పదాలకు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు చక్కని అర్థ నిర్ణయం చేసినారు.

''చోళవాళి= జొన్నలకయిన నిర్ణయము. వేళవాళి= జీవిత కాలమునకయిన నిర్ణయము. అనగా, జీతము (తిండికి జొన్నలు) ఇచ్చినందులకు చేయవలసిన సేవకు నీవధికారివికాని, జీవితకాలపు విధానములకెల్ల నధికారివి కావని యర్థము. చోళమనగా జొన్నలు. వాళి=వతను-ఏర్పాటు-నిర్ణయము-కన్నడమున 'చోళదవాళి' అని యుండుటచేతనది షష్ఠీ సమాసము''1

1. బసవపురాణ పీఠిక, పు. 113

పండితారాధ్య చరిత్రలోను వీటి ప్రస్తావన ఉంది.

''ఙోళవాళిక కాక క్షోణితలేశ
వేళవాళికి తగన్ వేయట్టులనిన''

మహిమాప్రకరణం, పు. 297

ఎప్పటికప్పుడు పని చేయించుకొని జీతం ఇచ్చే విధానమూ, మాసానికి ఒకేసారి జీతం ఇచ్చే విధానమూ ప్రాచీన కాలంలో ఉన్నట్లు తెలుస్తున్నది.

జీతం కేవలం ధనరూపంలోనేకాక తిండి, వస్త్రం, ధాన్యం రూపంలో కూడ ఉండవచ్చు. తిండీ, బట్టా, ఆశ్రయమూ కల్పిస్తే ఏ పనికైనా సమ్మతించే జీతగాళ్ళు తిక్కన కాలంలో ఉన్నట్లు తెలుస్తుంది. భారత విరాట పర్వంలో భీముడు విరాటునితో పల్కిన పల్కుల్లో ఈ విషయం స్పష్టమవుతుంది.

''పేరు వలలుండు కూడుం
జీరయునిడి సాకతంబు చేసినచాలుం
గోరిన వంటకములు తా
నేరిమి తగనెఱపి కొలుతు నిశ్చల భక్తిన్'' 1-219

పని చేసిన వెంటనే ఎప్పటికప్పుడు జీతం తీసుకొనేవాళ్ళు కైజీతగాళ్ళు. వీళ్లనే చేజీతగాళ్ళని కూడా అంటారు. భారతాశ్రమవాసపర్వంలో తిక్కన కైజీత గాళ్లను పేర్కొన్నాడు.

''మూలబలంబును మొత్తాలవారును
మిత్రబలంబును శత్రుబలము
కాననంబు బలము కైజీతగాండ్రును
నైనయట్టి బలము లాఋనరసి'' 1-173

యుద్ధసమయాల్లో కైజీతగాళ్ళను సైన్యంలో చేర్చుకొనే విధానం (recruitment) ఆ కాలంలో ఉన్నట్లు తెలుస్తుంది. యుద్ధ సంబంధమైన పనులకే కాక ఇతరమైన పనులకుకూడ కైజీతగాళ్లను ఏర్పాటు చేసుకొనే విధానం అనంతర కాలంలో వచ్చినట్లు తెలుస్తున్నది.

చిన నారాయణకవి కువలయాశ్వ చరిత్రలో కైజీతాలవారు రణరంగానికి ఎలా వెళ్ళారో తెల్పబడింది.

"ఒకనినొక డెచ్చరించుచు జికిలియొఱలు
పాఱవైచుచు వడిజార పారువారు
నగుచు కైజీతముల వారలనికి నిగిడి.'' 2-143

కాకమానిమూర్తికవి రాజవాహన విజయంలో- ఏమైనప్పటికీ వెనుకకు తిరుగనని ఒట్టుపెట్టుకొని యుద్ధం చేసే కైజీతగాళ్ళ గురించి చెప్పబడింది రోజు కూలికి యుద్ధంలో చేరినప్పటికీ శత్రువుల్ని చంపడమే ధ్యేయంగా పెట్టుకొన్న కైజీతగాళ్ళకు మనం కైమోడ్పులర్పించవచ్చు.

కైజీతగాళ్ళే అయినప్పటికీ వారు శత్రువుల్ని తరిమి తరిమి కొట్టినట్లు గణపవరపు వేంకటకవి ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసంలో వర్ణింప బడింది.

"బోయల్ దాయలపైపాయకప్పరవీథిన్
పరవీరులన్ గదుమగుంపుల్ గూడి కైజీతముల్ తఱుమన్'' - 797

రోజు కూలికి పనిచేసేవారూ, ఏ పనీలేక ఊరకుండేవారూ, యుద్ధం అంటే ఆసక్తి ఉన్నవారూ కైజీతగాళ్ళుగా చేరేవారని తెలుస్తున్నది.

పల్నాటి వీరచరిత్రలో నగదు జీతాల వారి గురించి తెల్పబడింది. నలగామరాజు నాగమ్మను పిలిచి బంట్లనూ, మన్నెంలో ఉండేవారినీ, సామంత రాజులు సన్మానించి ఇచ్చిన భూముల్లో నివసించే వారినీ, నెలజీతాలు తీసుకొనే వారినీ, భూముల్ని సాగుచేసుకొని జీవించేవారినీ, పల్లెల్ని ఆశ్రయించి బ్రతికే వారినీ యుద్ధ సన్నద్ధుల్ని చేయవలసిందిగా కోరాడు.

''నలగామ భూపతి నాగమ్మ బిలిచి
మనవద్ద బంట్లును మన్నెవారలును
పజ్జల నన్నంబు భక్షించువారు
రొక్క జీతంబుల రూఢులౌవారు

క్షేత్రముల్ జేసుక జీవించువారు
పల్లెలు బుచ్చుక బ్రతికెడువారు
నెలగోలు ప్రజలకు నెల్లరకిష్ణు
పైనమై రమ్మని పరగజెప్పింపు'' పు- 25

నెల జీతాల వాళ్లూ, పల్లెల్లో ఉండేవాళ్ళూ ఆ కాలంలో సైన్యంలో చేరే వారు. ప్రాచీన కాలంలో తరుచుగా రాజులకు రాజులకు మధ్య చిన్న చిన్న పోరాటాలు జరుగుతూనే ఉండేవి. అందుకు ఎక్కడెక్కడి వారిని సైన్యంలోకి తీసుకొనవలసి వచ్చేది. ఆ సైన్యంలో కై జీతగాళ్ళు, నెలజీతగాళ్ళు ఉండేవారు. ఎక్కడో పల్లెల్లో ఏవో పనులు చేసే సాధారణ జనులుకూడా బాకులూ, బల్లాలూ పట్టుకొని కదం తొక్కుతూ కదన రంగానికి తరలేవారు. వారికి కావలసింది తిండి, రాజులకు కావలసింది విజయం.

నెల జీతాలవాళ్ళు ఈ కాలంలో లాగానే ఆనాడు కూడ జీతంఒక్కరోజు ఆలస్యమైనా భరించేవారు కాదు.

''ఒక నెల మించెనా యోర్వరు బంట్లు
దొరబంటు మేరలు తొలగుచునుండు'' పు-25

జీతాలు సకాలంలో అందకపోతే దొర, సేవకుడు అనే తేడాలు పోతా యనడం యథార్థం. ధనంతోపాటు ధాన్యాన్ని నెల జీతంగా తీసుకొనే ఏర్పాటు ఆ కాలంలో ఉంది.

"ధాన్యముల్ గొనువారి ధనవేతనకుల
పిలిపించి వారికి ప్రియములు చెప్పి" పు- 28

కై జీతగాళ్ళకు పనిలో చేరకముందే కూలి ఇచ్చే సంప్రదాయం ఆ కాలంలో ఉంది. ఈ కూలి ధన ధాన్యాల రూపంలో ఉండేది.

''జీతపు రొక్కముల్ చేతిలోవేసి
వెంటనే పంపుడి వేగంబెమీర" పు- 31

కాశీఖండంలో కూలికి ఎంత దూరమైనా వచ్చే కూలీలున్నట్లు చెప్ప బడింది. "మార్గమధ్యంబున నొకవేటపల్లె నొక్క యాటవికునికిన్ భృతియిచ్చి

మూట మోపించుకొని యెట్టకేలకుం కాశీపట్టణంబుజేరి'' నాడు వైశ్యుడు.[1] యాత్రలకు వెళ్ళేవారు తమ వస్తువులను కూలీలతో మోయించుకొని వెళ్ళేవారు. ఆ కాలంలో చెంచులు అడవులను విడిచిపెట్టి కూలిపనికోసం బయటి ప్రదేశాలకు కూడా వెళ్ళేవారని తెలుస్తున్నది. అయితే వస్తువులతో సహా మాయమయ్యేవారు కూడ ఆనాడున్నారు.[2] దానికి కారణం వారి ఆర్థిక పరిస్థితులే.

ద్విపద పరమయోగి విలాసాన్ని బట్టి ఆ కాలంలో ఉగాది, దీపావళి పండుగలకు జీతగాళ్ళకు ధాన్యాన్ని జీతంగా ఇచ్చే ఏర్పాటున్నట్లు తెలుస్తుంది.

''సరవి కానుక దేవసంబు ధాన్యంబు
నరసి యుగాది దీపావళులందు
వగిది చెల్లించు నప్పగిది రాహుతుల
నగరి బంటుల జీతనాతంబులేలు'' అ. 3,పు 197

ఇదే కావ్యంలో రాజు కరణాలను పిలిచి లెక్కలడిగిన సందర్భంలో లంచాల ప్రసక్తి వచ్చింది.[3] ఆ కాలంలో రాజులు పరిపాలనకు సంబంధించిన జమా ఖర్చుల వ్యవహారం కరణాల కప్పగించేవారు. కరణాలకు జీతభత్యాలుండేవి.

సింహాసన ద్వాత్రింశికలో కొరవి గోపరాజు పౌరోహిత్యాన్ని గురించి వ్రాసినాడు. ఈ సందర్భంలో దినభత్యాలకు సంబంధించిన కొన్ని వివరాలు తెలుసుకొనవచ్చు.

''చేరెడు నూకలు పిడికెడు
కూరయు గొని యొక్కపూట కూటికి దొరయై
యూరికి బంచినపోబడు
పౌరోహిత్యంపు బుద్ధి బంటరికముగా'' 2-173

చేరెడు నూకలూ, పిడికెడు కూరగాయలూ భత్యంగా తీసుకొని ఒక్కపూటకు తృప్తిపడి, ఒకరికి గులాముగామారి కార్యార్థం వేరొక ఊరుకు పంప

---

1. కాశీఖండం, 5. 62 2. అదే, 5. 64 3. ద్విపదపరమయోగి విలాసం, ఆ.6, పు. 459

బడే పౌరోహిత్యం బంటుతనమే అని పై పద్యంలోని భావం. ఆ కాలంలోని దినభత్యాలెలా ఉండేవో తెలుసుకోవడానికి పై పద్యం ఉపయోగపడుతుంది.

ఆముక్తమాల్యదలో యామున ప్రభు రాజనీతి ఘట్టంలో రాజు సేవకుల్ని చక్కగా పోషించాలన్న విషయం చెప్పబడింది.

''కడుపున నొకకడి తఱిగిన
చెడజూచుటెకాక పతికి చెలియుంగలడే
యిడనని విడువంజెల్లునె
నడపవలయు నేర్చినట్లు నమ్మకయెక్కృపన్'' 4-233

భోజనంలో ఒక ముద్దతక్కువైనా సేవకులు రాజులను నిందిస్తారు. రాజుకు కీడు కలగాలని ఆశిస్తారు. నిజానికి రాజుకు మిత్రులైన సేవకులే లేరు. రాజులు సేవకులను నమ్మకపోయినా రాజ్యం నడవాలి కాబట్టి దయతో వారిని పోషిస్తూ వారిచేత పనిచేయించవలసిన బాధ్యత ఉందని భావం.

వెట్టి : - పొన్నగంటి తెలగన్న యయాతి చరిత్రలో 'వెట్టి' పేర్కొనబడింది. రావణుడు దేవతలచేత వెట్టి చాకిరి చేయించుకొన్నట్లు వర్ణించబడింది.

''వేలుపుల్ వెట్టంగొట్టము సేయమత్తిలివడిన్విన్నెటితాల్పున్నయా
గట్టుంబెట్టు పెకల్చి రావణుడనంగామీఱి....'' 2-62

ఏ జీతం తీసుకోకుండా జీవితాంతం గొడ్డులాగా చాకిరీచేయడమే వెట్టి ప్రాచీన కాలంలో ఈ ఆచారం ఉంది.

పండితారాధ్య చరిత్రలో కూడా ఈ వెట్టి విధానం ప్రస్తావించబడింది.

''చాకులకును మరి సంగవులకును
యేకత్వమున్నదే లోకంబునందు
వెట్టికి తెచ్చిన విధముననూర
వెట్టిగాదెచ్చిన యట్టివి సభలె'' వాదప్రకరణం, పు. 176

ఈ విధంగా ఆయా కావ్యాల్లో ప్రజల జీతభత్యాలకు సంబంధించిన విషయాలు ప్రతిబింబించాయి.

క్ర య వి క్ర యా లు :

నన్నెచోడుని కాలంలో వస్తువులను బండ్లపైన, ఎడ్లపైన, దున్నపోతుల పైన వేసుకొని ఒకచోటి నుంచి వేరొక చోటికి తరలించేవారు. ధాన్యం సంచులను పశువులమీద వేసుకొని వెళ్ళేవారు. వర్తకులు ఎడ్లమీద వేసుకొని పోయే ధాన్యం సంచులను పెరికెలని వ్యవహరిస్తారు. ఆ కాలంలో బండ్లు తక్కువ. దారులు సరిగా ఉండేవి కావు. పెరికె అనేది పెద్ద గోనె సంచి. దాన్ని మధ్య భాగంలో రెండు అరలేర్పడేటట్లు కుడుతారు. ఈ అరలను సరుకులతో నింపి రెండు దిక్కుల మూతులు గట్టిగా కడుతారు. సంచి మధ్యభాగం జంతువుల వీపుమీద ఉండేటట్లు చేసి ఒకచోటి నుంచి వరొక చోటికి తీసికొని వెడుతారు.

> ''ఇక్కుముట్టి చక్కినెక్కంగ మఱచి సం
> భ్రమము పొంది పిఱుద ప్రమథగణము
> లార్వపోతుమీద నడ్డంబుపడి యుప్పు
> పెఱికెవోలె వెఱచి పఱచెజముడు'' 2. 73

ప్రమథ గణాలు వెంటపడి తరుమగా భయపడిన యముడు తన వాహనమైన దున్నపోతునెక్కడం మరిచి, ఉప్పు నింపిన పెరికెలాగ దానిమీద అడ్డం పడి పారిపోయాడని పద్యంలోని భావం.

ప్రజలు సంతలకుగాని, దూరప్రదేశాలకు గాని వెళ్ళేటప్పుడు ఆయా జంతువుల మీద పెరికెలను వేసుకొని ప్రయాణం చేసే పద్ధతి నన్నెచోడుని కాలంలో ఉన్నట్లు భావించవచ్చు.

గొల్లపడుచులు చల్లలమ్మే విధానాన్ని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో వర్ణించినాడు.

> ''ఆ వీథి చల్లతానమ్ముచు గణక
> బోవుచో కాలూన బోయిన దొసగ
> కడు రొంపి కాలు జారుడు చల్లకడవ
> పడబోవ గొల్లెత 'బసవరో' యనిన'' ఆ. 2. పు. 57

పాలు, పెరుగు వీథివీథి తిరిగి అమ్మే ఆచారం ఆ కాలంలో ఉందని తెలుస్తుంది. జాతరలు, సంతలు జరిగే సందర్భాల్లో గొల్లపడుచులు పాలు, పెరుగు ఎక్కువగా అమ్మడం ఈనాటికీ మనం చూస్తాము.

కేయూరబాహు చరిత్రలో నూనెకు బదులు బియ్యాన్ని ఇచ్చిన వైశ్య బాలిక కథ ద్వారా మంచన ఆనాటి క్రయవిక్రయ విధానాన్ని కొంతవరకు తెలిపినాడు. ఏడు మాన్కల బియ్యానికి ఒక్క మాన్క తైలం లభించే విధానం అనాడుంది. ఇది వస్తు మార్పిడి విధానాన్ని సూచిస్తుంది.

'బియ్యమునకున్ సరితైలము వోయు' మని సంతలో కేకవేసిన వ్యక్తికి వైశ్యబాలిక ఇచ్చిన సమధానాన్ని చూడండి—

"ప్రాలేడు మానికలకున్ తైలము మానెడు పురమ్ము ధారణకలుగన్
ప్రాలసరితైలమడిగిన జాలియ యగుగాని నీకు చమురేలబ్బున్" 2-10

నాల్గు సోలల ధాన్యం పట్టేపాత్ర మానిక. 'మాన్క' అని జానపదుల వ్యవహారం. మానికను కొలతకు ఉపయోగించడం ఈనాటికీ ఉంది. 'మానికెల వడి' అనే రూపం దక్షిణ హిందూస్థాన శాసనాల్లో (క్రీ. శ. 1225) కనిపిస్తుంది.1

పాలు, పెరుగు, చల్ల, బియ్యం, మొదలైన వాటిని అమ్మినట్లే తేనెను కూడా కుండల్లో నింపి బోయవారు నగరాల్లో అమ్మినట్లు కేయూరబాహు చరిత్రలో వర్ణించబడింది.

"ధరణిపయి లాట నరపతి పురి తేనియనమ్ముకొరకు బోయల పల్లెం
జరియించుచుండు వాడొక పురుషుండది యొక్క కలశమునగొని కడకన్"
2. 111

చెంచులు తేనెను అడవుల్లో సేకరించి నగరాల్లో అమ్మడం ప్రత్యక్షంగా చూస్తున్నాం.

---

1. వైకృతపద స్వరూప నిరూపణము, తూమాటి దొణప్ప, పు. 616

క్రీడాభిరామాన్ని బట్టి ఓరుగంటిలో మడి సంతలు, మైల సంతలు ఉండేవని తెలుస్తున్నది. పామరజనం మైల సంతలో తమకు కావలసిన వస్తువులను కొనుక్కొనేవారు. స్త్రీలుపయోగించుకొనే సుసరభేత్తు అనే మందు మైల సంతలో అమ్మబడేది.

''ఇంతులకు ప్రీతిగా మైల సంతలోన
సుసరబేత్తని ఘోషించె జోటియోర్తు'' ప_77

ఇట్లే కరణకాంతలు పెద్దగా అరుస్తూ సంపంగి నూనెను అమ్మేవారు.

''ఓరుగంటి పురములోన నోరగ్రంత
పెద్దయెలుగున నమ్మె సంపెంగ నూనె
కోకిలము పంచమశ్రుతి కొసరినట్లు
కనుమయవ్వలి దేశంబు కరణకాంత'' ప. 102

మాలమాదిగలు నివసించే ప్రాంతం మొహరివాడ. మొహరివాడనే దోహరివాడగా వ్యవహరిస్తారు. దోహరులు తోళ్ళతో చెప్పులు కుట్టడమే కాక వెలివాడ వారికి చొక్కాలు, రవికలు, మొదలైనవి కుట్టిఇచ్చే వారని, తెలుగు నాట ఈ ఆచారం కొన్నేండ్ల క్రిందటి నుంచి వస్తుందని డా॥ వేటూరి ఆనంద మూర్తిగారు తెలిపినారు.1

ప్రాచీన కాలంలోని రచ్చబండలు న్యాయస్థానాలుగా గుర్తించ బడినట్లే, సంతలు వాణిజ్య కేంద్రాలుగా గుర్తించబడ్డాయి.

వస్తువులను అమ్మడమేకాక కుదువ బెట్టడం అనే ఆచారం ప్రాచీన కాలం నుంచీ వస్తుంది. ఈ విధానం క్రీమభిరామంలో పేర్కొనబడింది. నగలను, వస్తువులను, కుదువబెట్టడమే కాక అగ్రహారాలను కుదువబెట్టడం కూడ ఆ కాలంలో ఉంది.

''అధివెట్టితి జొన్నగద్దాగ్రహార
వృత్తియే నూరు రూకల విత్తమునకు'' ప.245

1. క్రీమభిరామం, పీఠికానుబంధం, ప్రచు: 1960

పోషణకై రాజు బ్రాహ్మణులకిచ్చే భూమి అగ్రహారం.[1] పసరాన్ని కొనడానికి వచ్చుడాన్ని అమ్మకొన్న వ్యవసాయదారుని ప్రస్తావన క్రీడాభిరామంలో ఉంది.[2]

ఒక వస్తువును కొనడానికి మరొక వస్తువును మారుగా ఇవ్వడంకానీ, లేదా దాన్ని అమ్మగా వచ్చిన ధనాన్ని ఇవ్వడం కానీ, లేదా కుదువబెట్టి డబ్బు తెచ్చి ఇవ్వడం కానీ ప్రాచీన కాలంలో ఉన్నదే.

ద్విపద పరమయోగి విలాసంలో భూమి మొదలైన వాటియొక్క క్రయ విక్రయ విధానం ప్రస్తావించబడింది. ఆ కాలంలో ఆయా వస్తువులను త్రాసులో తూచి వెలగట్టి అమ్మే విధానం అమలులో ఉంది.

''....ఏలరా మీగిన్నె లిటువంటివిపుడు
వేయైన త్రాసున వేచి తూచినను
మా యక్క గిన్నెకు మరిసరియగునె" 4-325

ఆ కాలంలో రూకలను బంగారాన్ని తూచడానికి ఉపయోగించేవారు.
"ప్రోగుగా రూకెత్తు పుత్తడిలేదు.'' 4.325

అప్పుగా తీసుకొన్న ధనాన్ని తిరిగి ఇచ్చినప్పుడు ఋణదాత చెల్లుచీటి ఇచ్చే విధానం ద్విపద పరమయోగి విలాసంలో పేర్కొనబడింది.

''క్షితినాథుచే సొమ్ము చెల్లించినందుకు
నితనికి నిప్పింపు డిట చెల్లు చీటి" 6.480

క్రయ విక్రయాలు జరిగినప్పుడు సాక్షి పత్రాలను వ్రాసుకోవడం కూడా ఆ కాలంలో ఉంది.

''అరయంగ సీమాన్యమైనయందులకు
పరగంగ సాక్షి సంబంధంబుగలదె

---

1. సూర్యరాయాంధ్ర నిఘంటువు, ప్రథమసంపుటం, పు. 75
2. క్రీడాభిరామం, ప. 262

అనిన నెక్కడి సాక్షులలనాడెపోయి
రనిన పత్రము కలదాయనియనిన" 7-533

హరిశ్చంద్రోపాఖ్యానంలో ఆవులను విక్రయించే విధానాన్ని గౌరన తెలియజేసినాడు. ఆవులు అమ్మబడినప్పుడు వాటితోపాటు దూడలు కూడ అప్పగింపబడేవి.

"ఎలమిధేనువు విక్రయించుచో గ్రేపు
తొలగింతురే తల్లి తొలగగా జేసి"

ఈ నాటికీ పశు విక్రయ విధానం ఇలాగే కొనసాగుతుంది. ఆముక్తమాల్యదలో ఊరూరి సంతలు ప్రస్తావించబడ్డాయి, స్త్రీలు పల్లెలనుంచి పూలమ్మడానికి నగరాలకు వచ్చేవారని రాయలు వర్ణించినాడు.[1]

పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ దిన వెచ్చాలకోసం నగలను కుదువబెట్టడం, గుత్తచేలను అమ్మడం మొదలైన విషయాలు చెప్పబడ్డాయి.[2]

ఒక వస్తువును తూకంగట్టి సమానంగా మరొక వస్తువును ఇస్తే అది ఎత్తుకు ఎత్తు అవుతుంది. శుకసప్తతిలో ఈ విధానం చెప్పబడింది.[3]

శుకసప్తతిలో సంతలు పేర్కొనబడ్డాయి. గ్రామీణులు పండుగ రెండు రోజులుందనగానే సంతకు వెళ్ళి కావలసిన సరుకులు కొని తెచ్చుకొనేవారు. సంతలు దూరంగా ఉంటే మరునాడు రావడం జరిగేది.

"ఎల్లుండి సమారాధన చిల్లర వెచ్చములు గొనగ శీఘ్రమెయిదె యీ
పల్లియ సంతకు జనియే నెల్లిటి కరుదెంతు పదిలమిల్లని పలుకన్"
2- 183

శుకసప్తతిలో వడ్డి చెల్లించే పద్ధతి పేర్కొనబడింది. ఆ కాలంలో నెలకు ఒక రూకకు వీసం చొప్పున వడ్డీ తీసుకొనేవారు. నాలుగుచట్ల పెరుగమ్మితే ఒక రూక వచ్చేది. నోరు వెడల్పుగా ఉండే చిన్న మట్టిపాత్రలే చట్లు.

1. ఆముక్తమాల్యద 1. 75 2. పాండురంగమాహాత్మ్యం 3. 16
3. శుకసప్తతి, 1-231

రూకలో 16వ భాగం వీసం. ఒక రూకను కూడా వడ్డికి ఇచ్చేవారంటే ఆ కాలంలో దానికున్న విలువ ఏ పాటిదో తెలుస్తుంది.

అత్త ఆజ్ఞప్రకారం కోడలు మజ్జిగను అమ్మగా ఒక రూక వచ్చింది. వచ్చిన రూకను ఆమె పోగొట్టుకొంటుంది. దానికి అత్త ఎంతో ఆవేదన పడుతుంది. అయ్యో రూకను వడ్డికిస్తే మిత్తికూడా వచ్చేది కదా అని చింతిస్తుంది. ఈ పద్యాన్ని చూడండి-

"వెలుపల వడ్డికిచ్చినను వీసము వచ్చుననట్టులాయెనో
బలబలవేగవచ్చు నల బావనికిచ్చిన యట్టులాయెనో
యలయక నాల్గుచట్ల పెరుగమ్మిన చేతికిరాని రూకనీ
వలె నల సంతలోన బడవైచిన వారలగాన సెచ్చటన్" 2. 580

నిరంకుశోపాఖ్యానంలో నూరు మాడలకు ఒక రూకను వడ్డిగా తీసుకొనే విధానం చెప్పబడింది.1

హంసవింశతిలో సంతలు వర్ణించబడ్డాయి. ఆ కాలంలో సంతలు అందంగా అలంకరించుకొని తిరిగే కాపుపడుచులతో ఆకర్షణీయంగా ఉండేవి. కాపు యువతులు సమీప గ్రామాల నుంచి వీటికి వచ్చేవారు. ఈ సంతలు కాపు గుబ్బెతలను ఆకర్షించే మంత్ర విద్యల్లాగా, పయసులో ఉన్న కోమట్లను కట్టి వేసే వల్లెతాళ్ళలాగా, సరుకులమ్మేవ్యాపారులకు లాభాలు కలగించేవిగా ఉన్నట్లు నారాయణామాత్యుడు వర్ణించాడు.

"కలసమీపపుటూళ్ళ కాపుగుబ్బెతలనె
 ష్మదుల నాకర్షింప మంత్రవిద్య
బచ్చుపాయపు వృషభ వ్యూహములనెల్ల
 వఱలంగ గుమి కూర్ప వల్లెత్రాడు
చిల్లర సరుకుల సెట్ల బేరాల కిం
 పుగ లాభమొందింప పూటకాపు

1, నిరంకుశోపాఖ్యానం, 2. 123

పెను కోటకాంద్రకు జన సమూహంబుల
గణితి చూపెడు నాయక ప్రముండు
ముద్రగరిటయ భుజముపై మొనయబెట్టి
ఘంట ఖంగని మ్రోయ సంగళ్ళబడిని
మరగి తిరుగు సళాదికి మణియకాంద్ర
కవని పడికాపు నా వింత నలరుసంత'' 2. 48

ఈ విధంగా మన ప్రాచీన కావ్యాల్లో క్రయవిక్రయాలకు సంబంధించిన అనేక అంశాలు చిత్రించబడ్డాయి.

ప్ర యా ణా లు :

ప్రయాణ సాధనాలు లేని కాలంలో గ్రామీణులు తరుచుగా ఒక చోటి నుంచి మరో చోటికి నడిచి వెళ్ళేవారు. దూర ప్రాంతాలకు వెళ్ళడానికి గుఱ్ఱాలను, బండ్లను కూడా ఉపయోగించే వారు. అప్పుడప్పుడు కాలినడకన బహుదూరం వెళ్ళేవారు.

నడిచి వెళ్లడం వల్ల కలిగే ఆయాసాన్ని తిక్కన విరాట పర్వంలో వర్ణించినాడు. ద్రౌపది పాండవులతోపాటు నడిచి నడిచి అలిసిపోయిన విధానాన్ని కవిబ్రహ్మ కళ్ళకు గట్టినట్లు చిత్రించినాడు.

"దప్పిజనించె వ్రేళుల పుటంబులు పొక్కుదొడంగె గోళ్ళలో
జిప్పిల జొచ్చె నెత్తురులు చిత్తము నాకు కడున్ వశంబుగా
దప్పర మిచ్చటచ్చటను నానల వచ్చితి నెంత దవ్వొకో
నిప్పటి బంగి నొక్కడగు నేగెడుదానికి నోర్వనెమ్మెయిన్" 1. 148

బాగా ప్రయాణం చేసి అలసిపోయిన వారి నోట ఎలాంటి మాటలు వస్తాయో ద్రౌపది నోట కూడా అలాంటి మాటలే వచ్చాయనిపిస్తుంది. ఎక్కువగా నడవడంవల్ల దప్పి కల్గుతుంది. చెప్పులు కూడా ధరించక పోవడంవల్ల అరికాళ్ళ బొబ్బలెక్కి వ్రేళ్ళు పొక్కి పోతాయి. గోళ్ళ నుంచి రక్తం కారుతుంది. శరీరం తూలుతుంది. మనస్సు అదోలా ఉంటుంది. తిరిగినట్లవుతుంది. ఇంత

ఆయాస పడుతూనే 'గమ్యం ఇంకెంతో దూరంలేదు'' అదిగో వచ్చేసింది' అని తోటి వారు చెప్పే మాటలమీద ఆశతో నడుస్తూనే ఉంటారు. తిక్కన ప్రజలు కాలినడకన చేసే ప్రయాణాన్ని బాగా పరిశీలించి ఈ వర్ణన చేసినట్లు కనిపిస్తుంది.

ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశ కావ్యంలో యాదవులు వ్రేపల్లె నుంచి బృందా వనానికి చేసిన ప్రయాణాన్ని సహజ మనోహరంగా చిత్రించినాడు.

ఎక్కడ ప్రకృతి వనరులు పుష్కలంగా ఉన్నాయో అక్కడ ప్రాచీనులు నివాసాలు ఏర్పర్చుకొన్నారు. కఱవు మొదలైనవి సంభవించినప్పుడు ఒక చోటి నుంచి మరో చోటికి వలస వెళ్ళారు. ఎఱ్ఱన వర్ణించిన కఱవును పరిశీలించి నట్లైతే గ్రామ సమృద్ధికి ఉపయోగపడే వస్తుజాలం ఎలాంటిదో అర్థమౌతుంది. ముఖ్యంగా నీళ్ళు, కట్టెలు, గడ్డి సమృద్ధిగా లభించే ప్రాంతంలోనే గ్రామాలు వెలిశాయి. వాటికి లోపం గలిగినప్పుడు మాత్రం గ్రామస్థులు తిండికి కట కట పడేవారు. ఇక పశువులకు కలిగే ఇబ్బందులు ఇన్నన్ని కావు. కఱవు కాటకాలను ఎఱ్ఱన ప్రత్యక్షంగా చూసినాడనిపించే వర్ణన చూడండి.

"ఎరువు తిప్పలుగాని యెల్లమందలుగాను
 జెక్కి మేపుడుచోటు ద్రొక్కువడియె
తరుతోలినఱుక మొదళులు సిక్కంగ జొం
 పము లేది జాడలు వడియె పొదలు
మడువులు పసుల కాల్మడి ప్రుచ్చె దొరుగండి
 ప్రంతలు పెనురొంపి ప్రంతలయ్యె
బూరివంటలు చెడిపోయె రాయిడి క్రంప
 లోనుగా దవ్వులగాని లేదు

పులుగు పూరెడు పోవడి పొలములందు
మెలగి వెదకిన పుట్టదు మెకములడగె
కూరగాయ కట్టియ విల్చి కొనగవలసి
యునికి వ్రేపల్లె పేటి పట్టునకు దొరగె'' పూ. భా. 6-5

కాటకం వచ్చినప్పుడు బలవర్ధకమైన ఆహారం ఎంత కష్టపడ్డా దొరకక పోవడమే కాక పసులు మేసే పచ్చిక మైదానాలు కూడ కాళ్ళ తొక్కిళ్ళకు గుర్తై నిస్సారమౌతాయి. చెట్లను అదేపనిగా నరకడంవల్ల మొదళ్ళు చిక్కిపోయి, పొదలు నశించి కేవలం జాడలు మాత్రమే మిగులుతాయి. నీటి మడుగులు ఎక్కువగా వచ్చే పసుల మూత్రం మొదలైన వాటిచేత కలుషితమై రొంపి రొంపి అవుతాయి. అనావృష్టివల్ల పంటలు పండక పోవడమేకాక గడ్డి కూడా కరువవుతుంది. కంపలు దూరం వరకూ లేకపోవడం, పిట్టలు పడి ఉన్న పొలాన్ని నాశనం చేయడం, మాంస భక్షకులకు మాంసం లభించక పోవడం మొదలైన కష్టాలు కలుగుతాయి. కూరగాయలను సమృద్ధిగా పండించే గ్రామాలే వాటిని ఇతర ప్రాంతాల నుంచి కొనుక్కోవలసి వస్తుంది. ఈ కారణాలవల్ల రేపల్లె ప్రజలు వలస వెళ్ళవలసి వచ్చినట్లు ఎఱ్ఱన తెలిపాడు.

గొల్లవారు రేపల్లె నుంచి బృందావనానికి వలస వెళ్ళిన తీరు అత్యంత సహజంగాను, తెలుగుతనం ఉట్టిపడే విధంగాను ఉంది. ఎఱ్ఱనకు ఒక ఊరి నుంచి మరో ఊరికి వలస వెళ్ళడం బాగా అనుభవంలో ఉన్న విషయమే. వేగి నాడులోని కరాపర్తి నుంచి గుడ్లూరూ అక్కడి నుంచి చెదలవాడ, అక్కడి నుంచి అద్దంకికి అతని కుటుంబం వలస వెళ్ళడం ఈ వర్ణనకు మరింత బలం చేకూర్చినట్లు ఆరుద్ర తెలిపారు.1

"బండ్ల మెట్టింపుపై బరువు లెక్కింపుమీ
దళ్ళను బూన్పు కావళ్ళ నునుపు
పదిలంబుగా నేతిపనటులు క్రొత్తగో
నియల బియ్యము వడ్లు నెమిలివడ్లు
నాదివిరి ప్రాలును నొనరంగ పోసి చా
పలు మంచములు మీద బలియకట్టు
దామెనలునువల్లె త్రాళ్ళును తలుగులు
కవ్వముల్గొడవలి కత్తిసూడు

1. సమగ్రాంధ్ర సాహిత్యం, సంపుటం 3, పు. 136

గొడుపు వాటోళ్ళు మొదలుగా చెడక యుండ
వలయు మల్లెల్ల తెమ్మ కంటలపు లెడ్ల
నాయితము సేయు ముదుసళ్ళనాడువారి
గంపమోపులు ముందర గదలు మనుము'' వూ. భా 6. 22

ప్రయాణానికి మొదలు బండ్లను సిద్ధపరచి, బరువులను ఎక్కించారు. అవి పడిపోకుండా ప్రక్క భాగాల్లో తడకలు కట్టారు. కావళ్ళలో నేతికుండలను పదిలంగా ఉంచారు. క్రొత్త గోనె సంచులలో బియ్యాన్ని, రకరకాల పప్పులనూ, నింపి మూతులు కట్టారు. పడుకొనే చాపలనూ, మంచాలనూ త్రాళ్ళతో బంధించారు. పశువులను బంధించే త్రాళ్ళనూ, తలుగులనూ, కవ్వాలనూ, కొడవళ్లనూ సమకూర్చారు. పసుల రోగాలను పరీక్షించే సాధనాలను బండ్లలోకి చేర్చారు. వృద్ధులనూ, స్త్రీలనూ, గంపలతో బయలుదేరే వాళ్ళనూ మొదలే పంపించారు.

వలసవెళ్ళినప్పుడు సామాన్యంగా ఆకాలంలో ఏయేవస్తువులను బండ్లమీద వేసుకొని వెళ్ళేవారో పై పద్యంలో వర్ణించబడింది. కాలినడకన ప్రయాణం చేసేటప్పుడు ముసలివాళ్ళనూ, స్త్రీలనూ ముందుగా పంపించడం ఈనాటికీ గ్రామాల్లో చూస్తాము.

ఊరువారంతా ఒక్కసారే కదిలేటప్పటికి కోలాహలం తప్పదు. బలం కలిగినవారు ఆవులను తోలుకుని ముందుగా వెళ్ళేవారు. వారివెనుక బండ్లూ, బండ్ల దారినిబట్టి ప్రజలూ వెళ్ళేవారు. ఆ ప్రయాణంలో వయసులో ఉన్న వారు సరసాలాపాలు చేసేవారు, పరిహాసాలు చేసుకొనేవారు. ఆకారణంగా ప్రయాణంవల్ల కలిగే అలసట కొంతవరకు తీరేది. ప్రయాణించే వారిలో కుంటి, గుడ్డి, ముసలివారిని నడిపించడానికి కూడా కొందరు తోడుగా ఉండే వారు.

"అని మఱియు పెక్కు భంగుల యెలుంగుల నొక్క కోలాహలం బెసంగ మందయంతయు నొక్కపెట్ట కదలి లావు మానుసులు కదుపులం గొని ముందఱంబోవ పిఱుంద బండ్లను బండ్లజాడం దక్కిన ప్రజయును నడువం దరుణ తరుణీ జనంబు లొండొరులతోడి మేలంపుటాలాపంబులం

ప్రమోదకరంబులగు వినోదంబుల నదటుమీఱి కడచి చనంబంగ్వంధ జరఠ ప్రముఖులగ్రుసిస్ని యోలాకుపడ నెడనెడంగాపలియై తగువారు నడపింప నవ్విధంబునంజని బృందావనంబు ప్రవేశించి యుచిత ప్రదేశంబులు నివేశంబులుగా నిరూపించి గోపాల ముఖ్యులు నిలువనాకుణంబ" పూ.భా. 6.23.

ఆయా వస్తువులను బండ్లలో వేయడం, నేతికుండలను కావళ్ళలో భద్రపరచడం గ్రామీణుల ముందు జాగ్రత్తను తెలుపుతున్నాయి.

గ్రామాంతరం వెళ్ళేటప్పుడు ఆహార పదార్థాలను దారిబత్తెంగా తీసుకొని పోవడం గ్రామీణుల ఆచారం. విష్ణుచిత్తుడు మధురకువెళ్ళే సందర్భంలో అతని భార్య కట్టిన దారిబత్తెం పరిశీలిస్తే ఆకాలంలో సామాన్యంగా ప్రజలు ప్రయాణంలో తోడుగా తీసుకొనివెళ్ళే ఆహార పదార్థాలెలాంటివో తెలుస్తాయి. గుఱ్ఱాలమీద సంచులు వేసుకొని, కావళ్ళలో అతిరసాలు భద్రపర్చుకొని ప్రయాణించే విధానాన్ని రాయలు వర్ణించినాడు.[1] విష్ణుచిత్తుని దారిబత్తాన్ని రాయలు ఈ క్రింది పద్యంలో వర్ణించిన తీరు చూడండి—

"భక్తి త్రోవకు సాధ్వి పరికరంబులు వెట్టి
కట్టిన పొరివిళంగాయగములు
నెసటిపోతలుగాగ నేర్చి నించినచిరం
తనపు శాలిక్షేమ తండులములు
వడిబెట్టి లోజీరగుడము సాబాలూస్ప
జెలగు సంచారంపు చింతపండు
పెల్లులో హండికావళ్ళ కొమ్ముల వ్రేలు
గిడ్డి మొత్తము నేతిలడ్డిగలును

పెరుగువడియంబులును పచ్చివరుగుబేడ
లురుతరాచ్యుత పూజోపకరణపేటి
కలును జాత్తిన చాత్తని కులము బలిసి
విధి నిషేధము లెఱిగి తామథురకరిగె" 2.98

1. ఆముక్తమాల్యద, 2.97.

అదారిబత్తెంలో వేపుడు బియ్యం పిండిని బెల్లం పాకంలో కలిపితయారు చేసిన ఉండలు, రాళ్ళులేని బియ్యం, జీలకట్టు, బెల్లం, చింతపండు, నేతిలడ్డిగలు (వీటిని కావళ్ళ కొనలకు వ్రేలాడ దీసేవారు) పెరుగు వడియాలు, వేయింపని వరుగులు, పూజాద్రవ్యాలు మొదలైనవి ఉన్నట్లు వర్ణింపబడింది. ఆకాలంలో ప్రజలు సాధారణంగా దారి బత్తెంలో తీసుకొనివెళ్ళే పదార్థాలే ఇవి.

ఇట్లే హంసవింశతిలో నారాయణామాత్యుడు విష్ణుదాసుని పరదేశ ప్రయాణ సన్నాహాన్ని దీర్ఘమైన వచనంలో - వర్ణించినాడు. ఆకాలంలో దూరప్రయాణం చేసే ప్రజలు తమ వెంట తీసుకొనిపోయే వస్తుజాలాన్ని, ఆహార పదార్థాలనూ రమణీయంగా చిత్రించినాడు. పటకుటీరపాత్ర సామగ్రిని గుఱ్ఱాలు, బండ్లు, ఎడ్లు, ఒంటెలు మొదలైన వాటిమీద తీసుకొని వెళ్ళేవారు.[1] అంతేకాక కావళ్ళలోనూ అనేక పదార్థాలను భద్రపర్చుకొని తీసుకొని వెళ్ళే వారు. వాటిలో పులిహోర, జున్ను, పెరుగు, నెయ్యి, వరుగులు, వడియాలు, మిరియపు పొడి, చింతపండు, ఉసిరిక, పచ్చళ్ళు, ఊరగాయలు, మామిడి తొక్కులు, గుగ్గిళ్ళు, అటుకులు, పేలాలు, నువ్వులు, దోసగింజలు, పప్పులు. కుడుములు, దోసెలు, అరిసెలు, రొట్టెలు, చక్కిలాలు, గారెలు, బూరెలు, పేణీలు, పూరీలు మొదలైనవి ఉన్నాయి.[2] ఇవన్నీ ఈనాడు మనకు తెలిసి నట్టివే.

ఈ విధంగా ఆయా కావ్యాల్లో ప్రయాణ విశేషాలు వర్ణింపబడ్డాయి ప్రయాణం చేసేటప్పుడు ముఖ్యంగా ప్రజలు వెంట తీసుకొనివెళ్ళే వస్తువులు, ఆహార పదార్థాలు పేర్కొనబడ్డాయి.

ఆ హా ర పా నీ యా లు :

మానవుని మనుగడకు ఆహార పానీయాలు అత్యంతావశ్యకమైనవి. బసవపురాణంలో అనేక రకాలైన ఆహార పదార్థాలు పేర్కొనబడ్డాయి. వాటిలో అంబలి, ఒడిపిలిపాసెం, పులగం మొదలైనవి ఉన్నాయి. అంబలిని ఆకాలంలో అంబకళం అని పిలిచేవారు.

---

1. హంసవింశతి, 1.104. 2. అదే, 1.105.

"కామింపగా కరికాళవ్వ యింట
మామిడి పండులు మఱుగున నమలి
పోయి చెన్నయ యింటి పులియంబకళము
చేయి తీయక జుఱ్ఱి చిఱుతొండనంబి" ఆ. 3, పు. 69.

అంబలిని చేయి తీయకుండా మళ్ళీమళ్ళీ జుర్రే ప్రజలు ఎక్కువగా ఆ కాలంలో ఉన్నారు.

మోళిగ మారయ్య కథలోను అంబలి ప్రస్తావించబడింది.

"బసవమారని యట్టి భక్తులు గలరె
వసుధలో నీయింటి రసరసాయనము
లతనినగరిగాంచు నంబకళంబు
ప్రతివచ్చునే యెన్ని భంగులనైన" ఆ. 5, పు. 152.

అంబలిని కన్నడంలో అంబకళం అని పిలుస్తారు. జానపదులు అన్నింటి కంటెను అంబలిని రుచికరమైందిగా భావిస్తారు. పండితారాధ్య చరిత్రలోనూ 'అంబలి' యొక్క ప్రస్తావన వచ్చింది.

"చిక్కితిగాక మాచేత నీవింక
నెక్కడ బోయెద విట్లు బోడలకు
పోడిగానంబలి పోసిన ఫలము
నేడుగదా నీకు నిండార బండె" దీక్షాప్రకరణం, పు. 41.

బోడలంటే సన్యాసులు. సన్యాసులకు అంబలి పోస్తే పుణ్యం. బసవపురాణంలో ఒడిసిలిపాసెం పేర్కొనబడింది. పండబారి పచ్చిగా ఉన్న ధాన్యాన్ని దంచి, ఆ బియ్యంతో వండిన పదార్థమే ఒడిపిలి పాయసం అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వివరించినారు.[1]

"అడవుల మనుబిళ్ళ కడుమంచిపాలు
నొడిపిలి పాసెంబు నుడుపనేతులును

1. బసవపురాణం పీఠిక, 118.

నిప్పపూవుసు తేనె లెల్లఫలాదు
లొప్పెడు వెదురు ప్రాలోగిరంబులును" ఆ. 3, పు. 80.

ఇందు పేర్కొనబడ్డ ఆహార పానీయాలు బోయవారివి. ఒడిపిలిపాసెం, ఇప్పపూలతో చేసిన సారాయి, వెదురు బియ్యంతో వండిన అన్నం తన ఊరుకువస్తే పెడతానని కన్నప్ప శివున్ని కోరే సందర్భంలోని పద్యమది.

బసవపురాణంలో 'పులగం' పేర్కొనబడింది. నందీశ్వరుని నోము నోచుకొనేవారు పులగం తయారుచేసి ఆరగింపు చేసేవారు.

"అక్షయ ధూపదీపాదు లొనర్చి
యక్షణంబున పంచభక్ష్యముల్ కుడిపి
పులగంబు ముందట ప్రోవగాపోసి
పులకండమును నెయ్యి గలిపి అర్పించి" ఆ. 1, పు. 14.

పప్పు చేర్చి వండిన అన్నం పులగం. ఇది రుచికరమైన ఆహారం. భారతం శాంతిపర్వంలోనూ ఇది పేర్కొనబడింది.

''పులగము పాయసమట్టులు పలలము నర్చనకుగాక పక్వములైనన్
కలుగు నభోజ్యత్వము విచ్చలవిడి వంటకముచేసి చనదు భుజింపన్''
1.324.

ఆధునిక కాలంలో పులగం వండే సంప్రదాయం ఉంది. నువ్వులు, బెల్లం, బియ్యం కలిపి పులగం వండుతారు. దీన్ని దేవునికి అర్పించకుండా ఎవరూ భుజించరు. ఈ పులగాన్ని ముఖ్యంగా ప్రజలు సంక్రాంతి, రథ సప్తమివంటి పండుగులకు వండుకొంటారు. సంక్రాంతి చలికాలంలో వచ్చే పండుగ. నువ్వులు శరీరానికి వేడిని కలిగిస్తాయి. కాబట్టి, వాటిని పులగంలో వేసి వండుకొంటారు.

ఎఱ్ఱన హరివంశంలో పాయసాన్ని పేర్కొన్నాడు పాలు, పటికబెల్లం, వెన్న మొదలైన వాటిని కలిపి ఆ కాలంలో పాయసం తయారు చేసేవారు.

"కలయగ పాలుపిండి పులకండము వెన్నయు బెట్టి యట్టిలై
యలవడ వండితిన్...." పూ. భా, 5-224.

క్రీడాభిరామంలో సామాన్య ప్రజలు భుజించే ఆహార పదార్థాలు పేర్కొన బడ్డాయి. చలికాలంలో కొఱ్ఱన్నం తినేవారు. అన్నంలో ఆవకూర కలుపుకొని నేతితోను, పెరుగుతోను భోంచేసేవారు.

"శీతకాలంబు కడిమాడ సేయ కుడుచు
భాగ్యవంతుడు జేపాడి పల్లెపట్ల
క్రొత్త యోరెంబు నిగురావకూరతోడ
పిచ్ఛిలంబైన నేతితో పెరుగుతోడ" —ప. 56

ఈ పద్యానికి మూలమైన శ్లోకం 'వృత్తరత్నాకరం' వ్యాఖ్యలో కనిపిస్తుంది.

"తరుణం సర్షపశాకం నవౌదనం పిచ్ఛిలానిచ దధీని
స్వల్పవ్యయేన సుందరి గ్రామ్యజనో మృష్టమశ్నాతి"

లేతనైన ఆవచిగురు కూరనే సర్షపశాకం అంటారు. ఈ కూర నెక్కువగా ఔత్తరాహులు తింటారు.

క్రీడాభిరామంలో సత్రాలేకాక పూటకూళ్ళ ఇండ్లు పేర్కొనబడ్డాయి. లక్ష్మణ వజ్ఝలవారి ఇంట్లో ఒక్క రూకకే మేలిరకం వరి అన్నం, గోధుమ పిండితో చేసిన పదార్థం, గుప్పెడు చక్కెర, నెయ్యి, పెసరపప్పు, అరటి పండ్లు, నాలుగు కూరలు, పచ్చళ్ళు, పాత్రనిండా పెరుగూ లభించేవి.

"కప్పురభోగి వంటకము కమ్మని గోధుమ పిండి వంటయున్
గుప్పెడు పంచదారయును క్రొత్తగ కాచిన యాలనేపెస
ర్పప్పును కొమ్మునల్లనటిపండ్లును నాలుగునైదు నంజులున్
లప్పలతోడ క్రొంబెరుగు లక్ష్మణ వజ్ఝల ఇంట రూకకున్" ప. 166

దీన్నిబట్టి ఆ కాలంలోని ప్రజలకు భోజన పదార్థాలపైగల మక్కువ ఏ పాటిదో తెలుస్తుంది. పాయసం, అన్నం, పచ్చళ్ళు, పిండివంటలు శివునికి ఆర గింపుచేసే ఆచారం పల్నాటి వీరచరిత్రలో పేర్కొనబడింది.

"పంచామృతమ్ములు పాయసాన్నములు
పేరైన పచ్చళ్ల పిండివంటలును" పు 15

పల్నాటి సీమలోని ప్రజలు ఎక్కువగా జొన్నలతో చేసిన ఆహార పానీయాలు స్వీకరించేవారని శ్రీనాథుని చాటువులనుబట్టి తెలుస్తున్నది.

"జొన్నకలి జొన్నయంబలి జొన్నన్నము జొన్నపిసరు జొన్నలెతప్పన్
సన్నన్నము సున్నసుమీ పన్నుగ పల్నాటి సీమ ప్రజలందరకున్"
(చాటువు)

పల్నాటి ప్రజలు చింతచిగురు, బచ్చలాకు కలిపి వండిన కూరతో జొన్నన్నం తినేవారు.

"ఫుల్ల సరోజనేత్ర: అలపూతన చన్నుల చేదుద్రావినా
డల్లదవాగ్ని బ్రమింగితినటంచును నిక్కెదవేల? తింత్రిణీ
పల్లవ యుక్తమౌనుడుకు బచ్చలి శాకము జొన్నకూటితో
మెల్లన యొక్కముద్ద దిగద్రమింగుమ! నీ పస కాననయ్యెడిన్" (చాటువు)

పలనాటిలో రేగడి భూమి ఎక్కువగా ఉంటుంది. అక్కడి ప్రజలు మెట్ట పొలాల్లో ఎక్కువగా జొన్నలు పండించి ఆహారంగా స్వీకరిస్తారు.

నగరవాసులు పల్లెలనుంచి చిరుదిండ్లు తెప్పించుకొనే ఆచారం హర విలాసంలో వర్ణించబడింది. చిరుతొండనంబి బావమరదులు సిరియాళునికి చిరుదిండ్లు తెప్పించినారు.

"పల్లియ చోటనుండి యెలపాసెము నడ్కులు చక్కిలంబులున్
బెల్లపుటచ్చులున్ సెనగబేడలు చిమ్మిల నువ్వుటుండలున్

పెల్లుగ నంబి వియ్యములు పెద్దఱికంబు ప్రియంబునొప్ప
మేనల్లునకున్ కుమారసిరియాళునకున్ కొనితెచ్చి రర్మిలిన్"  2. 91

ఇందులో పేర్కొనబడ్డ పాసెం, అటుకులు, సకిలాలు, అచ్చుబోసిన బెల్లం, సెనగపప్పు, బెల్లం తెల్లనువ్వులు కలిపి చేసిన లడ్డూలు మొదలైనవి పిల్లలకు ఎంతో ఇష్టమైనవి. పెద్దలు తమ పెద్దరికం నిల్పుకోవాలంటే పిల్లలకు ఇష్టమైన చిరుదిండ్లు పెట్టాలన్నదే ఈ పద్యంలోని ధ్వని. కుమారుడైన సిరియాళుని కోసం పల్లెనుంచి చిరుదిండ్లను తెప్పించడం పల్లెల్లో వాటికిగల ప్రత్యేకత ఏమిటో తెలుస్తుంది. పట్నవాసుల అభిరుచుల కనుగుణంగా పల్లెవాసులు ఆహార పదార్థాలతో పాటు చిరుదిండ్లను కూడా ఎగుమతి చేస్తూ ఉంటారని భావించవచ్చు. ఆవపచ్చళ్ళు కలుపుకొని పుల్లపెరుగుతో భోజనం చేయడం తెలుగువారికి అలవాటు. ఆవగల్పిన పెరుగన్నం తింటుంటే కారం నసాళాని కెక్కడం చాలా మందికి అనుభవమే. శ్రీనాథుడు శృంగార నైషధంలో తెలుగువారికి ఇష్టమైన భోజనాన్ని ఇలా వర్ణించినాడు.

''మిసిమిగల పుల్లపెరుగుతో మిళితములుగ
ఆవపచ్చళ్ళు చవిచూచిరాదరమున
జుఱ్ఱుమని మూర్ధములుదాకి యెజ్జదనము
పొగలు వెడలంగ నాసికాపుటములందు"  6. 130

ఈ కావ్యంలో కవిసార్వభౌముడు అంబలిని కూడా పేర్కొన్నాడు.

"పానకంబులతోడ తిమ్మనంబులతోడ దధిపిండ ఖండంబులతోడ మీగడలతోడ మజ్జిగలతోడ నూరుగాయలతోడ నంబకళంబులతోడ రసావళులతోడంగూడ''1

శ్రీనాథుడు స్వయంగా అంబలి గ్రోలినాడనడానికి అతని చాటుపద్యమే సాక్ష్యం.

1. శృంగార నైషధం, 7-185

"కుల్లాయుంచితి కోకగట్టితి మహాకూర్పాసముందాల్చితిన్
వెల్లుల్లిం దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వాస్త వడ్డింపగా
చల్లాయంబలిఁగ్రోలితిన్ రుచులు దోసంబంచుబోనాడితిన్
తల్లీ కన్నడరాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుడన్" (చాటువు)

చల్లను కల్పుకొని అంబలి త్రాగినాడన్న విశేషార్థం కూడ ఇక్కడ స్ఫురిస్తుంది. గ్రామీణులు సంకటిలోను, అంబలిలోను చల్లను కల్పుకొని జుర్రడం మామూలే. కొందరు ఆహారం వడ్డిస్తే భుజించడానికి వెనుకాడేవారు కూడా ఉన్నారు. విధవరాలు వెల్లుల్లినీ, నువ్వులపిండినీ వడ్డించినందుకు శ్రీనాథుడు ఎంతో బాధపడినాడు. అలా బాధపడడం అనేది వారివారి మనస్తత్వాలనుబట్టి ఉంటుంది.

తాటిపండు పల్లీయులకు అమృతంతో సమానం. శ్రీనాథుడు కాశీ ఖండంలో దీని ప్రస్తావన తెచ్చినాడు. ఆస్వాదకున్ని భైరవునితోను, తాటి పండును బ్రహ్మాండంతోను పోల్చినాడు.

"హస్తములు రెంట నందంద యదిమిపట్టి
తాటిపండారగించెడు తమకమునను
నవ్యయంబైన బ్రహ్మాండ మాస్వదించు
భైరవుండిచ్చుగాత శోభనము మనకు" 5.81.

తాటిపండును రెండు చేతులమధ్య అదిమిపట్టి దానిలోని రసాన్ని జుర్రే గ్రామీణులు ఈనాటికీ ఉన్నారు. పసులకాపరులు గ్రామాల్లో తాటివనాల్లో తిరుగుతూ చెట్లెక్కి తాటి పండ్లను రాలుస్తారు. ఆ తరువాత వాటిని కాల్చి ఆహారంగా ఉపయోగించుకొంటారు.

భీమఖండంలో శ్రీనాథుడు పీఠికాపుర వర్ణనచేస్తూ ఆకాలంలో లభించే కూరగాయలను విశేషంగా పేర్కొన్నాడు.[1] వీటితోపాటు కవిసార్వభౌముడు దాక్షారామంలోని సస్యసంపదను విపులంగా వర్ణించినాడు.[2] వీటిని చూచినట్లైతే ఆకాలంనాటి ప్రజల ఆహార పదార్థాలు తెలుస్తాయి.

---

1. భీమఖండం, 2.56. 2. అదే, 3.57.

తాళ్ళపాక తిమ్మక్క ఆనాటి ప్రజలు జాతరలకు వెళ్ళే సందర్భంలో వెంట తీసుకొనిపోయే ఆహార పదార్థాలను చక్కగా వర్ణించింది.

"పప్పుబూరెలు నెయ్యి పాయసాన్నములు
కాయగూరలు పెక్కు కలవంటకాలు
ఊరుగాయలు నెయ్యి ఒబ్బట్లు వడలు
గారెలు బూరెలు కండ మండిగెలు
అరటిపండులును రాజాన్న రాసులును
పిండికూరలు మొదల్ పెద్ద కుడుములును" పు. 37.

ఈ కుడుములు రొట్టెలకంటె మందంగా ఉంటాయి. తెలంగాణా ప్రాంతంలో సంక్రాంతి తరువాత వచ్చే కోరల పున్నానికి కుడుములు వండుకొనే ఆచారం ఉంది. వీటిని బియ్యం పిండితోగాని, సజ్జ పిండితోగాని తయారు చేస్తారు. కుండలోపెట్టి ఆవిరితోనే ఉడికిస్తారు. రుచిగా ఉండాలని బొబ్బర్లు పిండిలో కలుపుతారు.

తాళ్ళపాక తిరువేంగళనాథుడు తన పరమయోగి విలాసంలో ఆనాటి ప్రజలకిష్టమైన చల్దినీ, ఊరగాయ పచ్చళ్ళనూ పేర్కొన్నాడు. చల్దిని అమృతంగా భావించినాడు.

"అమృతమయంబైన యట్టి యా చలిది
పరికరముల పెనుపడు నూరుగాయ" 7-510

తిరువేంగళనాథుడు అంబలిని ప్రస్తావించినాడు. బియ్యం, జొన్నలు, సజ్జలు మొదలైనవాటి పిండితో పలుచగా కాచి చేసిన ఆహారమే అంబలి. అంబలి అంటే గ్రామీణులకు అమృతం. ఇది బాగా పనిచేసి అలిసిపోయిన రైతులకు బలకరమైన ఆహారం. సామాన్యంగా దీన్ని మధ్యాహ్నం సేవిస్తారు. అందుకే ఆ సమయాన్ని గ్రామీణులు 'అంబటి ప్రొద్దు' 'అంబటాల' అని పిలుస్తారు. గ్రామీణుల దృష్టిలో మధ్యాహ్నం అంటే 'అంబటాల'. అంబలి త్రాగే వేళ 'అంబటాల' అయింది.

సింహాసన ద్వాత్రింశికలో గర్భిణీ స్త్రీలకు పులుపు ఇష్టమనే విషయం ప్రస్తావించబడింది.

"కొమ్మకు పులుసింపయ్యెను కమ్మని మన్నంతకంటె కడుచవికెక్కెన్
తమ్మి మొనమొగ్గలెక్కిన తుమ్మెదలన చన్నుదోయి తుదకప్పారెన్"
3.30

వారు బియ్యంలోని మట్టి పెల్లలు తినడం కూడ సహజమే.

పులుసు గురించి వ్రాసిన గోపరాజు చింత చెట్టును గూర్చి వ్రాయకుండా ఉంటాడా? అతడు చింతచెట్లను గూర్చి చేసిన వర్ణన బహు సుందరమైంది. కవులు సాధారణంగా రసాలాన్ని వర్ణిస్తే గోపరాజు చింతచెట్లను వర్ణించినాడు.

"చింతమదిలేక మనుజులు చింతించిన కొలది చవులు చేకూర్చుచు ని
శ్చింతుల నొనరించెడి ఆచింతకు సరిగలదె లోకచింతామణికిన్" 3.155

చింతామణి లాగా చింతచెట్టు సామాన్య జనుల కోరికలు తీరుస్తుంది కాబట్టి, దాన్ని లోక చింతామణి అని కవి ప్రశంసించినాడు. దేవతలు సైతం ఆ చెట్టుకోసం చింతించిన కారణంగా దానికి చింత అనే పేరు వచ్చినట్లు కవి చమత్కరించినాడు.[1] గ్రామీణులు చింత చిగురును కూరగా, పండును పులుసుగా, కాయను పచ్చడిగా, చిగురాకును చారుగా చేసుకొంటారు. కాబట్టి ఇంతగా ఉపయోగపడే చెట్టే మరొకటిలేదని కవి వర్ణించినాడు.

"మునుచిగురున పువ్వున నోమనగాయలు దోరపండ్లు మఱియారగ పం
డిన పండ్ల నెల్లకాలము తనియగ చవులొసగ నొండు తరువులు గలవే"
3.158.

చింతగొడిసెలను కవి చంద్రకళలతో పోల్చిన తీరు అద్భుతం.

1. సింహాసనద్వాత్రింశిక, 3.157.

''ఉడుపతి తనలో నమృతము కడలుకొనియు పెక్కు చవులుగానకకృశుడై
విడిచిన కళలన్నియు నీ గొడిసెల రూపమున చింత గొలువగ బోలున్''
3-159.

షడ్రసాలతో పులుపు కూడ ఒకటి. చింతపండును గురించి ఇంతగా వర్ణించ డానికి కారణం ఉంది. చింతపండులేని ఇల్లు తెలుగుదేశంలో లేదనే చెప్పాలి. ఆపూట ఏ కూర లేకున్నా కనీసం పచ్చిపులుసైనా చేసుకొని దానితో సాపాటు ముగించుకొనే గ్రామీణులు ఎందరో ఉన్నారు. పచ్చిపులుసు సజీవ ఆహార పదార్థం! దానిలో ఏ పదార్థాన్నీ కలపకున్నా, అది ఆస్వాదయోగ్యమే. చింత పండు ప్రాశస్త్యాన్ని మరొకరు ఇంతకంటె మనోహరంగా చెప్పలేరనిపించే గోపరాజు పద్యాన్ని చూడండి.

''గరితిలేని యిల్లు దొరలేని తగవును
చింతపండులేని వింత చవియు
చనువులేని కొలువు శశిలేని రాత్రియు
ముక్కులేని మొగము నొక్కరూపు'' 3-161.

ఉగాది పచ్చడి రుచి తెలిసిన వారికి చింతపండును గూర్చి చెప్పవలసిన పనిలేదు.

గోపరాజు అంబలిని పేర్కొన్నాడు. పనిచేసి అలసిపోయిన గ్రామీ ణులు గంజితోపాటు అంబలిని త్రాగి చల్లగా ఎక్కడో ఒకచోట చెట్టునీడ మేనువాల్చి వెన్నెల గుడిపాటను పాడుతారని తెలిపినాడు.

''....పనిజేసి గంజియైనను నంబలైనను
నెదచల్లగా త్రాగి యెచటనైన
పడియుండి వెన్నెల గుడిపాట పాటగా
పేదలకాత్మ సంప్రీతి గలుగు....'' 9.15.

పేదప్రజలపాలిటి గంజి, అంబలి అమృతం వంటివి. కఱవుకాలంలోనూ గ్రామీణులను బ్రతికించేవి ఇవే.

శ్రీకృష్ణదేవరాయలు ఆముక్త మాల్యదలో తెల్లని అన్నంతోపాటు తియ్యని చారులు, మజ్జిగ, పులుసు, పలుచని అంబళ్లు, లేత టెంకాయ నీళ్లు, భక్ష్యాలు, ఊరవేసిన లేత మామిడి పిందెలు, నీరుమజ్జిగ మొదలైన ఆహార పానీయాలను పేర్కొన్నాడు. వీటిని ఆనాటి ప్రజలు సామాన్యంగా తమ భోజనంలో ఉపయోగించేవారు.

''తెలినులి వెచ్చయోగిరము తియ్యని చారులు తిమ్మనంబులున్
పలుచని యంబళుల్చోలుకు పాలెడనీళ్ళ రసావళుల్పలం
బులును సుగంధశీతజలముల్ వడపిందెలు నీరు చల్లయున్
వెలయగ బెట్టు భోజనము వేసవి చందన చర్చ మున్నుగన్'' 1-81

ఇది వేసవికాల భోజనంకాగా, ఇంక శీతాకాల భోజనాన్ని ఆంధ్ర భోజుడు వర్ణించిన విధానాన్ని చూడండి.

''పునుగుందావి సహోదసంబు మిరియంపుంబొళ్ళతో చట్టిచు
య్యను నాదాఅని కూర గుంపుముకు మందై యేర్చునావంజిగు
ర్కొను పచ్చళ్ళను పాయసాన్నములు నూరుంగాయలున్ చేసుబు
క్కను నేయుంజీబుపాలు వెల్లువగ నాహారంబిడున్శీతునన్'' 1- 82

మిరియాలపొడితో తిరుగబోసినప్పుడు కలిగే చప్పుడుతో వసంతైన కూరలు, ఆవపచ్చళ్ళు, పాయసాన్నాలు, ఊరగాయలు, చేయి చురుక్కుమనే విధంగా వేడి చేసిన నెయ్యి, మొదలైనవి శీతాకాల భోజనంలో ఉండేవి.

వేసవి భోజనాన్ని కృష్ణదేవరాయలు మరొకచోట వర్ణించినాడు. ఎండ కాలంలో చేపలెక్కువగా లభిస్తాయి. మామిడికాయలు సహజంగా కాస్తాయి. చేపలు, మామిడిముక్కలు కలిపి చేసిన వంటకం చాలా రుచిగా ఉంటుంది. కొంచెం ఎక్కువే తింటారు. అది జీర్ణం అయ్యేటప్పుడు తేపులు వస్తాయి. ఆ తేపులవల్ల వచ్చే కనరు పోవడానికి, శరీరం వేడి తగ్గడానికి సాయంకాలాల్లో - ఉదయం ఇసుకలో పూడ్చితీసిన టెంకాయ నీళ్ళు త్రాగేవారు. ఆ కాలంలో అన్ని రకాల ప్రజలు ఈ రకమైన ఆహార పానీయాలు స్వీకరించేవారని తెలుస్తున్నది.

''తారుణ్యాతిగ చూతనూత్న ఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారాధూపిత శుష్యదంబు హృతమాత్స్యచ్ఛేద పాకోద్గతో
ద్గారంపుంగనరార్చు భోగులకు సంధ్యావేళలంగేళికాం
తా రాభ్యంతర వాలుకాస్థిత హిమాంతర్నారికేళాంబువుల్'' 2-69

ఆయా ఋతువుల్లో ఆయా పదార్థాలను ప్రజలు భుజించేవారని రాయలు వర్ణించినాడు. వేసవిలో చల్లని ఆహారపదార్థాలను స్వీకరించినట్లే, చలికాలంలోను, వానకాలంలోను శరీరానికి వేడినిచ్చే ఆహార పదార్థాలను తీసుకోవడం మానవ సహజమైన లక్షణం. రాయలు పొలాలకు వెళ్ళే కాపుకుమారుల యొక్క వర్షఋతు భోజనాన్ని రమ్యంగా వర్ణించినాడు. వర్షాకాలంలో శరీరానికి వేడినిచ్చే కురకటం, చెంచలి, ద్రోణం, తంటెకూర, చింతచిగురు మొదలైన వాటిని నూనెలో వేయించి ఆ నాటి ప్రజలు తినేవారు.

''గురుగుంజెంచలి తుమ్మిలేతగిరిసాకుం తింత్రిణీ పల్లవో
త్కరముంగూడ పొరంటి నూనియలతో కట్టావి కుట్టారుకో
గిరములెక్కి తమింగొమల్పొలము వో క్రేపులెయుల్లాకమే
కెరువుం గుంపటి మంచమెక్కరి ప్రభుత్త్వైకాప్తి రెడ్లజ్జడిన్'' 4-134

చింతచిగురు ముఖ్యంగా గ్రామీణుల శాకమే. సింహాసనద్వాత్రింశికలోను, ఆముక్తమాల్యదలోను దీని ప్రస్తావన విశేషంగా ఉండడాన్ని బట్టి ఇది ప్రజలకు అత్యంత ప్రియమైన ఆహార పదార్థం అని తెలుస్తున్నదీ. తెలంగాణాలో చింతచిగురు తినని గ్రామీణులుండరు.

రాయలు వేసవిలో తీసుకొనే ఆహార పదార్థాల్లో నీరు చల్లను పేర్కొన్నాడు. నీరు చల్లే నీరు మజ్జిగ. తెలుగు వారికి నీరుమజ్జిగ అంటే ప్రాణం. ఇది తాపాన్ని ఉపశమింపజేసే దివ్యౌషధం. నీరు మజ్జిగను గూర్చి ఒక చాటువు.

''గొప్పైన నిమ్మపండ్లును కప్పురమును సొంటిపొడియు కఱివేపాకున్
ఉప్పును నేలకులింగువ నొప్పగ నీ చల్లరుచికి నొనగూర్పదగున్" (చాటువు)

కళాపూర్ణోదయంలో పింగళి సూరన తనకాలంనాటి ఆహార పదార్థాలను వర్ణించినాడు.

"కలవంటకములు బూరెలు తేనెతొలలుచా
పట్లు మండెంగ లొబ్బట్లు వడలు
కుడుములు సుకియలు కడియంపుటట్లువె
న్నప్పాలు వడియంబు లప్పడాలు
పొంగరంబులు సొజ్జె బూరె తాగులు సేవె
లుక్కెర లరిసెలు చక్కిలములు
ఖర్జూర గోస్తనీ కదళికా సహకార
ఫలములు కొబ్బెర పనసతొనలు

తేనియలుజున్ను మీగడలానవాలు
పానకములు రసావళ్ళు పచ్చడులును
నాజ్యమొలుపు పప్పులు కూరలనుపమాన్న
మపుడు ప్రజనెల్ల తనియించె నహరహంబు'' 7-82

బూరెలు, కుడుములు, అట్లు. అప్పడాలు, సేవెలు, పిండివంటలు, సొజ్జె భక్ష్యాలు, అరిసెలు, బియ్యంపిండితో చేసే సకిలాలు, పచ్చళ్ళు, పప్పుకూరలు మొదలైనవాటిని అన్నిరకాల ప్రజలు ఆ కాలంలో తయారు చేసుకొనేవారని తెలుస్తున్నది. శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో దూర్జటి ఆటవికుల జీవితాన్ని సహజమనోహరంగా చిత్రించినాడు. చెంచువారి ఆహారపు అలవాట్లను కూడా రమణీయంగా వర్ణించినాడు. గ్రామాల్లో ఆడపిల్లలకు చిన్నతనంలోనే వంటలు నేర్పుతారు. అత్తవారింట్లో మాటలు పడకుండా ఉండడానికి ముందుగానే తల్లులు తమ కూతుళ్ళకు వంటా వార్పులో చక్కని శిక్షణ ఇస్తారు. తిన్నని అక్కలు కమ్మని ఆహారపదార్థాలను వండడంలో సిద్ధహస్తులు. ముఖ్యంగా మాంసం వండడంలో నేర్పరులు.

"కొండల కానలందిరిగి క్రొవ్వినపందుల లేళ్ళదుప్పులన్
చెండిన పెక్కుచందముల చిన్నక పెద్దక గారు కమ్మగా
వండుదురట్ల పిట్టలును వండుదురిచ్చట నుండనేల నా
కొండొకటానతీక యుడుమూరికి రాగదవయ్య! లింగమా!'' 3-66

వేట ప్రధానవృత్తిగా కలిగిన చెంచులు సాధారణంగా మాంసాహారులు. పంది, లేడి, దుప్పి మొదలైన జంతువుల మాంసాన్నే కాక పిట్టల మాంసాన్ని

కూడా ఆటవికులు ఆహారంగా ఉపయోగించుకొంటారు. ధూర్జటి పాయసాన్ని, తయారు చేయడానికి ఉపయోగించే పదార్థాలను పేర్కొన్నాడు.

> "ఓ లింగమ విను నివ్వరి ప్రాలును, నాడిపిశ్య కునుకుప్రాలును వెదురుం
> బ్రాలును సవరపు మెకముల పాలును గలవచట నీకు పాయసమునకున్"
>
> 3.67

పాయసాన్ని అన్ని రకాల ప్రజలు త్రాగేవారని ఆకాలంలోని గ్రంథాలవల్ల తెలుస్తున్నది. రాయలు పాయసాన్ని పేదల ఆహారంగా పేర్కొనడం గమనించదగిన విషయం. గోదాదేవి కృష్ణుని గూర్చి పలికే సందర్భంలో పాసెం ప్రస్తావించబడింది.

> "విడువక మీగానము సొగసిడుటయు మఱి పాడుటనుట యెగ్గే? పాసెం
> బడిగిన వారే పేదలె? కొడిమెలు గట్టకుడి యతనిగొని పని యేలా"?
>
> 5 - 58

ఎవరైనా పాటను మధురంగా పాడినప్పుడు ఇంకా పాడమని అర్థించటం తప్పు కాదనే విషయాన్ని పాసెం వేడినవారు పేదవాళ్ళలా అవుతారనే మాటతో కవి సమర్థించాడు.

ధూర్జటి నత్కీరుని కథలో కఱవును వర్ణించినాడు. కఱవులో ప్రజలకు లభ్యమయ్యే ఆహార పదార్థాలు తెల్పినాడు.

> ''గునుకు లూదర్లు బరపటల్ గోళ్ళ గొండు
> లల్లిబియ్యంబు వెదురు బియ్యంబు గొట్టె
> చెట్లు నింజెట్లు తుంగ ముస్తెయలు నీత
> గుజ్జు మొదలుగ తిన దొరకొనియెజనము" 3-151

బరపట అంటే సంకటి. జొన్న బరపట, సజ్జబరపట అని గ్రామాల్లో ఈనాటికీ వ్యవహారం ఉంది. గునుకు, ఊదర, బరపట, గోళ్ళగొండ్లు, అల్లి బియ్యం, వెదురు బియ్యం, మొదలైనవి ధాన్య విశేషాలుగా సూర్యరాయాంధ్ర నిఘంటువులో పేర్కొనబడ్డాయి. కందగడ్డలను ఇంజెట్లు అంటారు. గడ్డి

దుంపలే తుంగ ముస్తెలు. కఱవుకాలంతో సామాన్య ప్రజలకు పై వాటితో పాటు ఈతగుజ్జు శరణ్యం అవుతుంది. గ్రామాల్లో ఈనాటికీ కాటకం వచ్చి నప్పుడు ఈతగుజ్జు, తుంగముస్తెలు తింటారు.

చెంచులు అడవి పందిని సంహరించి దాని మాంసాన్ని ఆహారంగా స్వీకరించే విధానాన్ని ధూర్జటి కన్నులకు కట్టినట్లు చిత్రించినాడు.

"క్రొవ్వీన యేకలంబులను కొన్నిటిగూల్చి కమర్చి పెంచులన్
జివ్వుచు నెట్టమన్నలది చివ్వున నీరవురంగనేర్చి నో
ళ్ళువ్విళులూర ప్రేల్చి చమురుట్టిపడంగఅకుట్లు గాల్చి క
ల్జువ్వనసీడనొక్క పరిశుద్ధ శిలాతల భూమినందఱున్" 3-50

క్రొవ్వెక్కిన పందిని చంపి మొదట మంటలో వేసేవారు. కమిరే విధంగా కాల్చి పెంకుల సహాయంతో తోలు ఊడదీసేవారు. ఎఱ్ఱమన్ను పూసి మళ్ళీ నిప్పులోవేసి నీరు ఇగిరేటట్లు కాల్చేవారు. ఆ తరువాత ముక్కలు చేసి సన్నని సలాకులకు గుచ్చేవారు. మూడవసారి మళ్లీ నిప్పులోవేసి వాటిని చమురు కారేటట్లు కాల్చేవారు. ఆ తరువాత వేటగాళ్ళంతా కల్జువ్వి చెట్టుకింద కూర్చొని ఆ మాంసాన్ని ఆరగించేవారు

పాండురంగ మాహాత్మ్యంలో రకరకాల భోజన పదార్థాలు పేర్కొన బడ్డాయి. వాటిలో అంబళ్లూ, ఊరుగాయలూ ఉన్నాయి.

"ఒక కొన్ని వడియంబు లొక కొన్ని వరుగులు
ఒక కొన్ని తెఱగుల యొలుపు పప్పు
లొక కొన్ని ద్రబ్బెడ లొకకొన్ని తాలింపు
లొక కొన్ని విధముల యొట్టుచేరు
లొక కొన్ని కలకల్వు లొకకొన్ని బజ్జులొ
క్కొక కొన్ని రీతుల యూర్పు వగలు
నొక కొన్ని శిఖరులు నొక కొన్ని యంబళ్ళు
నొక కొన్ని రసాల ఘుమఘుమోత్కారములు.

వివిధ ఫలకంద మూలంబు లవియు కొన్ని
ఊరుపిండులు నాక కొన్ని యొక్క కొన్ని
పెరుగుపాల్ తేనెనేతులు పెచ్చువెరుగ
ఊరుగాయలు పచ్చళ్ళు నొక్క కొన్ని'' 4-184

ద్రబ్బెడలంటే భక్ష్యాలు. ఒబ్బి అంటే కారం. పిండి మిరియాన్ని ఊర్పు అంటారు. తాళింపు మజ్జిగ సికరి. ఊరబెట్టిన పిండి ఊరుబిండి. ఇట్లే రామ కృష్ణుడు రకరకాల అన్నాలు పేర్కొన్నాడు. అవి అభినవోదనం, దధ్యోదనం, ఇవుర్వంటకం, చల్దన్నం మొదలైనవి.[1] అత్తెసరుపెట్టి వండి ఆర పెట్టిన అన్నాన్ని ఇవుర్వంటకం అనీ, ఇగురబెట్టిన అన్నం అనీ వ్యవహరిస్తారు.

రామకృష్ణుడు ఘటికాచల మాహాత్మ్యంలోను చల్దన్నం పేర్కొన్నాడు. ఆకాలంలో చల్దనాన్ని చిక్కంలో దాచి ఉంచేవారు.

రాత్రిపూట మిగిలిన అన్నాన్ని కొద్దిగా గంజిలో ఉంచి ఉదయాన్నే మజ్జిగ, ఉప్పువేసి చల్దన్నం తయారు చేస్తారు. దీన్ని శీతాన్నం అని కూడ వ్యవహరిస్తారు. ఈ చల్దన్నం ఆరోగ్యానికి మంచిది. ఇదే కాలానికి సంబంధించిన రాజశేఖరచరిత్రలో అంబళ్ళు, ఊరబిండ్లు, ఊరుగాయలు మొదలైనవి పేర్కొనబడ్డాయి.

''ఫలముల్ పానకముల్ రసాయనములంబళ్లూరు బిండ్లూరుగా
యలు బజ్జుల్ దధిపిండ ఖండములు నందావిర్భవించెం దగన్'' 2-127

వైష్ణవాలయాల్లో నైవేద్యం చేసే కూరలు, పిండివంటలు, పచ్చళ్ళు, పాయసం మొదలైన ఆహారపదార్థాలను సారంగు తమ్మయ్య తన వైజయంతీ విలాసంలో ప్రస్తావించినాడు.

''కూరలు నన్నము తిరుపణ్యారము పచ్చళ్ళు తిరుకణామధుమధురా
-హారములున్వధూటికి సారుచి ముప్పూటలును పసాపడబెట్టున్'' 2.131

నైవేద్యం చేయబడిన పదార్థాలు పూజారులకు, భక్తులకు వారికి సంబం

---

1. పాండురంగ మాహాత్మ్యం, 4.169

ధించిన వారికి కూడ లభించేవి. విప్రనారాయణుని వలచివచ్చిన దేవదేవి అనే వేశ్యకు కూడ అవి లభించాయని కవి వ్రాసినాడు.

ఓంతలపూడి యెల్లనార్యుని శ్రీ రాధామాధవంలో సత్రాలు పేర్కొనబడ్డాయి. రాయల కాలంలోనూ ఇవి ఉన్నాయి. రాజు లేదా. ధనవంతులు వీటి నిర్వహణ భారం వహించేవారు. సత్రాల్లో షడ్రసోపేతమైన భోజనం లభించేది. ఇంద్రుడు సత్రంకూటికి అలవాటుపడి భూలోకంలోనే ఉండిపోయాడని ఎల్లనార్యుడు చమత్కరించడాన్ని బట్టి చూస్తే ఆ నాటి సత్రం భోజనం ఎంత రుచికరంగా ఉండేదో తెలుస్తుంది.

"నిరతము నప్పురంబు ధరణీసురవర్యులయిండ్లయందుని
ర్జరపతి తానువేలుపులు సత్రపు కూళ్ళు భుజించుచుండగా
చిరవిరహాగ్ని నప్రజల సిక్తవిలోచన పంకజాతయై
సురపురిమేడపై నెదురు చూచుశచీసతి వజ్రిరాకకున్" 3-85.

ఇంద్రుడు సత్రం తిండికి అలవాటుపడి భూలోకంలోనే ఉండిపోవడం వల్ల శచీదేవి విరహాగ్నితో వేగిపోతూ స్వర్గంలో ఎదురు చూస్తూ ఉందని వర్ణించడం వల్ల స్వర్గంలో లభించే అమృతం కంటే కూడా రుచికరమైన ఆహార పదార్థాలు భూలోకంలోని సత్రాల్లో లభించేవని ధ్వన్యర్థం.

ఎల్లనార్యుడు తన కాలంలో ప్రజలు మద్యపానం చేసే విధానాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించినాడు. మద్యపాన ప్రియులు మండలాకృతిలో కూర్చొని, మధ్య మధ్య చిరుదిండ్లు తింటూ, కాల్చిన రుచికరమైన మాంసం ముక్కల్ని ఆరగిస్తూ, గుటకలువేస్తూ నవ్వుతూ, ఒకరికొకరు అందించుకొంటూ, గుక్కగుక్కకు మంచిదంటూ, తలలూపుతూ, ఉబ్బిపోతూ సంతోషంతో కల్లు సేవించేవారు.

సీ : కలధౌతమాణిక్య కనకపాత్రికలందు
వాసితమధుర పుష్పాసవంబు
పోసికర్పూరంపు పొడిమీద వెదజల్లి
తగనుపదంశ సంతతులుగూర్చి

ఘుమఘుమనై కమ్మ పొగపుతావులు గ్రమ్మ
నాస్వాదవంతంబులైన మాంస
ఖండముల్ రాసులుగా పోసి గ్రుక్కిళ్ళు
మ్రింగుచు నగవులు తొంగలింప

''మండలాకృతి కూర్చుండి మంచిదనుచు
గ్రుక్కగ్రుక్కకు తలయూచుకొనుచు నొకరి
కొకరి నందిచ్చి చూపుచు నుబ్బియుబ్బి
త్రావ దొడిగిరి యుల్లాసరసముతోడ'' 4-105

మద్యం సేవిస్తూ గౌడగీతాలు పాడినట్లు తన కాలంలోని వన్నెకాంతల గురించి నన్నెచోడుడు వర్ణించినాడు. ఇట్లే క్రీడాభిరామంలోను గ్రామదేవతల ఉత్సవాల్లో పూజారులు మద్యపానం చేసినట్లు వర్ణించబడింది.

శుకసప్తతిలో కుడుములు పేర్కొనబడ్డాయి. అంతేకాక ఆనాటి ప్రజలు జొన్నన్నంలో మజ్జిగ పోసుకొని జుర్రేవారని కదిరీపతి వర్ణించినాడు.

''...........ఉదయవేళ
మితియెఱుంగక తుంపురుల్మీద పడగ
జొన్నకూడును మజ్జిగ జుర్రితేచి'' 2-412.

గ్రామీణులు మజ్జిగ తుంపురులు మీద పడుతుండగా జొన్నన్నం తినడం ఈ నాటికీ చూస్తాం. పాండురంగమాహాత్మ్యంలో చల్దన్నం చిక్కంలో భద్రపరిచినట్లు చెప్పబడగా శుకసప్తతిలో అది సొరకాయ బుఱ్ఱలలో దాచిన విషయం ప్రస్తావించబడింది.

''.........................చిక్కమునన్ సొరకాయబుఱ్ఱలో
చలిదియునుంచి బంధుజనసంతతి దర్శనభీతిలోగుచున్'' 3-248.

సామాన్యంగా గ్రామీణులు చల్దన్నం తినిగాని, లేదా సద్ది మూటకట్టుకొనిగాని పొద్దున్నే పనుల్లోకి వెళతారు. చల్ది కట్టబడిన మూట 'సద్దిమూట.' శుకసప్తతిలో ఒక చాకలి చల్దిని ఆరగించి, మైలబట్టలను తీసుకొని గాడిదమీద ఎక్కి తెల్లవారకముందే రేవుకు వెళ్ళినట్లు వర్ణించబడింది.

ఆ రోజుల్లో కాక్షేయ మతానికి చెందినవారు మదిరా మందిరాలకు వెళి మదిరను గ్రోలేవారని శుకస ప్తతిలో చెప్పబడింది. కాని ఇదెంతవరకు సత్యమో చెప్పలేము. "కాక్షేయ మతంబువారును పెద్దలమునుంగున మెలంగు కురంగ్న నయనలకుగుదేజందగిన మదిరామందిరంబని డెందంబునం దలంచి"[1]

ఆ కాలంలో శివభక్తులు, తలారులు, బవనీలు, ఆటపాటల వాళ్ళు బహిరంగంగానే మద్యాన్ని త్రాగేవారని కదిరీపతి వర్ణించినాడు.

"సివసత్తులును దలారులు బవనీలున్మఱియు నాటపాటలవారుం
జవ్వలు నుతించుచు మదిరాసవముంగొని యొక్కడొకడె జరిగిన పిదపన్"
3.116.

కొందరు వివాహమైనస్త్రీలు కొంగులచివర్లో కాసో, దుడ్డో, బంగారుపూసో, వెండితునకో ఏదో ఒకటి ముడివేసుకొని మదిరాలయాలకు వెళ్ళేవారు.[2] హంస వింశతిలో రకరకాల ఆకుకూరలు పేర్కొనబడ్డాయి. అవి ఆ కాలంలో ప్రజల ఆహారంగా ఉపయోగపడేవి.

"గురుగెఱ బొద్ది చెంచలియు కుచ్చలి చిట్టితగిర్సితుమ్మిదు
స్సరి బలుగూటి బొద్దివెలి చల్మిలి పల్లెరురూకపాత్కెవె
ల్వరిగిసెమున్గయెల్కచెవిపావిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి నరవంజి చేతరసదాపయుకొండలి కొండపిండియున్" 4-132

పైన పేర్కొన్న వాటిలో బొద్ది, చెంచలి, తుమ్మి, మునగ, పాయిలి, దొగ్గలి, పొన్నగంటి మొదలైన ఆకుకూరలను మనమీనాడుకూడా ఆహారంలో స్వీకరిస్తున్నాము. ఇట్లే పాలకూర, బచ్చలికూర, కొయిగూర, దుంపబచ్చలి, తోటకూర, కొత్తిమీర, సోయికూర, మెంతాకు, చుక్కకూర మొదలైన వాటిని కూడ హంసవింశతికారుడు పేర్కొన్నాడు.

"పాలవాయింట తక్కలి బచ్చలికొయు
గూర చక్రవర్తము చిల్కకూర గోళి

---

1, శుకసప్తతి, 3-115. 2. అదే, 3-117.

కూర దుంపబచ్చలి తోటకూర కొతిమి
రాకు సోపు మెంతాకు చుక్కాకు గలదు''   4.133.

ఇట్లే నారాయణ కవి ఆ కాలంలో ప్రజలు తినే పండ్లనూ, కూరగాయలనూ వర్ణించివాడు. కవి తెలిపిన వడ్ల రకాలను పరిశీలిస్తే అతనికున్న ధాన్య సంబంధమైన పరిజ్ఞానం తేటతెల్లమౌతుంది.[1]

ఈ విధంగా ప్రాచీన కావ్యాల్లో తెలుగువారి ఆహారపు అలవాట్లు యథోచితంగా చిత్రించబడ్డాయి.

ఇ త ర ఆ చా ర వ్య వ హా రా లు :

పండుగలకు, జాతరలకు సంబంధించిన ఆచారాలేకాక, నిత్య జీవితంలో సాధారణంగా ప్రజలు పాటించే ఆచారాలు మన కావ్యాల్లో చాలావరకు ప్రతిబింబించాయి.

నన్నయభారతంలో స్త్రీల ప్రసవానికిముందే సమకూర్చబడే పదార్థాలు పేర్కొనబడ్డాయి.

''ధరణి కడు పేదవారును పురిటికి ఘృతతైల ధాన్యముల చెచ్చెరముం
దర సంగ్రహింతురవి మనకరుదుగ నతి దుర్లభంబు లర్థములేమిన్''
అరణ్యపర్వం, 3-241.

సుజాత ప్రసవ సమయానికి ముందుగా అవసరమైన వస్తువులను సంగ్రహించమని తన భర్త అయిన ఏకపాదునితో కోరిన సందర్భమది. పేదవారు కూడా పురిటికోసం ముందుగానే నేతినీ, నూనెనూ, ధాన్యాన్ని కొనుక్కొని భద్రపరుచుకోవడం నాటి ఆచారంగా భావించవచ్చు. నేడు గ్రామాల్లో సామాన్యులు చింతపండునూ, పాత బియ్యాన్ని, మిరపకాయలనూ సిద్ధం చేసుకోవడం చూస్తాము.

పతిహీనలైన స్త్రీలు మాంగల్యం మొదలైన ఆభరణాలను ధరించరాదన్న ఆచారం నన్నయనాడుంది. ఇది మూలభారతంలో కనిపించదు.

---

1, హంసవింశతి, 4-128.

''పతి హీనలైన కామిను లతిధనవతులయ్యుకులజులయ్యు ననలం
క్షతలయ్యెడు మాంగల్యరహితలయ్యెడు కృపణవృత్తినిది మొదలుగాన్''
ఆదిపర్వం, 4-230

గెలిచినవారు ఓడినవారి శరీరంమీద జీడితో ముద్రలువేసే ఆచారాన్ని నన్నెచోడుడు కుమారసంభవంలో ప్రస్తావించాడు.

''పోరతనకోడి పాఱుసీహారరోచి
పట్టుకొనిపోయి దానవప్రభుడు పిఱికి
వారికెల్లనునోగుల వానిగాగ
నురముపై జీడినిత్రియచ్చొత్తి విడిచె'' 4-16

తారకాసురుడు తన చేతిలో ఓడిపోయిన చంద్రున్ని పట్టుకొని అతని రొమ్మున జీడితో గుర్తు వేశాడట! ఆదే జింక గుర్తు.

పెళ్ళి పేరంటాలకు, ఉత్సవాలకు వెళ్ళే తల్లులు తమ వెంట చిన్న పిల్లలను తీసుకొనివెళ్ళే ఆచారం బసవపురాణంలో ప్రస్తావించబడింది.

''పెండ్లింట్లనోముల పేరంటములను
పండువు దినములపాటి జాతరలను
తగిన పోడిమిసేయు తల్లిలేకున్న
వగవరే మఱియెట్టి మగబిడ్డలైన'' ఆ. 3, పు. 58.

బసవపురాణంలో వెలివాడలు పేర్కొనబడ్డాయి. వెలివాడలో వేద ఘోష వినిపించే ఆచారంలేదు.

''వెలివాడగలుగునే వేదఘోషంబు
నిలనావమునగల్గునే రాగిముంత
తలపకుంపటిలోన తామరదుంప
మొలచునే యిన్నియు ముదలింపనేల'' ఆ. 5, పు. 154

ఉమ్మర్గావంలో రాగిముంతలు లేనట్లే, కుంపటిలో తామరలు పూయనట్లే వెలి వాడలో వేద ఘోష వినిపించేదికాదని సారాంశం.

చిన్న పిల్లలకు తలపై ముందుభాగంలో వెంట్రుకలు ముడిచి రావి ఆకులాంటి ఆభరణాన్ని రక్షారేఖగా కట్టడం ఎన్నటినాటి ఆచారం.[1] జాతరలు జరిగే సమయాల్లో ధనవంతులు పేదలకు దానధర్మాలుచేసే ఆచారం కేయూరబాహుచరిత్రలో పేర్కొనబడింది.[2] పుణ్యంకోసం కాపు స్త్రీలు కలుగ పట్లలో మెతుకులు చల్లడం, కాకులకు బలి ఇవ్వడం మొదలైన ఆచారాలను పంచన పేర్కొన్నాడు.[3] పల్నాటివీరచరిత్రలో కష్టసిద్ధికై స్తంభాలను ఆరాధించే ఆచారం ప్రస్తావించబడింది.

''ఇప్పుడాహారలబ్ధి ముదిగొకొమ్మంచు
కంబమునకునిట్లు గట్టిగా చెప్పి
పరమాన్నమును మంచి పప్పుకూరలను
పానకంబులు జున్ను పచ్చళ్ళు నెయ్యి
కొనితెచ్చి కుంభంబు కుండలకీతి" పు. 61

ఇనుము, ఇత్తడి, కంచు, బంగారం, రాగి, మొదలైన పంచలోహాలతో నిర్మించిన స్తంభాలను ఆలయాల్లో ప్రతిష్ఠించి ఆరాధించడం అనాదిగా వస్తున్న ఆచారమే. అయితే నైవేద్యాదులు పెట్టడం మాత్రం ఆశ్చర్యం కల్గిస్తుంది.

క్రొత్తగా బండికి ఎడ్లను కట్టినప్పుడు ప్రయాణానికి ముందు ఐదు రంగుల అన్నాన్ని తిప్పేసి దిష్టి తీయడాన్ని పల్నాటి వీరచరిత్ర పేర్కొన్నది.

"గ్రక్కున యెద్దులగాండ్ల కట్టించి
మొక్కల బంధించి ముందుగానపుడు
పంచెవన్నెలకూడు పైబారదివిచి...." పు. 8.

వీరు లెవరైనా మరణిస్తే వారి శౌర్య చిహ్నాలైన కాలి అందెలు, రక్తంతో తడిసిన బందాలు భద్రపరచడం నాటి ఆచారం.

---

1. హరివంశం, పూ.భా. 5-194, 2. కేయూరబాహుచరిత్ర, 1-44
3. అదే, 3.85.

"తరుచు నెత్తుటిచేత తడిసిన యట్టి
బిరుదును జందెంబు పెట్టెలో పెట్టి" పు. 100

యుద్ధానికి వెళ్ళేముందు వీరులు తల్లి దీవెనలతోపాటు భార్యచేతకూడ శుభాకాంక్షలు పొందడం పల్నాటి వీరచరిత్రలో ప్రస్తావించబడింది.

"సమరంబునకునేగు శౌర్యవంతులకు
తల్లి దీవెనపొంది తన భార్యచేత
దీవెనగానిపోవ తేజమ్మగుమ్మ...." పు. 61,

ఐతాంబ బాలచంద్రునితో పలికిన పలుకులవి. ముక్కుతిమ్మన పారిజాతాపహరణంలోనూ ఈ ఆచారం ప్రస్తావించబడింది.

"సురవీరుడొకడు సతిచే తురమునకు ననుజ్ఞవేడి తొల్లిటి యలుకన్
చిరకాల దుర్లభంబగు పరిరంభముగాంచి వెడలె ప్రమదంబెసగన్" 4.74

యుద్ధానికి పోతున్న వీరులు తమ భార్యలను కౌగిలించుకోవడం అనేది అనార్యుల ఆచారమనీ, అది మహమ్మదీయులనుంచి సంక్రమించి ఉండవచ్చుననీ శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులు పల్నాటివీరచరిత్ర పీఠికలో అభిప్రాయపడ్డారు. నిజానికి యుద్ధంలో జయాపజయాలు దైవాధీనాలు కాబట్టి రణభూమికి వెళ్ళేటప్పుడు వీరులు తమ భార్యలను కౌగిలించుకోవడం, దుఃఖోపశమనం కలిగించడం అసహజమేమీ కాదనిపిస్తుంది. యుద్ధానికి వెళ్ళే సమయంలో గంధం, కస్తూరి మొదలైన సుగంధ ద్రవ్యాలతోపాటు తాంబూలాన్ని ఇచ్చి వీరులను సాగనంపడం కాటమరాజు కథలో వర్ణించబడింది.

"గంధంబు కస్తూరి ఘనముగా పూసి
తబుకులో తములము తగగనిప్పించి
పోయిరమ్మని చాల పోషించి పంపె...."[1]

వేడినీళ్లూ, చన్నీళ్లూ సిద్ధం చేసుకొని, మంచం చాటున స్త్రీలు స్నానంచేసే ఆచారాన్ని కాటమరాజు కథ తెలియజేస్తుంది.[2]

1. కాటమరాజు కథ, సంపా : శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, ప్రచు : 1953 పు. 16. 2. అదే, పు. 21.

కాశీఖండంలో అతివలు పాటించవలసిన ఆచారాలు ప్రస్తావించబడ్డాయి. స్త్రీలు ఒంటరిగా పోవడం, తుడుపువస్త్రాలు లేకుండా స్నానం చేయడం, కడవ, సాన, రోలు మొదలైన వాటిమీద కూర్చోవడం శ్రేయస్కరంకాదు.

"'ఒంటి నెచ్చోట కరుగుట యుక్తికాదు
తడుపుగట్టక నీరాడ తగవుకాదు
కడపమీదను మఱి సన్నెకంటెమీద
చక్కిమీదను కూర్చుండ జాడకాదు'' 3.75

ఒంటరిగా స్త్రీలు వెళ్ళకూడదని చెప్పడంవల్ల వారికి బయటికి వెళ్ళడానికి ఆకాలంలో స్వేచ్ఛ ఉండేది కాదని తెలుస్తుంది.

పెద్దల సముఖానికి రిక్తహస్తాలతో వెళ్ళకూడదన్న విషయం పరమ యోగి విలాసంలో ప్రస్తావించబడింది.[1] వేరు పడ్డప్పుడు పెద్దవాడు మొదట పాలు పంచుకోవడమనే ఆచారం సింహాసన ద్వాత్రింశికలో పేర్కొనబడింది.

''పాదధనము పసులు పసిడియర్ధధనము
పావుకొఱత ధనము పండుభూమి
ధరణి నధిక ధనము ధాన్యంబుగావున
వానిగొనుడు పెద్దవాని వరుస'' 9-115.

మనుచరిత్రలో స్త్రీలు గోళ్ళకు గోరంటాకు పెట్టుకోవడం చెప్పబడింది.[2] వసు చరిత్రలో ప్రసవసమయంలో వేపమండలు, దీపాలు, నూనెలు సిద్ధంగా ఉంచుకోవడం మొదలైన ఆచారాలు ప్రస్తావించబడ్డాయి.[3] నన్నయభారతంలో ప్రసవానికిముందే ఘృతతైలాదులను సంగ్రహించుకొనే విషయం ప్రస్తావించ బడింది. శ్రీకాళహస్తిమాహాత్మ్యంలోనూ ఇట్టి ఆచారాలు వర్ణించబడ్డాయి. ప్రసవవేదన మొదలుకాగానే, మంత్రసానిని పిలవడం, శొంఠి, పిప్పళ్ళు, వాము మొదలైన వాటితో ఔషధాన్ని తయారు చేయడం, స్నానానికి వేడినీళ్ళు సిద్ధ పరచడం, పురిటి నీళ్ళకు ప్రత్యేకంగా చిన్న గుంటను త్రవ్వడం మొదలైన

1. పరమయోగివిలాసం, 2-69.
2. మనుచరిత్ర, 6-8. 3. వసుచరిత్ర, 3-23

ఆచారాలను ధూర్జటి సహజమనోహరంగా వర్ణించాడు. ఈ ఆచారాలను పల్లెల్లో నేటికీ చూస్తాము.

''జలజలకు బిడ్డకుట్టు విలసిల్లగ భిల్లపురంధ్రులంతలో
పిలువరె మంత్రసాని తలపెట్టరె కాయముగూర్పలేమకున్
జలకముకాచరే కొలనుచయ్యన ద్రవ్వరె మందగామినిన్
నిలుపగదే పరే యనుచు నేర్పరులైకడు సంభ్రమింపగన్'' 3.26.

చెట్లు పుష్పించడానికి ధూపంవేయడం, సందెప్రొద్దు కాకముందే కస పూడ్చడం మొదలైన ఆచారాలు వైజయంతీవిలాసంలో ప్రస్తావించబడ్డాయి.

''మెలపుతో చెట్లపాదుల కలుపుదీయు
నెమ్మి దోహద ధూపధూమమ్ము లిడును
సంజె ప్రొద్దైన కసపూడ్చు మందిరమున....'' 2.121.

తెలగన్న యయాతి చరిత్రలో రావణుడు దేవతలచేత వెట్టి పనులు చేయించుకొన్నట్లు వర్ణించబడింది. ఈ ఆచారం ఈనాటికీ అక్కడక్కడ కనిపిస్తుంది.

''వెట్టింగొట్టము సేయమత్తిలివడిన్ విన్నే టితాల్పున్న యా
గట్టుండిట్టు పెకల్చి రావణుడనంగా మీటి...'' 2-62

శుకసప్తతిలో ప్రజల ఆచార వ్యవహారాలు విపులంగా వర్ణించబడ్డాయి. కదిరీపతి గ్రామజీవన పరిశీలన పాటవానికి అతని వర్ణనలు పట్టుగొమ్మలు ఉదాహరణకు కవి చిత్రించిన కోమటింటికోడలి సాయంత్రపు దిన చర్యను తిలకించండి.

''నానావిధ ద్రవ్య నవ్య సంబారముల్
గల గృహంబులకు బీగములమర్చి
మొదవులం నన్నింటి పిదికిన పాల్గాచి
యొనర తోడంటుతోనుట్టివెట్టి

పసులు పిద్కిన తొత్తుపడుచులనిష్టాన్న
　　తృప్తినొందగజేసి యుండ్లకనిచి
యత్తమామలు సుఖాయత్తులై పవళింప
　　మృదుపదంబులనొత్తి నిదురపుచ్చి
జలకమొనరించి జిలుగు మేల్వలువగట్టి
కలపమలది వితాహార కలన దేలి
పీడియంబందు కొని యొక్కయడిగంపు
బుడుత తనవెంట నడువనప్పువ్వుబోడి'' 1-149

ధనధాన్యాలున్న గదులకు తాళాలువేయడం, పాలుకాచి తోడు పెట్టి పాలకుండలను ఉట్లమీద భద్రపరచడం, అత్తమామలను సేవించడం, స్నానమాడి జిలుగు చీర కట్టుకోవడం, భోజనానంతరం తాంబూలం వేసుకోవడం మొదలైన ఆచారాలు సర్వసాధారణంగా అనాడు గృహస్థుల ఇళ్ళలో పాటించబడేవని భావించవచ్చు.

సొమ్ములు కుదువబెట్టడం, గ్రామాలు గుత్తకు తీసుకోవడం, అప్పుపత్రాలు వ్రాయించుకోవడం మొదలైన అంశాలు కూడా శుకసప్తతిలో పేర్కొనబడ్డాయి.[1] పాండురంగమాహాత్మ్యంలోను ఇవి వర్ణింపబడ్డాయి.

శుకసప్తతిలో సుకేశి అనే కాపు స్త్రీ దైనందిన కార్యక్రమాలు సహజమనోజ్ఞంగా వర్ణించబడ్డాయి.

''సాక్షాత్కరించిన జలదేవతయనంగ
　　నీలాటిరేవున నీటుచూపు
రథముపై కనిపించు రతిదేవియన జొన్న
　　చేనుగాచుటకు మంచియ వసించు
కేళిగాగళిత మౌక్తికములేఏరువనాం
　　బుజపాణి నానిప్ప పూవులేరు
కాలచక్రముద్రిప్పు కమలనాభునిశక్తి
　　నానూలువడుక రాట్నంబు ద్రిప్పు....'' 2-40

---

1. శుకసప్తతి, 2-361.

ఆ కాలంలో కాపు వనితలు తాంబూలం వేసుకొనేవారనీ, అందుకు ప్రతిరోజు సంతనుంచి ఆకులూ పోకలూ తెప్పించుకొనేవారనీ, రజకులకు ఎక్కువ కూలి ఇచ్చి బట్టలను ఉతికించుకొనేవారనీ, స్వర్ణకారులతో ఎప్పటి కప్పుడు చెవి కమ్మలు మొదలైన ఆభరణాలను మెరుగుపెట్టించుకొనేవారనీ, సారాయిని సొంతంగా ఇళ్ళలో తయారు చేసుకోలేనివారు అంగళ్ళనుంచి తెప్పించుకొనేవారనీ కవి వర్ణించినాడు.[1]

శుకసప్తతిలో సోమశర్మ అనే బ్రాహ్మణుని జీవన విధానం కళ్ళకు గట్టినట్లు చిత్రించబడింది. ఈ చిత్రణనుబట్టి బ్రాహ్మణులు ఆకాలంలో ఆకు తోటలు, పోకచెట్లు పెంచేవారనీ, చేలు గుత్తకు తీసుకొనేవారనీ, ఆవులనూ గొర్రెలనూ పెంచే వారనీ, చెరకుగానుగలను ఆడించేవారనీ, నిత్యాన్న దానాలు సాగించేవారనీ, రాగినగలు ధరించేవారనీ, స్త్రీలు పాపటబొట్టు పెట్టు కొనేవారనీ, ఇంట్లో తులసిని పెంచేవారనీ తెలుస్తున్నది.[2] ఇంకా ఆకాలంలో ఒకరికి బదులు మరొకరు పూజలు జరిపే ఆచారం ఉంది. పురోహితులు అప్పుడప్పుడు సిగాలు ఊగేవారు. అన్నలు తోబుట్టువుల ఇళ్ళకు వెళ్ళినప్పుడు వెంట పూలూ, పళ్లూ, పసుపూ, కుంకుమలూ, చీరలూ పచ్చడాలూ కాను కలుగా తీసుకొని వెళ్ళేవారు.[3]

ఈవిధంగా మన ప్రాచీన కావ్యాల్లో ప్రజల సాంస్కృతిక, సాధారణ జీవన రంగాలకు సంబంధించిన అంశాలు చిత్రించబడ్డాయి.

మూడవ ప్రకరణం

# వృత్తిచిత్రణ

పూర్వ కాలంలో గ్రామ పరిపాలన బాధ్యత ఆయా వృత్తులవారి ఆధీనంలో ఉండేది. వారు 1. గ్రామాధికారి 2. న్యాయాధికారి 3. కరణం 4. గ్రన్తి 5. తలారి 6. జ్యోతిష్కుడు 7. కమ్మరి 8. కుమ్మరి 9. వడ్రంగి 10 చాకలి 11. మంగలి 12. ఉపాధ్యాయుడు.

గ్రామాధికారి గ్రామంలో జరిగే మంచి చెడ్డలకు బాధ్యత వహించేవాడు. న్యాయాధికారి గ్రామంలో జరిగే వివాదాలను పరిష్కరించేవాడు. కరణం భూమికి సంబంధించిన పన్నులు, ఇతరమైన సుంకాలు వాటి లెక్కలు చూసేవాడు. గ్రన్తి వ్యవసాయ యోగ్యమైన భూములకు నీళ్ళు ఇస్తూ జలాధారాలపై అధికారం వహించేవాడు. తలారి దొంగతనాలు దోపిడీలు జరుగకుండా గ్రామ రక్షకుడుగా వ్యవహరించేవాడు. కమ్మరి వ్యవసాయానికి సంబంధించిన పనిముట్లు తయారుచేసి ఇచ్చేవాడు. ఇట్లే కుమ్మరి, వడ్రంగి, చాకలి, మంగలి తమ తమ వృత్తులు నిర్వహిస్తూ ఉండేవారు. జ్యోతిష్కుడు రైతులకు ఏ ఏ తిథుల్లో ఏ ఏ విత్తనాలు నాటాలో తెలిపేవాడు. ఉపాధ్యాయుడు గ్రామంలోని పిల్లలకు చదువు చెప్పేవాడు.

గ్రామ సమాజంలో ఆయా కులాలవాళ్ళు తరతరాలుగా వస్తున్న వృత్తులనే అవలంబించినట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి. ప్రత్యేకంగా కులవృత్తులున్నప్పటికీ వ్యవసాయాన్ని మాత్రం యాదవులు. రెడ్లు, కాపులు మొదలైన వారేకాక బ్రాహ్మణులు కూడా చేసినట్లు చూస్తాము. మొత్తంమీద గ్రామీణులు ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని వ్యవసాయం మీదనే ఆధారపడి జీవించారు.

పూర్వకాలంలో ఒక్కో కులానికి ఒక్కో వృత్తి ఉండడంవల్ల అందరికీ పని జరిగిందేమో అనిపిస్తుంది. ఈ నాటివలె ఆ నాటి ప్రజలు నిరుద్యోగులుగా ఉండవలసిన అవసరం కూడా లేకుండింది. కులవృత్తులే వారికి అన్నం పెట్టాయి. ఎవరి వృత్తిని వారు నిర్వహించడం వల్ల వృత్తి సంబంధమైన ఒత్తిడి కూడా ఉండేది కాదు. కాని పెరుగుతున్న జనాభా కారణంగా రాను రాను కొత్త సమస్యలు పుట్టుకొచ్చాయి.

ఈ ప్రకరణంలో— ఆయా కావ్యాల్లో చిత్రించబడ్డ ప్రజల వృత్తులు పేర్కొనబడ్డాయి. ఆయా వృత్తులను నిర్వహించడంలో ప్రజల అభినివేశమూ ఇంటిల్లిపాది వృత్తి నిర్వహణలో పాల్గొన్న విధానమూ నిరూపించబడ్డాయి.

వ్యవసాయం :

గ్రామీణులకు వ్యవసాయం ప్రధానమైన వృత్తి. వ్యవసాయానికి ఎక్కువగా సహకరించేవి పశువులు. పశు సంపదను మించిన సంపద పల్లీయులకు లేదు. గోవు అటు పాడికీ, ఇటు పంటకూ మూలమైంది. గ్రామానికి ప్రాణాధారమైంది.

ఎఱ్ఱన తన హరివంశ కావ్యంలో పశువులపై పల్లీయులకు గల అభిమానాన్ని చాటినాడు. కృష్ణుని ఆగడాలను భరించలేని గొల్లభామలు యశోదతో పలికిన మాటలను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది.

> ''ఏ పొలములు పాడయ్యెనే? ఈ పల్లెకు చిచ్చుపెట్టి యేగెదె మేమున్
> మా పసులును గలిగిననటు నే పగిదిని బ్రతుకరాదెయిటు చెడుకంటెన్''
>
> 5-220

పశువులే తమ బ్రతుకన్న విశ్వాసం జానపదులది. పశు పోషణ బాగా జరిగేది కాబట్టి వృషభ వ్యాపారం కూడా ఆ రోజుల్లో గొప్పగానే ఉండేది.

> ''క్రేపులు వర్ధిల్లగ కడునే పెసగగ మొదవులీను నేటేటవృష
> వ్యాపారం బవ్యాహతమై పరగు..........'' 6- 30

ఎఱ్ఱనకుగల పల్లె జీవన పరిజ్ఞానం అపారమైంది. పశువులకు సంక్రమించిన వ్యాధులనూ, తత్ఫలితంగా అవి పడ్డ బాధలనూ, అతడు చక్కగా వర్ణించినాడు.

"వడకుచు రోమకోటి నిలువంబడి మేనులు దూల కన్నులం
దుడుగక బాష్పముల్ వడియుచుండ తలల్ దిగవైచినోరద్రే
గుడు దొరగంగ నెంతయును గ్రుస్సిఖురంబులు ప్రస్సిపుర్వులు
గ్గడువుగ గాఅతర్దయును కాఱియ బొందెవ్రజంబునం బసుల్" 6-44

రక్తం క్రక్కుతూ, అతిసారవ్యాధివల్ల పేగులు చిక్కి పోయి ఎత్తుబడిన పశువులను ప్రబంధ పరమేశ్వరుడు ప్రత్యక్షంగా చూసి చేశాడా అనిపించే వర్ణన చూడండి.

"కడలన్నెత్తురు పారన్ దొడగెన్ కొన్నియతిసార దుస్తరబాధన్
పడి ప్రేవులసిక్కి తునిసిపడకుండునె యనగనెత్తువడెనెల్లెడలన్" 6-45

ఎఱ్ఱన తన కాలంలో పశువులను బంధించడానికి అవలంబించే పద్ధతులను పేర్కొన్నాడు.

"వల్లియలు వైచి యోదముల్ పెల్లుద్రవ్వి
తార్చివేసరి యురులొగ్గి తిఱసిడయ్యె
దోలి యోటరి పోనీక దొడ్డినాగి
హొడువ నొడువను నలుదెసపొంచియుండి" 6-31

కృషి, వాణిజ్యం మొదలైన వృత్తులే ఆ నాటి ప్రజలకు దైవాలు. ఎఱ్ఱన వృత్తులను దైవాలుగా పేర్కొనడంవల్ల ప్రజలకు వాటివల్ల కలిగే ప్రయోజనమూ, వాటిపట్లగల భక్తి భావమూ తేటతెల్లమౌతున్నాయి.

"కరిసనమును బేహారము నరసి పసుల గూర్చుటయును ననగా వృత్తుల్
నరులకు నిందెవ్వనికే వెరవుచితంబదియ వాని వేల్పైయుండున్" 7-130

ఎఱ్ఱన కర్షకుల జీవితాన్ని సమగ్రంగా చిత్రించినాడు. హరివంశంలోని వ్రేపల్లె వర్ణనను పరిశీలిస్తే ఎఱ్ఱనకుగల గ్రామ జీవన పరిజ్ఞానం బోధపడుతుంది.

పిన వీరభద్రుని శకుంతలా పరిణయాన్ని బట్టి అతని కాలంలో వ్యవసాయానికి బాగా ప్రోత్సాహం లభించినట్లు తెలుస్తుంది. వ్యావసాయిక భూములకు ప్రభుత్వ పరంగా లభించే సౌకర్యాలను కవి ఇలా వర్ణించినాడు.

''ఏటి కాల్వలు పరిపాటిగా దీర్పించి
చెఱువుల నీరుండు నాఱపు దెలిసి
దేవమాతృకలు నదీ మాతృకలునైన
గ్రామసీమ క్షేత్రగతులు తెలిసి
నీరు నేలలు వానకారులు పరికించి
వరి పొలంబుల పంట వలతులరసి
కోరాయములు వచ్చుకొలది విచారించి
పది యూళ్ళ కొకరి తీర్పరిగ జేసి
చనవు వారలు పనివారు శాత్రవులును
చోరులును చేయు బాధలు చేరకుండ
ప్రజల పాలించుకొనుచు తత్పరతసాను
రాగుడై ప్రోవ వలయు రాష్ట్రింబు రాజు'' 4-176.

కాల్వలు తీయించడం, చెఱువులు త్రవ్వించడం, వర్షాధారపు పంటలతో పాటు నదీ మాతృకలైన పంటలను ప్రోత్సహించడం, వరి పంటలను అధికం చేయడం మొదలైన పనులు ప్రభుత్వ పరంగా జరిగేవి.

కావేరి కాల్వలనుంచి నీళ్ళు ముంచి పోస్తూ, మడవలు మార్చుస్తూ విప్రనారాయణుడు పూలతోటను పెంచినట్లు ద్విపద పరమయోగి విలాసంలో వర్ణించబడింది.

''అదన కావేరి తోయంబులకాల్వ
మొదలు బంటిని ముంచి ముంచి పోయుచును
తడయక వచ్చి గుద్దలిగొని తొంటి
మడవ మార్చుచు మాఱు మడవమార్చుచును
ద్రవ్వంగ వలయుచో త్రవ్వియందంద

పువ్వు చెట్టులకెల్ల ప్రోది సేయుచును
ఆరామ కృత్యంబు లాచరించుచును'' 4-281

మళ్ళకూ, పాదులకూ నీళ్ళుపారే కాలువల ముఖాలే మడవలు. తోట లను పెంచడం ఒక కళ. ఎత్తు పల్లాలు లేకుండా నేలను చదునుచేసి కసువు, కట్టె, జాయి, కంప మొదలైనవి లేకుండా చేసి ఆయా చెట్లకు పాదులుచేసి కాలువలు దీర్చి, నీరుకట్టి, అవసరమైతే కొన్ని తీగలకు అంట్లుగట్టి తోటలు పెంచడం అందరికీ చేతనైన పని కాదు.

"పొన్నమాకులకెల్ల బోదిగావించి కన్నియ మొగలిమొక్కల సేద్యపఱచి
గొజ్జంగి పొదలకు కుదురులమర్చి గుజ్జుమొల్లలకాముకొన నీరుగట్టి
కరవీరములదండ కాలువల్ దీర్చి సవరగా నచటనే చక్కచూచినను
మిసిమిగా నల్గడమిట్టుపల్లంబు కసవు కట్టెయు జాయు కంప లేకుండ''
5- 370

శ్రీకృష్ణదేవరాయలు రాజనీతిజ్ఞుడుగానేకాక లోకజ్ఞుడుగా కనిపిస్తాడు. అతని ప్రకృతి పరిశీలన పాటవం అపారమైంది. ఆముక్తమాల్యదలోని కృషి సంబంధమైన వర్ణనలను పరిశీలిస్తే అతడు కర్షకుడై వ్యవసాయం చేశాడా అనిపిస్తుంది. ఉదాహరణకు విలుపుత్తూరు వరిమళ్ళలోకి వెడుదాం —

విలుపుత్తూరుకు సమీపంలో వరిమళ్లున్నాయి. వాటి కాలువల్లో బాతులు స్వభావాన్నిబట్టి తలలు రెక్కలలో దూర్చుకొని నిద్రపోతున్నాయి. గ్రామ రక్షకులైన ఆరెకులకు ఆ బాతులు ప్రొద్దున్నే స్నానం చేయడానికి వచ్చిన బ్రాహ్మణులు కాల్వగట్లపై మరిచి విడిచి వెళ్ళిన తడిగుడ్డల్లాగా తోచాయి. వారు వెంటనే ఆ తడిబట్టలను తిరిగి బ్రాహ్మణుల కివ్వాలనే ఉద్దేశంతో అక్క డికి చేరారో లేదో ఒక్కసారిగా బాతులన్నీ పైకెగిరిపోయాయి. పైరుకు కాపలా ఉన్న కాపు కన్నెలు ఈ దృశ్యాన్ని చూశారు. ఒకరి నొకరు చూసు కొంటూ నవ్వుకొన్నారు.

"తలపక్షచ్ఛట గ్రుక్కి బాతువులు కేదారంపు కుల్యాంతర
స్థలి నిద్రింపగ జూచి యారెకులుష స్స్నాత ప్రయాత ద్విజా

వలి పిండీకృత శాటులన్నవి తదావాసంబు చేర్పంగ రే
వుల డిగ్గన్వెసపాఱు వానిగని నవ్వున్నాలి గోప్యోఘముల్" 1.65

జాతులు కాల్వల దగ్గర నిద్రపోవడం సహజమే.

వరిపంట కోతకు వచ్చే దశలో మళ్ళల్లో నీళ్ళు లేకుండా చేస్తారు. అలా చేసినప్పుడు, బాగా నీళ్ల త్రాగడానికి అలవాటుపడ్డ ఆ చేలు గాలికి తూగతూ ఆ ప్రక్కనే ఉన్న చెంగల్వ పూలమీద వ్రాలిపోయాయట![1] ఇదెంతో మనోజ్ఞమైన వర్ణన.

తోటను పెంచడానికిముందు నేలను సిద్ధం చేయాలి. నేలను త్రవ్వే సందర్భంలో గునపాన్ని ఉపయోగించడంవల్ల చేతులు కాయలు కాయడం సహజమే. రాయలు ఈ విషయాన్ని వర్ణించినాడు.

"స్వామీ! నన్ను నితఃపురా పఠితశాస్త్రగ్రంథ జాత్యంధునా
రామక్ష్మాఖననక్రియా ఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధ కఠునృవద్భవన దాసున్వాదిగా బంపుచో
భూమీభృత్సభనోటమైననయశఃబుల్మీకురాకుండునే" 2.90

పాండ్యరాజును వైష్ణవునిగా మార్చమని మన్నారుస్వామి విష్ణుచిత్తున్ని కోరగా, అతడు తానంతకుముందు శాస్త్రం చదవలేదని, పూలతోటకు నేలను సిద్ధం చేయడంలో గునపాన్ని పట్టుకోవడంవల్ల చేతులు కాయలు కాచాయని పలికిన సందర్భం అది.

గ్రామాల్లో భార్యాభర్తలూ, పిల్లలూ వ్యవసాయం పనుల్లో పాల్గొనడం సర్వసాధారణమైన విషయం. స్త్రీలూ, పిల్లలూ పొలాల్లో కూరలు కోయడానికి వెళ్ళినప్పుడు అరికాళ్ళకు ముళ్ళు నాటడంవల్ల అబాధ ఎక్కువై రాత్రిపూట వారికి సరిగా నిద్రలేకుండా చేసిందన్న విషయాన్ని రాయలు ఒక పద్యంలో వర్ణించాడు.

"అంటలుగట్టి చేలకును నాంద్రును బిడ్డలు కూర గోయబో
కంటకముల్పదాగ్రముల గాడగ దూసిన నొప్పి కూయిడన్

---

1. ఆముక్తమాల్యద, 1. 67.

కంటికి నిద్రగాన కొదుగంబడి వేగెద మిందు; నొక్క మా
కంటయ కాదు నీవు పడునట్టియవస్థ వచింప శక్యమే." 3-33

వర్షాకాలవర్ణనలో రాయలు వ్యావసాయిక జీవనాన్ని కళ్ళకు గట్టినట్లు చిత్రించినాడు.

"కాలుని దున్నసందినయి గంటలు దున్నక మంటినా మహా
కాలుని నంది దున్ననయి కర్దమమగ్నత లేకమంటినా
హాలికులెన్నడుం దెగని యారుల చేలును జౌడుమళ్ళు నుం
గాలలినేరు సాగిరిల గల్గు పసింగొని పేదమున్నగన్" 4-124

దున్నపోతుకు వెలిదుక్కి కష్టం. యమునికి వాహనంగా ఉండడంవల్ల దాని నుంచి బయటపడ్డానని దున్నపోతు ఆనందించింది. ఎద్దుకు రొంపిదుక్కి కష్టం. ఈశ్వరునికి వాహనంగా ఉండడంవల్ల దానినుంచి బయటపడ్డానని ఎద్దు ఆనందించింది. కాని పేద రైతులు వర్షాలు పడడంతో అవీ ఇవీ అనక పసులను అన్నింటినీ తెచ్చి వాటితో బీటి చేలూ, చవిటికయ్యలూ దున్నించారు.

వెలిదుక్కికి దున్నపోతులూ, రొంపిదుక్కికి ఎడ్లూ అనువైనవి కాక పోయినప్పటికీ పనులు తొందరగా పూర్తి చేయడానికి పశువులనన్నింటినీ తెచ్చి దున్నించారని చెప్పడంవల్ల వర్షాలు రావడంతో రైతుల హడావుడీ, అందులో పేద వ్యవసాయదారుల అవస్థలూ ఎలాంటివో అర్థం చేసుకోవచ్చు.

కర్షకులు బురదలో పని చేస్తుండగా వారి కాళ్ళకు సాధారణంగా నీరు తొట్టు పాములు చుట్టుకోవడం సహజమే. అయితే అవి బంగారు వర్ణం కలిగి రైతులు తమ గొప్పతనాన్ని చాటుకోవడానికి ధరించిన గండ పెండేరాల్లాగా ఉన్నాయని వర్ణిస్తూ రాయలు హాలికులమీద తనకున్న అభిమానాన్ని చాటు కొన్నాడు.

"వరుజూబడి రొంపి ద్రొక్కంచరణంబులజుట్టి పసిడిచాయకడుపులం
బొరినీరుకట్టెలము రెను బిరుదులు హాలికులుదున్న బెట్టిరొ యనగన్"
4-125.

ఈ వర్ణననుబట్టి ఆంధ్రభోజుడు కవులకేకాక కర్షకులకు కూడా గండపెండే రాలు తొడిగినాడన్న విషయం ధ్రువపడుతుంది.

కాపు స్త్రీలు పొలాలలో పనిచేసే తమ వారికోసం అంబలి, అన్నం సంపల్లో తీసుకొని వెళ్తారు. అనుకోకుండా వర్షం వచ్చేది. వెంటనే ప్రక్కనే ఉన్న గుడిసెల్లో దూరేవారు. కాని అప్పటికే గుడిసెల్లో ఉన్న హాలికులకు సజ్జలు మొదలైన పురాసకంకులతోపాటు తమ స్తనాలను కూడా అర్పించే వారని వర్ణించి రాయలు కర్షక జీవితాన్ని శృంగార రసభరితం చేసినాడు.

> ''వసతుల్వోల్వడి వానకై గుడిసెమోవన్‌రాక తా నానియే
> వసగానిల్చిన జమ్ముగూడ పొలసంబళ్ళోయుచుంబట్టి పె
> న్ముసురం దీగెడు కాపు గుబ్బెతల పెన్గుబ్బల్బునాసల్వె లిం
> బిసికిళ్లం బిసికిళ్ల హాలికుల కర్పించెన్నభస్యంబునన్" 4-133

పింగళి సూరన తన కళాపూర్ణోదయంలో శాలీనుని కర్షక జీవితాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించినాడు. మొక్కలకు నీరు పెట్టడం, కాల్వలు త్రవ్వడం, నేల చదునుచేయడం, ఎరువు చల్లడం, అంట్లు కట్టడం, నీరు పోయడం. కొమ్మనాటడం మొదలైన పనులను శాలీనుడు చక్కగా నిర్వర్తించినాడు.

> ''నీరెత్తు వేళల నీరెత్తు పాదు పా
> దునకు కాలువలు పొందుగ నమర్చి
> త్రవ్వటంబుల తఱి త్రవ్వటంబులు వెట్టు
> తగినట్టి కట్టు గుద్దలి గడించి
> యెరువు జల్లెడు వేళ నెరువుజల్లు గతాభి
> మానుడై గంపల తాన తెచ్చి
> యంట్లొత్తు పదనున నంట్లొత్తు, నెలమిగా
> న్పించు లేఁగొమ్మలు వంచి వంచి
> నారు వోయంగ వలయుచో నారువోయు
> కొమ్మ నాటంగ దగునెడ కొమ్మనాటు
> నొకటి విసువక, యంత కంతకును హెచ్చు
> హాళి తోడను శాలీనుడఖరతంబు'' 4-78

సాధారణంగా ప్రతి రైతూ ఈ పనులను చక్కగా చేయగలిగి ఉంటాడు. సమయానుకూలంగా పనులు కొనసాగినప్పుడే పంటలు బాగా పండుతాయి. కృషి ఫలిస్తుంది.

ధూర్జటి తన శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో మనం ఈనాటికీ చేలల్లో చూసే దిష్టి బొమ్మలను పేర్కొన్నాడు. జంతువుల బారినుంచి చేలను రక్షించడానికి ఇవి ఉపకరిస్తాయి. ఆకాలంలో వీటిని అగరుచెట్ల కట్టెలతో తయారుచేసి నిండా కస్తూరి పూసేవారు. అంతేకాక చామరాలు జుట్టుగా చేసి ముత్యాలను నేత్రాలుగా అమర్చేవారు. ఈ దిష్టి బొమ్మలను తవిదచేలకు రక్షణగా ఉంచినట్లు ధూర్జటి వ్రాసినాడు.

> "అగరుక్ష్మారుహ కాష్ఠ ఖండముల సర్వాంగంబులంజేసి మై
> మృగనాభి న్మసిపూసి చామరము ధమ్మిల్లమ్ముగాజుట్టి యే
> నుగు కుంభమ్ములలోని ముత్యముల కనుగ్రుడ్డుల్వినిర్మించి భి
> ల్ల గజేంద్రుల్వేలు బొమ్మలం దవిద చేలం జేయుదుర్మాపుగన్" 3-7

ఇంకా ఆకాలంలో పైరుకు దృష్టిదోషం కలగకుండా ఏనుగుల తలలను కొమ్ములతో పైకెత్తి కట్టేవారు. అవి చేలకు అలంకారంగానూ ఉండేవి.

> "ఏనుగుల తలలు కొమ్ములతో నారబములకు దృష్టిదోషమువాయం
> గానెత్తుదురెఱుకులు తమ చేనికి పసరంబుతలలు చెలువంబెసగన్" 3-8

అంతేకాక చెంచులు తమ చేలు అడవిపందులవల్ల పాడుకాకుండా ఉండడానికి తెల్లని చామరాలు అక్కడక్కడ పైకెత్తి కట్టేవారు.

> "కొండలలోచేసిన తమ పండిన చేలకు వరాహపంక్తులు చొర రా
> కుండన్ తెల్లని చామర ఖండంబులు ప్రోగుదశ్చకట్టుదురెఱుకుల్" 3-9

యయాతి చరిత్రలో పొన్నగంటితెలగన్న ఆయా పళ్ళచెట్ల పెంపకాన్ని గూర్చి వర్ణించినాడు. తనకాలంలో నేరేళ్ళు, మామిళ్ళు, దానిమ్మ, కర్జూరం చెట్లు విరివిగా కాసేవి. ఈ పండ్లతోటలను చూస్తే ముసలివారికైనా రాలిన పళ్లు తిరిగి వస్తాయని కవి చమత్కరించినాడు.

> "ఏచి సనిచి పూచి కాచి పండిన యమీ
> న్పురపు మేలితోటలరసి కాంచు
> ముసలి వారికైన పసిబిడ్డలకునైన
> పండ్లు వచ్చు నలరు ప్రాయమొదవి" 1-37.

జ ల యం త్రా లు

పంటభూములు దేవమాతృకలనీ నదీ మాతృకలనీ రెండు విధాలు. నదీ మాతృకలైన భూములకు నీళ్ళు నదుల నుంచి, చెరువుల నుంచి, బావుల నుంచి అందుతాయి. ఈ ప్రయత్నంలో రైతులకు ఏతాములూ, జలయంత్రాలూ ఎంతో ఉపకరిస్తాయి. ప్రాచీన కావ్యాల్లో వీటి ప్రస్తావన ఉంది.

జలయంత్రాన్ని ప్రాచీన కాలంలో గుంద్రలరాట్నం అనేవారు. అందలి ప్రధానమైన భాగం చక్రం. చక్రానికి కుండలు కట్టి పిడిసాయంతో త్రిప్పుతూ నీళ్లు తోడిపోస్తారు. కుమార సంభవంలో గుంద్రలరాట్నం యుద్ధవర్ణన సందర్భంలో పేర్కొనబడింది.

"ఎగయు శిరంబులు నభమున కొగి గ్రుమ్మెడు రక్తజలము లొలుకుచు భువిపై మగుడ బడు చూడ కడు రంగుగ నోలిన రాటనమున గుంద్రల పోలెన్"

11- 167

గుంద్రలే కుండలు. యుద్ధంలో ఖండించబడ్డ తలలు ఆకాశానికి ఎగిరి తిరిగి క్రింద పడడాన్ని — రాట్నానికి కట్టిన కుండలు నీళ్ళను నింపుకొని పైకెత్తి ఒలకబోస్తూ మళ్లీ క్రిందికి రావడంతో పోల్చబడింది.

నన్నెచోడుడు గుంద్రలరాట్నాన్ని యుద్ధపరంగా పేర్కొంటే పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలో దాన్ని వేదాంతపరంగా పేర్కొన్నాడు. ఈశ్వరుడు ప్రాణులు అనే కుండలను కర్మ అనే చక్రానికి కట్టడంవల్ల ఏర్పడ్డ తిరుగుళ్ళను చూచి వడ్రంగి జలయంత్రాన్ని రూపొందించినాడట:

"చటుల సంసృతి జీవఘట చక్రకర్మ
పటు పరివర్తన భ్రమణంబు గూర్చి
కీలువందించి యాక్రియరాటనముల
వాలియాడించు నా వడ్రంగి యతడు" 4-102

ఎడ్లతో లాగిస్తూ కూడా జలయంత్రాన్ని నడిపిస్తారు. ఈ విషయం పండితారాధ్య చరిత్రలో మనోజ్ఞంగా చెప్పబడింది.

"చనుజీవఘట కర్మ చక్ర సూర్యేందు
వినుత బలీవర్ద విభ్రమణమున

కూడంగ భావముల్ గౌరలు రావటన
మాడించు కర్త విశ్వాధికుండుండ''

జీవులు అనే ఘటాలను కర్మ అనే చక్రానికి తగిలించి సూర్యచంద్రులనే ఎడ్లతో లాగిస్తూ సంసారమనే రాట్నాన్ని శివుడు తిప్పుతున్నాడని భావం. ఇలాంటి వేదాంత పరమైన భావాన్నే తిరువేంగళనాథుడు పరమయోగి విలాసంలో వెల్లడించినాడు.

''గానకాని రాట్నపు గుండ్రల కరణి
పనిబూని మనకర్మ పరతంత్రులగుచు
నరకంబులందు జన్మంబుల యందు
తిరుగుచు నిట్లు వర్తిలెడు..............'' 1-24

తమ తమ కర్మలచే బంధింపబడ్డ జీవులు రాట్నాలకు కట్టిన కుండల్లాగా నరకాలనూ, అయాజన్మలనూ, చుట్టివస్తారని భావం.

రాయలు ఆముక్తమాల్యదలో రాట్నం గ్రుండలను ప్రస్తావించినాడు. వాటిని పద్మాల్లో ఝుమ్మంటూ తిరిగే తుమ్మెదలతో పోల్చినాడు.[1] ఏతాములను కూడా ఆ రాజకవి పేర్కొన్నాడు. తోటలోని చెట్లకు నీళ్ళు పెట్టడానికి ఏతాములు త్రొక్కుతూ, పాటలు పాడేవారనీ, ఆ సమయంలో బొక్కెనలతో నీళ్ళు ముంచడంవల్ల పుట్టిన ధ్వనులు మద్దెల చప్పుళ్ళవలె ఉన్నాయనీ అతడు చేసిన వర్ణనను చూడండి.

''ప్రాతర్వేలల నట్టివెట్టసొగసై పాటిల్లెకుంభోంభనో
ద్భూతాంబుధ్వని వాద్యమై మరుదధః పుంజీభవత్పాటల
వ్రాతామ్రేడిత సిక్త భూసుర భిళారామంబు కుల్యాబహు
స్రోతస్సంధుల సందు యంత్రనతిక్రుత్ప్రోద్గీత గేయౌఘముల్ 2-55

చేనేత :

వ్యవసాయం తరువాత పేర్కొనదగిన ముఖ్యమైన వృత్తి చేనేత. చేనేత వృత్తికి సంబంధించిన విశేషాలు మన సాహిత్యంలో ముఖ్యంగా శుకసప్తతి,

1. ఆముక్తమాల్యద, 4-152

హంసవింశతి కావ్యాల్లో కనిపిస్తున్నాయి. గ్రామీణ జీవన చిత్రణలో శుక సప్తతికి ఒక విశిష్టమైన స్థానం ఉంది. కదిరీపతి తన కాలంనాటి కాపుస్త్రీలు రాట్నాలమీద దారాన్ని తీసే విధానాన్ని సూచించాడు.

''....పదారింటి తరమునుగాగనూలు
వడకరే యంచు నొండొరుల్నొడివి కొనుచు'' 2-119

పదారింటితరమంటే ప్రశస్తంగా అని అర్థం. పదహారవవన్నె బంగారం అని ఎట్లా అంటామో అంత ప్రశస్తంగా ఆ నాటి స్త్రీలు నూలు వడికేవారు కవి నూలు వడికే రాట్నాన్ని వర్ణించిన తీరు చూడండి.

'వడిదారము చెవులుం ద్రొక్కుడు పలకయు దిండు కదురుగుంజలుసుంద్రొ
క్కుడుబొమ్మయునుం ద్రిప్పుడు పుడకయుసుం గలుగు రాట్నములుగై కొనుచున్''
2-420

రాట్నానికి ముందు భాగంలో ఉండేది తొక్కుడుబొమ్మ. దానికి రెండు చెవులుంటాయి. వాటిని కట్టెతోగాని, నారతోగాని చేస్తారు. వాటిమధ్య కదురుంటుంది. తొక్కుడు బొమ్మకు ఆధారమైంది తొక్కుడుపలక. దాన్ని జంగ అనీ, రాట్నం పలక అనీ వ్యవహరించడం కద్దు. తొక్కుడు పలకకు రెండవ వైపు రెండు స్తంభాలుంటాయి. వాటిమధ్య చక్రం అమర్చబడి ఉంటుంది. చక్రాన్ని తిప్పే సాధనమే తిప్పుడు పుడక.

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు రాట్నాన్ని చిత్రంగా గీసి చూపారు.[1] కాని దానిలో వారు త్రొక్కుడు బొమ్మను చూపలేదు. త్రొక్కుడు పలకకు ఎడమవైపు చివర బొమ్మ ఆకారంలో నిలబెట్టినట్లుండేదే త్రొక్కుడు బొమ్మ. ఇది రాట్నానికి అందాన్ని కూరుస్తుంది.

రాట్నం ముందు కూర్చొని దారం వడికే యువతులను గూర్చి కదిరీపతి సరసమైన వర్ణన చేసినాడు.

"గుంపునంపును లేక కొనసాగు ప్రోగు వెం
ట మెఱుంగు చూపు పేరెములు వార
ప్రాయంపు పడుచుల పని గొంటివే దూది
యనెడి పాటల తేనె చినుకు లీన

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పు 282.

నేకుతో చెలగు కేలెత్తుదో భుజముల
　　కాంతులు బయలు బంగారు సేయ
పుడక ద్రిప్పెడు రయంబున పైట చూచుచో
　　మినుకు గుబ్బలు తళుక్కని రహింప
ముడిచి కొన్నట్టి తెలిగంజి మడత చీర
లరిది తొడ నిగ్గుచే వసుపంటినట్లు
పొసగ చరణాల త్రొక్కుడు బొమ్మమీద
బచ్చెన ఘటింప వడికి రప్పద్మ ముఖులు'' 2-422

రాట్నం వడికేటప్పుడు పడుచువారి మెరిసే చూపులు దారంతో పాటు పరిగెత్తుతున్నాయి. తమలాంటి జవ్వనులకే పని చెప్పినట్టుదాని మీద వారు పాటను పడుతుంటే తేనెలు కురుస్తున్నాయి. పుడకను వేగంగా త్రిప్పడంవల్ల పైట కొంగులు జారుతున్నాయి. గంజి పట్టించి ఇస్త్రీ చేసిన చీరలు తొడల కాంతివల్ల పసుపు అంటినట్లు ప్రకాశించాయి.

పోగు సరిగా పోతుందో లేదో అని చూపును దానివెంటే పోనివ్వడం, ఏకుతోపాటు భుజాలను మాటిమాటికీ పైకెత్తడం, రాట్నం ముందు కూర్చున్నప్పుడు స్త్రీలు తమ చీరలు ముడుచుకోవడం ఇవన్నీ సహజసుందరమైన విషయాలు ఇక కాపు స్త్రీలు దారం కండెలను ఎలా చుడతారో చూడండి.

''ఎన్నికలు పక్షి పుంజంబు తేర్పరించి
పంట కట్టులు మఱి తోడు పడగనూచ
కండెలొనరించి చాలించి కాపుటింతు
లున్న యవ్వేళ నద్భుతంబుట్టి పడగ'' 2 42

నాలుగు పోగుల దారాన్ని ఎన్నిక అంటారు. నాలుగు పోగుల చొప్పున పుంజాలు కడుతారు. పుంజానికి అరవై పోగులు, పదిహేను ఎన్నికలు. పంటను కోసిన తరువాత జొన్నకర్రలు (ఊచలు) తెచ్చి ఎండబెడుతారు. అవసరమైన పరిమాణంలో ఊచలను ముక్కలుగా చేస్తారు. ఈ ముక్కలను రాట్నం కదురుకెక్కించి దారాన్ని చుడుతారు. ఇలా దారం చుట్టిన ఊచ ముక్కలనే కండెలని వ్యవహరిస్తారు.

తీరిక సమయాల్లో కాపు వనితలు దూదినేకి, దారంతీసి, పుంజాలు చేసి, కండెలు చుట్టిగాని రాట్నాల ముందు నులచి లేచేవారు కాదని చెప్పడం వల్ల వారికా పనులు చేయడంలోగల ఆసక్తి, నేర్పు తెటతెల్లమౌతున్నాయి.

హంసవింశతిలోను నారాయణకవి దారాన్ని కండెలుగా చుట్టే విధానం తెలిపినాడు. ఇంకా ఆయా వృత్తులవారి ఇళ్ళతోపాటు చేనేత పనివారి గృహాలను కూడా చిత్రించినాడు.

"కుంచె మగ్గపు గుంత గూటంబు పగ్గంబు
పంబెత్రొక్కుడు పట్టె పలకదోనె
పరిపరి యచ్చులు చరికుండ యూడిత
చీడు దబ్బలు దండె నాడెక్రోవి
కోతి పుల్లలు నాల్కకుడుతరి కొయ్యలు
చొప్పయూచలు కోతచూఅకత్తి
కారంపు పడుగులు గండెల కప్పెర
గోలెము లాకలు నీలి కడవ

గంపడొల్ల కలాసంబు కదురు చెమికె
నూలు రాట్నంబు జాలంబు గ్రాలు గోద
వఱల నా శుభ భద్రు నివాస భూమి
యప్పురంబున సంతతం బొప్పచుండు" 2-11

ఆసువోయడం, పడుగుజాపి కుంచెతో సరిచేయడం మొదలైన పనులు స్త్రీలు చేసేవారు.

"ఆసు వోసెడుదాని హస్తంబురీతిని
కుంచెదీసెడు దాని కొమరు మిగల" 1-220.

నూలు దారాన్ని ఆసు సహాయంతో ఆసువోస్తే సరంటు తయారవుతుంది. సరంటును ఊడితల సహాయంతో చాపి గంజి పెట్టి పడుగుగా మారుస్తారు. ఇందుకు కుంచెలు ఎంతో ఉపయోగపడుతాయి.

కుమ్మరం :

పల్నాటి వీరచరిత్రలో కుమ్మరాములు పేర్కొనబడ్డాయి.[1] మట్టితో కుండలు తయారుచేసి వాటిని కాలుస్తారు. అలా కాల్చడానికి ఏర్పాటు చేసిన నిర్మాణాలే కుమ్మరాములు. సాధారణంగా కుమ్మరాముల్లో కుండలు దొంతులుగా పేర్చబడి ఉంటాయి.

హంసవింశతిలో కుమ్మరం పరిశ్రమను గూర్చి విశేషంగా చెప్పబడింది చక్రదాసుడనే కుమ్మరి ఇంటిలోని కుమ్మరం సాధనాలు ఇలా ఉన్నాయి.

''సలుప కడవ, రాయి, సారె, కలాసంబు
కట్టె, యిసుము, జల్లి, కడవ, ముల్లు
మంటిముంత, గుబ్బమాను, నావంబును
మన్ను మోయ పోతు మలయుచుండు'' 5-9

మన్ను మోయడం, కుండలు చేయడం, సారె (చక్రం) త్రిప్పడం, కుండలను ఆవంలో కాల్చడం, కాల్చిన తరువాత వాటిని కుప్పలుగా పెట్టడం, మొదలైన పనులను కవి పేర్కొన్నాడు.

''ఆదివరాహంబు మేదిని నెత్తిన
మాడ్కి చొప్పడగ తా మన్ను మోయు
ప్రథమవేళల సృష్టిబ్రహ్మ చేసిన యట్లు
ఘటకోటు లుత్సాహ గరిమజేయు
విష్ణువు చక్రంబు వేడుక త్రిప్పెడు
చాడ్పున పలుమారు సారె ద్రిప్పు
బయలి పురంబులు భర్గుండు గాల్చిన
డంబు సూపట్ట నావంబు గాల్చు
కపివరుడు పర్వతంబులు కమిచి తెచ్చి
కుప్పలిడు రీతి కుండలు కుప్పవెట్టు
నవి దివియు ధాత కాండంబు లడచు సరణి
సాదు పథవర్తి ఘటకార చక్రవర్తి'' 5-10.

విష్ణువు భూమినెత్తినట్లు మన్ను మోసి, బ్రహ్మ సృష్టిలాగా కుండలు చేసి, విష్ణు చక్రంలాగా సారె త్రిప్పి, ఈశ్వరుడు త్రిపురాలను దగ్ధం చేసినట్లు ఆవాన్ని

1. పల్నాటి వీరచరిత్ర, పు. 35.

కాల్చి, హనుమంతుడు రామకార్య సాధనలో పర్వతాలు మోసుకొని వచ్చినట్లు కుండలు పేర్చి కుంభకారుడు అతిశయించినట్లు కవి వర్ణించిన తీరు అద్భుతంగా ఉంది.

కుమ్మరివారు తయారు చేసే రకరకాల కుండలను నారాయణామాత్యుడు పేర్కొన్నాడు.

''కాగు, మజ్జిగముంతయు, కడవ, గూన,
బాన, వెసలయు, బుడిగెలు, పరపు, చట్టి,
కడవ, ముంత, కరిగె, దుత్త, పిడత, గురిగి
కుందెలటికయు మూకుడుబిందె ప్రమిద'' 5-11

ఈ కుండలమీద రకరకాల సొగసులు కూడా చూపేవారు. కుండలు లేకుంటే గ్రామాల్లో ప్రజాజీవనమే కుంటు పడుతుంది. శుభాశుభ కార్యాలకు కుంభకారుడు క్రొత్త కుండలను తప్పనిసరి అందజేయవలసిందే.

"దేవ కార్యములకు తిరునాళ్ళకును మహో
త్సవములకును గంగ జాతరలకు
సంప్రోక్షణములకు జన్నములకు పెండ్లి
వడుగు నోములకును వ్రతములకును
సత్రంబులకు సహస్రంబులకును సమా
రాధన పితృ కార్య యూథములకు
పండుగలకు నాలపంబులకును బొంగ
లికిని దేవరకు గొబ్బికిని నడరు
జంగమార్చనలకు బాలదాస భోజ
నములకును దండువెట్టికి నగరివారి
కొండ బక్కలకును భిక్షుకులకునైన
గొలుత పడకుండ కుండలా కుమ్మరిచ్చు'' 5-14.

తెలుగింటిలో ఏ శుభకార్యం జరిగినా మట్టిపాత్ర అవసరమే. ఉత్సవాలకూ, జాతర్లకూ, పెళ్ళిళ్ళకూ వీటి అవసరం ఎంతో ఉంటుంది. పెళ్ళిళ్ళ సందర్భంలో ఐరేనికుండల ప్రాధాన్యం మనకు తెలియంది కాదు. కొత్త కుండల్తో

బోనాలెత్తుకోవడం ఆచారం. ఇంకో విశేషమేమిటంటే ఉగాది పచ్చడి కొత్త కుండల్లోనే తయారు చేస్తారు. ఈనాటికీ గ్రామాల్లో ప్రతి ఇంట్లో కూరాడు, ఒత్తు, పేర్పు, గోలెం, కుండ, ముంత, గురిగి మొదలైన మట్టి పాత్రలు కనిపిస్తాయి.

వ డ్ర ం గ ం :

పల్నాటి వీరచరిత్రలో వడ్రంగం ప్రస్తావించబడింది. బాలచంద్రుని కోసం ఐతమ్మ వడ్రంగులను రప్పించి బొంగరాలను చేయించింది. వారు కమ్మచ్చులు, నీరుకార్లు, సుత్తెలు, అచ్చులు, కత్తెర్లు మొదలైన పనిముట్లు తీసుకవచ్చారు.

''వారలిండ్లకుబోయి పట్టెడకారు
కమ్మచ్చులును నీరుకార్లు సుత్తెలును
ఘనమౌ పదచ్చును కత్తెరల్ మరియు
అలరు మచ్చులు గుదులాదియైనట్టి
పనిముట్లు గొని తెచ్చి.......'' పు. 42.

వారు బొంగరాలు తయారు చేయడానికి ముందు పనిముట్లకు పూజలు చేశారు.

'చదురేర్చి కూర్చుండి సరి పనిముట్లు
పరచి ముందరకత పావకున్నిలిపి
పుష్పగంధంబుల పూజ కావించి
నైవేద్య తాంబూల నతులొనరించి'' పు. 43.

కొత్తగా ఏదైనా వస్తువును తయారు చేసినప్పుడు జానపదులు సామాన్యంగా పూజలు చేయటమనేది ఆచారం.

వై ద్య ం :

పెద్దన మనుచరిత్రలో ఆయుర్వేదాన్ని పేర్కొన్నాడు. పెద్దన కాలంలో ఆయుర్వేద వైద్యానికి మంచి పేరున్నట్లు తెలుస్తున్నది.

''ఆయుర్వేదముగైకొని యీ యింతిం బెండ్లియాడు మెలమి రసానా
ర్ధాయణ పఠిణయ గేయ విగాయన గంధర్వమైన కవ్వపు కొండన్''
5-29

శ్రీ కాళహస్తిమాహాత్మ్యంలో నేత్రవ్యాధికి చికిత్సా విధానం పేర్కొనబడింది

"కోకపొట్లం బావిగొన నూది యొత్తుచు
కషనోష్ణ కరభ భాగమునగాచి
నెత్తి తంగేడాకు మెత్తి రేచకి నిమ్మ
పంటి నీరున నూటి పట్టువెట్టి
తెల్లదింటెన పువ్వు తెచ్చి తద్రసమిడి
కలివె పువ్వులుగోసి నలచి పిడిచి
పేరిన నెయివెట్టి పెరుగు వత్తులు వైచి
చనుబాలతోరాచి సంకుచమిరి
విన్నమందులు, తాసరి కన్నమందు,
లడిగి తెచ్చిన మందులు, నడవి మందు
లెన్ని చేసిన మానక యిందు మౌళి
కన్ను తొడిబడి నెత్తురు గాఱుటయును" 3-110

కంటిలో ఏమైనా దూళిగాని దుమ్ముగాని పడిందంటే గ్రామాల్లో ఈనాటికీ ప్రజలు వెంటనే బట్టను పొట్లంగాచేసి నోటి ఆవిరిపట్టి కంటిమీద ఉంచుతారు. తంగేడు, రేచకి, నిమ్మరసం, తెల్లదిరిసెన పువ్వురసం, కలివె పూలరసం మొదలైనవి కంటి జబ్బులకు బాగా పని చేస్తాయి. ఇంకా పేరిన నెయ్యి వేయడం, చనుబాలు పోయడం కూడా జానపదులుచేసే చికిత్సా విధానాలే. పల్లె ప్రజలు ఎక్కువగా చదువుకొన్నవారు కాదు. వారికి శాస్త్ర జ్ఞానం తక్కువ. రోగం వస్తే వెంటనే వైద్యుని దగ్గరికి వెళ్ళడం గ్రామీణులకు తెలియదు. ప్రథమ చికిత్స వారి వంతే అవుతుంది. తమకు తోచింది, తాము చూసింది చేసి చూస్తారు. తగ్గిందా సరేసరి. లేకపోతే వీళ్ళువాళ్ళు చెప్పింది చేసి చూస్తారు. దూర్జటి మహాకవి గ్రామీణుల స్వభావాన్ని "విన్న మందులు తాసరి కన్నమందు లడిగి తెచ్చిన మందులు...." అనే మాటల ద్వారా వ్యక్తం చేశాడు.

తిన్నడు వయసులో చిన్నవాడు. అయితే అతనికున్న అనుభవాన్ని బట్టి చికిత్స ప్రారంభించాడు. గ్రామల్లో జరిగే చికిత్సావిధానాన్ని దిఙ్మాత్రంగా

దర్శించడానికి ధూర్జటి రచన మనకు ఎంతైనా తోడ్పడుతుంది. ముఖ్యంగా కళ్ళల్లో దుమ్ము పడగానే బట్టను ఆవిరి బట్టి కంటిమీద పెట్టుకోవడం మన అనుభవంలోని విషయమే.

పౌ రో హి త్యం :

సింహాసన ద్వాత్రింశికలో పౌరోహిత్యం వర్ణించబడింది. పురానికి హితమైంది పౌరోహిత్యం. సాధారణంగా బ్రాహ్మణులు పౌరోహిత్యం చేస్తారు. గ్రామ ప్రజలకు శుభాశుభ కార్యాల్లో సలహాలివ్వడం పురోహితుల పని.

కొలని గోపరాజు కాలంనాటికే ఆ వృత్తి చేసేవారికి పౌరోహిత్యం మీద అంత గౌరవం లేనట్లు కనిపిస్తుంది.

''చేరెడు నూకలు పిడికెడుకూరయుగొని యొక్కప్పూట కూటికి దొరయై
యూరికి పంచిన పోబడు పౌరోహిత్యంబు బుద్ధి బంటతికముగా'' 2-173

చేరెడు నూకలు, పిడికిట్లో పట్టినంత కూర తీసుకొని అధికారుల కోరికపై వేరే గ్రామానికి పంపబడే పౌరోహిత్యం సేవకావృత్తే తప్ప మరోటి కాదని వారి నమ్మకం. పౌరోహిత్యం చేసేవారి జీతభత్యాలే ఇలా ఉంటే తక్కిన వాళ్ళ జీత భత్యా లెలా ఉండేవో?

''అప్పటి కమికెడు కూటికి నొప్పెడిదియుపోషణమ్ము హోమముకొరకై
యొప్పించి వేల్వగా గతిదప్పెడుతత్త్వము పురోహితత్వము జగతిన్''
2-174

అప్పటికే అయిపోయిన యాగాన్ని గూర్చి తెలుసుకొన్న పురోహితుడు అయ్యో! అక్కడికి వెళ్ళలేకపోతినే, ఈ పౌరోహిత్యం బంటరికమైందే అని బాధపడ్డాడు—ఈ వర్ణననుబట్టి 15వ శతాబ్దంలో పురోహితుల స్థితిగతులు అంత ఆశాజనకంగా ఉండేవికావని తెలుస్తుంది.

కదిరీపతి తన శుకసప్తతిలో కొంతమంది పురోహితులకు అక్షర జ్ఞానం లేదని వ్రాసినాడు.[1] కాని కొందరు పురోహితులు పరదేశీయులను వాదంలో ఓడించేవారనీ, అలాంటి వారిని కాపులు మెచ్చుకొనేవారనీ తెలిపినాడు.[2] ఇంకా కొందరు పురోహితులు గ్రామాల్లో అధికారులుగా వ్యవహరించేవారనీ,

---

1. శుకసప్తతి, 2-438 2. అదే, 2-439.

వారు ఇతరులను గ్రామాల్లోకి అంత సులభంగా ప్రవేశింపజేసేవారు కాదనీ వెల్లడించినాడు.

''జలములమొసలియు గుహలోపులి గంధపుమ్రానిమీద భుజగమువలెనా
హాలకగ్రామంబున నతడలరున్ పరులెవ్వరైన నడుగిడకుండన్'' 2-440

కొందరు రెడ్లు పురోహితున్ని 'బావా' అని సంబోధించేవారు. వేసిన విత్తనాలు మొలకెత్తుతాయా? అని ప్రశ్నించే వారు.1 అప్పుడా బ్రాహ్మణుడు తన చినిగి పోయిన దోవతిని చూపించేవాడు. ఆ దోవతి అతని పేద తనాన్ని చూపేది.

''చెప్పిననేమి లేదుగద చింపుల దోవతిచూడు మేను మీ
కెప్పుడు మేలుగోటి మఱియెక్కలిదేవికి గ్రామగంగకున్
చప్పిడిదించు మ్రొక్కుకొను జాడలెరుంగవె యిట్టిపట్లనే
చొప్పున నాశ్రితుంగరుణ జూడరుగాకది యేలయిత్తఱిన్'' 2-445.

తమను ఎల్లవేళల ఆశ్రయిస్తూ, ఫలాఫలాలు వివేచిస్తూ, తమ శుభాన్ని ఆశించి ఎల్లమ్మకూ, గంగమ్మకూ మ్రొక్కుతూ ఉన్నప్పటికీ పురోహితుల పేద తనాన్ని పట్టించుకోని గ్రామ పెద్దలు ఆనాటి కాలంలో ఉన్నారు.

హంసవింశతిలోనూ పురోహితులను ఆవరించిన కష్టాలు చెప్పబడ్డాయి. హరివర్మ అనే పురోహితుడు దారిద్ర్యం కారణంగా అనేక కష్టాలు అనుభవిస్తూ తన కుటుంబాన్ని పోషించుకొన్న తీరు వర్ణించబడింది.

''పంచాంగము[illegible] సెప్పి బాజారులోపల
రంజిల్లయాయవారంబులెత్తి
తలమీద మంత్రాక్షతములుంచి కలకాపు
టిండ్లనుపాదాన మెత్తితెచ్చి
గ్రహణ సంక్రమణాది కాలంబులకు రాచ
నగరాశ్రయించి దానములు పట్టి
తిలలుదర్భలుపూని తీర్థసన్నిధి మంత్ర
ములు సెప్పి నీరుకాసులు గడించి
జన్నిదములమ్మి గ్రహశాంతి జపముజేసి
శవములను మోచి దుర్దానసమితి కొగ్గి

1- శుకసప్తతి, 2.444.

వచ్చు నాదాయములు గ్రాసవాసములకు
గాగ దినములుగడపె నక్కాలమునను'' 2-152

పంచాంగాలు చెప్పి, అయవారాలెత్తి, మంత్రాక్షతలుచల్లి, కాపుల ఇళ్ళల్లో ఉపాదానాలెత్తి, గ్రహణ సమయాల్లో దానాలు పరిగ్రహించి, తీర్థస్థలాల్లో తిలలు, దర్భలు పట్టుకొని మంత్రాలు చెప్పి నీరుకాసులు సంపాదించి, జందాలు అమ్ముకొని, శవాలుమోసి, రకరకాలైన చెడుదానాలన్నీ స్వీకరించి వచ్చే ఆదాయంతో కుటుంబాన్ని పోషించుకొనే పురోహితుల కష్టాలను నారాయణకవి ఈ పద్యంలో కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు.

కరణీకం :

కరణాలు చేసే పని కరణీకం ప్రాచీన కాలం నుంచి కరణాలకు గ్రామ సమాజంలో ప్రత్యేకమైన స్థానం ఉంది. గ్రామంయొక్క ఆదాయ వ్యయాలను లెక్కలు కట్టడంలో వీరికి వీరే సాటి. కొఱవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశికలో కరణానికి గల ప్రాధాన్యాన్ని వివరించాడు.

"కరణము తన యేలిక కుపకరణము నిర్ణయగుణాభికరణము ప్రజకున్
శరణము పగవారలకును మరణము నాజెల్లు నీతిమంతుండైనన్'' 11-99

నీతి మంతుడైన కరణం ప్రజలకు ఉపయోగ పడుతాడనీ, పగవారికి మృత్యువవుతాడనీ చెప్పడం వల్ల కరణం తలుచుకొంటే ఏమైనా చేయగలడన్న అభిప్రాయం కలుగుతుంది. సాధారణంగా నియోగులు కరణీకాన్ని నిర్వహించేవారు. వీరెంతటి శక్తిమంతులో ఈ క్రింది చాటు పద్యం వల్ల తెలుస్తుంది.

''మేదిని నాథు డల్గినను మించిన కార్యము చక్కసేయ స
మ్మోదమెలర్పగా గణకముఖ్యుని సఖ్యములెన్స యెట్లనన్
ఆదట కాలుడల్గియు గతాయువటన్నను చిత్రగుప్తుడా
'గా' దొలగించి 'శా' మొదట గ్రక్కున వ్రాసి సజీవుజేయడే"

ఈ గణకులు కరణాలే. ఆదాయ వ్యయాలను లెక్కగట్టడం, ఎప్పటికప్పుడు లెక్కలు వ్రాసిపెట్టడం, వసూలు చేసిన పన్నులను గూర్చి అధికారులకు వివరాలందించడం మొదలైన పనులు కరణాలవే.

శ్రీకృష్ణదేవరాయలు గణకులుగానున్న కరణాల ద్వారా ఎప్పటికప్పుడు రాజ్యంయొక్క ఆదాయ వ్యయాలను తెలుసుకొన్నట్లు రాయ వాచకంలో చెప్పబడింది.

స్వ ర్ణ కా రం :

బంగారం, వెండి మొదలైన వాటితో నగలు తయారు చేయడమే స్వర్ణ కారుల పని. కంసాలి చిత్రవిచిత్రమైన ఆభరణాలు చేసినట్లు హంసవింశతిలో వర్ణించబడింది.

నేటికీ స్వర్ణకారులుపయోగించే సాధన సామగ్రిని కవి వర్ణించిన తీరు చూడండి.

> ''కమటము కట్ల సంచి యొరగల్లును కత్తెర సుత్తె చీర్ణముల్
> ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారుశా
> ణము పటకారు మూసబలునాణె పరీక్షలమచ్చు లాదిగా
> నమరగ భద్రకారక సమాహ్వయుడొండొక డుండునప్పురిన్" 2-181

సాధారణంగా సొమ్ములు తయారుచేసేటప్పుడు అనుసరించే పద్ధతులను కవి ఎంత చక్కగా తెలిపినాడో చూడండి.

> "కరగను పోతబోయగను కాచి కదించను కమ్మిదీయగా
> నొరయగ వన్నియల్ మిగుల నుండగ చూపగ బూదెగట్టరే
> కరుగగదీయ చెక్కగను నచ్చున వ్రేయగ సుద్దగించగా
> సొరిది విచిత్ర చిత్రములు సొమ్ములు సేయనతండు నేరిచెన్'' 2-182

వైజయంతీ విలాసంలోనూ స్వర్ణకారుల గురించి పేర్కొనబడింది. ముఖ్యంగా ప్రాచీన కావ్యాల్లో స్వర్ణకార వృత్తికి సంబంధించిన సమాచారాన్ని హంసవింశతి మాత్రమే మనకందిస్తుంది.

గాం డ్ల వృ త్తి :

క్రీడాభిరామంలో గాండ్ల వృత్తికి సంబంధించిన విషయాలు వర్ణించ బడ్డాయి. ఆ కాలంలోనూ స్త్రీలు గానుగలు త్రిప్పి నూనె తీసేవారు.

> ''ఈ నళినాక్షి తాతిరుపు పెద్దు ప్రతోదము మోపి రొప్పుచున్
> గానుగ పట్టెపై తిరుగ కట్టెడి టిట్టిభః మందరాద్రిమం

థానక మథ్యమాన తిమిధామ జలభ్రమి మండలంబధి
ష్ఠానముగా భ్రమించు నలసంపద చేడియ పోలకుండునే" ప. 103

గానుగకు ఎడ్లు కట్టి త్రిప్పుతున్నప్పుడు దాని పట్టె మీద కూర్చొన్న గాండ్ల పడుచు మందర పర్వతాన్ని కవ్వంగా చేసుకొని పాలసముద్రాన్ని చిలికి నప్పుడు వెలుపలికి వచ్చిన లక్ష్మీదేవిలాగా ఉందని కవి చక్కని వర్ణన చేశాడు.

వృత్తిచిత్రణకు ప్రాధాన్యం ఉన్న హంసవింశతిలో నారాయణా మాత్యుడు ఈ వృత్తికి సంబంధించిన సాధనాలను పేర్కొన్నాడు.

''గానుగ కడెంబు మోకులు గడ్డపార
కాడి సిద్దెలు గూటంబు కడవజల్లి
కంప కనుగంత తక్కెడ గట్టి యెద్దు
చుట్టు చలికేయు సర్వవస్తువులు దనరు'' 5- 205

నూనెను తీసిన తరువాత ఏర్పడ్డ పిప్పి పదార్థాన్ని తొలగించడానికి గడ్డపారనూ, నూనెను నిలప జేయడానికి సిద్దెలనూ, నూనెను వడబోయడానికి జల్లిగంపనూ, ఎడ్ల కళ్ళకు గంతలుగా కనుగంతలనూ సాధారణంగా ఉప యోగిస్తారు.

గానుగను త్రిప్పుతూ తీసే నూనెలను కవి ఈ క్రింది పద్యంలో పేర్కొన్నాడు. ఈ నూనెలను ఆ నాటి ప్రజ లుపయోగించేవారు.

"వెల్లగిసె నూనె కుసుము నూనె వెట్టిసూనె
నల్ల నూనిప్పనూనెయు తెల్లనూనె
కుసుమ గానుగ దుండుగ కొబ్బరయును
నూనె పొగనూనె తగిరెస నూనె దీయు'' 5-206

దర్జీపని :

క్రీడాభిరామంలో దర్జీపని ప్రస్తావించబడింది. మోహరివాడలో నివసించే దర్జీపనివారి చేష్టలను కవి శృంగార భరితంగా వర్ణించినాడు.

''కొలుచును జేనవెట్టి కుచకుంభయుగం బెగడిగ్గ కన్నుగ్రే
వలపరికించు కక్షముల వైచును దృష్టులు మాటిమాటికిన్

కలికితసంబునందఱచు గానగు సౌచిక పల్లవుండుకం
చెలవెసకుట్టియీాడు వెలచేడియకున్ విషయాభిలాషియై''

సౌచికుడంటే సూదితో బట్టలు కుట్టేవాడని అర్థం. విషయాభిలాషియైన దర్జీ వేశ్యలకు ఒక పెట్టున రవికలు కుట్టి ఇచ్చేవాడు కాదని పద్యంలోని భావం

రజకవృత్తి :

శుకసప్తతిలో పాలవేకరి కదిరీపతి బట్టలు ఉతికే వానిని గూర్చి తెలిపినాడు. తెల్లవారక ముందే చల్దన్నం తిని, మైల బట్టల మూటను తీసుకొని. గాడిద మీదెక్కి చాకలి వారు రేవుకు వెళ్ళేవారు.

''వేళమె కోడికూతయగు వేళల చల్ది భుజించి బండ్లుగం
గాళము కూడు నీరు చవుకారము లేవిడి యంపు చొక్కుతో
మైలల మోపు పీపున నమర్చిన రేవు గుఱానికెక్కివ
య్యాళిగ బోవువాడు విమలాప తటాక సమీప భూమికిన్'' 3-103

వేశ్యావృత్తి :

జారచోర కృత్యాలను శాస్త్రిలు ఒకవైపు పాపమని చెబుతున్నప్పటికీ అవి మాత్రం కొనసాగుతూనే ఉన్నాయి. ప్రాచీన సాహిత్యంలో వేశ్యా వర్ణన లేని కావ్యం లేదని చెప్పవచ్చు. పురవర్ణనల్లో వేశ్యా వర్ణనలు తప్పనిసరి చోటు చేసుకొన్నాయి. భోగలాలసులైన పురుషుల ఆనందం కోసం వేశ్యాజాతి ఏర్పడినట్లు ఊహించవచ్చు. వేశ్యలు మొన్న మొన్నటిదాకా పెళ్ళిళ్ళలో పాటలు పాడి బహుమానాలు పొందినట్లు చూస్తాము. పల్నాటివీర చరిత్రలో బాల చంద్రునికి శ్యామాంగి, వైజయంతీ విలాసంలో విప్రనారాయణునికి దేవదేవి అనే వేశ్యలున్నట్లు చెప్పబడింది. వేశ్యలు తమ కూతుళ్ళను వేశ్యావృత్తిలో ప్రవేశింపజేయడానికి ముందు ముకుర పీక్షా విధానాన్ని అమలు జరిపినట్లు క్రీడాభిరామంలో వర్ణించబడింది.

''........నేటి యపరాహ్ణ సమాగమవేళ పుష్యన
క్షత్రమునందు నీయనుగు గాదిలి కూతురు చూచునద్దమున్'' ప. 194

ఆముక్తమాల్యదలో వేశ్యల అలవాట్లు చెప్పబడ్డాయి. ఆకాలంలో వేశ్యలు విడెంవల్ల ఎరుపెక్కిన దంతాలను వరిగింజతో గీసుకొని తెల్లబరుచుకొనేవా రు

శరీరం నిగనిగలాడేట్లు పసుపు రాసుకొని జలకాలాడేవారు. కులాన్ని తెలుసుకొని విటులతో రమించేవారు. స్నేహపాత్రుడైన విటున్ని దరిద్రుడైనప్పటికీ ఆదరించేవారు.[1]

చోరవృత్తి :

బసవపురాణంలో చోరవృత్తిని అవలంబించేవారి సాధనాలు ప్రస్తావించబడ్డాయి.

''కత్తియు బలపంబు కావిచీరయును కత్తెరయిసుమునక్షత్రములునుముండ్ల
బంతియు నీలి కప్పడమును ద్రిండు మంతరకాటుక మఱిచండవేది
సెలగోలయొంటట్టి చెప్పులు పీకె యొలుకుల బూడిదయును వాటుఱాలు
కుక్కలపాకట్టుకొంకినారసము క్రక్కున కంకటి రజ్జువు నమర
సూచీముఖంబైన చొనుపంగరాని యేచిన చీకటినిండ్ల పంచలకు
జిడిముడిపల్కులచేరి యుల్వరిసి గడియకన్నంబును గడపకన్నంబు
గోడకన్నంబును గుఱినేలకన్నమోడక త్రవ్వి యిల్లొయ్యనజొచ్చి''
ఆ. 5, పు. 155

సోమనాథుడు పేర్కొన్న ఈచోరసాధనాలు సింహాసనద్వాత్రింశిక, పరమయోగి విలాసం మొదలైన కావ్యాల్లోనూ పేర్కొనబడ్డాయి. పైపద్యంలోని 'ద్రిండు' నడుముకు కట్టుకొనే పట్టీ లేదా పీపుకుచుట్టే బట్టల చుట్ట అనీ, 'మంతర కాటుక' మంత్రించిన కాటుక అనీ, బూడిద శ్మశానంలోనిదనీ వివరిస్తూ 'చూడవేది' అనే పదానికి నిఘంటువులో అర్థంలేదనీ శ్రీ సురవరం ప్రతాప రెడ్డిగారు తెలిపినారు.[1]

సింహాసన ద్వాత్రింశికలో ప్రస్తావించబడ్డ చోరసాధనాలను చూడండి.

''గాలిచీరయు నాల్క బూడిద గ్రద్దగోరును కొంకియున్
కోలయున్వెలుగార్చు పుర్వులక్రోవి ముండుల బంతియున్
మైలమందులకొయ్య కత్తెర మాఱుగన్నపు కత్తియు
న్నీలి దిండులు నల్లపూతయు నేర్పుతోడుగ ముచ్చులున్'' 10-118

కన్నం దగ్గర గాలి చొరకుండా కట్టే వస్త్రమే గాలిచీర. చోరులు స్మశానంలోని బూడిదనుతెచ్చి చల్లితే అది మత్తుమందుగా పని చేస్తుందని భావిస్తారు. గ్రద్ద

1. ఆముక్తమాల్యద, 1-60, 2. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పు. 162.

గోడతో కన్నం పెట్టేచోట గీస్తారు. తాడుకు కొంకిని, ముండ్ల బంతిని కట్టి గవాక్షం ద్వారా ఇంట్లోకివేసి వస్తువులను పైకి తీస్తారు. పురువుల్రకోవితో దీపాలను ఆర్పేస్తారు. చీకటిలో ఎవరికీ కనిపించకుండా ఉండడంకోసం శరీరానికి నల్లని పూతను పూసుకొంటారు.

ఇతరుల చప్పుడు వింటూ, తమ చప్పుడు వినిపించకుండా జాగ్రత్త పడుతూ అవసరమైనచోట మొద్దుల్లాగా ఉండి ఆ తరువాత కదలడం చోరులకు అలవాటు.

''చప్పుళ్ళాలించుచు తమ చప్పుళ్ళడచుచును చొచ్చి సందులలోనన్
చొప్పెరుగకుండనేగుచు తెప్పలుమాటైన దాగురింపుచు పురిలోన్'' 10-119

ద్విపద పరమయోగి విలాసంలో తిరవేంగనాథుడు చోరకళను వర్ణించినాడు. చోరులు ఆకాలంలో వైష్ణవుల్లాగా పట్టెనామాలు పెట్టుకొనేవారు. ఖారకోలను తోడుగా వెంట తీసుకొని వెళ్ళేవారు. మూలిక (బదనిక) లను మత్తు కల్గించడానికి నిద్రించినవారి నాసికల దగ్గర ఉంచేవారు.[1]

ఇట్లే కందుకూరి రుద్రయ్య రచించిన నిరంకుశోపాఖ్యానంలో కత్తి, బలపం మొదలైన చోరసాధనాలు పేర్కొనబడ్డాయి.[2]

వేట :

ఆటవికుల ప్రధానమైన వృత్తి వేట. చెంచులు వేటాడడంతోపాటు తమ నివాసభూములైన అడవుల్లో లభించే తేనెలనూ, పళ్ళనూ, రకరకాల మూలికలనూ సేకరించి వాటిని గ్రామాల్లోనూ, నగరాల్లోనూ అమ్ముతారు. మంచన కేయూర బాహుచరిత్రలో బోయవారు అడవినుంచి తేనెను తెచ్చి నగరంలో అమ్మినట్లు పేర్కొన్నాడు.

''ధరణిపయి లాటనరపతి పురి తేనియ నమ్ముకొరకు బోయలపల్లెన్
చరియించుచుండువాడొక పురుషుండదియొక్క కలశమునగొని కడకన్''
2-11.

వేట రాజులకు వినోదం కాగా బోయవారికది జీవనోపాధి అయ్యింది. ప్రాచీన కవుల్లో ధూర్జటి వలె వేటను వర్ణించినవారు లేరు. వల్లెతో ఎట్టినకూ,

1. ద్విపదపరమ యోగివిలాసం, 6-485, 2. నిరంకుశోపాఖ్యానం, 2-26

ప్రకృతితో రాయలకూ ఉన్న పరిచయమే వేట విషయంలో ధూర్జటికి ఉందని చెప్పవచ్చు. శ్రీ కాళహస్తి మాహాత్మ్యాన్ని పరిశీలిస్తే చెంచువారి ఆచార వ్యవహారాలనూ, విశ్వాసాలనూ, వేషధారణనూ, ఆభరణాలనూ, ఆహార విహారాలనూ, ఆరాధనావిశేషాలనూ ఒక్క ధూర్జటి మాత్రమే అత్యంత సహజ మనోజ్ఞంగా చిత్రించగలడేమో అన్న భావన కలుగుతుంది.

తిన్నని కథను ధూర్జటి సహజరమణీయంగా తీర్చి దిద్దినాడు. తిన్నని జన్మస్థలం ఉడుమూరు. ఆ ఊరి చెంచులు ముత్యాలను రేగుపండ్లలాగా, తుంగముస్తెల్లాగా చూస్తారు. మంచి గంధం, కృష్ణాగరు కట్టెలను వంటకట్టెలుగా లెక్కిస్తారు.[1] చెంచు స్త్రీలు పట్టు చీరలను కాదని పండుటాకులే కట్టుకొంటారు. రాజాన్నానికి బదులు అడవి ధాన్యాన్నే వండుకొంటారు. మాణిక్యాలకు బదులు గురువిందహారాలనే ధరిస్తారు. తూగుటుయ్యాలలను కాదని తీగలతో తయారైన ఉయ్యాలల్లోనే ఊగుతారు.[2] ధూర్జటి చెంచులు వేటలో ఉపయోగించే తెరచీర కట్టలను, ప్రోగుచుట్టలను, ఏటివలలను, కుందేటి వలలను, పందివలలను పేర్కొన్నాడు. ఇంకా అతడు రకరకాలైన వేట జంతువులను; విడివేట కవసరమైన పక్షులను; ఉరులు, ఉరిగోలలు, బోనులు చిక్కాలు మొదలైన సాధనాలను ప్రస్తావించినాడు. తిన్నడు చిన్నతనంలోనే తెర వేటతోపాటు కుక్కలను, పక్షులను ఉపయోగించి వేటాడే పద్ధతులను నేర్చుకొన్నాడు.

''ఒకనాడు తెరవేటనుగ్రసత్వంబుల
  పుడమిపై తడకాలు పడవధించి
యొకసారిసారమేయోద్ధతి నుద్ధుర
  స్తబ్ధరోమంబుల సంహరించి
యొకమరి దీమంబులొడ్డి పాదులు దీర్చి
  బహువిహంగంబుల పట్టితెచ్చి
యొకవేళ డేగవేటకు చని యెగజోపి
  నానాండజములప్రాణములు గెడపి
ముంగివేటేదు వేట సివంగివేట

1. శ్రీకాళహస్తిమాహాత్మ్యం, 3-4; 2. అదే, 3-6.

యిట్టివేటయుగంటవే పెద్దవేట
మొదలుగాగల వేటల యదనెఱింగి
తిన్న డొక్కొకక్కతూకు వర్తింపదొడగె'' 3-47.

వేటలో మొదట దొరికిన మృగాన్ని శివునికి అర్పిస్తారు.

''మున్నువడిన మెకము గొనివచ్చి మిడిగ్రుడ్లు
పొడిచి నీట శిరము తడిపి తోక
కోసి ధూపమిచ్చి మీసంబు పెకలించి
కానుకిచ్చి కాటి ఱేని గొలిచి'' 3-49

చంద్రభాను చరిత్రలో వేటసాధనాలు పేర్కొనబడ్డాయి.
''వలలు నురుల్ సిడుల్ పిసులు వంకర దుడ్డులు వందిపోట్లు దీ
ములు గొర కత్తెరల్ జిగురుమోకులు బోనులు గాలియుగ్గు బొం
గులు మిడివిండ్లు బందములు కొమ్ములు పాయలువల్లెత్రాళ్లు చి
వ్వల తడికెల్ ధరించి యిరువంకల జేరిరి కొందరుద్ధతిన్'' 2-21

ఇదే కావ్యంలో మల్లన్న పేర్కొన్న వేట కుక్కల పేర్లు చిత్రంగా ఉన్నాయి. వాటివాటి స్వభావాన్ని అనుసరించి ఆటవికులు పేర్లు పెట్టినట్లు భావించవచ్చు.

''జాతర పుట్టచెండు నెరజాణ గయాళి కరాళి దిట్ట చిం
బోతు తుపాకి జోగి సుకబోగి తుటారి తలారి మారి సం
గాతి లకోరి కోరి యనగా చను కుక్కలకేలబూని....'' 2-24

శివునికి తొలి జంతువును అర్పించడం చంద్రభానుచరిత్రలోను చెప్ప బడింది. యయాతి చరిత్రలో తెలగన్న వేటలో ఉపయోగించే రకరకాల వల లను ఒక జాబితాగా ఇచ్చాడు.

''వేట వలలును మేటి కుందేటి వలలు
నెలుక వలలును సవదండ వలలుదొడ్డి
వలలు పందిటి వలలును బలువు పకిల
వలలు మొదలుగ గలిగిన వలలు మఱియు'' 1-10

ధూర్జటి, మల్లన కవులు వేటలో లభించిన తొలి మృగాన్ని చెంచులు శివార్పణం చేసినట్లు చెప్పగా తెలగన్న మాత్రం రాజార్పణం చేసినటు

పేర్కొన్నాడు. వలల రకాలతోపాటు వేట పక్షుల రకాలను కూడా అతడు ప్రస్తావించాడు. విడి వేటలో పక్షులను ఒకేసారి వదలిపెట్టినప్పుడు అవి ఆకాశం లోకి ఎగిరి చూపరులకు ఆనందాన్ని కల్గించేవని వర్ణించాడు. ఇట్లే శుకసప్తతిలో కదిరీపతి తన కాలంలో వేటకు ఉపయోగించేసాధనాల బహుళంగా పేర్కొన్నాడు. అతడు కొత్తగా చెప్పిన వాటిలో తుపాకులు, పిడకల కుంపట్లు, గొడ్డళ్ళు ఉన్నాయి.

"పచ్చ కట్టెల గురుల్బలు తుపాకులునెద్దు
లేనుంగులు సివంగు లిటిపోతు
పిడుక కుంపటులాకు తడికెలు ప్రోగుత్రా
ళ్వాడి గొడ్డండ్లు ముప్వంపుటురులు...." 1-254

ఈ విధంగా ఆయా కావ్యాల్లో ఆటవికులు వేటాడే పద్ధతులు, వారు వేటలో ఉపయోగించే సాధనాలు వర్ణించబడ్డాయి. మొత్తంమీద ఆటవిక జీవనాన్ని, వేటనూ బహుముఖంగా చిత్రించిన కావ్యం శ్రీకాళహస్తిమాహాత్మ్యమే.

# రూపచిత్రణ

పాత్రల వివిధాకార వర్ణనలే రూపచిత్రణ. పాత్రకు సంబంధించిన సూక్ష్మాతి సూక్ష్మాలైన అంశాలను విడవకుండా పేర్కొనడంవల్ల ఆ పాత్రకు సమగ్రమైన రూపం సిద్ధిస్తుంది. పాఠకుని మనస్సులో ఆ రూపం చిత్రితమౌ తుంది. పాత్రలను గూర్చి ఒక విధమైన అవగాహన ఏర్పడుతుంది. మన ప్రాచీన కవులు స్వభావ చిత్రణకిచ్చిన ప్రాధాన్యాన్ని రూప చిత్రణకు కూడా ఇచ్చినట్లు కనిపిస్తుంది. ప్రపంచంలో రకరకాల వ్యక్తులున్నారు. కేవలం స్వభావం చేతనే కాక రూపంచేత కూడా ఒకరికంటె మరొకరు భిన్నంగా కనిపిస్తారు.

రూపచిత్రణ అంటే కేవలం వ్యక్తియొక్క శరీరం కొలతలు, రంగులు కాదు. జాత్యనుగుణంగా, ఆచారబద్ధంగా వస్త్రాలు, ఆభరణాలు ధరించి ఒక వైలక్షణ్యాన్ని కలిగి ఉండడమే. రూపచిత్రణలో వ్యక్తుల అభిరుచులు, సంస్కృతీ సంప్రదాయాలు, విశ్వాసాలు కూడా ప్రతిబింబించవచ్చు.

రూపచిత్రణ అనే ఈ ప్రకరణంలో గ్రామ సమాజంలోని స్త్రీ పురుషుల రూపురేఖలు, వారి వస్త్రధారణ, ఆభరణాలు పేర్కొనబడ్డాయి. అంతేకాక ఈ ప్రకరణంలో కుటుంబ జీవనానికి ఆలవాలమైన గృహాలు, గృహనిర్మాణాలు, గృహోపకరణాలు, గృహాలంకారాలు నిరూపించబడ్డాయి. ఎఱ్ఱాప్రెగ్గడ చిత్రిం చిన గొల్లపల్లె కూడా ఇందులో గ్రహించబడింది.

**రూపురేఖలు :**

**గోపాలుడు**

బసవపురాణంలోని మాదిరాజయ్య కథలో పాల్కురికి సోమనాథుడు చిత్రించిన వృద్ధగోపాలుని రూపాన్ని చూడండి.

"బలుపుప్రేళ్ళను మొద్దుపాదముల్ గుజ్జు- చిఱుతొడలును దొప్పచెవులును బరడు
ప్రక్కలు బీరసరములును జిదక - ముక్కనుముడిబొరుల్ మొగిదోని కడుపు
బొక్కిళ్ళుపోయిన చెక్కిళ్ళువలుద - బొక్కిబొమ్మను పెద్దనిక్కిన మెడయు
పల్లమీసములు నేర్పడు కాయకన్ను - పిల్లిగడ్డంబును నల్లని మేను
ప్రాకువట్టినపండ్లు బ్రద్దచేతులును - వీకకాళ్ళను నడ్డి వీపును దనర
ములుగత్తియుచ్చుకోకలు చూడుకొడుపు - మొలతిత్తినిడి దొడ్డమొలకచ్చ గట్టి
గాలిదప్పళు వెంద్రుకల్ దూలియాడ - నీలవెట్టుచు నుఱిమెట్టి చూచుచును
కుక్కల బిలుచుచు ఈకవెట్టుచును - నెక్కొన నొరగాల నిలుచుచుజనుచు''
ఆ. 3, పు. 96

మొద్దుబారిన పాదాలు, చిన్న తొడలు, దొప్ప చెవులు, ముడిపడ్డ బొమ్మలు, పీల్చుకపోయిన చెంపలు, నిక్కిన మెడ, పల్లమీసాలు, కాయగాసిన కన్ను, పిల్లిగడ్డం, నల్లని శరీరం, పాచిపండ్లు, గూనివీపు – ఇదీ వృద్ధ గోపాలుని రూపం. ఈల పెట్టడం, ఉరిమురిమి చూడడం, కుక్కలను పిలవడం, ఓరగాల నిలబడడం అతని స్వభావాన్ని సూచిస్తుంది.

హరివంశంలో ఎఱ్ఱన నందగోపుని రూపాన్ని చిత్రించినాడు.

''పరిమిత పలితైక భాసురంబగు కేశ
సంచయంబారణ్య సంచరమున
తరువులరాలు కేసరముల నత్యంత
ధూసరంబై కడుమాసరమున
గోఖురోద్ధత రేణుకుంఠితంబగు మోము
చెమట బొట్టుల చాల చెన్నుమిగుల
కట్టిన చెంగావి కాసె లేజిగురుల
జిగినూని తనువతిస్నిగ్ధ కాంతి
నలర కర్కష గ్రంథిల యష్టిచేత
బట్టి గోపాల పరివార బహువిధోక్తు
లెలసి చెలగంగ కదుపులవలన నుండి'' 5-181.

అడవిలో గోపాలురు తిరుగుతున్నప్పుడు వారిమీద చెట్లనుంచి పుప్పొడి పడడం సహజం. అసలే నెరసిన తల నందునిది. అతని మీద పుప్పొడి రాలింది. పసుల గిట్టలచేత ఎగురగొట్టబడ్డ దుమ్ము అతని ముఖాన్ని ఆవ

ించింది. వీటికితోడు కష్టాన్ని స్ఫురింపజేసే చెమట బిందువులు. చెంగావి ధోవతి కట్టుకొన్న నందుడు చేతిలో ముళ్ళకట్టె పట్టుకొని తోటి గోపాలురతో మాట్లాడుతూ గోకులంలో ప్రవేశించినట్లు కవి చేసిన వర్ణన సహజ రమణీయంగా ఉంది.

ఇట్లే కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీ పరిణయంలో నీలను వివాహమాడడానికి వచ్చిన గొల్లవారి రూపురేఖలు చక్కగా వర్ణించబడ్డాయి.

"కిర్రుచెప్పులు గొప్ప గీరునామంబులు మొలచెక్కు కత్తులు నిలువు సికలు కుడిముక్కు కమ్మలు గురివెంద పేరులు, పిల్లగ్రోవులు మేటి వల్లెత్రాళ్ళు నొరగట్టు పంచెలు బెరసుపచ్చడములు, కార్కొన్నలోవంక కటియొడళ్ళు గుండుబోగులుచిప్పగొడ్డండ్లు సెలగోలలొప్పారుపలువంక యుంగరములు.

కలిగి గాటంబుగా నెల్లకడల నుండి
పెల్లుమీఱగ గిబ్బల పీచమణచి
కోర్కులిగురొత్త కన్నె చేకొనెదమంచు
మెల్లగను జేరిరచటికి గొల్లలెల్ల" 3-49.

కిర్రుమనే చెప్పులు తొడుగుకొని, నుదుట కొనగోటితో గీరు నామం పెట్టుకొని, మొలలో కత్తులు చొప్పించుకొని, పొడగాటి జుట్టు వ్రేలాడుతుండగా, కుడివైపు ముక్కుకు పోగులు కుట్టించుకొని, మెడలో గురివింద హారాలు వేసుకొని, పంచెలు కట్టుకొని, ముతక దుప్పట్లు కప్పుకొని, పిల్లనగ్రోవులూ, పశువులను బంధించే త్రాళ్ళూ, చిప్పగొడ్డళ్ళూ, సెలగోలలూ మొదలైన వాటిని వెంట తీసుకొని వచ్చినట్లు చేసిన వర్ణన తిమ్మకవి యొక్క గ్రామ జీవన పరిశీలన పాటవాన్ని చాటుతుంది.

మొలకత్తులు, గొడ్డళ్ళు, సెలగోలలు మొదలైన వాటిని పాల్కురికి సోమనాథుడు కూడా పేర్కొన్నాడు. చిప్పగొడ్డళ్ళనే ఈ రోజు మనం గొడ్డలి చిప్పలంటున్నాం. గొల్లవాళ్ళ కోసం ప్రత్యేకంగా నేసే పంచెలే గొల్లపంచెలు.

ఇట్లే హంసవింశతిలో సుద్దులగొల్లలు పేర్కొనబడ్డారు. చర్మవాద్యాలు మ్రోగిస్తూ, కొమ్ములూదుతూ, కృష్ణలీలలు చిత్రితమైన పటాలను, కాటమరాజు కథలు వ్రాసిన పుస్తకాలను పట్టుకొని, ముఖ పట్టికలతో కూడిన రుమాళ్ళ

ధరించి, సొమ్ములు పెట్టుకొని, గిరునామాలతో గొల్ల సుద్దులు ఆ కాలంలో సంచరించేవారు.

> ''కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు వ్రాతల కృష్ణలీలలం
> గ్రమ్ము గుడార్లు పీరుడగు కాటమరాజు కథానులాపముల్
> పమ్మిన పుస్తకాలు ముఖ పట్టిక కట్టు రుమాలులున్ నెఱా
> సొమ్ములు నామముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్''
>
> 2-87.

డా. తంగిరాల వేంకట సుబ్బారావుగారు సుద్దుల గొల్లలను గూర్చి అనేక విశేషాలు తెలిపినారు. ''గొల్లసూక్తులు" అనే శబ్దం నుంచి గొల్ల సుద్దులు అనే శబ్దం పుట్టింది. కాటమరాజు కథలు పాడేవారికి ఈ పేరు వ్యవహరించబడింది. వీరు గొల్లల్లో ఒక శాఖ. వీరు యాదవుల్ని యాచిస్తారు. సుద్దులు పాడడం వల్ల సుద్దుల గొల్లలని పేరు కల్గింది. రాయలసీమలో వీరు సుద్దులన్నలుగా పేర్కొనబడినారు. నెల్లూరు, ప్రకాశం జిల్లాల్లో యాచకులని, తెరచీర భక్తులని పిలుస్తారు. తెలంగాణాలో ఎఱ్ఱగొల్లలు ఈ వృత్తి పాటిస్తారు. వీరు మేకలు కూడా పెంచుతారు.1

గోపస్త్రీ :

హంసవింశతిలో నారాయణ కవి గోపస్త్రీ వర్ణన చేసినాడు. ఆమె చక్కగా దువ్వుకొని, రవల మెట్టెలు ధరించి, చేతులకు పూలగాజులు తొడుగుకొని అందంగా అలంకరించుకొనేది.

> ''దువ్వెవ తీరుగా పసపుతో నలరించిన బొట్టు నున్నగా
> దువ్విన కొప్పు వన్నెగల దుప్పటి ముప్పు విడెంబు పుక్కిటన్
> మవ్వపు పోగునూల్ రవలమెట్టెలు చేతుల పూలగాజులున్
> నివ్వటిలంగ గోపహరిణీ తరళేక్షణ పోవ ముందటన్'' 2-115.

బ్రాహ్మణుడు :- క్రీడాభిరామంలో గోవిందమంచనశర్మ వేషం వర్ణించబడింది. మంచనశర్మ వేషధారణనుబట్టి ఆనాటి బ్రాహ్మణుల రూపురేఖలను తెలుసుకొనవచ్చు.

---

1. కాటమరాజు కథలు, ccl vii

"గన్నేరుపూచాయ కరమొప్పు నీర్కావి
మడుగుదోవతి పింజెవిడిచికట్టి
గొజ్జంగి పూనీరు గొలికిమేదించిన
గంగమట్టిలలాటకమున దీర్చి
వలచేత బంగారు జలపోసనముతోడ
బ్రన్ననిపట్టుతోరము ధరించి
జరిగొన్న వెలిపట్టుజన్నిదంబులలుంగ
యంటులు వాయంగ నఱుతవైచి
తళుకు చెంగావి కోకయు వలుద శిఖయు
విగురు బొమ్మంచు పెదవులు చిన్ని నగవు
నందమొందంగ వచ్చె గోవిందశర్మ" ప. 42

నందగోపుడు చెంగావి దోవతి కట్టుకొన్నట్లు ఎఱ్ఱన వర్ణించాడు. ఇట్లే మంచన శర్మ కూడా గన్నేరురంగు నీర్కావి దోవతి ధరించినట్లు క్రీడాభిరామకర్త పేర్కొన్నాడు. అనంతర కావ్యాల్లోను చెంగావి వస్త్రాల ప్రసక్తి కనిపిస్తుంది.

హంసవింశతిలో నారాయణామాత్యుడు బ్రాహ్మణబ్రహ్మచారుల వేష ధారణను వర్ణించినాడు. వారు కొంచెం కుళ్ళాయి కనిపించే విధంగా పంచెలు కట్టుకొని, తపాలలుంచిన చిన్న అసిమి (గోనెసంచి)ని భుజాలమీద పెట్టుకొని, దర్భల మొలత్రాడు కనిపించే విధంగా అంగ వస్త్రాన్ని ధరించి, మంత్రాక్షతలున్న మారేడు బుర్రలు, వేదాంతం వ్రాసిన తాటాకు పుస్తకాలు పట్టుకొని సంచరించేవారు.[1]

బవనీలు : బవనీలే జెండ్లవాళ్ళు. పెళ్ళిజాతరలందు సుద్దులు పాడుతూ ఆటలాడుతారు. ఇతరులను స్తోత్రంచేస్తూ జీవించడం వీరి వృత్తి. బవనీలు పరశురాముని కథలు పాడినట్లు క్రీడాభిరామంలో వర్ణించబడింది.

"పరశురాముని కథలెల్ల ప్రౌఢి పాడె
జాడతరకీర్తి బవనీల చక్రవర్తి" ప. 130

బవనీల వేషధారణను శుకసప్తతిలో కదిరీపతి వర్ణించినాడు.

---

1. హంసవింశతి, 1-157.

''దుసికిలజారు కోరసిగ దుప్పటినీటు లలాట పట్టికం
బొసగు విభూతిపై పసుపుబొట్టును దొట్టిన కల్లు చొక్కవె
క్కసముగ నెఱ్ఱవారిన వికారపు చూపులుగా కసంబడన్
వెసజనుదెంచె నొక్క బవనీడు తదీయ సమీప భూమికిన్'' 2-414

జారిపోయే సిగలు, కప్పుకొన్న దుప్పటి, ముఖాన విభూతి, దానిమీద పసుపుబొట్టు, కల్లు త్రాగడంవల్ల సుత్తెక్కి ఎర్రబడ్డకళ్ళు, వికారపుచూపులు బవనీల రూపురేఖలను తెలుపుతున్నాయి.

ఈ బవనీలు జమలిక అనే వాయిద్యాన్ని ప్రయోగిస్తూ ఇతరుల నుంచి ధనధాన్యాలు యాచిస్తారు. పూర్వీకులను గూర్చి స్తుతిస్తారు.

''వచ్చి జమలిక వాయించి వరుసతోడ
తాత తండ్రుల చౌదరి తనములెల్ల
నెన్ని కైవార మొనరించి యింపునెఱప
నతని గూర్చుండ నిడుకొని యాదరమున'' 2-415

కాపు స్త్రీలు :- ఏకశిలా నగరానికి పల్లెనుంచి వచ్చిన కాపుస్త్రీ రూపురేఖల్ని క్రీడాభిరామకర్త మనోహరంగా వర్ణించినాడు.

''జటివోనిగడితంపు చిఱుత చౌకంబుల
తొగరుపుట్టము కచ్చతొడివి కట్టి
నొలగంధపు బొట్టు నుపరిభాగంబుపై
సింధూర తిలకంబు పొందుపరిచి
పసరు దారెడునింబ పల్లవంబుల దండ
గుబ్బచన్నుల మీద కుదురుకొలిపి
క్రొత్తదోమిన దంత కోరకంబులయందు
తాంబూల రాగంబు తళుకుగూర్చి

సకల సంధ్యంగములకు తేజంబుగలుగ
పుదుముదారంభ మణకువ మరలత్రోవ
తేకువయు నారజంబును తేటపడగ
పురమునకు వచ్చె నొకకాపు పూవుబోణి'' ప. 134

కొందరు కాపుస్త్రీలు మద్యాన్ని సేవించిన వారై అందమైన గళ్ళచీరలూ రవికలూ ధరించి, ముఖాన ఓలగంధం బొట్టు పెట్టుకొని దానిమీద సిందూరాన్ని దిద్దుకొని, వేపాకు చిగుళ్ళ దండలు మెడలో వేసుకొని నోట్లో తాంబూలాన్ని నములుతూ గ్రామాల నుంచి నగరాల్లో జరిగే సంతలకు బయలుదేరి వచ్చేవారని పై వర్ణనవల్ల తెలుస్తున్నది.

గ్రామీణస్త్రీలు స్నానానంతరం నుదుట పెట్టుకొనే పసుపుబొట్టు ఓలగంధం. కాపుగుబ్బెతలకు సంబంధించిన రూపవర్ణనను శుకసప్తతిలోను చూడవచ్చు. ఆ కాలంలో స్త్రీలు ధరించే ఆభరణాలతోపాటు వారి రూపురేఖలెలాంటివో తెలుస్తాయి.

> "గొంటుపూసలు రెండు గుండ్లముంగరలు మై
> జారు చీరలు పైన సన్నగొలుసు
> పెద్ద మట్టెలు మట్టి పిల్లాండ్లు బొబ్బిలి
> కాయలొత్తులతోటి కడియములును
> కప్పు పల్వరుస లుంగరములు తూలెడు
> కొంగులు బలుచెంప కొప్పులంచు
> కమ్మ గవల్సన్న కాటుక రేకలు
> నాభినామంబులు నానుచుట్లు
>
> పసుపు పూతలు గుబ్బల బాగుదెల్పు
> బిగువు రవికెలు చిగురాకు పెదవులంటు
> పిడియపు కప్పులెప్పుడు వెలయ...." 2-332

రెండు గుండ్ల ముక్కరలు, జారిపోయే చీరలు, సన్నగొలుసులు, రకరకాల మెట్టెలు, కడాలు, తాంబూలరాగంవల్ల ఎర్రబడ్డ పెదవులు, కాటుక, కస్తూరిబొట్లు, పసుపుపూతలు, బిగించినట్లు కనబడే రవికలు మొదలైనవి ఆ కాలంనాటి స్త్రీల అలంకరణ ప్రియత్వాన్ని తెలియజేస్తున్నాయి.

**పాములాడించు వ్యక్తి :** క్రీడాభిరామంలో పాములాడించి పొట్ట గడుపుకొనే వ్యక్తి రూపురేఖలు ఎలా వర్ణించబడ్డాయో చూడండి.

> "కడగోరి తీర్చిన కస్తూరి గీర్బొట్టు
> నెక్క సక్కెంబుగా చక్క మెఱయ

సద్దంబు త్రికటంబునై యురస్థలమున
గంధ సారస్థాసకములు మెఱయ
నాల నిగ్గులు గుల్కు పాలకెక్కుల కుచ్చు
వామకర్ణంబుతో వక్కళింప
బెనచి వెంద్రుకలతో పెనవెట్టి చుట్టిన
ప్రాత చంద్రిక వన్నెపాగయమర
జన్నిదంబుగ పెనుబాము సవదరించి
యంఘ్రి కటకంబు ఘల్లుఘల్లనుచు మొరయ
నాహితుండిక గరళ విద్యాధిరాజు
వచ్చె పాముల వెంగడు వదరులాడు" ప. 223

కొనగోటితో దిద్దిన కస్తూరిబొట్టు, రొమ్ముకు అడ్డంగా మూడురేఖలుగా తీర్చిన గంధం, కుంకుమచారలు, ఎడమ చెవిని కప్పినకుచ్చు, జుట్టును పెన వేసి చుట్టిన పాత చెంగావి తలపాగ, మెడలో జందెంలాగా ప్రకాశించే పెద్ద పాము, కాళ్ళకు గజ్జెలు— ఇదీ పాములవాని రూపం.

గ డి డు: — వీరరస ప్రధానమైన పాటలను పాడుతూ భిక్షమెత్తే జాతి క్రీడాభి రామంలో పేర్కొనబడింది. ఈజాతి వ్యక్తిని గడిడు అంటారు. అతనిచేష్టల్ని, రూపురేఖల్ని కవి చిత్రంగా వర్ణించినాడు. ప్రజలకు వినోదం కల్గించే ఆట పాటల జాతిగా వీరిని లెక్కించవచ్చు.

"సున్నసైనలు పెక్కి నొసలిచేరువకంటి
కెకువ వైచిన శిఖపెరలు చుండ
గరసాన దిగిచిన కలివెగందపుబొట్టు
తిరికట్టుకొని మోము తిరిగియుండ
పటపెట దిమికిట ధ్వనులోలి పుట్టింప
జాలు గుమ్మెట చంకవ్రేలుచుండ
సలుకసై మీచేత నంటిన యాక్రొత్త
మువ్వలత్రెము సారెములుగుచుండ
నొసలు స్రుక్కించు నావుర్న నోరు దెరుచు
గ్రుడ్లు మిడికించు రాగమ్ము గుమ్మడించు

పాడుగలులకు తను దానె పరగియాడు
నల్లియాతడువో తూర్పునాటి గడిడు''  ప. 226

ముఖంమీద అటూ ఇటూ కదిలేజుట్టు, కలివెగంధంబొట్టు, ఒకచంకలో చేవమున్న కాగితం గూడు, చేతిలో గజ్జెలు ఇదీ అతని రూపం. నొసలు ముడి వేయడం, ఆవురుమని నోరు తెరవడం, కనుగ్రుడ్లు పెద్దగా చేయడం, పాడుతూ పాటకనుగుణంగా ఆడడం అతని విచిత్రస్వభావాన్ని సూచిస్తున్నాయి.

మేదరి :– వెదురుతో చాపలు, తడకలు, బుట్టలు అల్లే జాతిమేదర. ద్విపద పరమయోగి విలాసంలో తాళ్ళపాక తిరువేంగళనాథుడు మేదరి రూప చిత్రణను సహజ సుందరంగా చేసినాడు.

“........మొలత్రాటచెక్కిన మోటకత్తియును
కొనసిగతో కూడికురులొకయింత
గసుపట్టి చెరివిన గన్నెరాకమ్మ
గొసల వెల్వాడు పుట్టగోచి యునెరులు
పెనుగొన్న నునుదబ్బపీచుడాకేల
వెడవెడ జివ్వాడు వెదురుసలాక
యెడమచేబొటవ్రేలి యినుప యుంగరము”  2-65

చెట్లకొమ్మల్ని కొట్టే పెద్ద కత్తి మోటకత్తి. ‘కటీ తటిన్ బెట్టిన మోట కత్తులన్’[1] అని పెద్దన వీటి ప్రసక్తి తెచ్చినాడు. మోటకత్తినే మచ్చుకత్తి అంటారు.

మేదరి అడవిలో వెదురును సేకరించి మోపులు కట్టే విధానాన్ని తిరువేంగళనాథుడు కళ్ళకు గట్టినట్లు వర్ణించినాడు.

“కటకెక్కి చిట్టెలు కట్టెలో మునిగి
కుజచలై వంకర కొంకరలోవోక
నల్లనై చక్కనై నవరనై పెరిగి
వెల్లవోవని పండు వెదురులుచూచి
నెఱికె కుప్పలువైచి నయముగా చివ్వి
కుదియించి కుదియించి మోపులుగట్టి”  2-66

1. మనుచరిత్ర, 4.33

కాసెవారు. -ఇండ్లను నిర్మించే వారిని కాసెవారని వ్యవహరిస్తారు. తిరువేంగళ నాథుడు వీరిని తన పరమయోగి విలాసంలో పేర్కొన్నాడు.

''కలయ నాచార్యుల కాసీలనపుడు
పిలిపింప వారలు పెనుజన్నిదములు
చంకల శిల్పశాస్త్రముల పుస్తములు
వంకవోజుట్టిన వలుద పాగలును
కొలదిరేఖలు వడి కోసినయట్టి
యెలమించి వలకేలి యినుప కమ్మిలును
నలవడశిల్ప శాస్త్రాగమ వేత్త
లలపరాంతకునకు హస్తముల్మోగిచి''   7-538

కాసెవారు జందాలు ధరించేవారనీ,వాస్తుశిల్ప శాస్త్ర గ్రంథాలను ఎప్పుడూ దగ్గర ఉంచుకొనేవారనీ, పెద్దపెద్ద పాగల్ని ధరించేవారనీ, చేతిలో ఇనుప కమ్మిలు పట్టుకొని పనిమీదికి వెళ్ళేవారనీ తెలుస్తుంది.

సిద్ధుడు : ద్విపద పరమయోగి విలాసంలో సిద్ధుని రూపాన్ని కవి కళ్ళకు కట్టినట్లు వర్ణించినాడు. రాగివర్ణం తేలిన జడలు, దుప్పి కొమ్ము వాద్యాలు, విభూతి పూతలు, మొలత్రాడుకు చెక్కుకొన్న గోచి బట్టలు, రుద్రాక్షలు, శంఖులహారాలు, సంచులు, యోగపట్టెలు ఇదీ ఆ కాలంలోని సిద్ధుని రూపం.

''చిఱుతకెంజడలమై సింగినాదంబు
నెఱసినమేని వన్నెల బూదిపూత
బెత్తంపు మొలత్రాట బిగిసిచూపట్టు
గుత్తంపుగోచి చిక్కుల కుట్లబుట్ట
నిగనిగ మెఱయు మానికపుకామాక్షు
లొగిఫాలమున నొప్పుచున్న రుద్రాక్ష
మొగసిరి మసిబొట్టు మొనసంకుపేర్ల
దగిలిన పెనుజన్నిదపు రుండమాల
కప్పెరనట్టెంబు కక్షపాలయును
యొప్పుగా బిగిసిన యోగపట్టెయును''   2-81

మను చరిత్రలోని సిద్ధుని రూపం అత్యంత సహజ సుందరంగా వర్ణించ బడింది.

''ముడిచిన యొంటికెంజడమూయ ముప్పన్నె
 మొగముతోలు కిరీటముగ ధరించి
కకపాలకేదార కటకముద్రిత పాణి
 కుఱుచలాతాముతో కూర్చిపట్టి
యైణేయమైన యొడ్డాణంబు లవణిచే
 నక్కళించిన పొట్ట మక్కళించి
యారకూటచ్ఛాయ నవఘళింపగజాలు
 బడుగు దేహంబున భస్మమలది

మిట్టియురమున నిడుయోగ పట్టెమెఱయ
చెవుల రుద్రాక్ష పోగులు చవుకళింప
కావికుబుసంబు జలకుండికయును బూని
చేరెతద్గేహ మౌషధ సిద్ధుడొకడు'' 1-59

పులితోలును కిరీటంగా ధరించడం, చంకలో సంచిని పెట్టుకోవడం, చిన్నకోలను చేతిలో పట్టుకోవడం, జింకచర్మాన్ని ఒడ్డాణంగా నడుముకు చుట్టు కోవడం, కావిరంగు చొక్కాను ధరించడం, నీటితో నిండిన కమండలాన్ని చేతిలో పట్టుకోవడం సిద్ధుని ప్రత్యేకతలు. ఈ విధంగా పెద్దన తన కాలం నాటి సిద్ధుల ఆకార విశేషాలనే గళ్ళకు కట్టినట్లు చిత్రించాడు. ఇట్లే కళాపూర్ణోదయంలోను పింగళిసూరన పెద్దనవలె సిద్ధుల స్వరూపాన్ని వర్ణించినాడు.

''లలితపు భూతిపూతయును లాతపు కోలయు కక్షపాలయున్
మలగొను చిన్నకెంజడలు మందుల పొత్తము నాగబెత్తమున్
లలిగను పట్టుకిన్నెరయు లాహిరి మోదము సింగినాదమున్
చెలువలరంగ నొప్పు నొక సిద్ధుడు సింగపువారువంబుతోన్'' 2-50

సిద్ధుడు కిన్నెరను మీటుతూ వచ్చినట్లు విశేషంగా తెలిపినాడు సూరన. మొత్తంమీద పై ముగ్గురు కవులు తమ కావ్యాల్లో 15 16 శతాబ్దాల్లో సంఘంలో

సంచరించే శివభక్తులైన సిద్ధుల స్వరూపాన్ని సమగ్రంగా చిత్రించారని చెప్ప వచ్చు.

వైష్ణవుడు: పరమయోగి విలాసంలో తిరువేంగళనాథుడు వైష్ణవుని రూపాన్ని చిత్రించినాడు.

''తిరముగ నిడుపట్టె తిరునామములును - తిరుమణివడిములు తిరుచూర్ణములును
పొసగచుట్టిన యట్టి పొత్తినాగలును - గసటు లేనట్టి సీర్కావి దోవతులు
వెలది జన్నిదములు విచ్చక నడుము - బలసిన వెలిపట్టు పచ్చడంబులును
రవరవ తాంబూల రాగంబుతోడ - గవరనైయున్న చక్కని దంతములును''
ఆ. 3, పు.187

తిరునామాలు, తలపై పొత్తిపాగలు, సీర్కావి దోవతులు, జందాలు, పట్టువస్త్రాలు, తాంబూలరాగం వైష్ణవుల ప్రత్యేకతను చాటుతున్నాయి. ఇంకా ఆనాటి వైష్ణవులు గన్నేరు రంగు కావి దోవతులు కట్టుకొని నుదుట ధవళోర్ధ్వ పుండ్రాలు ధరించి పెద్దపెద్ద పుస్తకాలు చంకలో పెట్టుకొని సంచరించేవారని తిరువేంగళనాథుడు తెలియజేసినాడు. అంతేకాక అతడు ఒక వృద్ధ వైష్ణవుని రూపాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించినాడు.[1] నెరిసిన గడ్డం, నరాలు తేలిన మెడ, చేతిలో జందాలు, నుదుట ఊర్ధ్వపుండ్రాలు, వ్రాలిన కనుబొమలు, వంగిన వీపు, వణుకుతున్న తల, వదులుగా ఉన్న దోవతి, ఊతకర్ర, రుమాలు పచ్చడం, ఎడమ చేతిలో పంచాంగం, చంక సంచిలో చల్దిమూట ఇదీ ఆ వృద్ధవైష్ణవుని రూపం.

ఇట్లే వైజయంతీవిలాసంలో సారంగు తమ్మయ్య వైష్ణవుని రూపాన్ని సహజసుందరంగా చిత్రించినాడు. నెలకోసారి ముండనం చేయించుకొన్న తల, తలమీద చిన్న పిలక, మెడలో తులసిపూసల హారాలు, కర్ణకుండలాల వల్ల పెద్దగా రంధ్రాలేర్పడి క్రిందికి జారిన చెవులు, పట్టెనామాలు, చిన్న గోచి, ఎఱుపురంగు తలపాగాలు - ఇదీ అతడు చిత్రించిన వైష్ణవునిరూపం. కథానాయకుడైన విప్రనారాయణుడు వైష్ణవుడు. పరమభాగవతోత్తముడు. కవి అతని రూపాన్ని ఎలా వర్ణించినాడో చూడండి-

1. ద్విపదపరమయోగివిలాసం, ఆ. 7, పు. 509.

"అమ్మగువ కనుంగొనియెన్ ముమ్మరముగ పట్టెనామములు మైనెల్లం
గ్రమ్మికొన నుట్టిబెట్టిన గుమ్మడికాయయనుబోలె గూర్చున్నతనిన్" 2.56

పట్టెనామాలు శరీరం అంతటా పెట్టుకొన్న విప్రనారాయణుడు ఉట్టిలోబెట్టిన గుమ్మడి కాయలాగా కూర్చున్నాడట. ఎంత మనోహరమైన వర్ణన! ఇక్కడ పట్టెనామాలు ఉట్టిత్రాళ్ళతో పోల్చబడ్డాయి.

వైద్యుడు :-

తిరువేంగళనాథుడు తన కాలంనాటి వైద్యుని రూపాన్ని చక్కగా వర్ణించినాడు.

"చంక మందుల సంచి జగజంపు వలువ
పొంకుమై నిజకర్ణముల నొప్పు దూది
కునివడ చుట్టిన కుఱుమాపు పాగ
యనువంద పంచలోహంపుటుంగరము
నురుతరంబైనట్టి యూర్ధ్వ పుండ్రంబు
కరమొప్ప వలకేలి కరకకాయలును
బెరయ పచ్చడముతో పెనుపడ సంది
నరగను పట్టు బాహాట పుస్తకము
బనుపడలోగుణపాఠంబు చదివి
కొనుచు మూలికలు దిక్కుల చూచికొనుచు'' ఆ. 6, పు. 450

చెవుల్లో దూది పెట్టుకోవడం, తలపాగ చుట్టుకోవడం, పంచలోహాల ఉంగరం వ్రేలుకు ధరించడం, ఊర్ధ్వపుండ్రం (వైష్ణవుని సూచిస్తుంది) పెట్టుకోవడం, కరక్కాయలు, పుస్తకాలు, మూలికలు వెంట ఉంచుకోవడం ఆనాటి వైద్యుల ప్రత్యేకతను తెల్పుతున్నాయి. ఇట్లే తలపాగలు, పచ్చడాలు, గంధపు పూతలు, చెవుల పోగులు, ఉంగరాలు మొదలైన వాటిని వైద్యులు ధరించి నట్లు హంసవింశతిలో వర్ణించబడింది.

''మెలివడ తీగచుట్టు జిగిమించిన పాగ జినుంగు పచ్చడం
బలవడు చల్వదోవతి యొయారపు గంధపుపూత డొల్లు పో
గులు మణి ముద్రికల్ వలపుగుల్కెడు వీడ్యము చంక నట్ర మం
త్రములతుద ముచ్చెలున్ వెలయగు ప్తగుణుండను వైద్యుడొప్పగన్'' 1.232

కరణం:

కరణాలు బోడ కుల్లాలు ధరించేవారనీ, చెవుల్లో బలపాలు పెట్టుకొనే వారనీ తిరువేంగళనాథుడు వర్ణించినాడు.

''పొసగ జుట్టిన యట్టి బోడ కుల్లాలు
చింపి కుప్ప సములు చెవి దోరములును
సంపుటంబులతోడ జంపాడు నొడలు
బిగువుగా చెంప దోపిన బలపములు'' ఆ. 6. పు. 458

చెవుల సందున బలపాలు పెట్టుకోవడమనేది కరణాలు ఎప్పుడూ లెక్కలు చేస్తూనే ఉంటారనడానికి నిదర్శనం. శుకసప్తతిలో కదిరీపతి కరణం రూపాన్ని ఈ విధంగా చిత్రించినాడు.

''ముదుక తలపాగయును బాహుమూలమందు
కవిలె, చర్మపు టొఱలోని కత్తిగంట
వలతి నీర్కావి దోవతులమరి గ్రామ
కరణ మేతెంచి రెడ్డి చెంగట వసించె'' 2.416.

ఆదాయ వ్యయాలను ప్రతిరోజు వ్రాసుకొనే తాటాకుల కట్టనే కవిల అంటారు. గ్రామ కరణాలు వీటిని ఎల్లప్పుడూ దగ్గరే ఉంచుకొనేవారు. ఒక వైపు కత్తి గాను ఇంకొకవైపు గంటం (pen) గాను ఉపయోగపడే పనిముట్టు కత్తి గంటం. కరణాలు వీటిని దగ్గర ఉంచుకొనేవారు. తాటాకులను కోయడానికి కత్తి ఉపయోగపడేది. అంతేగాక అక్షరం తప్పైతే దాన్ని చెరిపి వేయడానికి కూడా అది అవసరపడేది. ఈ విధంగా ఆనాటి కరణాలు కత్తి గంటాలను రెండు విధాల ఉపయోగపడేట్లు తయారు చేయించుకొనేవారు.

హంసవింశతి కారుడు కరణం వేషాన్ని చిత్రించిన తీరు చూడండి.

''తెలి తలపాగ చొక్క మొలతిత్తి భుజంబున చల్వాపచ్చడం
బల చిటివ్రేల ముద్రిక యొయారముమీర పొగాకు చుట్ట సొం
పలరెడు కావి దోవతి పదాబ్జయుగంబున ముచ్చెలొప్పగా
నల నిభుడంత గ్రామ కరణం బటకై చనుదెంచి వేడుకన్'' 3.93

ఆ కాలంలోని కరణాలు ఒయారంగా పొగాకు చుట్టలు త్రాగేవారు. పన్నులు

వసూలు చేసే సందర్భంలో కాసులు భద్రపరచుకోవడానికి వారికి మొల తిత్తులు ఉపయోగపడేవి.

లౌకిక కార్య నిర్వహణలో ఉన్న బ్రాహ్మణులు నియోగులు. నియోగి బ్రాహ్మణులే కరణాలు. ఆంధ్ర ప్రాంతంలో నియోగులు కరణీకాలొనర్చి నట్లే తెలంగాణాలో గోలకొండ వ్యాపారులు కరణీకాలు చేసేవారు.[1] వీరి వేషం హంసవింశతిలో వర్ణించబడింది. తలమీదపాగ, చెవులకు పోగులు, చెవిసందున కలం,చక్కగా ఉతికి ధరించిన తెల్లనిదోవతి, పాదరక్షలు, చంకలో కాగితాలకట్ట, భుజంమీద కాశ్మీరు శాలువ-ఇదీ కరణీకంచేసే వ్యాపారి వేషం.

"మెలిబెట్టి చుట్టిన తెలిపైఠిణీపాగ
చెలిసందిపాగలో చెక్కుకలము
తొడిగిన నెఱచల్వ నడరునంగీజోడు
జీరాడు నడికట్టు చెఱగుకొనలు
పదతలంబుల నెట్టివాఱు పాపోసులు
చెక్కుగా చంక చీటీఖలీతి
నడికట్టులో మొలనిడిన కలందాను
హస్తాగ్రమున వ్రేలు దస్తరంబు
మించు బాహువుమీద కాశ్మీరుశాలు
చెవుల ముత్యాల పోగులు చెలువుదనర
నలతి నీర్కావి దోవతి యమరనటకు
పారుపత్తెంబు సేయు వ్యాపారి వచ్చె" 2-29.

తమ వెంట దస్త్రాలూ, కలందానులూతీసుకొని కరణాలు తిరిగే వారు. కలాలు పెట్టుకొనే చిన్న పెట్టె కలందాను. దాన్ని నడికట్టున కట్టుకొనేవారు.

రెడ్లు :-

ఆ కాలంలో వైద్యులేకాక పెద్దరెడ్లు తలపాగలు ధరించే వారనీ, చేతి వ్రేళ్ళకు ఉంగరాలు పెట్టుకొనేవారనీ, పిల్లిగడ్డాలతో వడివేసిన మీసాలతో కనిపించే వారనీ, పల్లకీలో వెళ్ళేవారనీ ద్విపద పరమయోగివిలాసంలో వర్ణించ బడింది.

---

1. ఆంధ్రసాహిత్యము-సాంఘిక జీవన ప్రతిఫలనము, పు. 318

"పసపు చుంగల తలపాగ నెట్టంబు
కసిబసి మెసగు బాగాల పీడియము
అలవడ నాందోళికారూఢుడగుచు
నలనాటి పూర్వికుడగు పెద్దిరెడ్డి" ఆ. 6, ప. 478

హంసవింశతిలో నారాయణకవి రెడ్ల వేషాన్ని సహజ సిద్ధంగా వర్ణించి నాడు. ఆకాలంలో రెడ్లు కమ్ముల వస్త్రాలను కట్టుకొనేవారు. చెవులకు స్త్రీల లాగా గంటీలు పెట్టుకొనే వారు. తలకు రుమాలు, చేతివ్రేళ్ళకు ఉంగరాలు, చెవుల సందున గన్నేరు పూలు, గంధం పూతలు, గజ్జెలు, అందెలు, కిర్రు చెప్పులు, చేతి కర్రలు ధరించేవారని తెలుస్తున్నది.

"కమ్మి పచ్చడమును గంటీల పోగులు - మొలచిట్టికమ్ముల ముదుగువల్లె
నిండుచల్వ రుమాలు రెండొంకుటుంగరం-బులుచుక్కబొట్టుసొంపొలయ మెడను
గందంపు నునుపూత కర్ణయుగంబున - నేర్పుగా చెక్కు గన్నేరుపూలు
కత్తెర గండంబు గజ్జెలు నందెలు - నాదించు జిగి సకలాది తిత్తి

పాదముల కిఱ్ఱు కిఱ్ఱని పలుకు మెట్లు
కుచ్చుటద్దాలు చేపట్టు కోల యమర
రెడ్డి ప్రియురాలి వాకిట ప్రేమ నిలిచి
వాకిలి సడల్పు మనుచు పిల్వంగనపుడు" 3-90

రెడ్ల వేషధారణ వారి విలాస జీవితాన్ని తెల్పుతున్నది.

వైశ్యుడు :

ముతుక రుమాలు గుడ్డను భుజంమీద వేసుకొని పాత దుప్పటిని పైన కప్పుకొని, నెలవంక బొట్టు పెట్టుకొని, వినాయకుని బొమ్మ ఉన్న ఉంగరాలను చేతివేళ్ళకు ధరించిన వైశ్యుడు హంసవింశతిలో వర్ణించబడ్డాడు.

"ముదుక రుమాలు గుడ్డ భుజమూలమునన్ గడితంబు మీదప్రా
తది యగు దుప్పటంబు మొలత్రాసును గీసరలుండు తిత్తిస
న్నది నెలవంక నామము వినాయకు నుంగర మంగుళంబునం
బొదలగ రత్నగుప్తుడు సమున్నతి నింటికిరా ప్రియంబునన్" 4-156

ఆ నాటి వైశ్యులు పొరలున్న తిత్తుల్లో రకరకాల నాణాలను నింపుకొని ఆ తిత్తులను తమ వెంట ఉంచుకొనే వారని తెలుస్తున్నది. ఇంకా వారు తమ వెంట ములత్రాసులు తీసుకొని వెళ్ళినట్లు చెప్పబడింది. ముల్లుగల త్రాసులే ములత్రాసులని సూర్యరాయాంధ్ర నిఘంటువు వివరిస్తుంది.[1]

ఎ క్కటి వీ రు లు :

ఎక్కటి వీరుల ప్రసక్తి సింహాసన ద్వాత్రింశికలో ఉంది. మల్లయుద్ధ క్రీడలు చేసేవారే ఎక్కటి వీరులు. ఎక్కటి వీరుల రూపురేఖలను కొఱవి గోపరాజు ఎంతో చక్కగా వర్ణించినాడు. మోకైన అంచుబట్టను కాసె కట్టుకొని, దానిమీద తాడుచుట్టి, శరీరానికి లోహంతో చేసిన కంచుకాన్ని ధరించినట్లు నల్లని తుమ్మజిగురు పూసుకొని, మెడలో రక్షగా పూసలపేరు తాయెత్తుల హారం ధరించి, నుదుట మందంగా బొట్టుపెట్టుకొని, జడలు చుట్టిన తలమీద చుంగులపాగ (కుచ్చుల రుమాలు) ధరించి చేతిలో మల్ల సాధనమైన దుడ్డుకుర్రను, కత్తికోలను పట్టుకొని సంగడీలు (తోటి స్నేహితులు) తమ ననుసరిస్తుండగా ఎక్కటి వీరులు మల్లయుద్ధ క్రీడల్లో పాల్గొనేవారు.

"కఱ కంచు వలిపెంబు గట్టిగా కాసించి
చెలిత్రాడు కాసెపై బలియజుట్టి
దేహంబు కప్పుగా లోహ కంచుక లీల
జిగిబిగి గల నల్లజిగుర మర్చి
వక్షస్థలంబున రక్షపూసల పేరు
దండ తాయెతులును తగ ధరించి
తిలకంబు దళముగా తీర్చి చుంగలపాగ
తలముడితో చొక్కెమలవరించి

కేలపుల్లతియును నీలి నూలునబూని
కేలిగతి కటారి కోలపట్టి
సంగడీలు గొల్వ చనుదెంచె నొకమత్త
గజము భంగి కలహ కంటకుండు" 7-46

---

1. సూర్యరాయాంధ్ర నిఘంటువు, 6 వ సం, పు. 551

ఎక్కటి వీరులను ఎక్కట్లు, ఏకాంగ వీరులు, కలహకంటకులు, జెట్టీలు, బంట్లు అని కూడా పిలుస్తారు. వీరిని గూర్చి కళాపూర్ణోదయంలో కూడా చెప్పబడింది.[1] పూర్వంరాజులు భూమిశిస్తును ధాన్యరూపంలో తీసుకొని ప్రతి ఊరిలో 'రాచగాదె'లు నిర్మించి అందులో ఆ ధాన్యాన్ని నిలువచేసేవారు. ఈ ధాన్యాగారాలకు కాపలాగా పెద్ద పెద్ద జెట్టీలను నియమించేవారు. ఒక గ్రామానికి మరో గ్రామానికి తగాదా వచ్చినప్పుడు ఆ ఊరివారూ ఈ ఊరి వారూ అంతా పోట్లాడకుండ ఆ ఊరి ఎక్కటినీ, ఈ ఊరి ఎక్కటినీ పోరాడే టట్లు చేసేవారు. ఆ తరువాత జయాపజయాలను బట్టి వివాదాన్ని పరిష్క రించుకొనేవారు. ద్వంద్వ యుద్ధం లాంటిదే ఎక్కటి కయ్యం. ఎక్కటి కయ్యం చేసేవారిని సూరన కటారులుగా పేర్కొన్నాడు.

చెంచులు :-

కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో చెంచువారి రూపాన్ని వర్ణించినాడు. ఆ కాలంలో చెంచులు పచ్చని చొక్కాలు, నల్లనివస్త్రాలు, పక్షి ఈకలు, పూసలపేర్లు ధరించేవారు. ఎఱ్ఱని తిలకం పెట్టుకొనేవారు. పిడికత్తి మొదలైన సాధనాలు కలిగి ఉండేవారు.

> ''నెమ్మి పచ్చని కుప్పసంబును నీలిచీరయు పీలియున్
> దమ్మి పూసలపేరు నెఱ్ఱనిధాతు బొట్టును జూడనం
> గమ్ముపై దగుసొమ్ముగా పిడికత్తి కానెనమర్చి పా
> అమ్ములన్విలు కేల బూన్కొనియంత చెంచరుదెంచుచున్'' 8.9

ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యంలో చెంచు బాలకుడైన తిన్నని వేష ధారణను కళ్ళకు గట్టినట్లు చిత్రించినాడు.

> ''జలంకంబార్చి విభూతిపెట్టి కటి కుంజాబీజ సంకీర్ణమే
> ఖల బంధించి మయూర పక్షలతికా కాండంబులంజేసి సం
> దిలి దండల్సవరించి కన్నుగవ కాంతిం గాటుకందీర్చి మం
> దుల తాయెత్తులు గట్టినన్కబర పుత్రుల్గూడి యాడంబురిన్'' 3-32

చెంచులెక్కువగా శైవాచారాలనే పాటించినట్లు కనిపిస్తుంది. వారు ముందుగా వేటలో కాత్రేనిని ఆరాధించటం ఈ విషయాన్ని బలపరుస్తుంది. గురి

1. కళాపూర్ణోదయం, 8-100

గింజల హారాలు, ముల్రతాళ్ళ ఆభరణాలు. నెమలిఈకలు, తాయెత్తులు వారికి అత్యంత ప్రీతిపాత్రమైనవి. స్త్రీ పురుషులు నెమలిపింఛాలతో అలంకరింసు కొంటారు. ధూర్జటి చెంచుస్త్రీలను వర్ణించిన తీరు చూడండి.

''కజకు జుంజాఱు వెంద్రుకల కొప్పు గాఢత
రంబుగా నెమలి పింఛంబు జుట్టి
తట్టుపున్గున వన్నె పెట్టినట్టి లలాట
పట్టిక జేగురు బొట్టు వెట్టి
గురివింద పేర్లకుందెరువీని పాలిండ్ల
పారుటాకులు గూర్చి పైటదీర్చి
జమిలి యొడ్డాణంబు సందున నిఱియంగ
బర్హాంబరము కటి పదిల పఱచి
పీకగల కఱగనుపుల నెదురువింట
జాగ పురిదాల్చి నారిగా సంతరించి
గసిక కోలలు గొని భిల్ల బిసరుహాక్షు
లడవి తిరుగుదు రాత్మనాయకుల గూడి'' 3. 15

మోహైన చింపిరి జుట్టులో నెమలి పించాన్ని చుట్టుకొని, నుదుట జేగురు బొట్టు ధరించి. పాలిండ్లపై గురువింద పేర్లనేగాక పండుటాకుల పైటను కూర్చుకొని, జంట ఒడ్డాణానికికూడా నెమలి పించాన్ని చుట్టుకొని, విండ్లనూ, మొనదేలిన కొయ్యబాణాలను చేతబట్టుకొని చెంచుస్త్రీలు తమభర్తలతో అడవుల్లో తిరిగినట్లు ధూర్జటి చక్కని వర్ణన చేసినాడు.

చెంచుస్త్రీలు మంచెలమీద ఎక్కి తాము చుట్టుకొన్న పండుటాకులు గాలికి అటూ ఇటూ చెదరగా ఒడిసెల్లతో రాళ్ళు విసురుతూ, అరుస్తూ, పిట్టల్ని పారద్రోలే వారని దూర్జటి ఒక చిత్రాన్ని గీసినాడు. ఇందులో కవి చెంచుస్త్రీల జీవన విధానంతోపాటు వారి సౌందర్యాన్ని మేళవించినాడు.

"మంచెల మీదనెక్కి కటిమండలి జుట్టిన పాఱుటాకు లిం
చించుక చంచలించి మరునిల్లు బయల్పడజేయ పిట్టలన్
చెంచెతలార్చి వేయుదురు చిత్రముగా నొడిసెళ్ళ బాహుమూ
లాంచిత దీధితుల్ చిఱుతయైన చనుంగవ మీద పర్వగన్" 3-10

ఎత్తైన మంచె, దానిమీద నిలబడ్డ చెంచువనిత, చేతిలో ఒడిసెల, గాలికి కద లాడే పండుటాకులు ఒడిసెలను త్రిప్పేటప్పుడు పాలిండ్ల మీద పడే బాహుమూల రుచులు - ఇవన్నీ ధూర్జటి కళ్ళకు కట్టినట్లు గీసిన చెంచెత చిత్ర భంగిమలు.

యయాతి చరిత్రలో తెలగన్న చెంచులు జిగురు బొట్టు పెట్టుకొని వాటి మీద తంగేడు పూలు అంటించుకొనే వారనీ, ఆకులను దట్టీలుగా కట్టుకునే వారనీ, కురుచ చేతులతో, మిడిగ్రుడ్లతో, కఱకు మీసాలతో ఉండే వారనీ వర్ణించినాడు.[1]

మంత్రసాని : తన కాలంనాటి మంత్రసానుల రూపాన్ని నారాయణ కవి హంసవింశతిలో చిత్రించినాడు. పల్ల వెంట్రుకలతో, ఊడిన దంతాలతో, గూనిపోయిన వీపులతో, వణికే తలతో మంత్రసానులు పురిటి విధులు నిర్వహించినట్లు ఈ పద్యాన్ని బట్టి తెలుస్తుంది.

> "ఉరిసిన పల్లవెండ్రుకలు నూడిన దంతములం బకంబులం
> గురిసెడు బాష్పజాలములు గూను వడంకెడు మస్తకంబు కం
> ధర తగుతోలుపాదములు దర్శనముల్వడి చీరపోతు నూ
> ల్మెఱసెడు మంత్రసాని గని మించెడు వేడ్క నుతించి మ్రొక్కెనన్",
> 2. 34.

వివిధ వ్యక్తుల రూపురేఖలు :

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో సూరసాని కథలో చండాలుర రూపురేఖలను సహజ సుందరంగా వర్ణించినాడు. చండాలుర కాయగాచిన అరచేతులు వారి కష్టాన్ని స్ఫురింప జేస్తాయి. నుదుట విభూది రేఖలు, మెడలో రుద్రాక్షమాలలు ధరించినారని వర్ణించడంవల్లవారు శైవ మతాన్ని అవలంబించినట్లు స్పష్టమౌతుంది. సోమనాథుని గ్రామ జీవన పరి

1. యయాతి చరిత్ర, 1-102.

శీలన పాటవానికి ఈ వర్ణనను ఒక ఉదాహరణగా చెప్పవచ్చు.[1]

రాయలు ఆముక్తమాల్యదలో చిత్రించిన మాలదాసరి వేషం విష్ణుభక్తులైన మాలల రూపాన్ని ప్రతిబింబిస్తుంది. చమురంటిన తోలు చొక్కా, కుల్లాయి, శంఖుచక్రాల చెవుల పోగులు, చేతుల్లో దీపస్తంభం, తోలుతిత్తి, బాణం, గొడుగు, సొరకాయదండె, వీణ, తాళాలు, పెట్టె, తులసిపూసలపేర్లు, పట్టెనామాలు, పసుపద్దిన తోలుజందెం, మాసిన శరీరం - ఇదీ 16 వ శతాబ్దం నాటి మాల దాసరి రూపం.

విష్ణ్వారాధకుడైన మాలదాసరి రూపాన్ని రాయలు ఎంత చక్కగా వర్ణించాడో అంతచక్కగా ధూర్జటి శివారాధకునివేషాన్ని చిత్రించినాడు. విభూతితో మూడు మూడు రేఖలచొప్పున దిద్దిన అవయవాలు,తడిసిన సిగ, ముడుల దారంతో గ్రుచ్చిన రుద్రాక్షమాలలు, హరనామస్మరణ, కాలిమడమల వరకు వ్రేలాడే సిర్కావిదోవతి,జందాలు,ఒక చేతిలో అభిషేకక్షీరంతో నిండిన పాత్ర, మరొక చేతిలో పూలబుట్ట, కుండలాంటి బొజ్జ, కురుచనైన రూపం, భుజం మీద వేలాడే ఉత్తరీయం — ఇదీ శివారాధకుని రూపం.[2]

వైజయంతీ విలాసంలో సారంగుతమ్మయ్య తలారిదండనాయకుని రూపాన్ని చిత్రించాడు. కస్తూరితో పొడుగుబొట్టు పెట్టుకొని, గంధంతో మైపూత పూసుకొని, హనుమంతుని కాసె (ఒక రకమైన పంచెకట్టు విధానం) ధరించి, కత్తులూ, కర్రలూ చేతిలో పట్టుకొని తలారిదండనాయకుడు చూపరులకు కొంచెం భయం కలిగించేవాడు.[3]

ఇట్లే సారంగుతమ్మయ్య దాసరిసాని రూపాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు. ముక్కుమీద పైకి సన్నని కస్తూరి నామం, మధ్య ఎర్రని బొట్టు, చెవులకు దుద్దులు, కొద్దిగా కొన బయటికి వెళ్ళాడేటట్లు వేసిన సిగ, స్తనాలను బిగ్గరగా కట్టినట్లు కనిపించే పైటకొంగు, మెరిసే దంతాలు, బొడ్డు క్రిందుగా

1. పండితారాధ్య చరిత్ర, దీక్షా ప్రకరణం, పు. 40. 2. శ్రీకాళహస్తి మాహాత్మ్యం, 3-94. 3. వైజయంతీవిలాసం, 4-67.

కట్టబడి నేలపై జీరాడే చీర, మెడలో తులసి పూసల హారాలు - ఇదీ దాసరి సాని రూపం.[1]

సారంగుతమ్మయ్య తన కాలంలో విటులు మల్లెమొగ్గలాంటి బొట్టు పెట్టుకొనేవారనీ, స్త్రీలవలె చెవి కమ్మలు ధరించేవారనీ తెలిపినాడు.[2] ఇంకా అతడు వేశ్యాలంపటులైన సైరిక రాకుమారులను బలిసిన కోడెలతో పోల్చినాడు.

ఈ విధంగా మన ప్రాచీన కావ్యాల్లో ఆయా వ్యక్తుల రూపు రేఖలు సహజ మనోజ్ఞంగా చిత్రించబడ్డాయి.

వ స్త్ర ధా ర ణ :

ప్రాచీన కావ్యాల్లో ప్రజల వస్త్రధారణకు సంబంధించిన విశేషాలు అనేకం చిత్రితమయ్యాయి. వాటిని గూర్చి తెలిసికొందాము.

తిక్కన కాలంలో మల్లయుద్ధం చేసేటప్పుడు దట్టీ కట్టుకొనేవారు. ఈ దట్టీని కచ్చ అనీ, కాసె అనీ పిలుస్తారు.

"కచ్చయమర బట్టి కాళ్ళును చేతులు
వ్రేలమత్తగజము లీల మెఱయ
ముష్టి బలువు నెఱయ ముక్కున వాతను
నెత్తురొలుక మల్లు నెత్తివైచె" విరాట, 2-17.

వెనుకకు చెక్కుకొనెడి దోవతి కొంగు కచ్చ.

రంగనాథ రామాయణంలో సీతాదేవి కొంగు చీరను ధరించినట్లు చెప్పబడింది.

"కొంగులనొప్పదుకూలముల్ గట్టి" బాలకాండ, పు, 74.

చేలాంచలమే కొంగు. సాధారణంగా చీరకొంగున ఏదో ఒక డిజైన్ ఉంటుంది. రంగురంగుల దారం లేదా జరితో అందమైన కమ్ములో లేదా అకులో, పూలో కొంగులో నేయబడి నేతకాని పనితనాన్ని చాటుతాయి. సామాన్యంగా మన తెలుగువారు కొంగుచీరలే ధరిస్తారు. చీరంతా ఒక మాదిరిగా ఉండి, అంచుగాని కొంగుగాని లేనట్లైతే అలాంటి చీరలు కట్టుకోవడానికి సిగ్గ

1. వైజయంతీవిలాసం, 2-54. 2. అదే, 2-46.

పడే స్త్రీలు ఈనాటికీ గ్రామాల్లో ఉన్నారు. చీరకొంగునే పైటగా వేసుకొం టారు. అప్పుడే కొంగులోని జలతారు పనితనం తెలుస్తుంది. ఈ పైటల ఆచారం ప్రతిష్ఠానం (పైఠన్) నుంచి సంక్రమించిందనీ, 'పైఠన్' శబ్దభవమే పైట అనీ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెలిపినారు.[1]

రంగనాథ రామాయణంలో జరితో కన్నులుగా కుట్టిన రవికలు ప్రస్తా వించబడ్డాయి. "కంగుల అయికలు కనుపట్ట దొడిగి'' బాలకాండ, పు. 75. విజయవిలాసంలోనూ వీటి ప్రసక్తి వచ్చింది. ''కంగుల్దీరిన పైఠిణీ అవిక చన్కట్టంటి రాణింపగా" 2-57.

కన్నులుగా జరితో కుట్టిన రవికలను గ్రామీణులు ఈనాటికీ ధరిస్తారు. అంతేకాక నేత్రాకారంలో పలుచని అద్దాలను కత్తిరించి వాటిని రవికల మీద జరితో కుట్టుకోవడం కూడా చూస్తాము. ఇలాంటి రవికలే అద్దాల రవికలు. వీటికి గ్రామాల్లో బాగా గిరాకీ ఉంటుంది.

హరివంశంలో నందుడు చెంగావిదట్టీ ధరించినట్లు చెప్పబడింది.

''కట్టిన చెంగావికాసె లేజిగురుల జిగినూనితనువతిస్నిగ్ధకాంతి'' 5-181.

వ్యవసాయం మొదలైన పనులు నిర్వహించేటప్పుడు సాధారణంగా స్త్రీ పురుషులు ధరించిన వస్త్రాల కొంగు భాగాలను వడేసి నడుముకు చుట్టుకొం టారు. దీన్నే నడికట్టు అంటారు. ఈ విషయాన్ని ఎఱ్ఱన వర్ణించాడు.

''మొలకచ్చకట్టుపై మలగిన పచ్చని
నునుకొంగు దిండుగా నులిచి చుట్టి'' పూ. భా, 7-13.

క్రీడాభిరామంలో మగవారు ధరించే గన్నేరు రంగు నీర్కావిదోవతులు పేర్కొనబడ్డాయి. కాకతీయుల కాలంలో ఇలాంటి వస్త్రధారణ ఉంది.

''గన్నేరుపూచాయకరమొప్పనీర్కావిమడుగుదోవతిపింజెవిడిచికట్టి''ప.42

ఇంకా ఆనాటి స్త్రీలకు చెంగావి చీరలంటే చాలా ఇష్టం.

పల్నాటి వీరచరిత్రలో సంపన్న స్త్రీలు బంగారువన్నె పట్టు రవికలు ధరించినట్లు వర్ణించబడింది. ''రాజిల్ల హొంబట్టు రవిక తొడిగి'' పు. 65.

---

1. తెలుగు మెఱుగులు, పు. 4

మనుచరిత్రలో పెద్దన కూడా పట్టు వస్త్రాలను పేర్కొన్నాడు. ఐతే వీటిని ధనవంతులు మాత్రమే ధరించేవారు. సింహాసనద్వాత్రింశికలో రకరకాల పట్టువస్త్రాలు ప్రస్తావించబడ్డాయి. వాటిలో వెలిపట్టు, హొంబట్టు వస్త్రాలున్నాయి.

పల్నాటివీరచరిత్రలో మాంచాలదేవి పట్టు రవికను నేర్పుతో తొడుగుకొని దూముడి వేసినట్లు చెప్పబడింది.

''బంగారుపువ్వుల పట్టుకంచుకము
తొడిగి నేరుపుతోడ దూముడివేసి" పు. 73.

పీటముడి, దూముడి అని ముడులు రెండు రకాలు. పీటముడి విప్పడం కష్టం. దూముడినే 'దుస్ముడి' అంటారు. దీన్ని సులభంగా విప్పవచ్చు. ముడి వేసుకొని ధరించే రవికలనే తెలంగాణాలో సాదారవికలని పిలుస్తారు. రవిక ముందరి క్రింది భాగంలోని రెండు కొనల్ని ముడివేసే పద్ధతి పామరస్త్రీలల్లో ఈనాటికీ ఉంది.

కాటమరాజు కథల్లో చంద్రకావిరుమాలు, భూచక్రాల పచ్చడం పేర్కొనబడ్డాయి.

"చంద్రకావిరుమాలు చెలువొప్పగట్టెను
పరగభూచక్రాల పచ్చడముగప్పెను"1

తనకాలంనాటి స్త్రీలు సన్నని వస్త్రాలను ధరించినట్లు శ్రీనాథుడు కాశీ ఖండంలో వర్ణించినాడు. "పసుపుంగుంకుమ కజ్జలంబు నును కూర్పాసంబు తాంబూలమున్" 2.73.

పిల్లలమర్రి పినవీరభద్రుడు శకుంతలా పరిణయంలో రవికలను ప్రస్తావించినాడు. కాని అవి ఎలాంటివో చెప్పలేదు. "కంచెలయుంబటీర తిలకంబును పాపట చెందిరంబు" 4-78.

ద్విపద పరమయోగి విలాసంలో బొమ్మలున్న అంచుల దుప్పట్లు పేర్కొనబడ్డాయి.

''వెలది వెన్నెలసోగవేగెంబులాట
దుళకించు బొమ్మంచు దుప్పటి గప్ప'' 4-315.

---

1. కాటమరాజుకథలు, సంపా : తంగిరాలవేంకట సుబ్బారావు, సంపు. 1, పు. 542.

ఆకాలంలో అర్చకులు దోవతులు కట్టుకొన్న విషయం చెప్పబడింది. దోతి కట్టుకొని దాని చివరను ఉత్తరీయంలాగా భుజంమీద వేసుకోవడం ఆచారం.

''బెడగుల నెరులు గాన్పించు దోవతియు
నుత్తరీయంబుగా నొక కొంత వైచి''

ఈ దోవతులు కట్టుకొనే ఆచారం అనాదిగా ఉంది. అర్చకులేకాక ఆయా వృత్తులు వారు వీటిని నేటికీ గ్రామాల్లో కట్టుకోవడం చూస్తాము. దోవతులనే పంచెలని వ్యవహరిస్తారు.

సింహాసన ద్వాత్రింశికలో గోపరాజు కఱకంచు వస్త్రాలను పేర్కొన్నాడు. ఎక్కటి వీరులు ఈ వస్త్రాలను ధరించి జారిపోకుండా నడికట్టు వేసుకొని దానిమీద తాడు కూడా కట్టుకొనేవారు. వీరు లోహంతో తయారు చేసిన అంగిలాగా నల్లని జిగురును శరీరమంతా పూసుకొనేవారు.

''కఱకంచువలిపెంబు గట్టిగా కాసించి
చెలిత్రాడు కాసెపై బలియజుట్టి
దేహంబు కప్పగా లోహకంచుకలీల
జిగిబిగిగల నల్ల జిగురమర్చి....'' 7-46

చంద్రభాను చరిత్రలో మల్లన సన్నని వస్త్రాలను వల్లెవాటుగా వేసుకొనే ఆచారాన్ని ప్రస్తావించినాడు. "వలిపె వలెవాటు దుప్పటి వెలిక్రిగమ్మ'' 1.89

దుప్పటి అంటే ఈనాడున్న అర్థం వేరు. మనమీనాడు కప్పుకోవడానికి ఉపయోగించే దళసరి వస్త్రాన్ని దుప్పటి అంటున్నాము. ప్రాచీనకాలంలో దుప్పటి అన్నా, చీర అన్నా, వస్త్రమన్నా ఒక్కటే. మల్లనకాలంలో స్త్రీలు చక్కని పనితనం కల్గిన పైటల చీరలు ధరించే వారు.

"చెలియొకతెపచ్చపట్టెల్ బలసిన బిదుహెళిసె సరిగెపని పైఠానీ
చలువయఱచట్టదొడిగెన్ సలలితగతి నొకతెకడకళలు ముడివైచెన్''5-154

పచ్చపట్టెల్ అంటే పట్టు చీరలని అర్థం. 'కడకళల్ ముడివైచెన్' అని చెప్పడం వల్ల అవి సాదా రవికలని తెలుస్తుంది.

ఆముక్తమాల్యదలో ఎఱ్రమట్టిరంగును పోలిన వస్త్రాలు పేర్కొనబడ్డాయి. వీటిని వీరులు యుద్ధ సమయాల్లో తలకు చుట్టుకొనేవారు.[1] ఉత్సవ

---

1. ఆముక్తమాల్యద, 10-118

సమయాల్లో గుత్తాలకు పాదాలవరకు వ్రేలాడే విధంగా లాలు కుంచెలు కట్టే వారు. ఎర్రని కుచ్చులే లాలుకుంచెలు. ఇవి సాధారణంగా గంగిరెద్దులవాళ్ళు చేతుల్లో పట్టుకొనివచ్చే కుచ్చులు. ఈ ఎర్రని కుచ్చులమధ్య అక్కడక్కడ నల్లని కుచ్చులు కుట్టేవారు. మోదుగు చెక్కవేసి కాచిన నీళ్ళలో తడిపి తీసిన గుడ్డలు నల్లగా మారుతాయి. అలాంటి వాటిని కుచ్చులుగా కుట్టి వాటికి గంటలను కూడా వ్రేలాడ దీసేవారు.[1]

రాయలకాలంలో పురుషులెక్కువగా పసుపువచ్చని వస్త్రాలు ధరించే వారు. పసుపువచ్చని గోచి ధరించడమంటే వారికి చాలా ఇష్టం. నిజానికి ఈ వస్త్రధారణ వారివారి స్వభావాన్ని తెలియజేస్తుంది. వీరులు ఎర్రని వస్త్రాలను తలకు చుట్టుకోవడం, పురుషులు పసుపు వచ్చని వస్త్రాలు ధరించడం ఇందుకు ఉదాహరణ. ఇట్లే భర్తలమీద అనురాగం కల్గిన యువతులు చెంగావిచీరలూ, అలుక చెందిన భార్యలు మాసిన చీరలూ కట్టుకొనే వారు. తెల్లని వస్త్రాలు అన్నివేళల ధరించడాన్ని అశుభంగా భావించేవారు. సత్యభామ కృష్ణుని మీద అలిగి మాసిన చీరను కట్టుకొన్నట్లు ముక్కుతిమ్మన పారిజాతాపహరణంలో చెప్పినాడు. అంతేకాదు ఆమెతలకు 'వాసెన కట్టు' కట్టింది. కుందమూలిని మూయడానికి కట్టే గుడ్డ వాసెన.

"మాసిన చీర గట్టికొని మౌనముతోడ నిరస్త భూషయై
వాసెన కట్టుగట్టి నిడువాలిక కస్తూరి బొట్టువెట్టిలో
గాసిలి చీకటింటికడ కంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢమనోజ విషాదవేదనన్" 1.99

ఈ వాసెన కట్టు విధానం సారంగ ధర చరిత్ర, శుకసప్తతి మొదలైన కావ్యాల్లోను చెప్పబడింది. అలుక చెందిన స్త్రీలు విషాద సూచకంగా తెల్లని వస్త్రాలు ధరించేవారు. కృష్ణుడు తనమీద అలిగిన సత్యభామతో "ఇందు నిభాస్యమైతొడవులేల ధరింపవు నున్నగావులీవెందును మానలేవు తెలుపేటికి గట్టితి"[2] వని ప్రశ్నించడం ఇందుకు నిదర్శనం.

కళా పూర్ణోదయంలో పసుపువచ్చని దట్టీలు, చంద్రకావిదట్టీలు ప్రస్తావించబడ్డాయి. ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఒల్లెలు పేర్కొనబడ్డాయి. ప్రభావతి ఒల్లెకట్టుకొన్నట్లు పింగళి సూరన వర్ణించినాడు.

---

1. ఆముక్తమాల్యద 4.35 2. పారిజాతాపహరణం, 1-115.

''తరుణి యొకింత సేపు చిఱుతమ్ములపుంబసతోడిమోవిమే
గరగరికన్విరాజిలుచు కమ్మలు తీగయుబూని వేణికా
సురభితబొల్చియొక్క పరిశుద్ధపుసైకపుటొల్లెగట్టి బా
సురత కడున్వెలార్చె పెఱసొమ్ములకోపమి యన్మిషమ్మునన్'' 4-141

ఈ ఒల్లె తిక్కన భారతంలో కేవలం వస్త్రమనే అర్థంలో కనిపిస్తుంది "తల్లి యొల్లియమౌళి దృఢంబుగానమర్చి'' కర్ణ, 3-327.

ఆముక్తమాల్యదలో చీర అనే అర్థంలో కనిపిస్తుంది.

''నారికేళాసవపు తీపుటూరు పొలయవలిపెయొంటొల్లెతో'' 2-61.

ఆధునిక కాలంలో ఒల్లెలకు ఒక ప్రత్యేకతఉంది. ఆడపిల్లలు పెరిగి పెద్దవాళ్ళవుతున్న సమయంలో ఒల్లెలు కట్టిస్తారు. తెలంగాణాలో ముఖ్యంగా అమ్మమ్మలు మనుమరాళ్ళకు ఒల్లెలు కట్టించడం ఆచారం. ఒల్లెలు చీరలంత పెద్దవికావు. ఐదు, తొమ్మిది, పదకొండు సంవత్సరాల వయస్సులో అమ్మాయిలకు ఒల్లెలూ, అబ్బాయిలకు దోవతులూ కట్టించడం తెలుగువారి ఆచారం.

వైజయంతీవిలాసంలో కూనలమ్మ చీరలు ప్రస్తావించబడ్డాయి. కూనలమ్మ గ్రామ దేవత. ఆమె పేరుమీద ధరించే చీరలే కూనలమ్మ చీరలు. గ్రామీణ స్త్రీలు ముత్యాలమ్మ, గోగులమ్మ, కూనలమ్మ మొదలైన దేవతలకు తమ కోర్కెలు తీరడానికి క్రొత్త చీరలుపెట్టి ఆతరువాత కట్టుకొంటారు. ఆకాలంలో కూనలమ్మ చీరలు కొత్త కమ్ములతో అందంగా నేసేవారు. కమ్ములంటే గళ్ళని అర్థం.

"పసుపు పిండియు నగపాలు గూర్చినపూత
బొట్టుపై చంద్రంపు బొట్టువెట్టి
కొత్తకమ్ములతోడి కూనలమ్మ పటంబు
కటివిప్పగా రెండు కట్లుగట్టి....'' 3-100.

శుకసప్తతిలో వస్త్రధారణకు సంబంధించిన అనేక విశేషాలు తెలుపబడ్డాయి. ఆకాలంలో ఎఱుక చెప్పే స్త్రీలు రంగురంగుల రవికలు ధరించేవారు. పని చేసేటప్పుడు కొంగులు నడుముకు చుట్టుకొనేవారు. బయటి ప్రదేశాలకు వెళ్ళినప్పుడు తమ చంటి పిల్లల్ని కొంగుచాటున ఎత్తుకొనేవారు.[1]

---

1. శుకసప్తతి, 2.97

వ్యవసాయంపనుల్లోపాల్గొనే గొల్లలు గొంగళ్ళుకప్పుకొనేవారు. వాటినిస్వయంగా నేసుకొనే సంప్రదాయం ఈనాటికీ గ్రామాల్లో కనిపిస్తుంది. "గొంగడి ముసుగుతో గొల్లలు చట్రాతి పైని బందారాకు పఱచికొనగ" 2-342.

శుకసప్తతిలో కదిరీపతి కమ్మి పంచెల గురించి తెలిపినాడు. పంచెకు సామాన్యంగా రెండు వైపుల ఒక వేలుమందం ఎరుపు లేదా పచ్చని దారంతో కమ్మివేస్తారు. ఇది అందంగా ఉంటుంది. పంచె పొడుగునా రెండు వైపుల రంగు దారంతో గోటు వేయడం కూడా ఉంది. కమ్ములూ, గోట్లూ లేని పంచెలను కొందరు వృద్ధులు ఈనాటికీ కట్టరు. "కమ్మి పంచెయుగట్టి కమ్మిదుప్పటివల్లె వాటుకెంగేలితో వంకవంకి...." 2-241.

కూనలమ్మ చీరలు శుకసప్తతిలోను పేర్కొనబడ్డాయి.
"....కూనలమ్మ చీర కుడిపైటలోపలి సిస్తుఱవిక
యెసగ చరియించు నిట్టులయ్యెమ్మెలాడి" 2-411

కూనలమ్మను సంతానాన్నిచ్చే దేవతగా కొలుస్తారు. కూనలను ఇచ్చే అమ్మకాబట్టి కూనలమ్మ అయ్యింది. కూనలంటేపిల్లలు. గంగాలమ్మ, పోలేరమ్మ వంటిదే కూనలమ్మ దేవత. కూనలమ్మకు గళ్ళ చీరలు, కమ్ముల చీరలంటే ఇష్టమని ఆచీరలే ఆమెకర్పిస్తారు. కూనలమ్మ పేరుమీద ముత్తైదువలకు చీరలను కానుకగా ఇచ్చే ఆచారం ఉంది.

స్త్రీలు కేవలం పండుగల సందర్భాల్లోనే కట్టుకొనే చీరలున్నాయి. వాటిని పండుగ చీరలంటారు. పండుగల సమయాల్లో తప్ప పెట్టెల నుంచి వాటిని బయటికి తీయరు.

"కూర్మిసతి పెట్టెలో దాచుకొన్ననల్ల
గరల పండుగ చీర పైకప్పుకొనుచు" 2-487

పదిహేడవ శతాబ్దానికి చెందిన విజయవిలాసంలో స్త్రీల వస్త్రధారణ విశేషాలు తెలుపబడ్డాయి. ఆకాలంలో స్త్రీలు సిందూరం రంగు కల్గిన రవికలు (చంద్రకావి రవికలు) ఎక్కువగా తొడుగుకొనే వారు. ఉత్సవ సందర్భంలో రవికల మాదిరిగా శరీరానికి కుంకుమను పూసుకొనే ఆచారం అనాడుంది. ఈ పద్యాన్ని చూడండి-

"కలయగ చంద్రకావి రవికంబలె కుంకుమ పూసి చూడుమో
పొలతుక నాదు నేర్పునిన పూసిన యట్లనె లెస్సయున్నదే
బళియని కేళినీ రమణి పల్కిన నవ్వుచు శంబరారియ
ర్మిలికయి నేసి యేగిరి గిరింగన నారుచిరాంగులిర్వురున్" 2-92

ఇంకా ఆ కాలంలో జడకుచ్చులు, జంటరవికలు, మొలనూలు మొదలైన వాటిని స్త్రీలు ధరించినట్లు వర్ణించబడింది.1 కందుకూరి రుద్రయ్య రచించిన నిరంకుశోపాఖ్యానంలో కావి దోవతులు, రుమాళ్ళు పేర్కొనబడ్డాయి. బ్రాహ్మణులు వదులుగా దోవతులు కట్టుకొనే వారు. పచ్చడాలు కప్పుకొనేవారు. అంతే కాక జారుతున్న వెంట్రుకలను సవరించి చక్కగా రుమాళ్ళు ధరించేవారు.
'జాటిన వెండ్రుకల్ సవరించి కట్టిన పసిడిబ్రాత రుమాలు దుసికిలంగ "2-21

మన్నారుదాసవిలాసంలో రంగాజమ్మ తన కాలంనాటి వస్త్రధారణ విశేషాలను తెలియజేసింది. రుమాళ్ళు ధరించడం, అరచట్టలు తొడుగుకోవడం దట్టీలు కట్టుకోవడం, దుప్పట్లు వల్లెవాటుగా వేసుకోవడం ఆనాటి ప్రజల వేష ధారణను సూచిస్తుంది.2 అరచట్టలంటే మొలవరకు ధరించే చిన్నచొక్కాలు **(half shirts).**

హంసవింశతిలోను దుప్పట్లు, రుమాళ్ళు పేర్కొనబడ్డాయి.

"పన్నీటన్నయనంబు లొత్తె తనువున్ పాటీర పంకంబుతో
చెన్నారన్ పదనిచ్చె గీరిసిగవేసెన్ తాయెతుల్ సుట్టెజీ
న్నొన్నాపట్టె రుమాలుగట్టె జరతాచుట్టంచు డాల్మించుమే
ల్మిన్నా సన్నపు దుప్పటంబు తగ హోళిన్ గప్పె సొంపారగన్" 1-75

ఆధునిక కాలంలో దుప్పట్లకున్న అర్థం వేరు. అవి కప్పుకోవడానికి ఉపయోగపడుతాయి. చలి కాలంలో వెచ్చదనం కలిగిస్తాయి. ఎక్కువగా గ్రామీణులు వ్యవసాయం పనుల్లో నిమగ్నులై పొలాల్లో గడపడం వల్ల వారికి గొంగళ్ళేకాక, దుప్పట్లు ఎక్కువగా తోడ్పడుతాయి. నూలు దుప్పట్లస్థానంలో ఈనాడు వులన్ దుప్పట్లు చోటు చేసుకొన్నాయి. ఇట్లే హంసవింశతిలో జిలుగు రవికలు, నేత్రాకారంలో చక్కని నేత పనితనం కల్గిన చీరలు ప్రస్తావించబడ్డాయి.

---

1. విజయవిలాసం, 3.197 2. మన్నారుదాస విలాసం, 2.16

"గిలుకు మట్టెలు జంటీల జిలుగు రవిక
సన్నమావేయు కన్నుల చలువ చీర
పసిమి చిల్కొడు ముంజేతి పచ్చలమర
దుద్దె తనమున తిరుగు నా రెడ్డిసాని" 4-138

ఇదే కాలానికి చెందిన నీలా సుందరీ పరిణయంలో నీర్కావిదోవతులు, హొంబట్టు దుప్పట్లు పేర్కొనబడ్డాయి.

ఈ విధంగా ప్రాచీనకావ్యాల్లో స్త్రీపురుషుల వస్త్రధారణకు సంబంధించిన విశేషాలు చిత్రించబడ్డాయి.

ఆ భ ర ణా లు :

ఇంచుమించుగా అన్ని జాతుల ప్రజలు ఆభరణాలు ధరిస్తారు. ఇది అనాదిగా వస్తున్న ఆచారం. వస్త్రధారణవలె ఆభరణాలు ఆయా ప్రజల సంస్కృతీ సంప్రదాయాలను తెలియజేస్తాయి. తెలుగుప్రజలెలాంటి ఆభరణాలు ధరించారో తెలుసుకోవడానికి ప్రాచీన శిల్పాలు, చిత్రాలు, కావ్యాలు తోడ్పడుతున్నాయి. నన్నయ భారతం మొదలుకొని అనేక కావ్యాల్లో తెలుగువారి ఆభరణాలు పేర్కొనబడ్డాయి.

మల్లయుద్ధం చేసేవారు కంటెలు ధరించినట్లు భారతంలో నన్నయ పేర్కొన్నాడు. మూలంలో - జరాసంధుడు భీమునితో పోరాడుతున్నప్పుడు కిరీటం మాత్రమే ధరించినట్లు చెప్పబడింది. కాని నన్నయ తన కాలం నాటి ఆచారాన్నిబట్టి జరాసంధుడు కంటెను ధరించినట్లు వర్ణించినాడు.

''బలియుడపుడు వెంద్రుకలు పాచిముడిచిగం
టెసగదాల్చి వీర రసికవృత్తి
నుద్ధతుండు మల్లయుద్ధ ప్రసాధనం
బమర నిలిచెవేడ్క నమిత బలుడు'' సభాపర్వం, 1-201

విరాట పర్వంలో తిక్కన ద్రౌపది మట్టెలు ధరించినట్టు వర్ణించినాడు. ఇది తెలుగువారి ఆచారం. "లలితంబులగు మట్టియల చప్పుడింపార నంచకైవడి నడ నల్ల వచ్చి'' 2-64

ఆ కాలంలో స్త్రీలేకాక పురుషులు కూడా మట్టెలు ధరించేవారు. కీచకుడు మట్టెలు ధరించినట్లు చెప్పబడింది. ''మట్టియ లొండొంటి బిట్టు దాకగనేల నందంద మునిగాళ్ళనప్పళించు'' 2-250

ఈ మట్టెలేకాక పీర మద్దియలు (కాలి రెండవ వ్రేలికిధరించే ఆభరణాలు), పిల్లాండ్లు (కాలి నాల్గవ వ్రేలికి ధరించే ఆభరణాలు) ఉత్తర హరివంశం ఆముక్తమాల్యద, ప్రభావతీ ప్రద్యుమ్నం, యయాతి చరిత్ర మొదలైన కావ్యాల్లో పేర్కొనబడ్డాయి.

దశకుమార చరిత్రలో కేతన తన కాలంనాటి సీమంతినులు ధరించే ఆభరణాలను చిత్రంలోలాగా సాక్షాత్కరింపజేశాడు. మట్టెలను కూడా పేర్కొన్నాడు.

''మట్టియలుజ్జ్వల మణినూపురంబులు
మొలనూలు వస్త్రిముల్ ముత్తియములు
కన్నవడంబులు గట్టినూళ్ళను సుద్ద
సరితీగె మినుకులు సందిదండ
అంగుళీయకములు హారకంకణములు
చేకట్టు పాలెలు చెన్నుమెఱుగు
టాకులు సరిపెణలాలక్తకము పూత
కాటుక తిలకంబు కమ్మపువ్వు

లాదిగాగల మేలిద్రవ్యముల నొప్ప
పసదనముచేసి యుచితరూపంబు దాల్చి
బాల చంద్రికబోటినై పజ్జకరిగి
దారువమ్మని లోగిలి దరియజొచ్చి 3-77

రంగనాథరామాయణంలో చిన్నపిల్లలు ధరించే గజ్జల మొలత్రాళ్ళు, కాలి అందెలు పేర్కొనబడ్డాయి.

''కడునొప్ప మొలనూళ్ళ గంటలు మొఱయ
మువ్వలందెలు పదంబుల రొదల్సేయ'' బాల, పు. 21.

ఆకాలంలో స్త్రీలు ముక్కరలు ధరించేవారు.

''చెక్కుల మకరికల్ చిత్రించి గొప్ప
ముక్కరల్ నాసాగ్రముల గీలుకొల్పి'' బాల, పు. 75.

హరివంశంలో పట్టిన గొల్లపడుచులు చేతులకు చిలుమూరే ఇత్తడి కడాలు,

వ్రేళ్లకు కంచు ఉంగరాలు ధరించినట్లు పేర్కొన్నాడు. "చిలుమూరు నిత్తడి కడియంబులుం గంచుటుంగరంబులునమరం గొమరారు నాచుదీగలు గలయం గ్రాకినం బొలుచు కెందామరలందెగడు చేతులన్" (పూ.భా.) 5-143.

పల్నాటి వీర చరిత్రనుబట్టి ఆకాలంలో స్త్రీ పురుషులు కడాలు ధరించినట్లు తెలుస్తుంది. బ్రహ్మనాయుడు పంపిన కన్నమనీడు గుజ్జరి కడియాలు ధరించినాడు.

"కరముల గుజ్జరికడియముల్ మెరయ
నేర్పైన పిడిగంట నెమలి సొగలును" పు-9.

గుజ్జరి 'ఘూర్జరి' శబ్దభవం. గుజరాతే ఘూర్జరిదేశం. ఆదేశంలో తయారయ్యే కడాలను ఆనాడు మనవారూ ధరించేవారు.

మాంచాలధరించిన ఆభరణాలను పరిశీలిస్తే శ్రీనాథుని కాలంలోని స్త్రీల ఆభరణాలు తెలుస్తాయి.

"ముక్కున ముత్యంబు ముంగరనిలిపి
తాటంకభూషణద్వయముకీలించి
ముత్యాలపట్టెడ ముదముతో పెట్టి
దండకడియములు దండతాయెతులు
మక్కువతో గట్టిమని కట్టునెగువ
నీలాలగాజులు నేర్పున దొడిగి
పచ్చలకంకణాల్ భాసిల్ల పెట్టి
చామలాకడియముల్ సంధింపజేసి
సొబగైన చౌకట్లు సొమ్ములు దాల్చి
ముయ్యంపు చేలంబు మోహనమొప్ప
కటియందు సంధించి గజ్జులువ్రేలు
తపనీయకాంచిని దట్టించిముడిచి
భూషణంబులువ్రేళ్ళపొందుగబెట్టి...." పు. 72.

తాటాకుతో తయారుచేసిన చెవికమ్మ తాటంకం. పట్టెలాగుండే కంఠాభరణం పట్టెడ. మోచేతులకు పైభాగంలో ఉండేవి దండకడాలూ, తాయెత్తులు. మని

కట్టు పై భాగంలో ఉండేవి గాజులూ, కంకణాలు. నడుమున ఉండేవి గజ్జెల మొలత్రాడూ, ఒడ్డాణం.

సుభద్రాకళ్యాణంలో తాళ్ళపాక తిమ్మక్క స్త్రీల అలంకారాలను సమగ్రంగా వర్ణించింది. సుభద్ర దువ్వెనతో చక్కగా దువ్వుకొని, కొప్పును కొద్దిగా జారేటట్లు వేసుకొని, మల్లెలూ, మందారాలూ, జాజులూ మొదలైన పూలు తురుముకొన్నది.

> "....దువ్వెన నెరగోర దువ్విన కురులు
> పాపటనొసపరి బాగుగా దీర్చి
> చూపట్టు కొప్పునించుక జారముడిచె
> మల్లెలు మొల్లలు మందారములును
> చల్లని జాజులు సంపంగి విరులు" పు. 28.

తిమ్మక్క ముక్కరను పేర్కొంది. సుభద్ర మూడువేల రూకల విలువచేసే ముక్కరను ధరించింది.

> "పంజాలదండ దాపున నేవళంబు
> రంజిల్లుబన్న సరంబుక్రీడించి
> ఇన్ని సొమ్ములకును వన్నె బెట్టునటు
> మూడువేల్ సేయు ముక్కర బెట్టె" పు. 26.

సుభద్ర ధరించిన ఆభరణాల్లో ఇంకా ఒడ్డాణమూ, బిల్లల మొలనూళ్ళూ, కాళ్ళ కడాలూ, కంఠహారాలూ ఉన్నాయి. ద్విపద పరమయోగి విలాసంలోనూ ఇలాంటి ఆభరణాలే పేర్కొనబడ్డాయి. అదనంగా పౌజులకమ్మలు చెప్పబడ్డాయి.[1] పీటికి పంజులకమ్మలని పేరు. ఇవి పల్లేరు పూల ఆకారంలో ఉంటాయని ద్విపద సారంగధర చరిత్రలో చెప్పబడింది.

> "పౌజులకమ్మలు పల్లేరుపూలు, రాజిల్లు రత్నాలరాకిడివెట్టి" పు.13

ఇంకా పరమయోగివిలాసంలో తిరువేంగళనాథుడు చిన్న పిల్లలకు ధరింపజేసే నెలవంక పులిగోరు, బంగారు గుండ్ల దండలు, నీలాల పూసల పేర్లు, రావిరేకులు (ఎఱ్ఱన వీటిని హరివంశంలో ప్రస్తావించాడు) గజ్జెలు, అందెలు, చిరుగంటల మొలత్రాళ్ళు పేర్కొన్నాడు.[2] పులిగోరు పతకాలు

---

1. ద్విపద పరమయోగివిలాసం, 2-55, 2 అదే, 3-60

ఈనాటికీ ఉన్నాయి.

పరమయోగివిలాసంలో సాధారణ స్త్రీలు ధరించే ఆభరణాలు ప్రస్తావించ బడ్డాయి.

''నల్లపూసల పేరు నలిగినకోక, వెల్లనై గుడికొన్న విచ్చుటాకులును
పిత్తడి కడియముల్ పికిలిపూదండ, మొత్తంబులగు నల్లముదుకగాజులును
లక్కతాయెతులు తెల్లని తగరంపు, ముక్కపు సీసపుముద్దుటుంగరము
కాకిబేగడబొట్టు కంచుమట్టియలు ...'' 4-323.

ముత్తైదువులు నల్లపూసలు తప్పక ధరిస్తారు. ఇత్తడి కడాలే పిత్తడి కడాలు. పికిలిపువ్వు అంటే 'పికిలిపిట్టతోక క్రింది రెక్క'[1] దానితో తయారు చేసిన దండ పికిలి పూదండ. లక్కతో తయారు చేసిన తాయెత్తులే లక్కతాయెతులు. అభ్రకంబొట్టునే కాకిబేగడబొట్టు అంటారు.

చంద్రభానుచరిత్రలో మల్లన తుమ్మెద తాళిని పేర్కొన్నాడు.[2] తుమ్మెద ఆకారంలో తయారు చేయబడే పతకం తుమ్మెదతాళి. ఐచ్ఛికంగా స్త్రీ లెవరైనా దీన్ని ధరించవచ్చు. తుమ్మెద తాళితోపాటు పచ్చలతాళి, పులిగోరు తాళి, చిలుకతాళి మొదలైనవి మన కావ్యాల్లో పేర్కొనబడ్డాయి. రసికజన మనోభిరామంలో పచ్చలతాళి, చిలుకతాళి ప్రస్తావించబడ్డాయి.[3] రెండువైపుల చిలుకలరూపం ఉండేట్లు తయారు చేసే పతకం చిలుకతాళి. గ్రామీణులకుతుమ్మెదలు, చిలుకలు సుపరిచితాలు. వాటి అందం, ధ్వని వారిని ఆకర్షిస్తాయి. అందుకే వాటి ఆకారంలో పతకాలను తయారు చేసుకొని ధరిస్తారు. వివిధాకారాల్లో ఉన్న ఈ తాళి అనంతర కాలంలో వివాహిత స్త్రీలకు తప్పనిసరి అలంకారమైంది.

చక్కని ఆభరణాలు ధరించి స్త్రీలు ఆహార పదార్థాలు వడ్డిస్తే ఆ వడ్డన మనోహరంగానూ, ఆ పదార్థాలు రుచికరంగానూ ఉంటాయనడానికి పారిజాతాపహరణంలో ముక్కుతిమ్మన చేసిన వర్ణన ప్రత్యక్ష సాక్ష్యం.

---

1. శబ్దరత్నాకరం, పు. 491, 2. చంద్రభానుచరిత్ర, 3-73,
3. రసికజన మనోభిరామం, 1.75.

''శాకపాకంబుల చవులు వక్కాణించు
గతికంకణంబులు గల్లుమనగ
నతివేగమిడుడు మీరను మాడ్కి మేఖలా
కీలిత రత్న కింకిణులు మొరయ
కలమాన్న రుచితోడ కలహించు జాడదు
వ్వలువ పింజలు ఫెళఫెళయనంగ
నారగింపుడు మీరలని ప్రియంబాడెడు
పొలుపున మెట్టియల్గులకరింప
నలరు బోడులువడ్డింపనచట కలహ
భోజియును తాను బహుభక్ష్యభోజ్యలేహ్య
చోష్య పానీయముల మధుసూదనుండు
సారె కొనియాడుచును వేడ్క నారగించె'' 2-19

ఈ కూర బాగుంది ఆ కూర బాగుంది అని రుచులు చెబుతున్నట్లు చేతి కంకణాలు గల్లుమన్నాయట. రుచికరమైనపదార్థాలను వెంటనే వడ్డించండిఅని చెబుతున్నట్లు ఒడ్డాణంలోని చిన్న చిన్న గజ్జెలు ధ్వనించాయట. ఆహార పదార్థాల రుచులతో పోటీపడుతున్నట్లు కట్టుకొన్న చలువ బట్టలు ఫెళ ఫెళ మన్నాయట. ఇక ఆలస్యం చేయక ఆరగించండి అని చెబుతున్నట్టు కాలిమెట్టెలు శబ్దం చేశాయట. తమకున్న పాటి ఆభరణాలను ధరించి తాము ఆనందించడమే కాక ఇతరులకు ఆనందాన్ని కలిగించే గృహిణులు అన్ని కాలాల్లో ఉంటారు,

భూలోక పారిజాతంలాంటి పై పద్యం - స్త్రీల చేతులకు కంకణాలూ నడుముకు వడ్డాణం, దానికి చిరు గజ్జెలూ, శరీరానికి చలువజేసిన బట్టలూ, కాలివ్రేళ్ళకు మెట్టెలూ ఎంతో శోభనిస్తాయనీ, ఆభరణ ధారియై గృహిణి ఆహారపదార్థాలను వడ్డిస్తే అవెంతో రుచికరంగా ఉంటాయనీ ధ్వనిస్తుంది.

మను చరిత్రలో మనోరమ పెళ్ళికూతురైనప్పుడు ఆమెకు ముత్తైదువలు ఆభరణాలు తొడిగించారు. మనోరమ లేచి స్వరోచిమీద తలంబ్రాలు పోస్తుంటే ఆమె కాలిమట్టెలు ధ్వనిచేశాయి.

''తను మధ్యత్రివళుల్ నటింప నిలమీద న్మట్టియల్ మోవగా
కనుపాపల్ పయిఱెప్పలంగదియ నుత్కంఠాగ్రయై నిక్కి నా

ఘని మౌళిందల్ప్రాలు వోసె నవలా దోర్మూల కూలంకష
స్తనవిస్ఫూర్తికి సందిదండల ఘళల్ సాహోనినాదంబిడన్'' 5-84

ప్రబంధ యుగంలో ముక్కర స్త్రీల సర్వసాధారణమైన ఆభరణంగా కనిపిస్తుంది. కొత్తగా చేయించుకొన్న ముక్కర అంటే అందరికీ ఇష్టమే. నిగమశర్మ తన ముక్కరను దొంగిలించడంవల్ల అతని అక్క ఇతరాభర ణాలు పోయిందానికంటె ఎక్కువగా బాధపడింది. నిగమశర్మ చెడిపోయినం దుకు లెస్సగా ఏడ్వని ఆ మహా తల్లి ముక్కర పోయిందని ఏడ్వడంవల్ల ఆ కాలంలో దానికున్న ప్రాధాన్యం స్పష్టమవుతుంది. ''క్రొత్తగా చేయించుకొన్న ముక్కరకునై యడలు దుర్వారయ్యై యాడుబిడ్డ'' 3-50

ప్రభావతీ ప్రద్యుమ్నంలో పింగళి సూరన ముత్యాల ముక్కరలను పేర్కొన్నాడు. ప్రభావతి మట్టెలు మార్చిమార్చి పెట్టుకొన్నట్లు వర్ణించాడు.

''వెలది మట్టెలు పిల్లాండ్లు పీరమద్ది
యలును నందెలు మొలనూళ్ళు నంగుళీయ
కంకణాంగద హార తాటంక ముఖ స
మస్తభూషణములః దాల్చె మార్చి మార్చి" 4-138

అలంకరణ విషయంలో ఆ నాటిస్త్రీలు ఈనాటి వారికేమీ తీసిపోరు. స్నానాంనతరం జుట్టు తడి ఆరడానికి ధూపం వేసేవారు. దూముడి కొప్పులు, వ్రేలాడే కొప్పులు, మూడు మూలల కొప్పులు ధరించేవారు. ఇంకా బొట్టును మార్చి మార్చి పెట్టుకొనేవారు. చుక్కబొట్టుతోపాటు అవిసాకు బొట్టు, చంద్ర తిలకం, నెలవంక నామం, అన్నిటికంటె గుమ్మడి విత్తు ఆకారంలోని బొట్టంటే వారికి చాలా ఇష్టం.

''మృగమదాదుల చుక్కబొట్టిగిసెయాకు
బొట్టు పూర్ణ చంద్ర తిలకంబు నెలవంక
విధము నామము గుమ్మడి విత్తునామ
మొకటిగాధని యొకటి యాయువిడ దాల్చె'' 2-137

సుగాత్రి తన భర్త శాలీనునికి ఆయుష్యం పెరుగుతుందనే భావనతో ఆభరణాలు ధరించినట్లు కళాపూర్ణోదయంలో చెప్పబడింది. "వేరొక్క లాగున

సుంపు సరసికి నాయురభివృద్ధి కరంబులనివివిధాలంకారంబులెప్పుడు నేమఱక తాల్చుచు తన తల్లి యతని నేమియు నిట్టట్టాడకుండం బ్రార్థించుచుండె" 4-73

స్త్రీలు పూలూ, నగలూ, ధరించడంవల్ల వారి భర్తలకు ఆయుష్యం పెరుగుతుందన్న విషయాన్ని శ్రీనాథుడు కాశీఖండంలోను, పినవీరభద్రుడు శకుంతలా పరిణయంలోను చెప్పినారు. శ్రీనాథుని పద్యం చూడండి–

''పసుపుం గుంకుమ కజ్జలంబు నునుకూర్పాసంబు తాంబూలమున్
కుసుమంబుల్ కబరీ భరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్
విసుపొక్కింతయులేక తాల్పవలయున్ పీనిన్ సదాకాలమున్
నసిచక్కంగ ప్రియుండు వర్థిల్లుటకై నాళీకపత్రాక్షికిన్'' 2-73

ఇక పినవీరభద్రుని పద్యం చూడండి.

''కంచెలయుంబటీర తిలకంబును పాపటచెందిరంబుఫా
లాంచలసీమ లేబసుపుటచ్చతబొట్టు చెవాకు గాజులున్
కొంచెపు పీద్యమున్ విరులు కొప్పుననొప్పు నొనర్పనెప్పుడున్
చంచల నేత్రయుండదగు సంతత భర్తృ ఫలాభివృద్ధికిన్'' 4-78

పురుషుల అభివృద్ధినీ,ఆయుష్యాన్నీ ఆకాంక్షించి అతివలు ఆభరణాలు ధరించాలని ప్రాచీనుల నియమం. పినవీరభద్రుడు శ్రీనాథునికంటె విశేషించి పటీర తిలకాన్ని, పాపట సిందూరాన్ని, పసుపు బొట్టునూ, గాజులనూ, పేర్కొన్నాడు. ఐతే వీటిలో కాలిమట్టెలూ, తాళిబొట్టూ లేకపోవడం వల్ల ఆ కాలంలో అవి తప్పనిసరి ధరించాలన్న నియమం లేనట్లు కనిపిస్తుంది.

మధురలాలసను పెళ్ళికూతురు చేసినప్పుడు ఆమె ఎన్నో అభరణాలు ధరించి భూషణాలకే భూషణమై ప్రకాశించినట్లు కళాపూర్ణోదయంలో వర్ణించ బడింది.

"తళుకు బిల్లాండ్లు బొబ్బిలికాయలును మట్టి
యలు పీరమద్దెలు నందియలును
మొలనూళ్ళ వడ్డాణములు నేవళంబుపుం
జాలదండయు బన్న సరము మొగపు

తీగయు వాణి ముత్తెపుబేర్లు సందిదం
పలు సూడిగములు గౌదసరములును
కడియాలు పెక్కు జోకల యుంగరములు ముం
గరయు కోలాటంపు కమ్మజోడు

చెవుల పూవులు బవిరలు చేరుచుక్క
కొప్పువలయును సవరించి రొప్పమీర
భూషణములకు తానొక భూషణమయి
పడతి యపుడొప్పె కన్నుల పండువగుచు'' 7-66

అలంకారంకోసం ఆ కాలంనాటి స్త్రీలు నడుముకు ఒడ్డాణాలేకాక మొల నూళ్ళు ధరించేవారు. ఇవి మొలత్రాళ్ళవంటివి. వీటికి బంగారం లేదా వెండితో తయారు చేసిన రావి ఆకులాంటి పతకాలను వ్రేలాడదీస్తారు. సాధారణంగా ఆభరణాలు ఏ పూల మాదిరిగానో, ఏ ఆకుల మాదిరిగానో ఉండడం జాన పదులకు ప్రకృతితో ఉన్న పరిచయాన్నీ ఆ ప్రకృతిలోని అందాలను ఆవిష్క రించగల హృదయ సంస్కారాన్నీ తెలియజేస్తుంది. అలంకారంగానూ, ఆరోగ్యపరంగానూ, ఆభరణాలు అందరినీ అలరిస్తూనే ఉన్నాయి. బంగారు ఆభరణాలు ధరించే స్తోమతలేని జానపదులు ప్రకృతిలో పూచిన పూలనే ఆభ రణాలుగా ధరిస్తారు. లేదా ఏ ఆకునో నగగా మార్చుకొని సంతృప్తి చెందు తారు. ఉదాహరణకు తాళిబొట్టు, తాటంకం ఇలా ఏర్పడ్డవే.

వైజయంతీ విలాసంలో తాటంకాలు, వాటిమధ్య అందంకోసం కలువ పూలు పెట్టుకోవడం ప్రస్తావించబడింది. ఇట్లే తీగ (కంఠాభరణం) ముక్కర దండతాయెతులు, గాజులు పేర్కొనబడ్డాయి.[1]

కళాపూర్ణోదయంలోని మధురలాలస ఎలాంటి ఆభరణాలు ధరించిందో యయాతి చరిత్రలోని దేవయాని కూడా అలాంటి ఆభరణాలే ధరించింది.[2] తెలగన్న కాలంలో పురుషులు ఎడమకాలుకు కడెం, చెవులకు చౌకట్లు పోగులు ధరించేవారు. ముత్యాలు మొదలైన వాటిని ఓ నాలుగు చేర్చి కట్టిన పోగులే

---

1. వైజయంతీవిలాసం, 4-30 2. యయాతిచరిత్ర, 4-90

పోకట్లు. యయాతి కాలికడెం, చెవిపోగులు ధరించాడు. మంగళ స్నానానికి ముందు వాటిని సులభంగా తీసినట్లు చెప్పబడింది.[1]

శుకసప్తతిలో కదిరీపతి తనకాలం నాటి కాపుస్త్రీలు ధరించే ఆభరణాలను ఒక జాబిత (List)గా ఇచ్చాడు.

> "గొంటిపూసలు రెండుగుండ్లముంగరలుపైజారు చీరలు పైన సన్నగొలుసు
> పెద్దమెట్టెలు మట్టె పిల్లాండ్లు బొబ్బిలి కాయలొత్తుల తోడి కడియములును
> కప్పువల్వరుస లుంగరములు తూలెడు కొంగులు బలు చెంప కొప్పులంచు
> కమ్మగవల్ సన్నకాటుక రేకలు నాభినామంబులు నానుచుట్లు...." 2-332

చిన్న చిన్న వక్కల్ని పూసలుగా చేసి అల్లిన కంఠహారాలే గొంటు పూసలు. ముక్కరలు, మెట్టెలు, కడాలు, ఉంగరాలు, నాను మొదలైన ఆభరణాలు సామాన్యులు సైతం ధరించేవే. నానుతోపాటు పట్టె, తీగె, కంటె మొదలైనవి కూడా కంఠాభరణాలే. ఐతే పట్టె, తీగె గొంతుకు హత్తుకు పోయినట్లుంటే, నానుమాత్రం కొంచెం ఒదులుగా ఉంటుంది. కంటె బరువుగా చక్రాకారంలో ఉండి నడుస్తుంటే రొమ్ముకు తాకుతుంది.

పరదేశంవెళ్ళి తిరిగి రాదనుకొన్న తన భర్త ప్రత్యక్షమయ్యేసరికి ఒక స్త్రీ అది తన మంగళసూత్రం యొక్క ప్రభావంగా భావించినట్లు కదిరీపతి తెలిపినాడు.

> "నేటికి పాటిసేవు నాత్రాటిమహిమ
> సింటికేతేర చల్లగా గంటినింక
> నిదియె పదివేలు వైభవం బెల్లనాడు
> నల్లపూసలు చెవియాకు నాకు చాలు" 2-84.

ముత్తైదువలు తాళిబొట్టు, నల్లపూసలు, చెవికమ్మలు, పసుపు కుంకుములు మొదలైన వాటిని మంగళప్రదంగా భావిస్తారు. నల్లపూసలూ, చెవికమ్మలూ దాలనుకోవడం తమ ముత్తైదువ తనాన్ని నిలుపుకోవడమే.

విజయవిలాసంలో కడాలూ, కమ్మలూ ప్రస్తావించబడ్డాయి. నిరంకుశోపాఖ్యానంలో ఘంటలు పేర్కొనబడ్డాయి. వీటిని పురుషులు కూడా ధరించే

1. యయాతి చరిత్ర, 4-94.

వారు. ''అత్త వారిచ్చిన అపరంజి ఘంటీలు, సంశయింపక చెవుల బెట్టె'' 2-116.

తిక్కన కాలంలో మగవారు మెట్టెలు ధరించగా కందుకూరి రుద్రయ్య కాలంలో ఘంటీలు ధరించారు. ఇది ఆయా కాలాల్లో ఉన్న ఆచారాన్ని సూచిస్తుంది. మన్నారుదాస విలాసంలో రంగాజమ్మ ముక్కెరతోపాటు జానపద స్త్రీలు ధరించే రకరకాల ఆభరణాలను పేర్కొన్నది. ముక్కెర గ్రామీణ స్త్రీలకు అన్నిటికంటె ఎక్కువ మక్కువ కలిగిస్తుందనడానికి ఉదాహరణగా ముక్కెరతో ఆరంభమైన ఈ పల్లెపాటను చూడండి.

''ముక్కుకూ ముక్కెర లేక ముక్కు చిన్నాబోయినాది
నీ ముగ్గురూ బిడ్డాలనమ్మి ముక్కుకూ ముక్కెరతేరా....''

ఇలా సాగుతుంది పాట.

ఇట్లే హంసవింశతిలో నారాయణకవి గోపస్త్రీ వర్ణనలో ఎన్నో ఆభరణాలు పేర్కొన్నాడు.

''కుప్పెరాగిడిబిళ్ళ కుంకుమరేఖ పా
పటబొట్టు కమ్మలు జావిలీలు
లలిసూర్య చంద్రవంకలు సూసకము కెంపు
రవల పల్లెరుపూవు రావిరేకు
బుగడలు నానుగ్రోవులు తీగమెడనూలు
కుతికంటు సరిపెణ గుండ్లపేరు
సరిగెముక్కర బన్నసరము నుత్తుండాలు
కంకణంబులు కట్లు కడియములును
సందిదండలు నొడ్డాణమంగమైన
ముద్రికలు హంసకంబులు మ్రోయుగజ్జె
లలరు బొబ్బిలికాయలు గిలుకుమట్టె
లాదియగు సొమ్ముదాల్చి యయ్యబలమెఱయు'' 2-190

కుంకుమరేఖ మొదలుకొని కాలిమట్టెలవరకు కవి చేసిన ఈ వర్ణనను పరిశీలిస్తే సర్వాభరణభూషితురాలైన ఒక జానపదస్త్రీ మనకళ్ళముందు ప్రత్యక్షమౌతుంది.

గృహాలు :

పురోహితుల గృహం :

ఎప్పటికప్పుడు అతిథులు రావడంవల్ల పురోహితుల ఇళ్ళు రోత పుట్టించేవని శ్రీనాథుని చాటువువల్ల తెలుస్తుంది.

"దోసెడు కొంపలో పసులతొక్కిడిమంచము దూడరేణమున్
పాసిన వంటకంబు పసిబాలుర శౌచము విస్తరాకులున్
మాసినగుడ్డలున్ తలకు మాసిన ముండలు వంటకుండలున్
రాసెడికట్టెలున్ తలపరాదు పురోహితులింటి కృత్యముల్"

ఇంటిని కొంప అని పిలుస్తారు. చిన్న ఇల్లు చిన్న కొంప. ఉన్న కొద్ది స్థలంలో పశువులు, మంచం, పేడ, పాసిపోయిన అన్నం, పిల్లల శౌచం, విస్తరాకులు, మాసిన గుడ్డలు, విధవరాళ్ళు, వంట పాత్రలు, ఎప్పుడూ పొయ్యిలో రాజుకొనే కట్టెలు, తద్వారా వ్యాపించే పొగ - ఇవన్నీ ఆనాటి పురోహితుల ఇంటి సమస్యలు.

వైజయంతీ విలాసంలో వైష్ణవుల గృహాలు చిత్రించబడ్డాయి. ఆకాలంలో వైష్ణవ గురువులుండే ప్రదేశాలను చక్కగా ఊడ్చి, అలికి, ముగ్గులు వేసి పవిత్రంగా ఉంచేవారు.

హంసవింశతిలో నారాయణామాత్యుడు అరుగులకు సున్నాలువేయడం, గోడలకు ఎఱ్ఱమట్టితో పట్టెలు పెట్టడం, కొబ్బరి మట్టల్లాగా నీటుగా ముంగిలి అలకడం, ఐదు రంగుల ముగ్గులు వేయడం, ఉతికిన మడుగు దోవతులను దండెంమీద ఆరవేయడం, ఇళ్ళముందు పసపాకు పందిళ్ళు వేసుకోవడం మొదలైన ఆచారాలను బ్రాహ్మణులు పాటించినట్లు పేర్కొన్నాడు.[1] సాధారణంగా ఇళ్ళల్లో ఉండే దేవునిల్లు, పడకటిల్లు, వంటిల్లు, పసులదొడ్డి, బావి, తోట మొదలైన వాటిని కూడా కవి వర్ణించినాడు.

రెడ్ల గృహం :

శుకసప్తతిలో కదిరీపతి గ్రామాధికారిగాఉన్న రెడ్డిగృహాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు.[2] గ్రామానికి పెద్ద రెడ్డి కాబట్టి ప్రజల తగవులను విచారించ

1. హంస వింశతి 1-151. 2. శుకసప్తతి 2-408.

డానికి వేదిక అతని ఇంటిముందుండే రచ్చబండ. రచ్చబండే 'రచ్చకొట్టు'. ఇంటిముందు అరుగులు, ఇంటి చుట్టూ పారిగోడ (ప్రహరీగోడ) ఉండడం సహజం. వీటితోపాటు కవి కోళ్ళ గూళ్ళను, పొలాన్ని దున్ని చదునుచేసే సాధనాలను, ఇంటి ముందుండే చిన్న చిన్న బండ్లను, పశువులకు సంబంధించిన కాడ్లను, తలుగులను, దొడ్డిలో ఉండే పశువులను, గడ్డి, చొప్ప వాములను, పిడకల గూళ్ళను, రుబ్బురోళ్ళను పేర్కొన్నాడు. ఈ వర్ణన చూస్తుంటే పదహారు పదిహేడు శతాబ్దాల కాలం నాటి వ్యవసాయదారుల గృహాలు ఈనాటి వలె మన కళ్ళముందు నిలుస్తాయి.

ఇట్లే హంసవింశతిలో నారాయణామాత్యుడు ఆయా వృత్తుల వారి గృహాలను చిత్రించినాడు ముఖ్యంగా చేనేతగృహాలు, బ్రాహ్మణుల గృహాలు, వైశ్యుల గృహాలు, రెడ్ల గృహాలు, యాదవుల గృహాలు అతని గ్రామజీవన పరిశీలన పాటవానికి ప్రబల నిదర్శనాలు. అతడు చిత్రించిన రైతు గృహాన్ని చూడండి.

"ముంగిట పులిజూదములు గీచియుండిన రచ్చబండలు గొప్ప ప్రహరిగోడ
పంచె తిన్నెలు చాలు పట్టెలు ముమ్మూల గూండ్లు దీర్చిన యట్టి గోడలలప
దేవర చవికె పందిరి కోళ్ళగూడులు గుబ్రు గుంటక కాడి గొర్ల పల్లు
లట్టువగల కాడి కొట్టంబు పలు గాడి కంప పాతిన లేగ కదువుదొడ్డి
ప్రత్తిగూటంబు తొట్టియు పలక పీట బావి పిడుకల కుప్పల పసుల మేప
మంగలము దాలి యోలిర్కు గ్రామనిసందుగలిగి విలసిల్లునాతనిని లయమెప్పుడు"
4.124.

శుకసప్తతిలోని రెడ్డి గృహానికి, హంసవింశతిలోని ఈ రైతు గృహానికి ఏమంత భేదం లేదు.

చే నే త గృ హ ం :

నారాయణకవి చేనేత పనివారి ఇంటిని సహజ సుందరంగా వర్ణించినాడు.

''కుంచెమగ్గపు గుంతగూటంబు పగ్గంబు పంచె త్రొక్కుడు పట్టె పలకవాసె
పరిపరి యచ్చులు చరికుండ యూడిత పిడు పట్టెలు దంపె నాడె క్రోవి

కోతి పుల్లలు నాల్కు కుడుతరి కొయ్యలు చొప్ప యూచలు కోత చూఱ కత్తి
కారంపు పడుగులు కండెల కప్పెర గోలెము లాకలు నీలి కడవ
గంపడొల్ల కలాసంబు కదురు చెమికె నూలు రాట్నంబు జాలంబు గ్రాలుగోడ
వజలునా శుభభద్రు నివాస భూమి యప్పురంబున సంతత మొప్పుచుండు''

2.11

ఈ పద్యంలోని పనిముట్లు చేనేత వృత్తి సంబంధమైనవి. ఆంధ్ర దేశంలో చేనేత వృత్తిని అవలంబించే ఏ పద్మశాలి గృహాన్ని పరిశీలించినా ఈ వస్తుజాలమంతా కనిపిస్తుంది. ఇందులో పేర్కొన్న పగ్గమే సరిత్రాడు. త్రొక్కుడు పట్టెలే పాకోళ్లు. నేతలో ఒకపోగు పైకి ఒకపోగు కిందికి ఆడుతూ 'అని' పడేటట్లు చేసేవి అచ్చులు. నూలును నేత కనుగుణంగా చేయడానికి ఉపయోగించే గంజిపాత్ర సరికుండ. తయారైన వస్త్రాన్ని ఎప్పటికప్పుడు చుట్టేది దోసుగ (రూపాంతరం - దోనె). కోతి పుల్లలే పన్నె పుల్లలు. చీడు అంటే పడుగు. (రూపాంతరం - సీడు). చొప్ప ఊచల్ని ముక్కలు చేసి దారాన్ని చుడుతారు. అలా చుట్టబడిన ఊచలే కండెలు. కండెలకు తగిన విధంగా ఊచలు తయారుచేయడానికి ఉపయోగపడేది చూఱకత్తి. (రూపాంతరం-సుర్కత్తి). మూతివెడల్పుగా ఉన్న పెద్దపాత్ర గోలెం. దీన్ని నూలును నాన్చడానికీ- రంగులద్దడానికీ ఉపయోగిస్తారు. వెదురు బద్దలే లాకలు. నీలి రంగును నింపే కడవ నీలికడవ. చేనేత గృహాన్ని ఎంతో పరిశీలిస్తేగాని ఇలా వ్రాయడానికి వీలుకాదు. నారాయణకవి వృత్తి విద్యా పరిజ్ఞానానికి ఈ చిత్రణ ఒక ఉదాహరణ.

గోప గృహం:

ఇట్లే నారాయణ కవి గోపగృహాన్ని చక్కగా వర్ణించినాడు. వారి ఇళ్ళల్లో ఉండే రకరకాల వస్తువుల్ని పేర్కొన్నాడు. కంబళ్ళు, దుడ్డుకర్రలు, కవ్వాలు, చల్లకుండలు, గొడ్డళ్ళు, కావళ్ళు, ఉట్లు, చిక్కాలు, పొగాకుతిత్తులు, చల్లముంతలు, త్రాళ్ళు, కత్తులు, పాలగుంజలు, పూజబిందెలు, ఒడిసెళ్ళు, తోలు కుల్లాయీలు మొదలైనవి వాటిలో ఉన్నాయి. ఈనాటికీ వీటిని వ్యవసాయదారులైన గొల్లవారి ఇండ్లల్లో చూడవచ్చు.

''కంబళి తలదుడ్డు కవ్వము మజ్జిగబాన గొడ్డలి నుచ్చుప్రాతలగుది
కావడి యుట్లు చిక్కము సందికడియంబు సూకలతోప పొగాకుతిత్తి
బొప్పి మజ్జిగముంత బొట మంచిపిల్లలగూడుదామెనత్రాడు కోతకత్తి
తొర్లు గట్టెయు జలచుబ్బ చిల్కుడుగుంజ పూజ బిందెలు వెన్నపూస చట్టి
పాల బుడిగలు వడిసెల్ప్రాత మెట్లు మలప మందుల పొడిబుజ్జి మన్నెముల్లు
తోలుకుళ్ళాయి తొడుపునుదొడ్డికంపచుట్టు చవికెయుకొమరప్ప సొలయునతడు''
2.75.

వైశ్యగృహం :

హంసవింశతిలో నారాయణామాత్యుడు వరుసగా ఐదు పద్యాల్లో వైశ్య గృహవర్ణన చేశాడు. వాటిలో ధాన్యాలు, వైద్యానికి సంబంధించిన మూలికలు, రసపదార్థాలు, ప్రజలకు నిత్యం ఉపయోగపడే సరుకులు పేర్కొనబడ్డాయి. ప్రజలకు కావలసిన అన్నిరకాల వస్తువులనూ, ఆహారధాన్యాలనూ ఆకాలంలో వైశ్యులు అమ్మేవారు. ఆయా సరుకులతో వైశ్యుల ఇండ్లు నిండుగా ఉండేవి. వైశ్యులమ్మే వైద్యసంబంధమైన పదార్థాలు ఈ క్రింది పద్యంలో వర్ణించ బడ్డాయి.

''జాజికాయలు రాస్న జాపత్రియు హరిద్ర నాగర గంధక నాభిరసము
లతి మధురంబు తుత్థాభ్రకశైలాశిలాజిత్తులు మురుదారు సింగుహింగు
వన్నభేదియు వస యక్కలకర పంచలవణ చవ్యములు బోళము మణిశిల
పిప్పళ్ళు కోష్ఠువు పిప్పలీ మూలముల్ హరిదళ నాగకేసరము లింగె
లీకము సదాపవేళ్లు ధాన్యాకములును కటుక రోహిణి పటిక జంగాల పచ్చ
కర్పరియుకారవియురేణుకమతివసయుతాళకముమాంసినఖము నేపాళములును''
2.227.

ఇంకా ధాన్యరాసులు, బంగారంలాంటి విలువైన వస్తువులు, నాణాలు, పట్టువస్త్రాలు మొదలైన వాటితో వైశ్యుని గృహం కళకళలాడేది. చుట్టు ప్రక్కల ఉన్న ఊళ్ల నుంచి ప్రజలు వచ్చి తమకు కావలసిన వస్తువులు కొనుక్కొనే వారు.

గృహ నిర్మాణాలు :

కొండ గుహల్లో నివసించిన మనిషి నాగరికత అభివృద్ధి చెందడంతో ఆహార పానీయాల విషయంలోను, గృహ నిర్మాణాల విషయంలోను ప్రగతి సాధించినాడు. దట్టమైన అరణ్యాలను నరికి వ్యవసాయ యోగ్యంగా మార్చు కొన్నట్లే కొండలమీద నివాసస్థానాలు ఏర్పాటుచేసుకొన్నాడు. ఎత్తుపల్లాలను రాళ్ళతో నింపి, సమతలం చేసి గుడిసెలు వేసుకొన్నాడు. రానురాను వెదురు బద్దల్ని, చెక్కల్ని నిలబెట్టి వాటిని పేడతోనో, మట్టితోనో పూసి గోడల ఆకారంలో మార్చుకొన్నాడు. మట్టితో గోడలు కట్టి ఆ గోడలమీద అడ్డంగా దూలాలూ, వట్టెలూ వేసి పైన ఆకులతోగాని లేదా గడ్డితోగాని కప్పి గుడి సెలు నిర్మించుకొన్నాడు. గుడిసెలు గోపురాల్లాగా ఉండడం వల్ల వాన నీరు పైన నిల్చేదికాదు. క్రమంగా ఈ గుడిసెలే తర్వాతి కాలంలో గృహ నిర్మా ణానికి, గుళ్ళ నిర్మాణానికి దారి చూపాయి. కప్పులు సమతలంగా నిర్మించ వలసి వచ్చినప్పుడే స్తంభాలు అవసరమయ్యాయి. ప్రాథమిక దశలో గుడిసె లకు గోడలూ, స్తంభాలూ లేవు. కాలక్రమేణా గృహ నిర్మాణంలో అనేక ప్రయోగాలు జరిగాయి. అంతేగాక వాస్తుశాస్త్రం ప్రకారం కూడా నిర్మాణాలు కొనసాగాయి.

హరివంశంలో పూరిగుడిసెలు పేర్కొనబడ్డాయి. ఆ గుడిసెలకు వాకి ళ్ళున్నాయి కాని గడియల్లేవు. గుడిసెల ముందు బండ్లు నిలిపేవారు. మంచెలు ఏర్పాటుచేసేవారు. గుడిసెల చుట్టూ కంప గొట్టించే వారు. గుడిసెల్లో చిన్న చిన్న అరుగులుండేవి. గృహిణులు పెరుగు చిలకడంవల్ల చుక్కలు పడి అరుగులు అందంగా కనిపించేవనిఎఱ్ఱన వర్ణించినాడు.[1]

కొత్తచోటికి వెళ్ళినప్పుడు వెంటనే శాశ్వత గృహాలు కట్టుకోవడం సాధ్యం కాదు. తాత్కాలికంగా గుడారాలో, గుడిసెలో వేసుకొంటారు. ప్రేపల్లెవాసులు క్రొత్తప్రదేశానికి వలస వెళ్ళినప్పుడు అక్కడ వారు నిర్మించు కొన్న నివాస గృహాలను ఎఱ్ఱన సహజంగానూ, రమ్యంగానూ వర్ణించినాడు.

1. హరివంశం (పూ. భా), 5.143.

"గుడిసెలు వన్నియున్ ఘన నికుంజము లిండులు గాన జొచ్చియున్
బెడగగు జొంపముల్ గలిగి పేర్చిన మ్రాకుల క్రింద నుండియున్
కడక యెలర్ప దొడ్లకును గ్రంపలు వైచియు నొక్క నాటిలో
నడరగ ప్రాత కాపులయి రక్కడ గోప కుటుంబ లందరున్"'

పూర్వ. 6.26.

గుడిసెలు వేసుకొని, పొదల్ని ఇండ్లుగా మలచుకొని, పసుల కోసం దొడ్లు నిర్మించుకొని, బాగా ఆకులున్న చెట్ల క్రింది ప్రదేశాలను నివాసాలుగా మార్చుకొని ఒక్క రోజుకే ఎన్నో రోజులనుంచి నివసిస్తున్నట్లు మెలిగారని కవి వర్ణించినాడు.

గ్రామీణులకు గుడిసెలే మేడలు. వాటినినిర్మించుకోవడానికి తాటాకులు, తాటినార, గడ్డి, చిన్న చిన్న కట్టెలు ఉంటేచాలు. ఒక్క రోజులోనే నివాసాలను ఏర్పాటుచేసుకోగల శక్తి సామర్థ్యాలు వారివి.

కేయూరబాహు చరిత్రలో వస్తువులను భద్రపరచుకోవడానికి ఇండ్లలో నిర్మించే అటకలు పేర్కొనబడ్డాయి.[1] ఇట్లే రంగనాథ రామాయణంలో సోరణగండ్లు (కిటికీలు) ప్రస్తావించబడ్డాయి [2]

కాశీఖండంలో శ్రీనాథుడు ఇంటిముందుండే అరుగులు, పందిళ్ళు పేర్కొన్నాడు. సామాన్యంగా గ్రామీణ సమాజంలో ఇంటి వెనుక చెట్టు, ఇంటి ముందు పందిరి ఉండవలసిందే, కులవృత్తులు చేసుకొని జీవించేవారు తరచుగా పందిళ్ళ క్రిందనే కాలం గడపడం చూస్తాము. మేదరివారు తమ ఇళ్ళముందు తడకలతో పందిళ్ళు వేసుకొని పనులు చేయడం ఈనాటికీ ఉన్నదే.

ఒక వైశ్యుడు అంగడి నుంచి సరాసరి ఇంటికి వచ్చి పందిరిక్రింద అరుగుమీద సేద తీర్చుకొన్నట్లు శ్రీనాథుడు వర్ణించినాడు.

"అంగడి నుండి బియ్యము పదార్థములుం గొనివచ్చి దప్పిమై
నంగము దూల నుస్సనుచు నల్లన కోమటిసెట్టి మందిర

---

1, కేయూరబాహుచరిత్ర, 3-238. 2. రంగనాథ రామాయణం, బాల, పు. 64,

ప్రాంగణ సీమవేదిపయి పందిరి నీడను విశ్రమించి పి
ల్చెం గటమున్ ప్రసేవమును చెప్పెర దెమ్మని బంటు ప్లేచ్చునిన్" 5.66

ద్విపద పరమయోగి విలాసంలో పంచెతిన్నెలు పేర్కొనబడ్డాయి. విశాలమైన అరుగులే ఈ పంచె తిన్నెలు. ఇవి కూర్చోవడానికే కాక విశ్ర మించడానికి కూడా ఉపయోగపడేవి. "ఒక పంచెతిన్నెపై నొక్కండ యలసి నికట భాగంబున నిద్రించుచున్న" 4.354.

గృ హో ప క ర ణా లు :

బసవపురాణంలో పాలను కొలిచే పాత్రలు, గురుగులు, బానలు, కుండలు మొదలైనవి పేర్కొనబడ్డాయి. గొడగూచి గురుగుల్లో పోతెలు, ఉట్లపైన బానల్లో నెయ్యి, కుండల్లో పటిక బెల్లం భద్రపరచినట్లు వర్ణింప బడింది.[1]

క్రీడాభిరామంలో పట్టెమంచాలు, వెదురు మంచాలు పేర్కొనబడినాయి. ఆ కాలంలో శిఖండి మంచాలుండేవి.[2] రెండు దిక్కులు ఒకేలాగుండే మంచాలే శిఖండిమంచాలు. పల్నాటి వీరచరిత్రలో నిలువుటద్దాలు పేర్కొన బడ్డాయి.[3] వీటిని ధనవంతులు ఉపయోగించేవారు. శృంగారనైషధంలో తూగుటుయ్యాలలు, సకినెల మంచాలు పేర్కొనబడ్డాయి.[4] సింహాసన ద్వాత్రింశికలో ధాన్యం నిలువచేసే గాదెలు ప్రస్తావించబడ్డాయి.[5] గ్రామీణులు వీటిని కొట్టెలని వ్యవహరిస్తారు. పండితారాధ్య చరిత్రలోనూ, రాజవాహన విజయంలోనూ వీటి ప్రస్తావన ఉంది. ద్విపద పరమయోగి విలాసంలో కాళ్ళ పీటలు పేర్కొనబడ్డాయి.

"....కాళ్ళ పలక పీటపై సొమ్ములు పెట్టి వచ్చితిని" 3.208.

ప్రభావతీ ప్రద్యుమ్నంలో తాంబూలపాత్రలు పేర్కొనబడ్డాయి. రంగు రంగుల బొమ్మలు చిత్రించిన తాంబూల పాత్రలను ఆనాటి ప్రజలుపయోగించే వారు.[6] పాండురంగ మాహాత్మ్యంలో సామాన్య జనం ఉపయోగించే గిండి,

---

1. బసవ పురాణం, ఆ. 3, పు. 71. 2. క్రీడాభిరామం, ప. 70.
3. పల్నాటి వీరచరిత్ర, పు. 16. 4, శృంగార నైషధం 7.148.
5. సింహాసన ద్వాత్రింశిక, 9.100. 6. ప్రభావతీ ప్రద్యుమ్నం, 4.144.

పేర్లు, శ్రావమూకుడు మొదలైన పాత్రలు ప్రస్తావింపబడ్డాయి.[1] చిన్న నోరున్న చెంబు గిండి. మట్టితో చేసిన కుండ పేర్లు. కుండ మీద మూతగా ఉంచే కంచంలాంటి మట్టిపాత్ర శ్రావమూకుడు. రాజశేఖరచరిత్రలో మూతి వెడల్పుగా గల మట్టిపాత్రలు పేర్కొనబడ్డాయి.[2]

వైజయంతీ విలాసంలో సామాన్యులుపయోగించే వస్తు సామాగ్రి పేర్కొనబడింది. అందులో సకినెల మంచాలు, గుండ్రని తలగడలు, వట్టి వ్రేళ్ళతో తయారుచేసిన విసనకర్రలు, గొజ్జంగి నీరు నింపిన గాజుకుప్పెలు, గొడుగులు, పావకోళ్ళు, గంధపు పెట్టెలు, సానలు, గడియారాలు, హంస ముక్కాలిపీటలు, పటిక గిన్నెలు, చెంబులు, పోకచెక్కల బరిణలు మొదలైనవి ఉన్నాయి.[3] చంద్రభాను చరిత్రలో స్త్రీలు ముక్కాలిపీటమీదకూర్చొని అలంకరించుకొన్నట్లు వర్ణించబడింది.

''ముక్కాలి పీటపెట్టి యొక ముద్దియ కుంచెయవ్వైచె వెంద్రుకల్" 5.152.

ఈ కావ్యంలో చిలుకల బొమ్మలు చెక్కిన తూగు మంచాలు పేర్కొనబడ్డాయి· ఊగడానికి వీలుగా పైనుంచి వ్రేలాడదీసిన మంచాలే తూగుమంచాలు. వీటికి ఉయ్యాల మంచాలని కూడా పేరుంది- యయాతి చరిత్రలో - వివాహ సమయంలో యయాతిని ముక్కాలిపీటమీద కూర్చుండబెట్టి నలుగురాసినట్లు చెప్పబడింది.4 కేయూరబాహు చరిత్రలో లాగా శుకసప్తతిలో కూడా విశాలమైన అటకలు ప్రస్తావించబడ్డాయి.

,,అంతలో దాని పెనిమిటి అటక డిగ్గి
గూఢముగ నేగి పెరటి బల్గోడదాటి'' 2.194.

ఈ కావ్యంలో బొడ్డు గిన్నెలు పేర్కొనబడ్డాయి. వీటిలో తవిద అన్నాన్ని భద్రపరుచుకొనేవారు. నీలాసుందరి పరిణయంలో ముక్కాలి పీటలు పేర్కొనబడ్డాయి. ఈ కావ్యంలో తిమ్మకవి నీలా కృష్ణుల శోభనం గదిని వర్ణించిన సందర్భాన్ని పరిశీలిస్తే ఆ కాలంలో సామాన్యులు సైతం నిత్య జీవితంలో ఉపయోగించే వస్తుసామాగ్రి తెలుస్తుంది.

1. పాండురంగ మాహాత్మ్యం, 4.165 2. రాజశేఖర చరిత్ర. 2.128.
3. వైజయంతీ విలాసం, 3.74. 4. యయాతి చరిత్ర, 4.94.

''పగడంపు సకినెల పట్టెమంచము దోమతెర విరజాజి క్రొవ్విరుల పరుపు
సురమాలి బాలీసు సూతిని గవుసెన జరజాజు చందువా సానపీట
కపురంపు బరణి చిల్కల దివ్వె కంబంబు నిల్వుటద్దములు పన్నీటి క్రోవి
జవ్వాది పక్కణి జాలవల్లికపైడి వీణె దువ్వెన వట్టి వ్రేళ్ళ సురటి
తమ్మ పడిగము మంచిగంధంపుకోర పచ్చి కస్తురి పెట్టె సంపెంగ నూనె
గిండియలు గల్గి కన్నుల పండువైన పచ్చరాచట్టు గొనబుటుప్పరిగలోన''
3.91.

కీచు కీచు మని చప్పుడు చేసే మంచమే సకినెల మంచం. వెనక్కి చేరగిలబడడానికి వీలయ్యే దిండు బాలీసు. దీపాలుంచిన చిలుకల ఆకారంలోని చిన్న చిన్న స్తంభాలే చిలుకల దివ్వెకంబాలు. తాంబూల పాత్రలే జాలవల్లికలు. ఇట్లే తిమ్మకవి పేర్కొన్న ఇతర వస్తువులు ఈనాటికీ మనం ఇళ్ళల్లో ఉపయోగించేవే.

గృహాలంకారాలు :

ఇళ్ళ ముందు ముగ్గులు వేయడం ప్రాచీనకాలంనుంచి వస్తున్న తెలుగు వారి ఆచారం. సంక్రాంతి ముగ్గులకున్న ప్రాధాన్యం అందరికీ తెలిసిందే. పాండవులు వస్తున్నారని తెలిసి వారణావత ప్రజలు తమ ఇళ్ళ ముందు ముగ్గులు వేసి నగరాన్ని అలంకరించుకొన్నట్లు నన్నయ వర్ణించినాడు.[1] ముగ్గుల ప్రస్తావన మూలంలో లేదు. ఇట్లే కుమారసంభవంలో ద్వారాలకు రెండువైపుల గోడలకు చిత్రాలు వేసే విధానం చెప్పబడింది.

"ఇడుపు లేక చిత్రము వ్రాయ ...'' 8-135.

క్రీ. శ. 1130 ప్రాంతంలో సోమేశ్వరుడనే పశ్చిమ చాళుక్యరాజు రచించిన అభిలషితార్థ చింతామణిలో తెలుగువారి కళలకు సంబంధించిన అనేక విషయాలు ప్రస్తావించబడ్డాయి. ఇందులో ప్రతిమా శిల్పాలూ, చిత్తరువులూ ఆయా వృత్తులవారి కళలుగా పేర్కొనబడ్డాయి. చిత్రాలకు అవసరమైన రంగులు సిద్ధపరచుకొనే విధానం తెలుపబడింది. ఎలాగంటే మొదట

1. ఆంధ్ర మహాభారతం, ఆదిపర్వం, 6-149.

గట్టి గచ్చుతో గోడను చదునుచేయాలి. దున్నపోతు తోలును నీళ్ళలో నాన బెట్టి మెత్తగా తయారైన తర్వాత దాని మడ్డిని తీసుకొని వెన్నలాగా చేసి గోడమీద లేపనంగా వాడుకోవాలి. శంఖ చూర్ణం అందులో కలపాలి. వెదురు చివర రాగి పొన్ను వేసి దాన్ని బ్రష్‌గా వాడుకోవాలి. ఇట్లే ఈ గ్రంథంలో ఆయా దేవతలు, మనుష్యులు, జంతువులు ఏయే ఆకారంలో చిత్రించబడాలో సూచించబడింది.

క్రీడాభిరామాన్నిబట్టి ఆ కాలంలో ఇళ్ళ గోడల్ని రకరకాల చిత్రాల తోనూ, ముంగిళ్ళను ముగ్గులతోనూ అలంకరించేవారని తెలుస్తుంది. ముఖ్యంగా వేశ్యల గృహాలు శృంగారాత్మకమైన చిత్తరువులతో అలంకరించబడేవి. మాచల్దేవి చిత్రశాల గోపికా కృష్ణ లీలలతో ప్రకాశించినట్లు వర్ణించబడింది.

పల్నాటి వీర చరిత్రలో గోడలకు వేలాడదీసే పటాలు పేర్కొన బడ్డాయి. ఆ కాలంలో ప్రజలు రాముడు, కృష్ణుడు మొదలైన పురాణపురుషుల కథలు వ్రాసిన పటాలను గోడలకు వ్రేలాడదీసేవారు.

''శ్రీరామ కథలును శ్రీకృష్ణ కథలు
పన్నుగా వ్రాసిన పటముల దెచ్చి
కట్టిరి గోడల కనపడకుండ....'' పు. 16.

ఆముక్తమాల్యదలో రాయలు ముగ్గుల్ని మనోజ్ఞంగా వర్ణించినాడు. విలుపుత్తూరులో ముంగిళ్ళు రత్నాలు తాపడంవల్ల ప్రకాశిస్తున్నాయి. ఆముంగి ళ్ళలో కొబ్బరిచెట్లున్నాయి. ఆ చెట్ల ఆకుల యొక్క, మొగ్గల యొక్క నీడలు నేలపై ప్రతిఫలిస్తున్నాయి. అప్పుడు ఆకుల నీడ అలికినట్లుగానూ, మొగ్గల నీడ ముగ్గులు వేసినట్లుగానూ ఉన్నట్లు రాయలు చేసిన వర్ణన అద్భుతంగా ఉంది.

"కోరకిత నారికేళ క్ష్మారుహములు రత్నకుట్టిమంబులతోపన్
ద్వారములయత్న కృత శృంగారంబుగనలికి ముగ్గ ఘటియించిరనన్''
1-55.

రాధా మాధవ కావ్యంలో గోడలమీద చిత్రరూపం ధరించిన పురాణ కథలు ప్రస్తావించబడ్డాయి, ఇవన్నీ పెళ్ళి కథలు కావడం విశేషం.

''ఆదినారాయణు డమృతాబ్ధి మథియించి
యబ్జవాసిని పెండ్లియైన కథలు
చంద్రశేఖరుడు పుష్పశరాసు గెల్చి హి
మాచల తనయ పెండ్లైన కథలు
శ్రీరామ చంద్రుండు శివ ధనుర్భంజన
మడరించి సీత పెండ్లైన కథలు
నలచక్రవర్తి వేల్పులు సిగ్గుపడగ భీ
మాధీశ కన్య పెండ్లైన కథలు
చిత్రభవకేళి బంధ విచిత్ర గతులు
హంస కలరవ కీర రథాంగ గతులు
వ్రాసి రలవడ తత్స్వయంవర మహీస్థ
లాంతిక స్వర్ణ సౌధ కుడ్యముల నెల్ల" 4-148.

యయాతి చరిత్రలోను ముగ్గుల ప్రస్తావన కనిపిస్తుంది. ముంగిళ్ళలో పూల ఆకారంలో ఉన్న ముగ్గులు నిజమైన పూలకు తెలివిని నేర్పేలాగున్నాయని తెలగన్న వర్ణించినాడు.[1]

గొల్లపల్లె :

వర్ణనాత్మక శైలికి గురుప్రాయుడైన ఎఱ్ఱన ప్రతిభా పాటవాలను ఆతడు హరివంశంలో గొల్లపల్లెను చిత్రించిన విధానాన్ని బట్టి తెలుసుకోవచ్చు. చిన్న తనంలో శంభుదాసుడు తన హృదయం మీద చిత్రించుకొన్న గొల్లపల్లె హరివంశ కావ్యంలో వ్రేపల్లెగా రూపు దిద్దుకోవడమేకాక ఆ కాలంనాటి పల్లె జీవనానికి అద్దం పట్టింది. ఈ విషయంలో ప్రబంధ పరమేశ్వరుడు భాగవత కర్త అయిన పోతనామాత్యునికి మార్గదర్శకుడైనాడు.

పురుటి పాపడైన కృష్ణున్ని ఉయ్యాలతొట్టిలో మోపించుకొని నందుడు యశోదతో కూడి బలమైన కోడెలను కట్టిన బండెక్కి వ్రేపల్లెకు చేరు

1. యయాతి చరిత్ర, 2-49.

కొన్నాడు. ఇట్టి సందర్భంలో ఎఱ్ఱన వ్రేపల్లెను చిత్రించిన తీరు ప్రశంసార్హమైంది.[1]

పుష్పించి ఫలించిన చెట్లతో యమునా నది తీరం అందంగా ఉంది. యమునా నదికి నాల్గు దిక్కుల బలమైన ముళ్ళ కంపలతో పెద్ద పెద్ద దొడ్లున్నాయి. వాటిలో తెల్లవారుజామున మంచు వడ్డ పచ్చ గడ్డిని మేసి వచ్చి ఆవులు హాయిగా నిద్రిస్తున్నాయి. గొల్లలు పాడి ఆవులను పేరు పెట్టి పిలుస్తున్నారు. ఉల్లాసంతో హుంకారాలు చేస్తున్న తల్లి ఆవులను దూడలు సమీపించడంవల్ల త్రొక్కిసలాట ఏర్పడింది. ఋతు సమయంలో ఉన్న ఆవులను చూస్తూ కోడెలు ఒకదాన్ని మరొకటి చేరనివ్వకుండా అడ్డుపడుతున్నాయి. పెద్దగా రంకెలు వేస్తున్నాయి. కాలి గిట్టలతో నేలను త్రవ్వుతున్నాయి కొమ్ములతో పొడుచుకొంటున్నాయి. అంతేకాక కరకుజారిన మెడలతో, వెడల్పైన వీపులతో, నిండైన గంగడోళ్ళతో తిరుగుతున్నాయి.

పాలు పిదుకుతూనే తలుగులను తలలకూ, మొలలకూ చుట్టుకొన్న గొల్లలు అటు ఇటు తిరుగుతూ ఆవులనుంచి దూడలను వేరు చేస్తున్నారు. వారికి అంటుకొన్న ఆవుల నోటి నురుగు, దూడల పేడ, పాలకుండల మసి వారినుంచి ఎన్నడూ వేరుచేయలేని ఆభరణాలుగా భాసిల్లాయి.

కొందరు గొల్లలు ఒంటిమీదున్న వల్లెలు విసిరి కోడెదూడల్ని కాలుజారి పడేటట్లు చేసి బంధించడమే కాక వాటిని వ్యాపారస్థులకు అప్పగిస్తున్నారు. వాతలు పెట్టే కడ్డీలతోను, నోరు తెరిచి చూసే సాధనాలతోను, వెంట్రుకల బంతిలాగున్న వస్తువులతోను కొందరు రోగగ్రస్థమైన పశువులకు చికిత్స చేస్తున్నారు. మరికొంతమంది గొల్లలు దూడలను దగ్గరికి రానివ్వని పాడి ఆవులను దూరంగా కట్టేసి, అవి పాలు చేపడానికి రకరకాల పద్ధతుల్ని అవిలంబిస్తున్నారు మందులు చల్లుతూ బాధపెడుతున్నారు. మందలో కొందరు ఎటు చూసినా తామే అన్నట్లు తిరుగుతున్నారు. వాళ్ళ వీపులు

1. హరివంశం (పూ. భా), 5-143.

కావళ్ళు మోయడంవల్ల కందిపోయాయి. కాయలు కాచి వంగిపోయాయి. తల మీది జుట్టు వారి బలహీనమైన వీపులకు అంటుకొని మురికి పట్టి, మొద్దుబారి, పిండితే సీచుకంపుకొట్టే విధంగా తయారయ్యాయి. వారి శరీరావయవాలు పసుల కొమ్ములు తాకడంవల్లనూ, అడవికంప కుచ్చుకోవడంవల్లనూ, పొడిచే స్వభావం కల్గిన దొంగెడ్ల పోట్లవల్లనూ గంట్లు గట్టి మొద్దుబారి పోయాయి. కొందరు గొల్లలు ఎఱ్ఱగీరలున్న పుల్లరంగు కళ్ళతో వెర్రిచూపులు చూస్తు న్నారు. బొంగురు గొంతుతో మాట్లాడుతున్నారు.

గొల్లపల్లెలోని పడుచులు చిలుమూరే ఇత్తడి కడాలు తొడుక్కొని, కంచు ఉంగరాలు పెట్టుకొని, నాచు ఆవరించిన తామర పూలను సైతం లెక్క చెయ్యని తమ అందమైన చేతులతో కడవల మూతుల్ని భద్రంగా పట్టుకొని, ముఖంమీద ముంగురులు గాలికి ఆడుతుంటే, మబ్బు తునకలు కప్పిన చందమామలాంటి ముఖంమీది నుంచి చెమట చుక్కలు జారిపడగా వయసు గర్వంతోనూ, ఇంకా నిద్ర చాల్లేదని సూచించే నిట్టూర్పులతోనూ గుంపులు గుంపులుగా బయల్దేరి ఏటి నీళ్ళు మోసుకొస్తున్నారు. మరికొంతమంది బంగారు గాజుల గలగలలతో, వక్షోజాల రాపిళ్ళతో, పిరుదుల కదలికలతో కమ్మని పాటలు పాడుతూ, చూసే వాళ్ళ మనస్సు దోచుకొనే విధంగా పెరుగు చిలుకుతున్నారు.

మందలోని గృహిణులు నెయ్యి, మజ్జిగ అమ్మే పనిలోను, ఇళ్ళను శుభ్రం చేసుకోవడంలోను, ఏడుస్తున్న పిల్లల్ని సముదాయించడంలోను, చిన్న పిల్లలకూ, కూలివాళ్ళకూ తిండి పెట్టడంలోను నిమగ్నులై ఉన్నారు.

కొత్తగా నిర్మించిన గడ్డి గుడిసెలకు గడియలు లేకుండానే వాకిళ్ళు వదిలివేయబడ్డాయి. వాకిళ్ళలో బండ్లూ, మంచెలూ ఉన్నాయి. ఎక్కడ చూసినా నేతిని కాస్తుండడం వల్ల చురచుర శబ్దం వినిపిస్తూ ఉంది. సువాసన వ్యాపిస్తూ ఉంది. పిల్లలు అన్నంతినేటప్పుడు అంచుకు మీగడ పెట్టుకొన్నారు. అయితే వారి అజాగ్రత్తవల్ల అది క్రింద పడి పిడకలు ఉంచిన ప్రదేశమంతా తడయ్యింది. గుడిసెల ముందూ, గుడిసెల లోపలా చిన్నచిన్న అరుగు లున్నాయి. అవి పెరుగు చిలికేటప్పుడు చుక్కలు పడి మరింత అందంగా కనిపిస్తున్నాయి—ఇదీ ఎఱ్ఱన చేసిన గొల్లపల్లె చిత్రణ.

ప్రాచీనకాలంలో పల్లీయులకు పశువులే సంపద. వారి జీవితాలు ఆల మందలతోను, పొలాలతోను ముడివేయబడ్డాయి. పశువులదొడ్లూ, వాటి చుట్టూ ముళ్ళకంపలు నాటడం గ్రామాల్లో నేటికీ చూస్తాం. నీటి వసతిఉన్న ప్రదేశాల్లోనే పసులదొడ్లు నిర్మించుకోవడం గ్రామ ప్రజల పరిణత పరిజ్ఞానాన్ని సూచిస్తుంది.

వేకువ జామున ఆలమందలో జరిగే హడావుడిని ఎఱ్ఱన కళ్ళకు కట్టి నట్లు చిత్రించినాడు. చీకటి ఉండగానే మంచులో తడిసిన గడ్డిని మేసి వచ్చి ఆవులు నిద్రించడం, పాలు పిండే సమయంలో దూడలు అల్లరి చేయడం, ఆవుల వెంటపడే కోడెల దుడుకుదనం - ఇవన్నీ వాస్తవాలే. పాలు వేడిచేసి నప్పుడు కుండలకు మసి అంటుకొంటుంది. పసులు గడ్డి మేసేటప్పుడు నోటి నుంచి నురుగు వస్తుంది. ఆ మసీ, నురుగూ, పసుల పేడా గొల్లవారి శరీరాల కంటుకొని సహజాభరణాలుగా ఉన్నాయనడం అతిశయోక్తి ఏమీ కాదు. ఎఱ్ఱన సూక్ష్మ పరిశీలనకు ఇదొక ఉదాహరణ. దీన్ని బట్టి గొల్లలు దినమంతా పసుల మధ్య, పాల కడవల మధ్య తిరుగుతారన్న విషయం ధ్వనిస్తుంది.

కావళ్ళు మోయడంవల్ల పంగిపోయి కాయలు కాచిన వీపూ, కర్రా కంపా తగిలి మొద్దుబారిన శరీరమూ, కంపు గొట్టే వెంట్రుకలూ, బొంగురు గొంతూ, పుల్లరంగు కళ్లూ, అమాయకమైన చూపులూ పరిశీలిస్తే గొల్లల ఆకారాన్ని ఇంత సహజంగా ఎఱ్ఱన తప్ప మరొకరు చిత్రించలేరేమో అని పిస్తుంది.

గొల్ల పడుచులు ధరించినవి బంగారు కడాలూ, వెండి ఉంగరాలూ కావు. ఇత్తడి కడాలు, కంచు ఉంగరాలు మాత్రమే. ఇవి గొల్లవారి పేద తనాన్ని సూచిస్తున్నాయి.

ఈ కాలంలోను పేడతో పిడికెలు తయారుచేసి భద్రపరచుకొంటారు. పొయ్యిలోనూ, కుంపటిలోనూ వాటి నుపయోగిస్తారు. ఊళ్ళల్లో ప్రతి ఇంట్లో పిడికెలగూడుంటుంది. పిడికెలమీద నెయ్యి పడి తడి అయిన విషయాన్ని కూడా కవి మరచిపోకుండా చెప్పడం అతనికి గ్రామీణ జీవితంతో ఉన్న గాఢ మైన పరిచయాన్ని చాటుతుంది. ముఖ్యంగా ఎఱ్ఱన వాడిన జాతీయాలు, పద బంధాలు గ్రామీణ జీవన చిత్రణకు మరింత వన్నె చేకూర్చాయి.

ఉదాహరణకు ఎఱ్ఱ సెరలు, కఱకెక్కిన మెడలు, కావటి మోపులు, గంగడోళ్లు, చికిచికి వెంౘ్రుకలు, చిడిముడిపాటు, చిలుమూరు, తలమొలలు, వెడదవీవులు, వెదయావులు, తెవులుగొంటులు, నిదురయూర్పులు, పెనుదొడ్లు, పోకుమేయు, ముదకవెన్నులు, ములువెలుగులు, మ్రుచ్చులపోట్లు మొదలైన వాటిని చెప్పుకోవచ్చు.

ఈ విధంగా పల్లె జీవితాన్ని సహజ సుందరంగా చిత్రించిన ప్రాచీన కవుల్లో ఎఱ్ఱనది ప్రథమస్థానమంటే అతిశయోక్తి కాదు. కనుకనే శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు ప్రబంధ పరమేశ్వరున్ని ఇలా ప్రస్తుతించారు.

"ఎఱ్ఱన హరివంశంలోని శ్రీకృష్ణుని బాల్య విహారములకు రంగ స్థలమైన గోకులమును, గోప జీవితమును వర్ణించిన ఘట్టములు ప్రత్యేకము ఒక **Pastoral Poem** గా చదివి ఆనందింప దగియుండును.[1]

1, ఆంధ్ర సాహిత్య చరిత్ర, పు. 298.

# స్వభావ చిత్రణ

మానవ స్వభావ చిత్రణలో మన తెలుగు కవులు వారికి వారే సాటి. వారు రూప చిత్రణ కిచ్చిన ప్రాధాన్యతను స్వభావ చిత్రణకు కూడా ఇచ్చారు. నాయికా నాయకుల అంగాంగ వర్ణనలు చేస్తూ కావ్యం సైజును పెంచారన్న అభియోగం ఏమైనప్పటికీ, సందర్భానుగుణంగా పాత్రల మనోభావాలను చక్కగా వ్యక్తీకరించారనే చెప్పాలి.

స్వభావ మనేది మాటల ద్వారా, చేష్టల ద్వారా అభివ్యక్తమౌతుంది. లోకంలో కొందరి స్వభావాలున్నాయి. అవి ఎప్పుడైనా, ఎక్కడైనా ఒకే లాగుండవిడం శేషం. గ్రామీణ వాతావరణంలో ఆయాపాత్రల మనస్తత్వాన్ని కవులు చిత్రించిన తీరును ఈ ప్రకరణంలో చూడవచ్చు. ఇట్లే మానవ స్వభావ మూలకాలైన విశ్వాసాలను, శకునాలను గూర్చి తెలుసుకోవచ్చు.

మనస్తత్వం :

బసవ పురాణంలో పాల్కురికి సోమనాథుడు చిన్న పిల్లలను ఆడా, మగా భేదం లేకుండా పెళ్ళిళ్ళకు తీసుకొనివెళ్ళే తల్లుల అనురాగాన్ని బెజ్జ మహాదేవి పాత్ర ద్వారా తెలియజేసినాడు.

''పెండ్లిండ్ల నోముల పేరంటములను
పండువు దినముల పాటి జాతరలను
తగిన పోడిమి సేయు తల్లి లేకున్న
వగపరే మఱి యెట్టి సుగబిడ్డలైన" ఆ. 3, పు. 58,

బసవ పురాణంలో గొడగూచి కథ చిన్నపిల్లల మనస్తత్వ చిత్రణకు అద్దం పట్టింది. గొడగూచి శివుడు పాలారగిస్తే అతన్ని బండిమీద వీర భద్రుని జాతరకు తీసుకుపోతానంటుంది. ఇంకా ఆడుకోవడానికి చిన్న చిన్న బొమ్మలూ, గురుగులూ ఇస్తానంటుంది. తింటానికి పళ్లూ, అటుకులూ ఇస్తా నంటుంది.

''వీరభద్రుని జాత్రవేళ నిన్బండి యేరొప్ప బనిచెద నీ పాలు ద్రావు
పిన్ని పన్నారులు పిన్ని బొమ్మలును నిన్నికూడడుకులు నెన్నెన్నిపండ్లు
నాకెల్ల మావారు నలిదెత్తురపుడు నీకు నిచ్చెదగాని నీ యాన ద్రావు''
ఆ. 3, పు. 71.

'నీ యాన' అంటే నీమీద ఒట్టు అని అర్థం. సాధారణంగా ఒట్లు పెట్టుకోవడం పిల్లలకలవాటే.

హరివంశంలో ఎఱ్ఱన శ్రీకృష్ణుని బాల్యక్రీడలను వర్ణించే సందర్భంలో యశోద మాతృ హృదయాన్ని ఆవిష్కరించిన తీరు సహజ సుందరంగా ఉంది. చిన్నికృష్ణుడు శకటాసురున్ని కాలితోతంతాడు. రాక్షసరూపంలో ఉన్న బండి విఱిగిపోతుంది. ఆ దృశ్యాన్ని చూసిన యశోద హృదయం తల్లడిల్లి పోతుంది. సందుడు వచ్చి ఏమంటాడో అని దిగులుపడుతుంది.

''నిన్నిటు పాఱవైచి తగ నిద్దురవోయెడు పాపడంచు నే
మిన్నక నీళ్ళ నాటయను మిత్తికి నేటికి బోయితిన్ని జం
బన్న! కుమార! యింకిపుడయర్థి భవజ్జనకుండు వచ్చి న
న్నెన్ని తెఱంగులం బఱుపడింతయు జూచి తనర్చు నల్కతోన్''
పూ. భా, 5.178.

'అయ్యో పిల్లవానికి దెబ్బ తగిలిందే' 'ఆయన వచ్చి నన్నేమంటాడో' అని ఆందోళన చెందే గృహిణులు అన్ని కాలాల్లో ఉంటారు. 'నీళ్ళనాట' అంటే జలకాలాట. చిన్ని కృష్ణునికి ఏదైనా ప్రమాదం జరిగి ఉంటే జలకా లాట తన పాలిటి మృత్యువయ్యేదని యశోద భయపడింది.

చిన్ని కృష్ణుని బాధలు పడలేని గోపికలు వ్రేపల్లెను విడిచి పోతా మంటారు.

"ఎక్కడికేనియు బోయెద మిక్కష్టపు పాటుపడగ నేమోర్వము నీ
చొక్కపు కొడుకును నీవునునొక్కతలై నొక్కయూరి నుండుడునెమ్మిన్''
పూ. భా, 5-232.

ఇందలి 'చొక్కపు కొడుకు' అనే పదబంధం 'కొడుకు సొక్కం' అనే రూపంలో నేటికీ వ్యవహారంలో ఉంది. ఈ మాటకు నీ కుమారుడే శ్రేష్ఠుడు, మా పిల్లలు కానివారని భావం. ఈ విధంగా ప్రజల పలుకుబడిలో మానవ స్వభావాన్ని వ్యక్తం చేయడం ఒక కళ.

తల్లి పిల్లవానికి తన పాలే శ్రేష్ఠమైనవిగా భావిస్తుంది.

"తల్లి చనుబ్రాలు గ్రుక్కెడు తక్కినయవి
పుట్టెడును నొక్కరూపన భూమి పరగు
నొడువు బొంకయ్యె చన్నిత్తు తొడిలమీద
గుండెవట్టి యించుక తడవుండవయ్య" పూ.భా, 5-239.

'గుండెవట్టియించుక తడవుండవయ్య' అంటే కొంచెం ఓపిక పట్టుకొని ఉండమని భావం. తక్కిన పాలకంటె తల్లిపాలే పిల్లలకారోగ్యకరమన్న సత్యాన్ని ఎఱ్ఱన చక్కగా తెలిపినాడు.

పాలు త్రాగిన తరువాత పిల్లవాని చెంపలూ, రొమ్ము, తలా నిమురుతూ ముద్దు పెట్టుకొనే తల్లుల చేష్టలను కవి ఈ క్రింది పద్యంలో వర్ణించినాడు.

''మునుజననీ స్తనంబులకు మోపగ్రవేగయియున్న యట్టియ
వ్వినుత పయస్సులన్నియును వేడుకతో కడు పారనారగిం
చినప్రియమంది నందసతి చెక్కులునక్కును మస్తకంబు మూ
ర్కొనుచును ముద్దులాడి మఱికొండొక సేపునకున్ ప్రియంబునన్"
పూ. భా, 5-240

జంతువుల్లో కూడా ఇలాంటి స్వభావాన్ని చూస్తాం. పిల్లలమీద తల్లులకుండే వాత్సల్యా మమకారాలు ప్రకృతి సిద్ధమైనవి.

దుర్భరమైన కరవు ఏర్పడినప్పటికీ కొందరు గ్రామాలను వదిలిపెట్టి బయటికిపోరు. ముఖ్యంగా వృద్ధులు సమ్మతించరని ఎఱ్ఱన వ్రాసినాడు.

''మన పల్లెలోని ముదుసళ్ళు మచ్చిగ పేర్మినిచ్చోటు నిడువం జాలకున్నవారు'' పూ. భా, 6-6.

సాధారణంగా ప్రజలు తమ కోరికలు తీర్చని దేవుళ్ళను అప్పుడప్పుడు దూషించడం కద్దు. పల్నాటివీరచరిత్రలోని ఈ పంక్తుల్ని చూడండి.

''కరమెత్తి మ్రొక్కితి కాద్రేనికేను, పలునోములీరీతి భక్తితోజేయ
ఏదేవుడైనను ఇచ్చలో మెచ్చి, వరమీయడాయెనావ్రాతకేమందు
అనిచింతజేయుచు ఆసురుసురంచు దైవంబుదూరుచు....'' పు. 53.

కొడుకు గ్రామాంతరం వెళ్ళినప్పుడు అతడెప్పుడు వస్తాడా అని ఎదురు చూసే తల్లిదండ్రులున్నారు. ఇట్లే తమకోసం తల్లిదండ్రులెంత అడలిపోతున్నారో అని బాధపడే కుమారులూ ఉన్నారు. మనుచరిత్రలో ప్రవరుడు వరూధినితో మాట్లాడిన మాటలను గమనించండి.

''నను నిముసంబు గానకయున్న నూరెల్ల
　　సరయు మజ్జనకుడెంతడలునొక్కొ
ఎపుడు సంధ్యలయందు నిలువెళ్ళనీకన
　　న్నోమెడు తల్లి యెంతొ్లలునొక్కొ....'' 2-17.

కోపస్వభావం కల్గిన స్త్రీలు భర్తలమీద అలిగి మాసిన చీరలు కట్టుకోవడం, అభరణాలు ధరించకపోవడం, ముసుగు పెట్టుకొని ఒంటరిగా పడుకోవడం లోక సహజం. కృష్ణునిమీద అలుకచెందిన సత్యభామ మనస్తత్వాన్ని పారిజాతాపహరణంలో ముక్కుతిమ్మన సహజరమణీయంగా చిత్రించినాడు.[1]

కళాపూర్ణోదయంలోని సుగాత్రీశాలీనుల కథ తెలుగు సాహిత్యంలో ఒక రసగుళిక. ఈ కథ జానపదుల మనస్తత్వానికి అద్దం పట్టింది. శాలీనుడు కృత్రిమత్వంలేని స్వచ్ఛమైన పల్లె జీవితానికి ప్రతీక. అతనికి వ్యవసాయం పనుల్లో తగిన ప్రవేశం ఉంది.

స్త్రీలు ఆభరణాలు ధరిస్తే తమ భర్తలకు ఆయుష్యం పెరుగుతుందనే అభిప్రాయం ఒకటుంది.

1. పారిజాతాపహరణం, 1-99

పెళ్ళైన తరువాత మొదటి రాత్రి సుగాత్రిని సర్వాలంకార భూషితురాలిని చేసి చెలులామెను శోభనం గదికి పంపిస్తారు. కాని శాలీనుడు ఆమెను కన్నెత్తి చూడడు. ఒక మాటైనా మాట్లాడడు. అతనికి బాహిర సౌందర్యం కంటె హృదయ సౌందర్యమే బాగా నచ్చుతుంది. సుగాత్రికి మాత్రం అతని మనస్సు అర్థం కాదు. రెండు మూడు రోజులు యథాప్రకారం గడుస్తాయి. భర్తలో మాత్రం మార్పులేదు. అతన్ని ఏమంటే ఏమౌతుందోనని సుగాత్రి భయపడుతుంది. చివరికి మంగళసూత్రం పదిలంగా ఉంటే చాలనుకొంటుంది. ''ఈయన నింకేమి ప్రపంచంబు చేసిన నెఱయనెడసిపోవుట తక్క ప్రయోజనంబేమియులేదు. నాకును మంగళసూత్రం బీపాటి శుభస్థితి నుండుటయు పదివేలనుచు నెంచుకొనియు వేఱొక్కలాగున నుండక యతనికి నాయురాభివృద్ధి కరంబులని వివిధాలంకారంబులెప్పుడు నేమఱకతాల్చుచు తన తల్లి యతనినేమియు నిట్టట్టాడకుండం బ్రార్థించుచుండె" 4-73.

ఈ సందర్భంలో మనం ముఖ్యంగా మూడు విషయాలు గమనించాలి. ఒకటి: స్త్రీ భర్తవల్ల ఎలాంటికష్టమెదురైనప్పటికీ మంగళసూత్రాన్ని మాత్రం మంగళప్రదంగా భావించి రక్షించుకోవడం. రెండు: భర్తల ఆయుష్యం పెరగడానికి ఆభరణాలు ధరించడం; మూడు: తల్లిగాని, మరెవ్వరుగాని భర్తను దూషించకుండా చూసుకోవడం.

సుగాత్రి మాతృమూర్తికి శాలీనుని పనులు నచ్చలేదు. ఆమె దృష్టిలో అతడొక దౌర్భాగ్యుడు. అతన్ని తోట పనిలో పెడితే చక్కబడతాడని భావించి అలాగే చేస్తుంది. ఇల్లటం వచ్చిన శాలీనుడు మారుమాట్లాడక తోట పనులు చేయసాగాడు. ఇది చూసి సుగాత్రి కూడా అతన్ని అనుసరించింది.

''తల్లి మాటలచే నిట్లు తనవిభుండు
తనువు బడలంగ పూదోట పనులు సేయ
చూడనోర్వక తాను నచ్చోటికరిగి
తోడు పడియెడసని చూచు ప్రీడనుడుగు'' 4-84.

సుగాత్రి నగలు ధరించి తోట పనుల్లో భర్తకు తోడుగా నిలిచిందేకాని అతన్ని మాత్రం ఆకర్షించలేకపోయింది. తాను చేసే పనులకు ఎలాంటి ఆమోదాన్ని

తెలుపని భర్తను ఏమీ అనలేకపోయింది. ఇక చేసేదేమీలేక తల్లిమాటకాదని ఒక నాడు సుగాత్రి తోటకువచ్చి, ధరించిన ఆభరణాలన్నీ తీసి ఒక మరుగున పెట్టి, జానపద వనిత వలె నడికట్టుకట్టుకొని భర్తకు తోడుగా నిలిచింది.1 సహజ సౌందర్యాన్ని ఆరాధించే స్వభావం కల్గిన శాలీనున్ని తన కాయకష్టంతో ఆకర్షించింది. అంతేకాక అతనికి దగ్గర కాగలిగింది

సుగాత్రీ శాలీనులు జానపద ముగ్ధత్వానికి ప్రతీకలు. వీరిది సాధారణంగా ప్రబంధాల్లో కవిపించే శృంగారం కాదు. వీరి కథలో విరహవేదనలూ, మన్మథ దూషణలూ, శీతోపచారాలూ కనిపించవు. కేవలం సహజ సౌందర్యాన్ని అభిమానించే మనస్తత్వం పునాదిగా అల్లిన కథ ఇది.

తమ్మునిమీద అక్కకుండే ప్రేమాభిమానాలకు ఒక ఉదాహరణ నిగమ శర్మ అక్క. నిగమశర్మను బాగు చేయడానికి ఆమె తన పిల్లలను తీసుకొని భర్తతో పుట్టింటికి వస్తుంది. పేరులేని నిగమశర్మ అక్క పుట్టింటిమీద అమితమైన అభిమానం చూపే తెలుగింటి ఆడపడుచుగా పేరు తెచ్చుకొంది. ఆమె తమ్మునికెన్నో బుద్ధులు చెప్పింది. పిల్లలు వెంటపడి పనులు చేయనివ్వకున్నా తమ్ముని తలవెంట్రుకల ముళ్ళు విప్పింది.2 అక్కకు తమ్మునిమీదుండే ప్రేమకు ఇదొక గుర్తు.

లోకంలో సాధారణంగా తల్లిదండ్రులే తమ పిల్లలకు తగిన బుద్ధులు చెప్పి వారినొక దారికి తెస్తారు. సాధ్యం కానప్పుడు వారు "మీ తమ్ముణ్ని ఓ దారికి తీసుకరావద్దా?" అని కూతురును కోరవచ్చు. కాని అలా కోరకున్నప్పటికీ తమ్ముడు చెడిపోతున్నాడని కర్ణాకర్ణిగా విని కుటుంబసమేతంగా వచ్చింది నిగమశర్మ అక్క. పుట్టినింటికీ, మెట్టినింటికీ గౌరవం తేవలసిన బాధ్యత ఆడపిల్లలమీద కూడా ఉంటుందని నిరూపించిన సాధ్వీమణి ఆమె.

మానవ మనస్తత్వం లోతుల్లోకి చూడగలిగిన తెనాలి రామకృష్ణుడు నిగమశర్మ అక్కను జనపదంనుంచి కావ్యపథంలోకి ప్రవేశింపజేసి ఆమెను ఒక ఆదర్శమూర్తిగా ప్రతిష్ఠించినాడు.

---

1. కళాపూర్ణోదయం, 4-95. 2. పాండురంగమాహాత్మ్యం, 3-29.

శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని తిన్నని కథ ధూర్జటి గ్రామజీవన పరిశీలన పాటవానికి చక్కని నిదర్శనం. తిన్ననిది మూఢభక్తి. ఉడుమూరికి శివున్ని రమ్మనడంలో అతని అమాయకత్వం గోచరిస్తుంది. ఈ ఘట్టం పాల్కురికి సోమనాథుని గొడగూచి కథను స్మృతికి తెస్తుంది.

''ఇల్లో ముంగిలియో యనుంగు చెలులో యాడైన చుట్టంబులో
యిల్లాలో కొడుకో తరింపవశమే యేపోడుముల్లేకమా
పల్లెంగోరిన వెల్లనుంగలవు తెప్పల్గాగ నీకిచ్చెదన్
చెల్లంబోయిట నొంటినుండకటవిచ్చేయంగదే లింగమా!'' 3.70

సమష్టి ఆనందానికి ఆలవాలమైన జీవితాన్నే పల్లీయులు కోరుకొంటారు. వారి దృష్టిలో ఒంటరి బ్రతుకు బ్రతుకేకాదు. ఇల్లూ, వాకిలీ, స్నేహితులూ, చుట్టాలూ ఆ తరువాత భార్యా, పిల్లలూ- వీరందరితో కలసి ఉండడమే జీవితం. ఇందులో ఏ ఒక్కటి తక్కువైనా అది సంపూర్ణ జీవితంకాదని వారి విశ్వాసం.

తిన్నడూ, అతని సహచరులూ అడవికి వేటకొస్తారు. తిన్నడు శివున్నే సర్వస్వంగా భావించి అక్కడే ఉండిపోతాడు. అప్పుడు తోటివారిలా అంటారు.

''ఓ తండ్రీ నినుడించిపో మనసు మా కొక్కింతరానేర్చునే
మీ తోబుట్టులు తల్లిదండ్రులు చెలుల్మీరెల్లనేతేరగా
మా తిన్నండిపుడెందుబోయె? ననినన్ మా ప్రాణముల్పోవనే రా
వే తిట్టింపక పల్లెలోన మము తేవే వన్నెయున్ వాసియున్ 3.77

క్రొత్తచోటికి కొంతమంది కలిసి వెళ్ళినప్పుడు అందరూ తిరిగి కలిసి రావడం పద్ధతి. అలాకాక అందులో ఒకరు తక్కువైతే తోడుగా వెళ్ళినవారి బాధ ఇంతంత కాదు. అతని తోబుట్టువులూ, తల్లిదండ్రులూ, స్నేహితులూ అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పలేక ప్రాణం పోయినంత పనవుతుంది. అంతేకాక గ్రామంలో చెడ్డపేరు కూడా వస్తుంది. తిన్నడు రావడంవల్ల అతని సహచరులు పొందిన ఈ విధమైన మానసిక ఆందోళనను ధూర్జటి లోక సహజంగా చిత్రించడంలో కృతకృత్యుడైనాడు.

యయాతి చరిత్రలో తెలగన్న దేవయాని మనస్తత్వాన్ని సహజ మనోహరంగా చిత్రించినాడు. దేవయాని చెలికత్తెలతో అచ్చనగండ్లు మొదలైన ఆటలను సంతోషంగా ఆడుకొంటుంది. కాని కచుడు తనను నిరాకరించి స్వర్గానికి వెళ్ళిపోయాడని తెలియగానే ఒక్కసారి కోపం కట్టలు త్రెంచుకొని వస్తుంది. వెంటనే చేతిలోని అచ్చనగండ్లను పారేసింది. ఓమన గుంటలను విడిచి పెట్టింది. బొమ్మల పెళ్ళిళ్ళు ఆపేసింది.

"ముదురు వెన్నెలగాయు ముత్యాల తిన్నెపై పైడి యచ్చనగండ్లు పారవైచి
మఱియాడియాడి తామరకెంపు పీటపై నోముల గుంటల నుజ్జగించి
పాపమేవరి వచ్చ పన్నారు లోపల కులుకు గుజ్జనగూళ్ళు కుడుచుటుడిగి
తనయీడు వారైన తలిరాకు బోంట్లతో సిరిబొమ్మ పెండ్లిండు సేయకడలి
తోడిచెలులెల్ల వెఱగుతో కూడిరాగగొనబు కనుదమ్ములను నీళ్ళుగ్రుక్కుకొనుచు
చిన్ని వేసలి జారంగ చిన్నవోయి తెగువనచటికి నేతెంచె దేవయాని" 3.152

మన ఇష్టానికి వ్యతిరేకంగా ఏమైనా జరిగినప్పుడు మన కోపాన్ని ఆయా వస్తువుల మీద చూపడం సహజమే కదా!

ఇట్లే తెలగన్న కొత్తపెళ్ళికూతురు మనస్తత్వాన్ని ఎంతో సహజంగా వర్ణించాడు. యయాతిని వివాహమాడిన దేవయాని అత్తవారింటికి వెళ్ళేముందు ఏడ్పుముఖం పెట్టింది. వెంటనే తల్లి ఓదార్చింది. చెక్కిలిపై పడ్డ కన్నీళ్ళను తుడిచింది. రేపు కాస్తా ఆగావంటే ఎల్లుండి నిన్ను మీ నాన్న తీసుకొని వస్తాడు. ఇప్పుడు నీ వెంట తమ్ముడూ, చెల్లెలూ వస్తున్నారు కదా! అని ధైర్యం చెప్పింది. శోకమూర్తి అయిన నూతన వధువుతో ఏ తల్లైనా ఇలాగేఅంటుంది. ఇది లోక స్వభావం. ఈ పద్యాన్ని చూడండి.

"ఉల్లమున వగవనేటికి నెల్లుండియ పిల్వనంప నేతెంచెదు నా
తల్లివికద నీ తమ్ముడు మల్లికయుండోడురాగ మదినడనేలా?" 4.140

మనస్తత్వ చిత్రణకు లోకానుభవమే పునాది అనుకొన్నప్పుడు అట్టి లోకానుభవం పుష్కలంగా ఉన్నకవి కదిరీపతి. అతడు శుకసప్తతిలో ఇద్దరు

స్త్రీలు సరసంగా మాట్లాడుకోవడాన్ని వర్ణించినాడు. వారి మాటలనుబట్టి వారి స్వభావాన్ని తెలుసుకోవచ్చు.

''పోలిరెడ్డికి మగ పోడిమిలేదుగా గాదికేలాగున కడుపునిక్క
వదరకే మగవారు వచ్చెదరదెచక్క చెక్కుకో పయ్యెద చెఱగుకొండి
యోసి! లేవేమల్లి వేసాలు వేయకు మగవారలెరుగని మర్మమెద్ది
నీకేటి సిబ్బితి నెరరాగవైమించి యదగ ద్రొక్కిన దానవత్తగారి
పెద్ది వినలేదె! మనసుబ్బు పెరటిగోడ దాట! మావ: గనెనట యేటి సుద్ది?
యెనగిమగడొల్లకున్నసదేమిసేయు ననుచు కనివోవపలుమాటలాడుకొనుచు''
2.423

పెళ్ళై అత్తవారింటికి వెళ్ళినప్పటికీ, పుట్టింటి మీద అమ్మాయిలకుండే ప్రేమానురాగాలను కదిరీపతి చక్కగా వర్ణించినాడు. ఎన్నో రోజుల తర్వాత తనను చూడడానికి వచ్చిన అన్నతో చెల్లె పల్కిన పల్కులు చూడండి-

''మనయమ్మ తా సుఖమ్మునసున్నదె యయ్య పెద్దవాడయ్యెగా పేర్మినతని
పోషింతురే మీరు పొరచూపులేక నా యరిది చెల్లెలివచ్చియత్తవారు
తోడ్కొని పోయిరే దూరంబుగాన యే వార్తయు వినము మావదిన వేక
టనివింటి నే బిడ్డగనియెను మగవానిగనియెనో యది మేలుగాకయాడు
దాననై పుట్టి మిము జూడ గాన కిట్టు లేను బడు పాటు చాలదా? యెన్నడైన
దలతురా నన్ను మీరు డెందంబునందు నేల తలతురు మఱచిపోయితిరినన్ను''
2.520

తల్లిదండ్రులనూ, చెల్లెలినీ, వదినెనూ అడగడమే కాక, తనను పుట్టింటివారు మరిచిపోయారని అనడంతో ఇంతకాలం శోకభరితమై ఉన్న ఆమె హృదయం ఒక్కసారి అగ్నిపర్వతంలా బ్రద్దలౌతుంది. కన్నవారికి దూరమైన ఆడపిల్లల గుండెల్లో ఎంత దుఃఖం దాగి ఉంటుందో ఈ పద్యం నిరూపిస్తుంది.

ఆడబడుచులు పుట్టింటిమీద ఆశపెట్టుకొంటారు- కనీసం పండుగలకూ, పబ్బాలకూ తమను ఆహ్వానించకపోయినా చీరో, రవికో పంపకపోయిరిగదా అని అనుకోవడం లోకస్వభావం.

"చెలియలి పెండ్లి చేసితిరి చిల్లర పబ్బము లెన్ని యైన శో
భిలె నను నెన్నడైన పిలిపించితిరే పిలిపింపకున్న నే
మలరెడు కూర్మి నాడబడుచాస పడుంగదయంచు పచ్చ పో
గులు గల చీరయంప నొనగూడకపోయెనె యేమి చెప్పదున్" 2.521

ఇట్లే కదిరీపతి తన కాలంలోని మధ్య ప్రియులైన స్త్రీలను గూర్చి వ్రాశాడు. వారు బహిరంగంగా త్రాగడానికి భయపడేవారు. కాని మధ్యశి గృహాల్లో ఎలా వ్యవహరించేవారో, వారి మనస్తత్వం ఎలాంటిదో కవి చక్కగా చిత్రించినాడు.

"ఇంటి వారెవ్వరో యెందు గానపటంచు
నదిగొ కూర్చున్న దాయమ్మ యనుచు
సమ్మిక తాను గానక వచ్చితినటంచు
నిది యెవ్వరుండెడి యిల్లటంచు
నంగడి కరుగుచో నరుదెంచితినటంచు
వచ్చి జామయ్యె పోవలయునంచు
సటిది బిడ్డలకు మందడగ వచ్చితినంచు
నే నందులకు వచ్చినా నటంచు
చేరి రవ్వేళ తమ ముని చెఱగులందు
కాసు దుడ్డును బంగారు పూస వెండి
తునక మొదలింటి చిఱువాడుగొనినదెల్ల
గొనుచు మగనాండ్రు తమ కెల్ల గుట్టు మెరయ" 3.117.

తల్లిదండ్రులూ, అన్నలూ, వదినెలూ, ఊరంతా బలగం ఉండగా, అందరిని విడిచి అత్తవారింటికి వెళ్ళేటప్పుడు పెళ్ళికూతురు హృదయం తల్లడిల్లి పోతుంది. విజయవిలాసంలో చేమకూర వేంకటకవి సుభద్ర అత్తవారింటికి వెళ్ళేటప్పటి దృశ్యాన్ని ఎంతో సహజంగా చిత్రించాడు. ఏడుస్తున్న సుభద్రతో దేవకి ఇలా అంటుంది —

"వింతచే యేమి ? మేనత్త గొంతిదేవి
కోరి వెండియు పెండ్లాడినారు మీర

లోండొరులు ! నీ విభుండు లోకోత్తరుండు
దొరకెను సుభద్ర ! మంచి కాపురము నీకు. 3.136.

మేనత్తకొడుకును పెళ్ళి చేసుకోవడం వల్ల సాధారణంగా ఆడపిల్లకు ఏ కష్టాలూ ఉండవని లోకంలో భావిస్తారు. అందుకే దేవకి ''కుంతీదేవి నీ మేనత్త గదా'' అంటుంది. సుకుమార మనస్తత్వం కల్గిన కన్యలకు ప్రేమ కల్గిన మేనత్త కుమారులు భర్తలుగా లభించడం అదృష్టమే.

విశ్వాసాలు :

అలౌకిక శక్తులు, మంత్ర తంత్రాలు, జోస్యం, శకునం మొదలైనవాటి పట్ల ప్రజలు విశ్వాసం ఏర్పర్చుకొంటారు. ఈ విశ్వాసాలను చాలావరకు ఒక తరం నుంచి మరోతరానికి సంక్రమించిన అనుకరణాలుగా చెప్పవచ్చు. సత్యాన్ని తెలుసుకోవాలన్న జిజ్ఞాస ఉన్నప్పుడు ఎలాంటి మూఢ విశ్వాసాలకూ తావులేదు. ఏది ఏమైనా ప్రపంచంలో ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క విశ్వాసం ఉండడం గమనించదగ్గ విషయం.

నన్నెచోడుని కాలంలో ప్రజలకు చేతబడి మీద విశ్వాసం ఉంది కుమారసంభవంలో ఈ విషయం చెప్పబడింది.

"పొలిచె మధువేళ కంకేలి పూచి భృంగ
పరివృతమ్మై మనోజుండు పాంథ తతికి
నాభిచారంబు వేల్చు కుండాంతరమున
తగిలి కామాగ్ని పొగలతో నెగయునట్లు'' 4.94.

కంకేళిపూలు ఎర్రగా ఉంటాయి. వాటిమీద ఎగిరే తుమ్మెదలు నల్లనివి. కవి పూలను అభిచార హోమకుండంలో రగిలే నిప్పులతోను, తుమ్మెదలను వాటి మీద ఎగిరే ధూమంతోనూ పోల్చాడు. 'చేతబడి'లో హోమం చేస్తారు.

కుమార సంభవాన్ని బట్టి ఆ కాలంలో ఇంద్రజాలంలో తోచిన రూపాలను సామాన్యులు నిజమని నమ్మినట్లు తెలుస్తుంది.

"దొరకొను నింద్రజాలమున తోచిన రూపము లింద్రజాల మం
చర్చయగ లేక చూపఱకు నన్నియు నిక్కమవోలె నైన య

ట్లిరవుగ పారమార్థికుల కెప్పుడు ద్రవ్యము లెల్ల మిథ్యలై
నిరతముచూడ లోకులకు నిక్కములైచను భ్రాంతి పెంపునన్" 6.77

ఇంకా ఆ కాలంలో బోకి పెంకులమీద మంత్రించినకాటుకను పూసి చూస్తే అనుకొన్నవి కనిపిస్తాయని అమాయకులైన ప్రజలు నమ్మేవారు.

''....బ్రహ్మాండ కర్పర ఖండంబున మంత్ర కజ్జలమొగిన్ ఫాలాక్షుకూర్మింపస గ్గిరిరాజాత్మజ పట్టెనానమరి నింగింబర్వెనీలాభ్రముల్'' 6.96

ఈ నాటివలె ప్రజలు కష్టకాలంలో తాము నమ్మిన దేవుళ్ళకు ముడుపులు కట్టేవారు- ''ఎల్ల సమయములకు సిఖండు వేల్పని, ముడియకట్టవచ్చు వడువువోలె' 8.64

వంకాయలు లింగాలుగా మారడం, జొన్నలు ముత్యాలు కావడం బసవేశ్వరుని లీలలుగా బసవపురాణంలో వర్ణించబడ్డాయి. ''వంగకాయలు కట్టు కొంగుల బొదివి, లింగ సన్నిహితుల భంగివర్తిల్ల" అ. 2, పు. 42

పండితారాధ్య చరిత్రలో శ్రీశైలం మీద జరిగే ఉత్సవాలు వర్ణించబడ్డాయి. ప్రజలు శివరాత్రికి శ్రీశైలం వెళ్ళి మహాదేవున్ని సందర్శించడం మహాభాగ్యంగా భావించేవారు. పుణ్యలోకాలు సిద్ధిస్తాయనికూడావిశ్వసించేవారు.[1]

పండితారాధ్య చరిత్రలో పాము విషాన్ని పోగొట్టే మాంత్రికులు పేర్కొనబడ్డారు. ఇట్లే మంత్రసిద్ధుల ప్రభావంచేత చనిపోయిన వారు కూడా బ్రతుకుతారని ఆ కాలంనాటి ప్రజల నమ్మకం.

"శాస్త్రవైద్యులు గారుడ వరమంత్రవిదులు
చనుదెంచి విషముచే చచ్చినన్నృపతి
కనుగొనియు నశక్యమనుచునునేగ
మరియొక్క గారుడ మంత్రసిద్ధుండు
పఱతెంచి విషదగ్ధ భావంబుజూచి'' పు.435

హరివంశంలో భూతం ఆవేశించిన బ్రాహ్మణుడు అట్టహాసంతో సామగానం చేసినట్లు వర్ణించబడింది.[2]

---

1. పండితారాధ్యచరిత్ర,పర్వతప్రకరణం,పు.336.2.హరివంశం,పూ.భా,6.61

అడవుల్లో సంచరిస్తూ, గోవులను పోషిస్తూ వాటిపల్ల జీవించే గొల్లవారికి అడవులూ, కొండలూ, పశువులూ, ఆరాధనీయాలని ప్రబంధ పరమేశ్వరుడు హరివంశంలో వివరించాడు.

"కానలలో చరించి గిరికందరలన్ వసియించి గోవులన్
మానుగబెంచి వీనివలనన్ బ్రతుకొంది మనన్ సుఖంబుమై
భూనుత యున్నవారమటు బుద్ధినెరింగిన నెల్లభంగులన్
కానలు కొండలుం బసులు గాదిలివేల్పులు గొల్లవారికిన్" 7.131

వ్యావసాయిక దేవతలను ఆరాధించడం అతి ప్రాచీన గ్రంథాల్లోనూ కనిపిస్తుంది. ఋగ్వేదంలో విశ్వామిత్రుడు ఇళా దేవిని స్తుతించాడు. ఇళ అన్న దేవత.

'ఆ భారతీ భారతీభిః సజోషా ఇళాదేవైర్మనుష్యే భిరగ్నిః
సరస్వతీసారస్వతే భిరర్వాక్ త్రిసోదేవర్బర్హిరేదం సదన్తు'' 3.4.8

దున్నడం, విత్తడం. పంటలుకోసి ధాన్యాన్ని ఇంటికి తీసుకొనిరావడం మొదలైన సందర్భాల్లో ఉర్వర, సీత, యజ, సామ, భూతి మొదలైన దేవతలను రైతులారాధించినట్లు పరాశర గృహ్య సూత్రాల్లో చెప్పబడింది.1

వృత్తులే జీవనాధారమైనప్పుడు గ్రామీణులు వాటిని దేవతలుగా విశ్వసించడంలో అనౌచిత్యమేమీ లేదు. ఉదాహరణకు వ్యవసాయేతరమైన చేనేత వృత్తినవలంబించే పద్మశాలీలు ఈనాటికీ మగ్గాన్ని శారదగా విశ్వసిస్తున్నారు. విశేషమేమంటే వ్యవసాయ సంబంధమైన దేవతల మీద గ్రామీణులకు భక్తి ఎక్కువ. తత్ఫలితంగానే ఎల్లమ్మ, పోలేరమ్మ, పోచమ్మ సూరమ్మ మొదలైన వారు ఈ నాటికీ పూజలందుకొంటున్నారు. అంతేకాక సంక్రాంతికి రైతులూ, ఉగాదికి వడ్రంగులూ, వినాయక చవితికి చేనేత పనివారూ తమవృత్తి సాధనాలను కడిగి శుభ్రంచేసి పసుపు కుంకుమలతోనూ, పూలతోనూ ఆరాధిస్తున్నారు. దీన్నిబట్టి వృత్తులే దైవాలన్న నమ్మకం అనాదిగా ప్రజల్లో ఉందని చెప్పవచ్చు.

---

1. తెనుగుజానపదసాహిత్యం- పురాగాథలు, పు.166

పాలకులు పాపం చేస్తే కరవు వస్తుందనే భావం ప్రజల్లో ఉన్నట్లు కేయూరబాహు చరిత్రలో చెప్పబడింది.

"ఆరాజు సేయు నెగ్గులు కారణముగ జనపదమున కవగుటయు ము
న్నా రాష్ట్రంబు దమకు నాధారమ్ముగ నుండు కాకి తండంబెల్లన్" 3.82

క్రొత్తగా నిర్మించిన బండ్లకు ఎద్లు కట్టినప్పుడు దృష్టి దోషం తగలకుండా ఐదు రంగుల అన్నాన్ని త్రిప్పేసినట్లు పల్నాటివీరచరిత్రలో ప్రస్తావించబడింది. నేటికీ గ్రామాల్లో ఈ విశ్వాసం ఉంది.

''గ్రక్కున యెద్దుల కాండ్ల కట్టించి
మోకుల బంధించి ముందుగా నపుడు
పంచవన్నెల కూడు పైబారవైచి....'' పు. 8.

కాటమరాజు కథను పరిశీలిస్తే సంతానం లేని వారి ఇంటిలో యోగులనబడే వారు భోజనం చేయని విషయం తెలుస్తుంది. ఒకవేళ గృహస్థులు తెలియక వారికి భోజనం పెడితే అది పాపమని లెక్కిస్తారు.

''సంతానము లేనింట జపయోగులు వచ్చి
బంతుల భోంచెయ్య పాపమందురమ్మ
బాలలు లేనింట ప్రమథాదులొచ్చి
వాలాయముగ భోంచేయ వద్దందురమ్మ''[1]

మరణించిన వారి అస్థులు గంగలో కలిపితే ఋణ విముక్తులమౌతామన్న భావన ప్రజల్లో ఉంది. కాశీఖండంలోని ఈ పంక్తులను చూడండి.

''కాశి వడి గంగ నస్థులు కలపకున్న
తల్లి ఋణమెట్లు వాయు పుత్రకునకు'' 5.60.

అస్థి సంస్కారం కర్మకాండలో ఒక భాగం. హిందువుల్లో ఈనాటికీ ఈ విశ్వాసం ఉంది. శిశువు మూలనక్షత్రంలో జన్మిస్తే తండ్రికి మరణంతప్పదనే విశ్వాసం ఉంది. కాశీఖండంలోని పద్యాన్ని చూడండి-

---

1. కాటమరాజు కథలు, సం. 1, పు, 120.

''మూల నక్షత్రమున యందు మొదలికాల
కన్య గండాన పుట్టిన కారణమున
కర్మఠుడు విప్రు డానంద కాననమున
వచ్చె చింతా జ్వరముపైన జ్వరము దాకి'' 5.329.

ఇట్లే చంద్రబలంతో పుట్టిన శిశువు గొప్ప వాడవుతాడనే విశ్వాసం సింహాసన ద్వాత్రింశికలో చెప్పబడింది.1 ఇంకా ఇదే కావ్యంలో స్త్రీ భోగం, లంచం, ధనం, మంచిమాట, పూలు, తాంబూలం మొదలైన వాటిని ఆలస్యం చేయకుండా తీసుకోవాలని చెప్పబడింది.

"వనితా భోగము లంచము ధనము సుభాషితము విరులు తాంబూలము పం
డిన పండ్లును సిద్ధాన్నంబును తడయక కొన్నవాడె భువిజాణ యగున్''4.59

బ్రాహ్మణులకు తృప్తి కల్గించడంతోపాటు, గ్రహ పూజలు, దేవతార్చనలు, హోమాలు చేస్తే వర్షాలు పడతాయని ప్రజల నమ్మకం. గోపరాజు చెప్పిన ఈ పద్యాన్ని చూడిండి.

''అనవుడు దీని కడ్డుపడునట్టి యుపాయము గల్గెనేని నా
యను వటిగింపు మన్న వసుధామరతృప్తియెకారణంబుగా
నొనరిన దేవతార్చనల హోమములన్ గ్రహ పూజ మున్నుగా
జనవర శక్తికిం దగిన శాంతి యొనర్పుము వర్షణంబగున్'' 10.20

కర్మకాండ తెలియని పామరులు వినాయకున్ని కొలుస్తారని శకుంతలా పరిణయంలో చెప్పబడింది. "కర్మకాండంబెఋంగని పామరుండు కార్యాది చేకొని వినాయకుని గొల్చు'' 2.9

విఘ్నేశ్వరుని పూజించడం అనాదిగా వస్తున్న ఆచారం. పండిత పామర భేదం లేకుండా ఆధునిక యుగంలో ఎందరో ఆ దేవున్ని ఆరాధించడం చూస్తున్నాం కదా.

ద్విపద పరమయోగి విలాసంలో మంత్ర తంత్రాలు పేర్కొనబడ్డాయి. ఉదాహరణకు పెట్టెను ఎత్తరాకుండా మంత్రం ఉండేది. తిరిగి ఎత్తాలన్నా మంత్రం ఉండేది. దీన్నే తిరుగు మంత్రం అంటారు.

---

1. సింహాసన ద్వాత్రింశిక, 3.40.

''ఇటుచూచి యా పెట్టె యెత్తరాకుండ
మటు మాయలాడ నీ మంత్రించినట్టి
మంత్రంబు మాని క్రమ్మఱ నెత్తవచ్చు
మంత్రంబు చెప్పెదో మఱియు గొట్టెదనా''

ఆలయంలోని ఏ ప్రాణికీ అపకారం చేసినా కీడు కలుగుతుందని ఆ కాలంనాటి ప్రజల విశ్వాసం. ఆముక్తమాల్యదలో ఈ విషయం ప్రస్తావించబడింది. విలుపుత్తూరిలోని ద్రావిడ కన్యలు ఇళ్ళముందు వడ్లెండబోసి కాపలా ఉన్నారు. ఇంతలో కోవెలలోని పెంపుడు జింకపిల్ల వచ్చి ఆ వడ్లు తింటుంది. కర్రతో కొడితే పాపమని భావించిన ఆ అమ్మాయిలు అదే సమయంలో గ్రామాలనుంచి పూలమ్మడానికి వచ్చిన స్త్రీల నడిగి వారి గంపల నుంచి కల్వపూదండలు తీసుకొని వాటితో జాగ్రత్తగా జింక పిల్లను అదలించినారు.

'''కలమపు డెండుగుల్ద్రవిడ కన్యలు ముంగిట కాచియుండి త
జ్జలరుహనాభ గేహ రురుశాబము సారెకు బొక్కులాడ కొం
దెలవయి కమ్మ గ్రామ్య తరుణీతతి డించిన వేపగంపలం
దల మగుచున్న చెంగలువ దండల దోలుదు రప్పురంబునన్'' 1.75.

నిరంకుశోపాఖ్యానాన్ని బట్టి ఆనాటి ప్రజలకు మంత్ర తంత్రాల మీద విశ్వాసం ఉన్నట్లు తెలుస్తుంది. ఆ కాలంలో భూతవైద్యాలు జరిగేవి. ప్రజలు ఏ గాలి సోకకుండా ఉండడానికి నరసింహ, నీలకంఠ, శ్రీరామ, వీరభద్ర శరభమంత్రాలు జపించేవారు.1

శుకసప్తతి ప్రజల ఆచార వ్యవహారాలనూ, విశ్వాసాలనూ, ప్రతిబింబిస్తుంది. కదిరీపతి దారికట్టు, మొనకట్టు, వాకట్టు, కాంతావశీకరణం మొదలైన విద్యలు పేర్కొన్నాడు.

''ఇది దారికట్టు మొనకట్టిది కాంతావశ్య కరణమిది నీమదికిం
హితవపించు నోనరేశ్వర పదిలంబని తెచ్చికొన్ని బదనికలొసగెన్''1.98

దారిని నిరోధించడానికి ఉపయోగించే మూలిక దారికట్టు. యుద్ధంలో శత్రువును నిరోధించడానికి ఉపయోగించేది మొనకట్టు.

1. నిరంకుశోపాఖ్యానం. 4.72

స్త్రీలను వశం చేసుకోవడానికి ఉపయోగించేది కాంతావశీకరణం. ఇట్లే వాగ్బంధనం చేయడానికి ఉపయోగించే మూలిక వాకట్టు. బాగా దూషించే స్వభావం కల్గిన తన అత్తకు వాకట్టు మందులు కావాలని కోరుకొంటుంది ఒక కోడలు. ఈ పంక్తులను చూడండి.

"అత్తవాకట్టు మంత్రంబులడిగెనొకతె
విభుని జోకొట్టు మందులు వేడెనొకతె....''3.122

మూలికలు గారడీ విద్యల వంటివి కావనీ, మూలికలతో తాయెత్తులు ధరిస్తే శుభం కలుగుతుందనీ కదిరీపతి వ్రాశాడు.

''తలపుననిది గారడమని తలపకు మాసింగడల్ల తఱిగొండదరిన్
తలమోచి తెచ్చినవి యివితలనుంచుము పసిడి తాయెతల నుంచి నృపా"
1.99

తరిగొండ ప్రాంతంలో విశిష్టమైన మూలికలు లభించేవని తెలుస్తుంది. బహుశా ఆ ప్రాంతంలో ఎఱుక చెప్పేవారు కూడా ఎక్కువగా నివసించే వారేమో! తరిగొండ వేంగమాంబ వేంకటాచలమాహాత్మ్యంలో 'ఎఱుక' చెప్పే ఘట్టాన్ని సహజసుందరంగా చిత్రించిన సంగతి సహృదయులకు తెలిసిందే.

శుకసప్తతిలో గంగగుళ్ళు ప్రస్తావించబడ్డాయి. గంగగుడి దగ్గర 'బాస' చేస్తే నిజమని నమ్మేవారు ఆ నాటి ప్రజలు.1 దేవుళ్ళమీద ప్రమాణం చేయడం, విగ్రహాలను తాకడం, నిప్పును పట్టుకోవడం, చిన్న పిల్లలమీద ఒట్టుపెట్టుకోవడం మొదలైన ఆచారాలు ప్రజల విశ్వాసాలను ప్రతిబింబిస్తున్నాయి. ఇట్లే అనారోగ్యం కల్గినప్పుడు గాలిసోకిందని మంత్రతంత్రాల కోసం పరిగెత్తడం గ్రామీణులకలవాటే. "మఱ్ఱియూడల నుండి యమ్మగువ మీద గాలి సోకెనా యనుచు....'' 2.350

హంసవింశతిలో ఆ కాలం నాటి ప్రజల విశ్వాసాలు ప్రతిబింబించాయి. సంతానం లేనివారు తీర్థయాత్రలకు వెళ్ళివస్తే శుభం కలుగు తుందని ఒక

1. శుకసప్తతి, 2.94.

నమ్మకం. కాని, తీర్థయాత్రలు చేసి కూడా సంతానాన్ని పొందలేని దంపతుల మనోవ్యథను కవి వర్ణించిన తీరు చూడండి.

> "తిరుమలకంచి పుష్పగిరి తీర్థములుంజని కొంగుముళ్ళతో
> వరములు దంపతుల్ వడయ వారకకాన్కలు వైచియంతటన్
> పరికలు దృష్టిదీపములు పన్నిన గద్దెలు పెట్టియేమిటన్
> కరమగు పుత్రవాంఛ కడగానగలేక విచారఖిన్నులై" 2.85

పరిక అంటే రంగవల్లి విశేషం.

హంసవింశతిలో స్త్రీవశీకరణౌషధాలతోపాటు తమకే వశమై ఉండడం కోసం భార్యలు భర్తలకు పెట్టే మర్లు మందులూ ప్రస్తావించబడ్డాయి.1 గ్రామీణులు సాధారణంగా జోస్యం చెప్పించుకొంటారు. ఈ విషయం నీలాసుందరీ పరిణయంలో ప్రస్తావించబడింది. నీలకు తగిన వరున్ని అన్వేషిస్తూ కుంభకుడు బ్రాహ్మణున్ని జోస్యం అడుగుతాడు. అప్పుడతడు నీల అరచేతిని చూసి జోస్యం చెబుతాడు.

> "అరచేతి వ్రాలుచూసిన దొరయెందునులేని దొడ్డదొర చేకొనిబల్
> సిరుల నిరువందగలదీ విరిబోడి జగంబులెల్ల విరివిగ పొగడన్" 1.88

ఈ విధంగా మన కావ్యాల్లో ప్రజల విశ్వాసాలు ప్రతిబింబించాయి.

శకునాలు :

మంచి చెడ్డలను సూచించే నిమిత్తాన్ని శకునం అంటారు. గ్రామప్రజలు అనాదిగా శకునాలను విశ్వసిస్తున్నారు. శకునాల శుభాశుభాలను తెలిపే గ్రంథాలు కూడా ఉన్నాయి. శకున పరిజ్ఞానం ఈనాటిది కాదు. పురుషునికి కుడిభుజం అదిరితే శుభశకునంగా భావిస్తారు. రఘువంశ మహాకావ్యంలో ఇందుమతీ పరిణయ ఘట్టంలో ఇందుమతి తనను వరిస్తుందో లేదో అన్న అనుమానంతో ఉన్న అజునికి కుడిభుజం అదిరి శుభ శకునం పలుకుతుంది. కాళిదాసు ఈ విషయాన్ని ఎంతో చక్కగా వర్ణించినాడు.

---

1. హంసవింశతి, 5.152

"తస్యాం రఘోస్సూను రుప స్థితాయాం
వృణీత వానేతి సమాకులోఽభూత్ ।
వామేతరం సంశయ మస్య బాహుః
కేయూర బంధోచ్ఛసితైర్నునోద ॥ సర్గ- 6. శ్లో.47

క్రీడాభిరామంలో శకునాల ప్రసక్తి వచ్చింది. మంచనశర్మ టిట్టిభునికి శుభ శకునాలేవో తెలిపినాడు.

"చుక్క యొకింత నిక్కి బలసూదను దిక్కున రాయుచుండుటన్
చక్కగ వేగదిప్పుడు నిశాసమయం బది ప్రస్ఫుటంబుగా
ఘుక్కని మాటిమాటికిని కోటడు పల్కెడు వామ దిక్కునం
జొక్కటమై ఫలించు మన శోభన కార్యములెల్ల టిట్టిభా" ప. 50.

వేగుచుక్క తూర్పున నిక్కి ఉండడం, గుడ్లగూబ ఎడమ దిక్కున అరవడం శుభసూచకాలుగా ఆ కాలంలో భావించేవారు. ఇట్లే నెమలి షడ్జమ స్వరంలో కేకారావాలు చేస్తే విజయం కల్గుతుందని తలంచేవారు. "షడ్జమ ప్రకాశింపన్ లే గొదమ నెమలి పల్కెడు కేగోయని వైశ్యమనకు గెల్పగుసుమ్మీ" ప. 51.

కోడి, భరద్వాజ పక్షి, నక్క, నెమలి ప్రయాణ సమయంలో కుడి ప్రక్కగా కనిపిస్తే చేపట్టినపని తప్పక అవుతుందనే విశ్వాసం ఆ కాలం ప్రజల్లో ఉంది.

"కానకానం గోడి యేత్రింత కొంక నక్క
నమలి యీ నాలుగిటి దర్శనంబు లెస్స
పేనివల తీరు పలుకు నుర్వీజనులకు
కొంగుబంగార మంత్రదు శాకునికవరులు" ప. 52

"వాడు నక్కను తొక్కివచ్చినట్లుంది" అనే సామెత కూడా ఉంది. గోవు హిందువులకు ఆరాధ్య జంతువు. గోధూళి వ్యాపించిన సమయంలో అనగా ఉషఃకాలంలో గ్రామంలో ప్రవేశించడం వల్ల సర్వశ్రేయస్సులు కలుగుతాయని ప్రజల విశ్వాసం. "గోధూళి లగ్నంబునం బురంబు ప్రవేశింపవలయు విశేషించి యుషఃకాలంబు సర్వప్రయోజనారంభంబులకుప్రశస్తంబు". -65.

వీరులు యుద్ధానికి వెళ్ళేటప్పుడు మార్గమధ్యంలో పరిసరాలలోని గ్రామ ప్రజలు వారిని చూడడానికి వచ్చేవారు. వీరులను విందు భోజనం చేసి వెళ్ళండనీ, కొంతసేపు విశ్రమించండనీ కోరేవారు. అంతేకాక శకునం కూడా చెప్పేవారు. పల్నాటివీరచరిత్రలోని ఈ ద్విపద పంక్తులను చూడండి.

> ''పల్లెల వార్లెల్ల బాలుని జూడ చనుదెంచి రెంతయు సంతసం మెప్ప
> ముటుకూరి కాపులు మ్రొక్కుచు ననిరి విందారగింపుడు విశ్రమింపుండు
> తరువాత తరలుట తగు శకునంబు....'' పు. 82.

యుద్ధభూమికి వెళ్ళే బాలచంద్రునికి తోవలో ముటుకూరి కాపులు శకునం చెప్పినట్లు పైన వర్ణించబడింది.

కాటమరాజుకథలోను బాలచంద్రునికి ఎదురైన అపశకునాలు విశేషంగా వర్ణించబడ్డాయి. వీటిలో తుమ్మడం మొదలైనవి ఉన్నాయి.

> ''పల్లకి యెక్కగా పల్లి కొండయ్య - పిల్లులు రొదచేసి బెదరిపోసాగె
> గ్రహము మీద వనిత క్రక్కున తుమ్మె - తటతట ఒక్కతె తల వీరబోసి
> మెటికలు విరుచుచు మిగుల కోపాన - ఇంతి యింగలపెంచు ఎదురేగిరాగ
> అంతట కనుగొని ఆ పల్లికొండ - నీల కడవ నొక్క నెల తెదురేగి
> పాలకి ముందర భగ్గున అవిశె - బడుగు బ్రాహ్మ డెదురు పడెనంతలోన
> పడిగెత్తి ఒక పాము పడినేల మొత్తె - వరుడు పెద్ద పులుగు వసుధ కంపింపు
> మరువక రొదచేసె మరిమరి మీద - నల్ల పక్షులు వచ్చి నడిత్రోవలోను
> పల్లకి ముందర పడి పొర్లె పొర్లె - పాలలు మిక్కిలి పరివారములుగ
> వాలు దిర్గుచు రొప్పవడి గూబబెదిరె - పొళ్ళ కాయలు ద్రుంచి భువి నేసినట్లు
> చాల పాములు వచ్చి సరితట్టెముందు - వీచె పక్షులు నంత విపరీతముగను
> చూచిరి పెద్దలు చోద్యంబుగాను - పక్షుల శకునంబు పలికొండజూచి"
>
> —కాటమరాజు కథలు, సం. 1, పు. 392.

ఉదయం నిద్ర లేవగానే విధవరాలు ముఖం చూడడం శుభ శకునం కాదని కాశీఖండంలో చెప్పబడింది. ఐతే విధవలైన తల్లి, వదినె, అత్తగార్లకు ఈ నియమం వర్తించదు. కాశీఖండంలోని ఈ పద్యాన్ని చూడండి.

''నిద్ర మేల్కాంచి రేపాడి నియమ పరత
నహిమ భానుని వీక్షింప యటక మున్న
తగదు నరునకు జూడంగ తల్లి వదినె
నత్తగారిని తప్పించి యన్య విధవ'' 2.33.

పిల్లలమర్రి పినవీరభద్రుని శకుంతలా పరిణయంలో శుభ శకునాలు పేర్కొనబడ్డాయి. వేటకు వెళ్ళే ముందు శకునాలు గమనించడం ఆచారం.

''హర్మ్యంబు వెడల వాయసము చేరువ దీర్చె
వృషభం బెదుర అంకె వేసి నిలిచె
వాడలో శునకంబు వచ్చెను దక్షిణం
బుద పూర్ణకుంభంబు లెదురు పడియె
గవని వెలుపల బెరికయు పోతు వలగొనె
వల తెక్క సూపె చే వలతి చెమరు
పరువు నేలను వచ్చె పాల పయ్యెదవంక
కుడి నుండి యెడమకు నడిచె నక్క
నీవు వేటకు విచ్చేయు నెడ నృపాల
పంబి పెండ్లికి నగు శకునంబులయ్యె
నేడు గొల్లల మాట మన్నించి నిలిచి
మృగయ కరుగుట మిక్కిలి మేలు జేపు'' 1.132.

పాయసం ఆరగించినట్లు కలవస్తే శుభశకునం.

''పాయసముం గలలో భూనాయక భోజనము సేయు నరులకునెంతే
శ్రేయస్కరమని స్వప్నాధ్యాయంబున చెప్పవిందు తద్జ్ఞులచేతన్'' 1.129

'స్వప్నాధ్యాయం' అనేది స్వప్న ఫలాలు తెలియజేసే గ్రంథం కావచ్చు. భోజనం, తాంబూల గంధపుష్పాదులు ఇచ్చినప్పుడు వాటిని తిరస్కరిస్తే అప శకునంగా భావిస్తారు.

"భోజనము సేయుమనగ తాంబూల గంధ
పుష్పములు కొమ్మనంగ త్రోసిపోవ జనదు
ఇంపు తోడుత నంగీకరింప వలయు
కార్యఫలసిద్ధి కవి యాది కారణములు" 1.130

పినవీరన కాలంలో ప్రత్యేకంగా శకునాలు చెప్పేవారున్నట్లు తెలుస్తుంది.
"ఇలువెడలి మానవుడు తన తలచిన తాపునకు చేరుదాకను నేయం
కిలిలేక ఱెక్క తీరుపు వలయును శాకునిక వరుల వచన విధమునన్"
1.131

ఱెక్క తీరుపు అంటే మంచి శకునమని అర్థం. ఇంటి నుంచి బయలు దేరి వేరొక ప్రదేశానికి వెళ్ళేవారు తరుచుగా శకునం చూసుకొనే వారని పై పద్యం వల్ల తెలుస్తున్నది. ఈ కాలంలో కూడా గ్రామాంతరం వెళ్ళేవారు అప శకునాలు ఎదురు కాకుండా జాగ్రత్త పడతారు.

కొఱవి గోపరాజు రచించిన సింహాసన ద్వాత్రింశికలో చాలా చోట్ల శకు నాలు పేర్కొనబడ్డాయి. కవి అపశకునాల జాబితానే ఇచ్చాడు.

"పిల్లులు పోరాడె బల్లి యూరక త్రెల్లె
దమ్మళి పొడసూపె తుమ్మి రెదుర
తొఱగు పోయిన లేగ కొఱలుచునొక కుక్క
పఱతెంచె గ్రంపపై నఱచె కాకి
యులుమడొక్కడు నూనె తలతోడ నేతెంచె
మైల చీరల చాకి మ్రోల నెదిరె
కాకియును గొరవంకయును ఱెక్కల పోతు
నేటిచెంతయు దాటె నెడమ దిశకు
బైటవెరవుదప్ప పాలగుమ్మయు పాఱె
నొంటి పాట పైడి కంటిపీచె
నెలుగు చేసె పెద్ద పులుగు పామటు తోచె
దబ్బి బొబ్బలిడియె నుబ్బులడర" 1.23

పిల్లులు పోరాడడం, బల్లి పలకడం, పూజారి కనిపించడం, ఎదుట తుమ్మడం, దూడను పోగొట్టుకొని ఆవు అరవడం, కంపమీద కూర్చొని కాకి కావుకావుమనడం, కుష్ఠరోగి తలకు నూనె పెట్టుకొని ఎదురవ్వడం, చాకలి మైల బట్టలతో ఎదురుగా రావడం, కాకి, గోరువంక, భరద్వాజపక్షి ఎడమ దిక్కుకు వెళ్ళడం, పైడికంటి, గుడ్లగూబ మొదలైనవి కూయడం. పాము ఎదురుగా రావడం- ఇవన్నీ చెడు శకునాలు.

మూల కథలో ''అకాల వృష్ట్యాదీని దుర్నిమిత్తాని బభూవః, అకాల వృష్టిఃతు అథ భూమి కంపో, నిర్ఘాత ఉల్కాపతనం తదైవ" అని కనిపిస్తుండగా గోపరాజు మూలాన్ని వదలిపెట్టి తన కాలంలో తెలుగువారు ఏవైతే దుశ్శకునాలని భావిస్తారో వాటిని సింహాసన ద్వాత్రింశికలో సంపూర్ణంగా వర్ణించినాడు.

రాత్రి స్వప్నం వస్తే మరునాడు జ్ఞాపకం తెచ్చుకొని వెంటనే స్వప్న ఫలాన్ని పెద్దలనుగాని, బ్రాహ్మణులనుగాని అడిగి తెలుసుకోవడం గ్రామాల్లో సామాన్యమైన విషయం. కలలో వచ్చిన వస్తువులు మంచివైతే శుభశకునంగా భావిస్తారు. స్వప్న సమయాన్నిబట్టి కూడా శుభాశుభాలను నిర్ణయిస్తారు.

''కలకు మొదలిజాము ఫలమొక యేటిలో
నందుకొను ద్వితీయ యామ ఫలము
అష్ట మాసములకు నబ్బు మూడవజాము
ఫలము జాడ మూడు నెలలు గలుగు" 9.71

ఈ పద్యంతో పాటు వరుసగా పదిపద్యాల్లో స్వప్న ఫలాలను పేర్కొన్న గోపరాజు శకునశాస్త్రంలో సమర్థుడనిపిస్తుంది. గోపరాజు పేర్కొన్న శకునాల్లో కొన్ని :-

తొలి వేకువలో వచ్చిన కల పది దినాల్లో ఫలితం ఇవ్వగా, పశువుల్ని విడిచిపెట్టినట్లు వచ్చినకల అదే రోజు ఫలితం ఇస్తుంది. ఏనుగు, గుఱ్ఱం, పచ్చనిచెట్లు, మేడమెట్లు, కోడె మొదలైన వాటిని ఎక్కినట్లు వచ్చిన కలలు సుఖాన్నీ, రాజ్యాన్నీ కల్గజేస్తాయి. స్త్రీతోసంగమించినట్లు వచ్చిన కలలు పుత్ర లాభాన్ని కల్గిస్తాయి. తలను పేను కొరిగినట్లు; పేగుత్తో శరీరం చుట్టబడినట్లు;

మనిషి నెత్తురు, పెరుగు, పాలు, కల్లు, నెయ్యి తాగినట్టు వచ్చినకలలు సంతోషాన్ని కలిగిస్తాయి.

ఇట్లే ఎద్దు, గాడిద, ఎనుపోతు, లొట్టిపిట్ట, మొదలైన వాటిని ఎక్కినట్లు, అన్నం, పిండి, నువ్వులు కలిపి తిన్నట్లు వచ్చిన కలలు అశుభం కల్గిస్తాయి. నూనె, కలి, కొవ్వు, తేనె కలిపి తాగినట్లు వచ్చిన కలలు వ్యాధులు సంక్రమింపజేస్తాయి. కోతి, పొగకాకి మొదలయిన వాటితో వచ్చిన కలలు అపకారం కలిగిస్తాయి.

స్వప్నఫలం దోషాన్ని కలిగించేదైతే దాన్ని అపశకునంగా భావించి పూజా కార్యక్రమాలు ఆరంభించే విధానం ఈ నాటికీ ఉంది. ఆశ్చర్యమేమంటే కొందరు ప్రయాణమై వెళ్ళేటప్పుడు పలకరిస్తేచాలు అపశకునంగా భావిస్తారు. ఎక్కడికని ప్రశ్నించినా, లేదా కొంచెం ఆగండి అన్నా, పోవద్దు అన్నా తమ ప్రయాణాన్ని మధ్యలోనే ఆపుకొనే వాళ్ళూ ఉన్నారు.

జానపదుల కథల్లో ఈ శకునాలప్రస్తావన ఎక్కువగా ఉంది. పల్నాటి వీర చరిత్రకు సంబంధించిన కథల్లో ఆయా శకునాలు, వాటి ఫలాఫలాలు వివరింపబడ్డాయి. దేశింగురాజుకథలో అపశకునాలనుగూర్చి వ్రాయబడింది. దేశింగు రాజు యుద్ధానికి బయలుదేరే ముందు రంగనాధస్వామికి మొక్కగా స్వామి మెడలోని హారం తెగినట్లు, గోపుర శిఖరం కూలినట్లు, గుడిలోని అఖండజ్యోతి ఆరిపోయినట్లు చెప్పబడింది.

"పటువగు దేవుని మెడలో హారంబట భువి తెగి పడెను
పటపటమని గోపుర శిఖరంబులు పడెను భూమియందు"

ఈ నాటికీ శకునాలు పామర జనజీవితంలో పాతుకొని పోయాయి. వీటిని మూఢంగా నమ్మి భయపడవలసిన పనిలేదు. కట్టెలు పచ్చిగా ఉంటే పొయ్యి ముసరడం స్వాభావికం. అంతేకాని చుట్టాలు వస్తారనుకోవడం మూఢ విశ్వాసమే అవుతుంది.

ఆ ర వ ప్ర క ర ణం

# ప్రకృతి చిత్రణ

మానవునికీ, ప్రకృతికీ విడదీయరాని సంబంధం ఉంది. మనకు ఆలోచనతోపాటు ఆహారం, నిద్ర మొదలయిన అలవాట్లు ప్రకృతివల్ల సంక్రమించినవే. సూర్యుడుదయిస్తే మేల్కొవడం, అస్తమిస్తే నిద్రకుపక్రమించడం అంతా ప్రకృతి ప్రభావమే.

కవి సృష్టిలో ప్రకృతి అతిలోక సౌందర్యాన్ని సంతరించుకొంటుంది. దీనికి తోడు కవి తన అసమాన ప్రజ్ఞా విశేషంచేత ప్రకృతిని మానవీకరణం చేస్తాడు. కనుకనే మన కావ్యాల్లోని ఋతువర్ణనల్లోనూ, సూర్యోదయ చంద్రోదయాది వర్ణనల్లోనూ మానవ జీవితమే కనిపిస్తుంది.

ప్రకృతి చిత్రణలో మన కవులేవిధంగా గ్రామీణ జీవితాన్ని మేళవించారో తెలుసుకోవడమే ఈ ప్రకరణం యొక్క ముఖ్యోద్దేశం.

గ్రామీణులు సంవత్సరాన్ని మూడు కాలాలుగా లెక్కిస్తారు. వసంత గ్రీష్మాలను ఎండకాలమనీ, వర్షశరత్తులను వాన కాలమనీ, హేమంత శిశిరాలను చలి కాలమనీ వ్యవహరిస్తారు. ద్విపద పరమయోగి విలాసంలో దీనికి ఆధారం కనిపిస్తుంది.

> ''కడు నేర్పుమై వానకాలంబు కొఱకు
> కడమ యెనిమిది నెలల్ గడియింప వలయు'' 5.355

వానకాలం నాల్గు నెలలుకాగా తక్కిన చలికాలం, ఎండకాలం నాల్గు నెలల చొప్పున ఎనిమిది నెలలవుతుంది. ఈ ఎనిమిది నెలల కాలంలో సంపాదించుకొన్న దాన్ని వానకాలంలో అనుభవించడానికి వినియోగించ వచ్చునని పై పద్యం యొక్క తాత్పర్యం.

ప్రకృతి మనిషి సుఖదుఃఖాలలో పాలు పంచుకొంటుంది. కనుకనే కవి ప్రకృతిని లోకంతో సమన్వయించి చెబుతున్నాడు. ఉదాహరణకు తిక్కన భారతంలోని ప్రభాత కాల వర్ణన చూడండి.

"ద్రుపదనందన పరిభవ దుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచు నున్న సరసి
వేడి నిట్టూర్పులో యన వెడలె క్రొత్త
తావి మూతులు విచ్చు నెత్తమ్మి విరుల" విరాటపర్వం, 2,236

ద్రౌపది కీచకునివల్ల అవమానింపబడి ఎంతో వేదనకు లోనైంది. అందుకు బాధపడ్డ సరోవరం విడిచే వేడినిట్టూర్పులో -న్నట్లు క్రొత్త తావిని వెద జల్లుతూ ఉదయాన తామర రేకులు విచ్చుకొన్నాయట. ద్రౌపది శోకాన్ని సరసి రూపంలో ప్రకృతి అనుభవించిందని చెప్పడం ఇందలి ధ్వని.

మన ప్రాచీన కవులందరూ ఇంచుమించుగా ప్రకృతి వర్ణనలు చేసిన వారే. అందుకేనేమొ "ఆంధ్ర కవితా ప్రకృతి అంతా నాకు ఆరు ఋతుశోభల్లా కనిపిస్తుంది"[1] అని శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు అభిప్రాయపడ్డారు.

గ్రీష్మం :

నన్నెచోడుడు కాళిదాసువలె గ్రీష్మాన్ని తీక్షణంగా వర్ణించినాడు. లోకం మీద దాని ప్రభావం ఎలాంటిదో చెప్పినాడు.

"తలచిన డెందము కందును పలికిన నోరెల్లపొక్కు ప్రభవూచిన రే
ప్పలు కమురు ననగ పటుతర విలయానలభాతి నెండ వేసవిగాచెన్' 6.135

తలచుకొంటే హృదయం కంది పోతుందనీ, ఎండ పేరెత్తితే నోరు పొక్కి పోతుందనీ చెప్పడంవల్ల ఎండ ఎంత భయంకరమైందో తెలుస్తుంది.

తెలుగు సాహిత్యంలో శ్రీ కృష్ణదేవరాయలు చేసినంత ఋతు వర్ణనం మరే కవి చేయలేదు. ఆతని ఆముక్తమాల్యద ప్రకృతి వర్ణనలకు పుట్టినిల్లు.

1. ఆధునయుగాల ఆంధ్రకవిత, తొలిమాటలు, p.x

వేసవిలో దాహం ఎక్కువ. ముఖ్యంగా బాటసారులు బడలికవల్ల మాటిమాటికి నీళ్ళు త్రాగుతారు. ఇట్టి మానవ స్వభావాన్ని కవి మనోజ్ఞంగా చిత్రించాడు.

> ''తొడిబడనమ్మ లక్కలని తూలుచు దీనత దోయిలొగ్గుచున్
> వడమటి తేరతేర నలవాక్యము లెన్నక మోము గుబ్బలున్
> గడుకొను కక్ష దీధితు లెగాదిగ గన్గొను చిట్టకంపు త్రా
> గుడు గని సన్నలన్నగిరి కొందరు పాంథు ప్రపాప్రపాలికల్'' 2.59

బాగా నడవడం వల్లనూ, తీక్షణమైన ఎండ మూలంగానూ, అలసిపోయి దప్పిగొన్న బాటసారులు త్రోవలో గ్రామాల్లో ఉన్న చలివేంద్రాల దగ్గరికి దీనంగా వెళ్ళేవారు. అక్కడ నీళ్ళుపోసే స్త్రీలను మొదట అమ్మా, అక్కా అని సంబోధిస్తూ దోసిళ్ళుపట్టి నీళ్ళు త్రాగేవారు. దప్పి తీరగానే తామిదివరకు పల్కిన పల్కులు మరిచిపోయి నీళ్ళు పోసే ఆ సుందరాంగుల కళ్ళూ, ముఖమూ, స్తనాలూ, చంకలూ ఎగాదిగా చూసేవారు. ఈ వర్ణన సహజ సుందరంగా ఉండి లోకస్వభావాన్ని తెలియజేస్తుంది.

రాయలు వేసవి వెన్నెలను చకోరాలకుదోసెలు పోసినట్లుందని వర్ణించినాడు.

> ''ఎసగు కట్టావి క్రియ నావి రెగయ పగటి
> యెండ యుడు కారకుండు భూమండలమున
> పొలిచె మాపట పండు వెన్నెల చకోర
> పోత వితతికి చాపట్టు పోసినట్లు'' 2.60

భూమి కాలిన పెనంలాగా ఉందనీ, పగటి ఎండ ఉడుకుదనం పోలేదనీ, వేసవి రాత్రుల్లో వెన్నెల చకోరాలకు పలుచని దోసెలు పోసినట్లుందనీ చెప్పిన తీరు అద్భుతం. ఈ నాటి వలె నాటి ప్రజలు వేడిచేసిన పెనం మీద దోసెలు చేసేవారని ఈ వర్ణనవల్ల తెలుస్తుంది.

ఐంద్రజాలికులకు నెమలి ఈకలు ఎక్కువగా ఉపయోగ పడతాయని రాయలు తెలియజేసినాడు.

> ''సమసి కళావశిష్టమగు చందన శైల సమీరణంబు క్ర
> త్రిమగతి నింద్రజాలమున తే డొదగెన్నుపి తాళవృంతజా

లము; లది మాయ యౌటకు తలంపతదీయ మయూర పింఛికా
భ్రమణమె సాక్షికాదె నగరంబున నట్టి కడింది వేసవిన్'' 2.64

వేసవిలో గాలి సరిగా ఆడదు. కాబట్టి విసనకర్రలే మనకు శరణ్యం. అయితే ఆ విసన కర్రలు చల్లగాలిని అందించడానికి ముఖ్యమైన కారణం, వాటి చుట్టూ అల్లబడిన నెమలి ఈకలేనని కవి చమత్కారం.

చంద్రభాను చరిత్రలో మల్లన వేసవిని వర్ణించాడు. ఆ కాలంలో సామాన్యులు పాదరక్షలు లేకుండానే నడిచేవారు. ఎండ వేడిమికి కాగిన నేల వారి పాదాలకు చురుకెక్కించేది. ఆ కారణంగా వారు చెట్ల క్రింది నుంచి నడిచేవారు.
''అజికాలి సెగసోకి చుఱుకనగా చెట్లబడి త్రోవ నడిచిరి పథికులెల్ల'' 1.70

సాధారణంగా బాటసారులు ఆ కాలంలో ఎండలో వెళ్ళేటప్పుడు తమ వెంట ఏయే పదార్థాలను తీసికొని వెళ్ళేవారో మల్లన ఎంతో సహజంగా వర్ణించాడు.

''చక్కెర చింతపండొడిని సందిట నేలకి చద్ది మౌళిపై
చెక్కిన కానుగాకు వలచేజలకుండిక వీజనంబువే
ఱొక్కకరంబునందు పదయుగ్మమునం బిగివాళ్ళు గల్గి న
ల్దిక్కులనధ్వగుల్బడలి త్రిమ్మరి రట్టి కడింది యెండలన్'' 1.161

ఒడిలో చెఱకు గడలు, చింతపండు; చంకలో చద్ది మూట; తలమీద కానుగాకులు; చేతిలో నీళ్ళ చెంబు, విసనకర్రలు; కాళ్ళకు బిగువాళ్ళు (కట్టెల మోపులు బిగించే తాళ్ళు) కల్గి బాటసారులు ఎండలో నడిచివెళ్ళేవారు. ఎండ దెబ్బ తగలకుండా గ్రామీణులు నేటికీ తలలమీద కానుగాకులు కప్పుకొని బయల్దేరడం చూస్తాము.

వైజయంతీ విలాసంలో సారంగు తమ్మయ్య వేసవిలోని ఎండతీక్ష్ణతను తెలుపుతూ సూర్యుడు మనకిచ్చిన నీళ్ళు మళ్ళీ తీసుకొన్నాడనీ, నీటి కుండలు ఉట్లమీది కెక్కాయనీ, శివలింగాలమీద నీటి కలశాలు నిలిచాయనీ, మజ్జిగలో నీళ్ళెక్కువయ్యాయనీ చమత్కరించాడు.

''చండభానుడు కర్కసము జేసి మున్ను తా మహికిచ్చునప్పులుమరలగొనియె
వారిపూర్ణములైన వసుధార కలశముల్ శివలింగమూర్తుల శిరము లెక్క
నృప మందిరముల పానీయ కుంభంబులు వెస నుట్టి గట్టుగ వ్రేల దొడిగె
భువినెల్ల జనుల దప్పులు మాన్పు తక్రమ్ము తా దప్పిగొని నీళ్ళత్రావజొచ్చె
హరుడు కైలాస కుధర నాథాగ్రవసతి విడిచి వటమూల తలమున విశ్రమించె
సతత నిజదీర్ఘతా తనూకృతి నిశాప్రహరములగునట్టి గ్రీష్మవాసరములందు''
1.57

వేసవిలో మనం మజ్జిగలో నీళ్ళెక్కువగా కలుపుకొని త్రాగడం సహజం. దీన్నే కవి ప్రజల దప్పిని తీర్చే మజ్జిగ తానే దప్పిగొని అధికంగా నీళ్ళు త్రాగిందని చమత్కరించాడు.

వర్షం :

కుమార సంభవంలో నన్నెచోడుడు చలిగాలులతో కూడిన ముసురుకు భయపడి నేల తల్లి పచ్చని కంబలిని కప్పుకొన్నట్లు, ఎక్కడచూచినా పచ్చిక కనిపిస్తుందని వర్ణించాడు. ఈ వర్ణనవల్ల రైతులు ముసురుకు గొంగళ్ళు కప్పుకొంటారన్న విషయం స్పష్టమౌతుంది.

''చలిగాడ్పుల ముసురుల మెయి వలిగొని ధాత్రీపురంధ్రి వడి పచ్చని కం
బలిగవిసికొన్న విధమున బొలుపుగ చిప్పరలు గవిసెభూతలమెల్లన్'' 6.757

హరివంశాన్ని బట్టి ఆ కాలంనాటి ప్రజలు కోల్పోయిన శరీర బలాన్ని తిరిగి పొందడానికి మూలికారసం సేవించేవారని తెలుస్తున్నది.

''ఘన రసోపయోగంబున క్రమ్మఱంగ
బడసె ప్రాయంబు తగదె యిబ్భంగి యనగ
హరిత తృణలతారుణ కోమలాంగి యగుచు
పృథ్వియెంతయు క్రొత్త యొప్పిదమునొందె'' పూ. భా, 6.111.

మానవులు మూలికారసం ద్వారా తిరిగి యౌవన వైభవాన్ని పొందినట్లే వర్షం కారణంగా భూమి పచ్చని గడ్డితోనూ, లతలతోనూ క్రొత్త అందాన్ని పొందిందని పద్యం యొక్క భావం.

వర్షఋతువులో విపరీతంగా కురిసే వానలకు పశువులూ, గోపాలురూ పొందే బాధలను ఎఱ్ఱన కళ్ళకు గట్టినట్లు చిత్రించాడు. ''అట్టి సమయంబున

నిరంతర ధారాపాతంబునం దడిసి సలుదెసలం బఱచివ్రేయు వాయువున ...
ఆత్మగతంబున'' పూ. ఖ, 7.171.

ఎడతెగకుండా వానలు కురవడంవల్ల చాలావరకు పసులు తడిసి పోయాయి. పెనుగాలికి భయపడి ఒకదానిచాటున మరొకటి ఒదిగిపోయాయి. కొన్నిపసులు కొమ్ము లొడ్డి, కన్నులు వాల్చి, రెప్పల చివరనుంచి నీళ్లు కారుతుండగా తలలు వంచాయి. నెమరు వేయడం మానివేశాయి. ఆవులు వణికిపోతూనే అంబా అని అరుస్తున్న దూడలను తమ గంగడోళ్లకు హత్తుకొన్నాయి. కొన్ని పసులు నీటి ప్రవాహం కారణంగా నిలవడానికి చోటులేక పడుతూ లేస్తూ మెరుపును చూసి బెదిరిపోయాయి. ఉరుముకు దిమ్మ దిరిగిపోయి మందకు దూరమయ్యాయి. కొన్ని పసులు అదేపనిగా తిరగడంవల్ల తిండలేక ఎత్తువడి రోగంతోనూ, ముసలితనంతోనూ చనిపోయాయి. బలమైనవి కూడా సత్తువను కోల్పోయాయి. అంతేకాక గుడిసెలు కూలిపోయాయి. బండ్లు తలక్రిందులయ్యాయి. వంటపనులు, ఇంటిపనులు ఆగిపోయాయి. పాడికి సంబంధించిన పనులు నిలిచిపోయాయి.

ఈ విధంగా ఎట్టిన అతివృష్టివల్ల పశుకోటికీ, ప్రజలకూ కల్గిన నష్టాన్ని సూక్ష్మ పరిశీలనతో చిత్రించినాడు.

పడమటి దిక్కున ఇంద్రచాపం కనిపించినా లేదా చంద్రుని చుట్టు గాలి గుడికట్టినా వర్షాలు పడతాయని ప్రజల విశ్వాసం. హరవిలాసంలోని ఈ పద్యాన్ని చూడండి.

''పశ్చిమంబున నింద్రచాపంబు వొడిచె
నిండునెల చుట్టె పరివేషమండలంబు
గగన మార్గంబునందు నాగడపలెగసె
నంబుధర మాలికలు దక్షిణంబు నడచె'' 2.17

ప్రజలయొక్క ఈ విశ్వాసాన్ని గూర్చి శ్రీ విలుకూరి పాపయ్యశాస్త్రి గారు తమ ''శ్రీనాథుని కృతులలో ఋతువులు'' అనే వ్యాసంలో చక్కగా వివరించారు.

"ఇంద్రచాపము ప్రాక్పశ్చిమ దిశలలో బొడసూపుచుండును. దిశాభేదమును బట్టి ఫలభేదమొదవుచుండును. ఈ ఇంద్రధనుస్సును భీమ మండలములోని వారు మొండి కొఱవి లేక మొండి కొడవలి యనివాకొందురు. ఈ ఇంద్రచాపము పశ్చిమమున పొడచూపిన నది విశేష వర్షారంభ సూచకము. తూర్పున పొడచూపిన వర్షాభావ సూచకము. దీనిని గూర్చి హాలికులలో ప్రసిద్ధమైన యొక నానుడి గలదు. 'తూర్పున మొండి కొఱవి వేస్తే పశువులను తుంగబీడులో కట్టవచ్చు. పడమట మొండి కొఱవి వేస్తే పశువులను బండరాళ్ళమీద కట్టవలె'నని. తూర్పుననింద్రచాపము పొడిచిన జలప్రాయమైన తుంగబీటిలో పశువులను కట్టినను వానికి వర్షము వలన బాధ యుండదనియు, పశ్చిమమున నింద్రచాపము పొడిచిన పశువుల నెత్తైనచోట బండరాళ్ళ మీద కట్టవలెననియు కృషీవలుల నిశ్చయము. నిశ్చయము మాత్రమే కాదు. అనుభవము కూడా నట్టిదియే.... ఇటులనే చంద్రునకు పరివేషము చుట్టుట (చంద్రబింబము చుట్టును గుడికట్టుట) యును వర్షారంభ సూచకమే. చంద్రునకిట్టి పరివేషమేర్పడినప్పుడు తెలుగునాటివారు 'దూరముగ గుడి కట్టినపుడు దగ్గర వానలు, దగ్గరగా గుడి కట్టినపుడు దూరపువానలు'అని వాకొందురు. ....ఆగడపలు లేచుటయనగా ఆకసమునందు మేఘఖండములు దొంతులు దొంతులుగా నేర్పడుట. ఆకసమునందాగడపలు లేచినపుడు వర్షము విశేషముగ గురియుటయు ప్రసిద్ధమే"1

చిరుతొండనంబిని పరీక్షించడానికి జడివాన కురిసింది. పిడుగులుపడ్డాయి ఈ సందర్భంగా ప్రజలు అర్జునుని పది పేర్లను స్మరించినట్లు శ్రీనాథుడు వర్ణించాడు.

"తటిదభిఘాత వేగమున ధారలు జోఅని కుర్యుచుండగా
పిటిలు పిటిల్లనంబ్రిదిలి ప్రేలిపడం దొడగెం జతుర్దిశా
తటముల మండుచుంబిడుగు తండము కాంచి పురీజనంబు హృ
త్పుటములు జల్లనన్మఘవ పుత్రుని పేళ్ళ పదిం జపింపగన్" 2.22

1. ఆంధ్ర సాహిత్యపరిషత్ పత్రిక, 'శ్రీనాథుని కృతులలో ఋతువులు,' సంపు. 44, పు. 233.

పిడుగు చప్పుడు వినిపించగానే తెనుగునాట అర్జునా, ఫల్గునా, అని మొత్తం పది పేర్లు ఉచ్చరిస్తారు. "అర్జునః పల్గునః పార్థః కిరీటీః శ్వేతవాహనః బీభత్సో విజయః కష్ణః సవ్యసాచీ ధనంజయః" అనేవి ఆ పది పేర్లు.

వర్షాకాలంలో ఎండిన కట్టెలు లభించడం కష్టం. కనుకనే వస్త్రాలను నూనెలో తడిపి వంట చెఱకుగా ఉపయోగించడాన్ని శ్రీనాథుడు హరవిలాసంలో వర్ణించాడు.1 పిడుగుల భయంతో స్త్రీలు ఇళ్ళ నుంచి బయటికి రావడానికి భయపడతారు. రాత్రిపూట భోజనానంతరం పళ్ళాలు కడిగిన నీళ్ళను వారు గడపలో నిలబడే బయటికి చల్లుతారు. ఇది లోక స్వభావం. ద్విపద పరమయోగి విలాసంలోని ఈ పద్యాన్ని చూడండి.

‹‹లీలమై మగని పళ్ళెరము కెంకేల
కీలించి యపుడ వాకిట కేగుదెంచి
తడయంగనోడి యా తన్వంగి వంగి
కడప ముంగిట నిల్చి కడిగి చల్లగను
కప్పిన చీకటి గమి విచ్చి పాఱ
నప్పుడు ధళ ధళక్కన మెరయుటయు› 6.489.

ఇదే భావాన్ని రాయలు ఆముక్తమాల్యదలో ఉత్ప్రేక్షాలంకారంలో చెప్పినాడు.

‹‹పిడుగుల కల్కి లో దొలిచి భీరులు కంచము చల్లు దీధితు
ల్గడపల వెళ్ళిరాపొగల కావిరి గ్రుంగెడు పుల్గృహంబు లె
ల్లెడ కనుపట్టె నీళ్ళ నిలయెల్లను ముంచి రసాతలంబు పై
విడియగ దండు డిగ్గిన సవిద్యు దురుస్తనయిత్నులోయనన్›› 4,128,

పిడుగుల భయానికి గడపల్లోనే ఉండి, కంచాల్లోని నీళ్ళు చల్లడంవల్ల బయట కాంతి వ్యాపించింది. అప్పుడు నల్లని పొగతో నిండిన పూరి గుడిసెలు భూమిని జలమయం చేసి పాతాళం మీద దండెత్తి వచ్చిన మెరుపుతో కూడిన

1. హరవిలాసం, 2.31

మేఘాల్లా ఉన్నాయట ! ఇందులో కంచాల నీళ్ళు చల్లడం వల్ల పుట్టిన కాంతి మెరుపుతోనూ, నల్లని పొగతోనిండిన పూరి గుడిసెలు మేఘాలతోను పోల్చబడ్డాయి.

విష్ణుచిత్తుని భార్య జడివానలో కొబ్బరి చిప్పలతో వంట చేసిందనీ, వరన్నంతోపాటు, కూరలు, పెరుగు, నెయ్యి అతిథులకువడ్డించిందనీ రాయలు వర్ణించాడు.

''గగనము నీటి బుగ్గ కెనగా జడివట్టిన నాళ్ళు భార్య క
న్బొగ సొరకుండ నారికెడపుం బొరియల్దవులించి వండ న
య్యగపలముంచి పెట్టుకలమాన్నము గొల్చిన పప్పు నాలు గే
న్పొగిసిన కూరలున్వడియము ల్వరుగు ల్పెరుగు న్ఘృతప్లుతిన్'' 1.80

పసిపిల్లలకు పాలపండ్లు రాలిపోయి మళ్ళీ పండ్లు మొలిచేటప్పుడు క్రమంగా కంఠస్వరంలో మార్పు వస్తుంది. రాయలు ఈ సత్యాన్ని మేఘ గర్జనతో సమన్వయించి చెప్పాడు. మేఘాలు వడగళ్ళు అనే పాలపండ్లను పోగొట్టుకొని మళ్ళీ కొంగలనే దంతాలు మొలవగా, స్వరం మారినట్లు ఉరుము లెక్కువయ్యాయని చెప్పడం కవి లోకజ్ఞతను తెలియజేస్తుంది.

''కృతపయః పాన నవమేఘ పృథుకములకు
రాలె నొయ్యన వడగండ్ల పాలతండ్లు
మఱి బలాకాద్విజాళి సంప్రాప్తి గలిగె
పెరుగ పెరుగంగ ధ్వనియు గంభీరమయ్యె'' 4.82.

ఆకాశం మబ్బు పట్టడంవల్ల నిరంతరం ప్రకృతిలో జరిగే పరిణామాలను, ఆయా ప్రాణులనుభవించే సుఖ దుఃఖాలను రాయలు సహజ మనోహరంగా వర్ణించినాడు. సూర్యుడెప్పుడు కనిపిస్తాడా ? అని ఆచారపరులూ, తొండలూ తమ దృష్టిని ఆకాశంమీదనే ఉంచడం జరుగుతుంది. అర్ఘ్యం ఇచ్చే బ్రాహ్మణులకూ, ఇళ్ళకు వచ్చే పసులకూ సాయంకాలం అనే భ్రమ కలుగుతుంది. కాని వ్యవసాయదారులకు పంటలు పండాయనీ, తెల్ల కొంగలకు గర్భం ధరించే సమయం ఆసన్నమైందనీ సంతోషం కలుగుతుంది. అయితే

సంతలకు వచ్చిన ప్రజలు మాత్రం ఊళ్ళకు తిరిగి వెళ్ళిపోతారు. ఇట్లే ముసురు కారణంగా అతిథులకు దవడలు కుంచించుకొని పోవడం, దూడలకు పాలుత్రాగరాక నోళ్ళు బిగుసుకొని పోవడం జరుగుతుంది. మట్టిమిద్దెల వాళ్ళు కూడా వర్షం ఎక్కడ కురుస్తుందో? అని భయపడతారు. ఒకవేళ భార్యలు పుట్టింటికి వెళ్ళినట్లైతే పురుషులకు నిద్ర పట్టడం కూడా కష్టమౌతుంది.

''రవిజూచి కుడుచువారలకును గృకలాసములకును దృష్టి మిన్నులనె నిలిచె
సంధ్యార్ఘ్యదాయి ద్విజశ్రేణికిలు సేరు మొదవులకును భ్రాంతి మది జనించె
హలజీవి సందోహములకు బలాకికా విసరంబులకు మంచి వెదలు దొరకె
నెలమి బొల్పగు యూథికలకు సంతల కూటములకును మరివిచ్చు మొగ్గలొదవె
నతిథి సంఘమునకు నీనినట్టి యెనుప కదుపు లేగలగమికి వాకట్టు లెసగి
మంటిమిద్దెల వారికి మరుపనులకు నెలతబాసిన వారికి నిదుర చెడియె'' 4.123

వానకు తడిసిన వంట చెరకు పొయ్యిలో పెట్టినప్పుడు అది నీళ్ళు కక్కుతూ నిప్పును చల్లార్చడం సహజం. దీన్ని రాయలు చెరకుగడను గానుగలో వేసి తిప్పినప్పుడు రసంకారినట్లే పొయ్యిలో పెట్టడంవల్ల వంట చెరకు నామసార్థక్యం పొందిందని చమత్కరించాడు.

''నాని శిఖి వంట చెఱకుల చేనఅనవి వెండి వంట చెఱకులె యగుటం
బోనంబు ప్రజకు జక్కుల బోనంబులెయయ్యె బ్రొయ్యి పొగయమి వృష్టిన్
4.126

కట్టెలు మండి వంట కాకపోవడంచేత ప్రజలకు భోజనం జక్కుల వాళ్ళ భోజనం అయ్యిందని చెప్పడంవల్ల సాధారణంగా పెళ్ళిళ్ళలో జక్కుల వాళ్ళు ఖాళీ కుండలను తలలమీద పెట్టుకొని బోనాలో! బోనాలో! అని పలికే ఆచారం స్ఫురిస్తుంది.

వర్షాకాలంలో సామాన్యప్రజలు పడే బాధలతోపాటు ప్రత్యేకంగా గృహిణులు ఎదుర్కొనే ఇబ్బందులను రాయలు కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు.

"ఇల్లిల్లు దిరుగనొక్కింతబ్బు శిఖి, యబ్బె
నేనింటిలో పూరియిడి విసరక
రాజదు, రాజిన రవులు కొల్పాసలె
గాని కల్గదు కూడు, దానగలిగె
నేనికూరగుట మందైన పెన్పొగసుఖ
భుక్తిసేకూర, దాభుక్తి కిడిన
ప్రాగ్భోక్తలకెతీరు బహుజనాన్నము, తీఱ
నారుల కొదవు పునఃప్రయత్న,
మాజ్యపటముఖ్యలయ మెన్న, రాలయాంగ
దారులయ మెన్న రంతిక, కారజనిక
పచననాంధో గృహిణి రామి పడుక మరుడు
వెడవెడనె యార్పనొగిలి రజ్జడిని గృహులు" 4.127

ఎన్నో ఇండ్లు తిరిగితే ఎక్కడో ఒకచోట నిప్పు లభించేది. అలా లభించినా ఎండుగడ్డి లేకుంటే రాజుకోదు. రాజుకొన్నా ఇంటివాసాలు పెడితేగాని మంట రగుల్కొదు. రగుల్కొన్నా సరిగా అన్నం ఉడకదు. ఒకవేళ ఉడికినా ఇల్లంతా పొగ నిండుకొంటుంది. పొగవల్ల సుఖంగా భోంచేయడం కష్టం. ఇంతలో అతిథులు వస్తే తయారైన అన్నం మొదటి బంతికే సరిపోతుంది. మళ్ళీ ఆ గృహిణులు వంట మొదలుపెట్టాలి. వంట మొదలు పెట్టడమంటే మాటలా? నేతితో తడిపిన బట్టలూ, ఇంటివాసాలూ పెట్టి ఎలాగో పొయ్యిని మండించాలి. ఇలా ఎంతో కష్టపడి రాత్రిదాకా వంటచేసినా వారికి అన్నమే మిగిలేది కాదు. పైగా వారు తొందరగా రాలేదని అప్పటికే పాన్పుల మీదికి చేరుకొన్న భర్తల ఆంక్షోళన!

వర్షఋతువులో గృహిణులు వంటచేస్తూ పడేపాట్లను ఎవరూ చిత్రించలేనంత సహజంగా రాయలు చిత్రించాడనిపిస్తుంది.

సాధారణంగా బాటసారులు వానజల్లుమీదపడకుండా తమనుతామురక్షించుకోవడానికి చెట్లక్రిందికి వెడుతారు. కాని అంతకుముందే వచ్చిన జల్లు కారణంగా

చెట్లఆకుల్లో నిలిచిన వాననీరు క్రొత్తజల్లు వచ్చేలోపలే వారిని తడుపుతుంది. లోక సహజమైన ఈ విషయాన్ని రాయలు ఎంత మనోహరంగా వర్ణించాడో చూడండి—

''దవుల జల్లని తూరనంతకు మునుపటి
జల్లునీరూని వచ్చు నా జల్లు మొదలి
గాలియెలగోలుచే కొమ్మకదలిజల్లు
తలపడకమున్న వంగుళ్ళ తడిపె తరులు'' 4.130

వర్షంలో గొడుగులు పట్టుకొని వెళ్ళేవారిని చూస్తాం. అలాంటి వారంటే మేఘానికి కోపం. అందుకే అది వారి చేతుల్లోని గొడుగులను ఎగరగొట్టి కేవలం కర్రలతో వారిని పరిగెత్తించిందని రాయలు చేసిన వర్ణనను చూడండి.

''గొడుగుల గాలిగూల్చి మఱి కోలలతోడనెపాఱనాన్చె చే
ద్పడజడి మేఘుటట్లగుట పాంథులపై తనకెంత వైరమో?
తడిసిన మేననింకి యదిదారవియోగజవహ్ని కొంతకొం
తుడిగె విధాతరక్ష విషమొక్కొక్కమాట మృతంబు సేయగన్''4.129

వర్షం వస్తుందనగానే బాటసారులు పరిగెత్తుకొని వచ్చి ధర్మసత్రాల ముందున్న అరుగుల మీదికిగానీ, రచ్చబండలమీదికిగానీ చేరుతారు. అంతటితో ఊరుకోక రాజులనూ సామంతులనూ దృష్టిలో పెట్టుకొని ఒకరికంటె ఒకరికి గుఱ్ఱాలూ, ఏనుగులూ ఎక్కువగా ఉన్నాయని వాదులాడుతారు. ఇంతలో మబ్బు కాస్తా తొలగిపోతుంది. అప్పుడు మాటలు కట్టిపెట్టి ఎక్కడి వారక్కడ జారుకొంటారు. ఇది లోక స్వభావం. రాయల పద్యాన్ని చూడండి.

''రయమున వృష్టికై యొదిగి రచ్చలపై విధియింతురుగ్రతన్
హయపతిమీద దంతిపతి నాతనిపై నృపతింగజాదిని
ర్ణయముల మొత్తులాడుదురు, మబ్బొక యించుక విప్పవిచ్చుమొ
గ్గయిమఱి పాఱిపోదురు సమస్త దిశాగతులైన యధ్వగుల్'' 4.131

వర్షాకాలంలో శరీరానికి వేడినిచ్చే పదార్థాలను తినడం సహజమే. కుర కటం, చెంచలి, చింతచిగురు మొదలైన వాటిని నూనెలో వేయించి తయారు

చేసిన కూరలతో భోజనంచేసి తమ కుమారులు పొలాలకు వెళ్ళగా రెడ్లుమాత్రం మంచాలమీద కూర్చొని మంచం కోళ్ళకు కట్టిన దూడలు తమ శరీరాలను నాకు తుండగా మేక ఎరువు కుంపట్లను కాపుకొంటూ, అబ్బిన అధికారంతో ఇళ్ళలోనే హాయిగా కాలం గడిపినట్లు రాయలు చేసిన వర్ణన అతని పరిశీలన పాటవానికి చక్కని నిదర్శనం.1

చంద్రభాను చరిత్రలో మల్లన వర్షఋతువులో బాటసారులకు సాధారణంగా కలిగే ఇబ్బందులను వర్ణించినాడు.

> ''అసటిలో దిగబడి వెసికి వెల్వడలేక
> యెలుగెత్తి పొలమర్ల పిలుచువారు
> కటియరేవడి పదాగ్రముల జిఱ్ఱనజాఱ
> ప్రాంతభూజములూత పట్టువారు
> నెదురువానకు తలయెత్తక యేగుచో
> ముందరగానక మ్రొగ్గువారు
> గొబ్బునజల్లుపైకొన్న చెట్లనుజేరి
> వంగుళ్ళు ఘనమైన వడకువారు
>
> నై ముదురు జంబుగూడల పయిధరించి
> మొకమొకించుక గానరా ముసుగువెట్టి
> కేలనోరచ్చు మడత్రాళ్ళ వ్రేలుచుండ
> నమగతి నధ్వగులు త్రోవ నడచిరపుడు'' 5.39

కొందరు బురదలో దిగబడి బయటకు రాలేక కాపాడండి అని ఇతరులను పిలిచేవారు. కొందరు నల్లరేగడి భూముల్లో నడుస్తూ చిత్తడివల్ల కాలుజారి ప్రక్కనే ఉన్న చెట్లను ఊతగా పట్టుకొనేవారు. కొందరు ఎదురువానకు తలలెత్తక నడిచేవారు. కొందరు జల్లురాగానే చెట్లక్రిందికి వెళ్ళి వణుకుతూ అలాగే నిల్చేవారు. కొందరు జమ్ముతోచేసిన పెద్ద దొప్పలను తలలమీద బోర్లించుకొనేవారు. కొందరు ముఖాలు కొంచెం కొంచెం కనిపించేటట్లు ముసుగు పెట్టుకొనేవారు. కొందరు మెలమెల్లగా నడిచేవారు. మల్లనచేసిన ఈ వర్ణన ఎంతో సహజ సిద్ధమైంది.

---

1. ఆముక్తమాల్యద, 4.134

వైజయంతీ విలాసంలోని వర్షాకాల వర్ణనలో ఆ నాటి శిక్షా విధానం గోచరిస్తుంది.

"అనమాయప్పులీక పోతేనియనుచు
ధరణి పంపున తొలుకారు తరువుకాడు
నింగి గుడిగ్రాసి యాగిన భంగినపుడు
చండకరుడుండె పరివేష మండలమున" 2.143

అప్పులిచ్చిన భూమి పక్షాన తొలకరి, సూర్యునిచుట్టూ గీసినవృత్తంలాగా ఇంద్రధనుస్సు ఉందని భావం. ఋణదాతకు ఋణగ్రహీత పట్టుబడగానే అతన్ని నిలబెట్టి, చుట్టూ గీతగీసి ఆ గీతనుదాటి రాకూడదని ఆజ్ఞాపించడం గమనార్హం. 'అప్పు' అనే మాటకు నీళ్ళు, ఋణం అనే అర్థాలున్నాయి. వాటిని సమన్వయించుకొంటే తాత్పర్యం బోధ పడుతుంది- ఇట్లే సారంగుతమ్మయ్య శ్రీనాథునిలాగా పిడుగు చప్పుడు వినగానే ప్రజలు అర్జునుని పది పేర్లను స్మరించడాన్ని పేర్కొన్నాడు.1

శుకసప్తతిలో కదిరీపతి చినుకు పడినప్పుడు పసులు, పసుల కాపరులు ఎదుర్కొనే అవస్థలను కళ్ళకు గట్టినట్లు చిత్రించినాడు.

గొల్లలు బండరాళ్ళమీద అలాన్ని పరుచుకొని, గొంగడి ముసుగు పెట్టుకొని పడుకొనేవారు. మేతకు వెళ్ళిన ఆవులు అంభారావాలు చేస్తూ మందకు వచ్చేవి. పాలు త్రాగుతున్న దూడలు ఆవుల ప్రక్కకు ఒదిగేవి. ఇక మేకలు కదలాలా వద్దా? అనుకొంటూనే ఒకదాన్ని వేరొకటి దాటుతూ వేగంగా పరిగెత్తి చెట్ల క్రిందికి చేరి నెమరు వేసేవి.

"గొంగడి ముసుగుతో గొల్లలు చట్రాతి
పైని బందరాకు పరచికొనగ
నాలమందలు మేతకరిగి యేతెంచి యం
భారవంబుల తోడ మందగొనగ
పొదుగు దూటలమాని యొదిగి క్రేపుల గుంపు
జననీనికాయంబు చాటుజేర

1. వైజయంతీవిలాసం 2.145

నొకటి నొక్కటిజూచి యురికి మేకలు చెట్టు
నీడల గుమికూడి నెమరువెట్ట
దనరునంబుదకాండ వేదండ యూథ
గర్జితోర్జిత భూరిభూత్కార గళిత
వమధుశీకర వార దుర్వారమగుచు
చలువతెమ్మెరలేతేర సన్నతూర" 2.342

'బందారాకు'ను గూర్చి శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఇలా వ్రాసినారు. 'బందారు' ఒకానొక చెట్టు అని శబ్దరత్నాకరము. అది చెట్టు కాదు. అలము, తీగె. తెలంగాణములో బందాల అలము అందురు. అది పచ్చగా జడలుగా వానకాలమందు చేలలో ప్రబలియుండును. నలిపిన కొద్ది సువాసననిచ్చును. ఆ తీగెలను కూలి పడుచులు తమ కొప్పులలో నుంచుకొందురు. నేటికిని ఆయలము కల తావులలో వానకాలమందు గొల్లలు దానిని పరచుకొని గొంగడి ముసుగుతన్ని వర్షము ఆగువరకు పండుకొందురు.1

వర్షం పడుతున్నప్పటికీ పొలాల నుంచి రైతులు ఇళ్లకు వస్తూనే ఉంటారు. గాలివానకు బెదరక ఒక రెడ్డి తలమీద మ్రిడిఊడల మోపుతో, ఇల్లాలి మీది ప్రేమతో ఒక బూతంలాగా తడిసి ఇంటికి వచ్చినట్లు కదిరేపతి వర్ణించినాడు.

"తలపై నూడలమోపున్ మొలగత్తియు నింటిమీది మోహము మదిలో
తలకొన చలికి చలింపక బలుబూతము వోలె పెద్ద పరువునవచ్చెన్"
2.347

శరత్తు :

రాయలు గ్రీష్మ వర్షఋతు వర్ణనల్లో మాదిరిగా శరదృతు వర్ణనలోను గ్రామీణ జీవన అంశాలను పొందుపరిచినాడు.

పక్వానికి వచ్చిన పెద్దపెద్ద పండ్లూ, పచ్చని ఆకులున్న దోసతోటలూ, పండినపైరుమీద తిరిగే చిల్కల గుంపులూ, తుమ్మెద రెక్కల నిగనిగలూ

1. ఆంధ్రులసాంఘిక చరిత్ర. పు. 316

ప్రతిబింబించిస్తున్నట్లుగా కొంచెం సంధ్యాకాలపు ఎర్రదనం కల్గిన తెల్లని మేఘాలు ఆకాశంలో ఉన్నాయని రాయలు మనోజ్ఞంగా వర్ణించాడు.

"అశిగరుదంచలామల తదంతర బింబితమయ్యెపాకని
ర్దళిత మహాఫలౌఘ హరితచ్ఛద కర్కటికావనాలినా
కలమవనభ్రమచ్ఛుకనికాయములోపల సాంధ్యరక్తిమం
బలతిగ దాల్చిమింట గననయ్యెవిపాండుపయోద ఖండముల్" 4.140

అద్దాలను శుభ్రం చేయడానికి గ్రామీణులు బూడిదను ఉపయోగిస్తారు

"రవిశశిముకురములు శర
ద్యువతి మెఱుగుపెట్టుభూతియోయన పర్వెన్
పవనాహత సపత్రచ్ఛద
నివహపరాగంబు దివికి నిర్మల కాంతిన్" 4.142

సూర్యచంద్రులు అనే అద్దాలకు పట్టిన మాలిన్యాన్ని తొలగించడానికి శరద్వనిత పెట్టినవిబూది అన్నట్లు ఆకాశంలో ఏడాకులుకల్గిన అరటిచెట్ల పుప్పొడి వ్యాపించిందని భావం.

తెలుగువారి పెళ్ళి ఆచారాలు ప్రతిఫలించిన రాయల పద్యాన్ని చూడండి-

"కెరలు స్రవంతిపై యిసుక క్రిందగువేళ నినుండు మేఘపుం
దెర సన చల్లగా విరహదీప్తకరప్లుతమౌసజీరకో
త్కరగుడమట్లు పద్మినుల గ్రమ్మసకేసర మాధ్విపొల్చె, పై
కరమరుదారె తేంట్లు సెక కందిన ముత్తెపు సేసలోయనన్" 4.150

శరత్కాలంలో ఏటిలో పై ఇసుక క్రిందికి జారిపోతుంది. సూర్యుడు క్రమంగా మేఘాల వెనక్కి పోతాడు. ఈ దృశ్యం పెళ్ళికొడుకు ముందు తెర గట్టినట్లుంది! తామర పూలలో మకరందం నిండి ఉంది. కేసరాలు జీలకర్ర లాగా, తెనె బెల్లంలాగా ఉన్నాయి. తామరపూల నుంచి కారుతున్న తేనె విరహానికి కరిగి చేతికంటుకొన్న బెల్లంలాగా కనిపిస్తుంది. ఎగురుతున్న తుమ్మెదలు ముత్యాల తలంబ్రాల వలె ఉన్నాయి. తెరగట్టడం, జీలకర్రతో కూడిన

బెల్లాన్ని తలమీద ఉంచడం, తలంబ్రాలు పోసుకోవడం మొదలైన పెళ్ళి ఆచారాలను ప్రకృతితో సమన్వయించి చెప్పిన రాయలు అభినందనీయుడు.

కుంకుడుకాయ రసాన్ని సాధారణంగా తలజిడ్డు పోవడానికి ఉపయోగిస్తారు. రాయల కాలంలో ఈ రసాన్ని ఆభరణాలను శుభ్రం చేయడానికి ఉపయోగించినట్లు చెప్పబడింది.

"గగనలక్ష్మి నిజోరు నక్షత్రమాలి
కలు వియన్నది జలముల కడుగపిసుక
నెఱయు కుంకుడుపండుల నుఱువులనగ
పలపలని పాండురాంబుద పంక్తులమరె" 4.157

ఈ పద్యంలో శరన్మేఘాలు కుంకుడు కాయల నురుగుతో పోల్చబడ్డాయి.

కిరాతస్త్రీలకు గురువింజలంటే పంచప్రాణాలు. వారు ముక్కరలోనలుపు భాగాన్ని పైకుంచి గురుగింజను అడ్డంగా గుచ్చుకొనేవారు. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని రాయలు శరత్కాలంలో అస్తమయ ఉదయకాల సంధ్యారాగం నడుమ నల్లదనంతో ప్రకాశించే ఆకాశం– మూల ప్రకృతి అనే చెంచెత యొక్క గురిగింజ ముక్కెర సౌందర్యానికి సాటి అయ్యిందని వర్ణించినాడు.

"కంజహితాస్తోదయముల సంజకడలనడుము కప్పుసంధిలమిన్నా
ప్పెంజూడ ప్రకృతి శబరీ గుంజానాసా విభూష కొమరు భజింపన్"
4.161

కవికర్ణరసాయనంలోని శరద్వర్ణన మనోజ్ఞమైంది.

వర్షఋతువు గడచిన తరువాత శరత్తు ప్రవేశిస్తుంది. బురదతో కూడిన దారులు ఎండిపోతాయి. బాటసారులు బాటలు తెలియక తికమక పడతారు. చివరకు పంటచేలకు కాపలా ఉన్న పామర స్త్రీలను వారు దారి అడిగి తెలుసుకొంటారు.

"శరదుదయంబునన్ విగతసంకుల పంకము లేటమార్గముల్
గరగరనైననైన వెసగా జననేరక యుండి రెల్లెడన్

తెరువరు లాత్మదృష్టి కతిథిత్వముగొల్పెడి పంటచేలపా
మరసతులంబఢంబడిగి మాటికి మాటికి మాటలార్చుచున్'' 2.61

బాటసారుల చూపులకు అతిథ్యం ఇచ్చే విధంగా పంటచేలున్నాయని చెప్పడం కవి భావనా శక్తికి చక్కని నిదర్శనం.

హేమంతం :

శివరాత్రి మాహాత్మ్యంలో శ్రీనాథుడు చేసిన హేమంత ఋతువర్ణన సహజ మనోహరంగా ఉండి సహృదయులను ఆనంద పరుస్తున్నది.

''కలమవనాళికా కణిశకంటక కోటులచేత చూడ్కికిం
పలవడఁజెన్దరిత్రి తుహినాగమవేళ తటాకసారణీ
సలిలము వాఁటి పండిన యజాంగల సీమము లెన్నియన్నిటం
దలమగు శీతు పేర్మి గరుదాల్చిన భావము ప్రస్ఫుటంబుగన్'' 4-20.

చెరువులనుంచి వచ్చే నీటి కాల్వల ఆధారంగా పండే వరిచేలున్నాయి ఆ చేలలో ధాన్యపు వెన్నులమీది నూగుతో నేల - హేమంతంలోని అధికమైన చలి కారణంగా రోమాంచం దాల్చినట్లుందని కవి వర్ణించినాడు. పండిన ధాన్యపు వెన్నులకు నూగు పట్టడం ప్రకృతి సహజం దీన్నే శ్రీనాథుడు చలి వల్ల నేలతల్లి శరీరం గగుర్పొడించిందని చెప్పడం ప్రకృతి సూక్ష్మపరిశీలనకు చక్కని నిదర్శనం.

ఇంటి కప్పులను అంటుకొని ఉన్న ఊరు బిచ్చుకలు హేమంతపు చలికి తట్టుకోలేక కూతలు పెడుతున్నాయి. ఆ కూతలు చలే అలా గులగుల కూస్తున్నట్లున్నాయని కవి వర్ణించినాడు.

''కలవింక కలకలాకుల వలభీగర్భములు సౌధవాటములు పురం
బులయందు తుహినవేళల చలి గులగుల కూయునట్టి చందంబొందెన్" 4.21

హేమంతంలో చలి విపరీతంగా ఉంటుంది.

''చలి ప్రవేశించు నాగులచవితినాడు
మెఱయు వేసవి రథ సప్తమీ దినమున

నచ్చ శీతు ప్రవేశించు పెచ్చుపెరిగి
మార్గశిర పౌష మాసాల నడుమ''   4.25

కార్తీక శుద్ధ చతుర్థే నాగచతుర్థి. దీన్నే నాగులచవితి అంటారు. ఇది తెలుగువారికందరికీ పుణ్యదినం. ఈరోజు నాగులను పూజిస్తారు. ఈరోజే చలి ప్రవేశిస్తుంది. మాఘ శుద్ధ సప్తమే రథసప్తమి. ఈరోజుకి చలి మళ్లుతుంది, ఈ రెండు పండుగల నడుమనే మార్గశిర పౌష మాసాలుంటాయి ఈ మధ్య కాలంలోనే చలి విపరీతంగా ఉంటుంది.

మకర సంక్రాంతి సాధారణంగా పుష్యమాసం మధ్యలో వస్తుంది. ఈ పండుగనాడు తెలుగునాట పల్లెల్లో కనిపించే చలికి సంబంధించిన వినోదాలను శ్రీనాథుడు రమ్యంగా వర్ణించినాడు.

''ఇండ్ల మొదలను నీరెండ నీడికలను
ననుగు తమ్ముడు నన్నయు నాటలాడు
నత్తయును కోడలును గుమ్ములాడు కుమ్ము
గాచు చోటికి మకర సంక్రాంతి వేళ''   4.27.

విత్తనాలు చల్లిన తరువాత చేను చదునుచేయడానికి ఈడ్చే కంప ఈడిక, ఇండ్ల ముందు నీరెండలో చిన్నపిల్లలైన అన్నదమ్ములు ఈడికలతో ఆటలాడుతారు. ఇళ్లే మంట ఆరిపోయి వేడిని ఎగజిమ్మే కుమ్ము (పొట్టునిప్పు) దగ్గరికి వెళ్ళడానికి అత్తా కోడళ్లు పోట్లాడుకొంటారు.

నీరెండలో అన్నదమ్ముల ఆటలు, కుమ్ము దగ్గర అత్తా కోడళ్ళ కుమ్ములాటలు అచ్చమైన గ్రామీణ దృశ్యాలు.

కంకంటి పాపరాజు రచించిన ఉత్తర రామాయణంలో హేమంత ఋతువు వర్ణించబడింది.

''దినము ప్రాతస్స్నాన మొనరించు ద్విజులకు
నగుకర్మ లోప భయంబుకంటె
ప్రాచిపనులు సేయ లేచుకోడండ్రకొ
నత్తల వలసి భయంబుకంటె

గడుపులోదూర మేగగ నున్నచారుల
కధిపుచే నొదవు భయంబుకంటె
కర్షణంబొనరింప కడగుకాపుల కారయమి
పైరు చెడునన్ భయంబుకంటె
కడిదియయ్యెశీతు ఖగమృగపశునర
ప్రముఖ జంతువులకు భావములను
జాలమించె మిథున సంపర్క సౌఖ్యంబు
శిశిర మహిమ వినుతి సేయవశమె'' 5.282

తెల్లవారకముందే లేచి బ్రాహ్మణులు స్నానవిధులు నిర్వహించడం, కోడళ్ళు పాచిపనులు చేయడం, చారులు దూరప్రదేశాలకు వెళ్ళడం, రైతులు పొలాలకు పోవడం వారి వారి దినచర్యను సూచిస్తున్నాయి. సకాలంలో ఆయా పనులు చేయక పోవడం వల్ల కలిగే భయంకంటె చలి భయమే ఎక్కువని కవి చెప్పిన మాటలు యథార్థం. ప్రకృతియొక్క ప్రభావం ప్రజలమీద ఎలా ఉంటుందో తెలుసుకోవడానికి పై పద్యం చక్కని ఉదాహరణ.

శిశిరం :

మాఘమాసంలో చలి విపరీతంగా ఉంటుంది. ప్రాతఃకాలంలో చలి సామాన్యున్ని ఏ విధంగా ఇక్కట్ల పాలు చేస్తుందో క్రీడాభిరామకర్త ఎంతో సహజంగా వర్ణించాడు.

మొదట చలి శరీరాన్ని అటువైపూ ఇటువైపూ వంచుతుంది. పళ్ళు కొరికేటట్లు చేస్తుంది. వక్షస్థలాన్ని కుంచిస్తుంది. శరీరాన్ని గుమ్మడి కాయలాగా మూట కడుతుంది. వీపుమీదెక్కి సవారి చేస్తుంది. ఒకచోట నిలబడనీయకుండా పరుగులు తీయిస్తుంది. అదేపనిగా ఆట పట్టిస్తుంది.

''ప్రక్కలు వంచివంచిమొని పండ్లును పండ్లును రాచిరాచిజా
మ్మక్కిలజేసిచేసి తలయల్లన కాళ్ళకు నందియందిలో
చక్కికి నొక్కినొక్కి యిరుచంబడ గుమ్మడి మూటగట్టి వీ
పెక్కి ధువాళిజేసి చలియిక్కడ నక్కడ బెట్టువేకువన్'' ప.45

ఈ పద్యంలోని క్రియాపదాలు ఆమ్రేడితం కావడంవల్ల చలి పెట్టే బాధలను రెట్టింపు చేసుకోవాలి.

చలి పులిలాగా విజృంభిస్తుంటే రైతు తాను ఉపయోగించుకోవాలనుకొన్న పచ్చడాన్ని పసరం కోసం అమ్ముకొన్నాడనీ, దానికి కారణం అతని ఇల్లాలి పాలిండ్లు పొగలేని పొయ్యిండ్లు కావడమేననీ క్రీడాభిరామకర్త వర్ణించినాడు. కాని, ఇందలి చమత్కారం హాలుని గాథా సప్తశతినుంచి గ్రహించినట్టిదే.

"మాఘమాసంబు పులివలె మలయుచుండ
పచ్చడంబమ్ము కొన్నాడు పసరమునకు
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికి నొఱగోయకేలుండు సైరికుండు" ప. 262

కళాపూర్ణోదయాన్ని బట్టి తద్రచనా కాలంలో ప్రజలు చలి నుంచి తప్పించుకోవడానికి జమిలిపోగుతో నేసిన దుప్పట్లు కప్పుకొనేవారని తెలుస్తుంది. ఇంకా వారు చిత్రవర్ణ వస్త్రాలు ధరించినట్లు, దోమతెర మంచాలపై పరుండినట్లు, కుంపట్లు మండించి చలికాచుకొన్నట్లు చెప్పబడింది.[1]

వసంతం:

నన్నెచోడుడు కుమార సంభవంలో వసంత ఋతుపును వర్ణించినాడు. ఈ సందర్భంలో అతడు మన్మథుని పుష్పరథం నెపంతో తన కాలంలో వాడుకలో ఉన్న బండినీ, దాని భాగాలనూ చక్కగా తెలిపినాడు.

"పంకరుహంబులు బండికన్నులు, చంపకంబులు నొగ,లుత్పలంబులిరుసు
గరవీరములు పలుగాడి, జాదులు సనుగొయ్యఁ లశోకముల్ గోడిపీట
సిందువారంబులు సీలలు, కేతకుల్ మెట్టులు, మొల్లలు మెట్లగుదెలు
పొగడలుపలుపులు, పున్నాగములు పగ్గములు, సహకారముల్ పూనుగాడి
కురవకానీక మాలంపుకోల, కైరవములు మునుకోల, కోకముల్వాహనములు
గావసంతుడు సూతుడై పూవుదేరనెరయ కుసుమాయుధంబులు నీని తెచ్చె"
4.83

1. కళాపూర్ణోదయం, 7.185

ఈ పద్యంలో పేర్కొనబడిన బండి యొక్క భాగాలు ఇవి :

1. బండి చక్రాలు 2. నొగలు 3. ఇరుసు 4. పలుగాడులు 5. నొగతో చేర్చి బిగించే కొయ్యలు 6. కాడిపీట - నొగ క్రింద ఎత్తుగా ఉంచే మోపుడు కొయ్య 7. సీలలు 8. తొక్కుడు పలకలు 9. మెట్లను కదలకుండా నిలబెట్టే కొయ్యలు 10. పలుపుదాళ్ళు 11. పగ్గాలు 12. కాడి 13. పోటుకర్ర 14. ముసుకోల - కొరడా 15. వాహనాలు.

కవి బండిలోని ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క జాతిపుష్పంగాచెప్పి బండిని పుష్పరథంగా మార్చినాడు.

నేటికీ గ్రామాల్లో ఇలాంటిబండ్లే కనిపించడం విశేషం.

సూర్యోదయం :

సాము గరడీల ప్రస్తావన ఆముక్తమాల్యద, మనుచరిత్ర మొదలైన కావ్యాల్లో కనిపిస్తుంది. రాయల కాలంలో వ్యాయామశాలల్లో ఎర్రని ఇసుకను కానీ, మట్టిని కానీ పోసేవారు. జెట్టీల గరడి సాధనాలకు రెండు వైపుల పెద్ద పెద్ద ఇనుప గుండ్లుండేవి. మనుచరిత్రలోని సూర్యోదయవర్ణనలో సాము గరిడీలు పేర్కొనబడ్డాయి

"ఉరు సంధ్యాతపశోణమృత్కలితమై యొప్పారు బ్రహ్మాండ మ
న్గరడిన్ కాలపు హొంతకాడు చరమాగ స్కంధమున్ జేర్చి ని
బ్బరపున్ సంగడమోయనన్ శశిడిగెన్ ప్రాగ్భూమిభృత్కైత వే
తర బాహాగ్రపు సంగడంబనగ మార్తాండుండు తోచెన్ దివిన్" 3.59

బ్రహ్మాండం వ్యాయామశాల. సంధ్యారాగం ఎర్రని ఇసుకలేదా మట్టి. కాలం జెట్టి. ఉదయ పశ్చిమాద్రులు మూపులు. జెట్టిచేతిలోని గరడి సాధనానికి ఇరువైపులున్న ఇనుప గుండ్లు ఒకటి అస్తమిస్తున్న చంద్రుడు, రెండు ఉదయిస్తున్న సూర్యుడు.

ప్రభావతీ ప్రద్యుమ్నంలోని సూర్యోదయ వర్ణనలో భర్తలచేత అవమానించబడ్డ స్త్రీలు ఆ నాటి ఆచారం ప్రకారం ఏమీ దోషం చేయలేదని నిరూపించడానికి కాల్చిన ఇనుప కడ్డీని పట్టుకొనేవిషయం ప్రస్తావించబడింది.

"ఏగలలోన నొండెరుగ నీవె విభుండవు సందియంబునా
పైగలదేని చూడుమని ప్రాగ్దిశ గౌతమదారజారునిన్
తాగడునమ్మ జేయుటకు త్రాగగ నెత్తెడునట్టి యెఱ్ఱగా
కాగిన మడ్డు చందమెసగం గనుపట్టెనినుండు నుష్ణతన్'' 4.60

తూర్పు దిక్పతి ఇంద్రుడే తన భర్త అని నిరూపించదలచి మ్రింగ డానికి చేతులతో పైకెత్తిన ఎర్రగా కాల్చబడ్డ ఇనుప గుండులాగా సూర్యుడుద యించాడని భావం.

రాజశేఖర చరిత్రలో ఉదయరాగం తాంబూలం వేసుకొని ఉమిసిన రసంతో పోల్చబడింది.

"....ప్రాచియుమిసిన తాంబూల రసమనంగ
నుదయ రాగంబు మెల్లన నుప్పతిల్లె'' 3.152

ఈనాడు పెళ్ళికిరమ్మని శుభలేఖలు పంపుతాము. ఐతే అక్షంతలు చేతిలో పెట్టి పెళ్ళికి ఆహ్వానించే ఆచారం రాజశేఖర చరిత్రలో చెప్పబడింది.

''తనదు మనుమని పెండ్లికెంతయును వేడ్క
సఖిల దిఙ్నాగ పతుల రమ్మనుచు శోభ
నాక్షతంబులు వెట్టిన యట్టి కరణి
కమలబాంధవ దీప్తి నల్గడల నెఱసె" 3.153

పెళ్ళికి రమ్మని దిక్పాలురకు అందించిన అక్షంతల్లాగా ప్రొద్దుటిపూట సూర్యునికాంతి నాల్గుదిక్కుల వ్యాపించిందని భావం.

సూర్యాస్తమయం :

రజస్వలవల్ల అంటుకొన్న దోషం పోవడానికి ఆచరించే స్నానాది కృత్యాలు కుమారసంభవ కావ్యంలోని సూర్యాస్తమయ వర్ణనలో ప్రస్తావించ బడ్డాయి.

"పోంక నలినీ రజస్వల సోంకిన దోషంబు వాయసూర్యుడు కలితా
శంక నపరాంబునిధిలో గ్రుంకెనోకోయనగ ప్రొద్దుగ్రుంకుడునంతన్" 8.88

తన ప్రియురాలైనకమలం రజస్వలకాగా, ఆమెవల్ల అంటుకొన్న దోషం పోవడానికి పడమటి సముద్రంలో క్రుంకినాడా అన్నట్లు సూర్యుడస్తమించాడని భావం.

కళాపూర్ణోదయంలోని సూర్యాస్తమయ వర్ణనలో వ్యావసాయిక వృత్తి విశేషాలు పేర్కొనబడ్డాయి.

"కాలకృషీవలుండు గడకంబరిణత్యరుణాతపచ్ఛటా
శాలిచయంబుగోసి పెలుచంబన మోయుచున్న వాడుకా
బోలును కుప్పగానన నభోమణి మండల మంతకంతకుం
జాల విశాలమై చరమశైలము చేర్పున నొప్పెచూడ్కికిన్" 8.8

రైతులు వరిపైరుకొని ఓదెగావేసి, ఎండిన తరువాత దాన్ని కుప్పలు కొట్టడానికి అనువుగా మోపులు కడతారు. దీన్నే 'పనకట్టడం' అంటారు. పై పద్యంలో అస్తమిస్తున్న సూర్యుడు ఎండిన వరిని మోపులు కట్టి తీసుకొని పోయే కృషీవలునితో పోల్చబడ్డ తీరును పరిశీలిస్తే పింగళిసూరన మంచి సేద్య మెరిగిన దేశికవి అనిపిస్తుంది.

చంద్రభాను చరిత్రలోని సూర్యాస్తమయ వర్ణనలో వేట ప్రస్తావించ బడింది.

"జలరాశియనెడు బోయలతలదొర చరమాద్రిపేరితడికమరువునన్
నిలిచి కిరణంపుటురి కోలల దిగిచె పతంగ మండలం బవ్వేళన్" 5.88

సముద్రుడనే బోయదొర పడమటికొండ అనే తడకదాపున నిలబడి కిరణాలనే ఉరికోలలను పన్నినాడా అన్నట్లు అస్తమిస్తున్న సూర్యుని కిరణాలున్నాయని భావం. బోయలు పిట్టలు మొదలైన వాటిని పట్టుకోవడం కోసం ఉరి కోలలు పన్నడం లోక సాధారణమైన విషయం.

యయాతి చరిత్రలోని సూర్యాస్తమయ వర్ణనలో కమ్మరం పని ప్రస్తావించబడింది.

''పరగ మిన్నను కమ్మరి సంజకొలిమి
బెట్టుగాకాల్చి బంగారు చుట్టువాలు
పదును పెట్టంగ గొనిపోయి పట్టలేక
విడిచెనన ప్రొద్దు పడమటి కడలిమునిగె'' 2.67

ఆకాశం అనే కమ్మరీడు సంధ్య అనే కొలిమిలో బంగారుచక్రాన్ని కాల్చి పదును పెట్టడానికి తీసుకొనిపోతూ మధ్యన పట్టుకోలేక విడిచి పెట్టాడా అన్నట్లు సూర్యుడు పడమటి సముద్రంలో మునిగాడని భావం.

చం ద్రో ద యం :

ద్విపద పరమయోగి విలాసంలోని చంద్రోదయ వర్ణనలో దువ్వెనలు ప్రస్తావించబడ్డాయి. తూర్పు దిక్సతి ముఖాన్ని ఆవరించిన చీకట్లలాంటి ముంగురులను పక్కకు తొలగించడానికి దువ్వెనలాగా ఉదయిస్తున్న చంద్రుడున్నాడని కవి వర్ణించినాడు.[1]

మనుచరిత్రలోని చంద్రోదయ వర్ణనలో నిధులు సంగ్రహించే విధానం చెప్పబడింది. మొదట నిధులున్నాయని గుర్తించడానికి అంజనం వేస్తారు.కళ్లకు కాటుక పెట్టుకొని వెదుకుతారు. నిధులను పిశాచాలంటి పెట్టుకొని ఉంటాయనే విశ్వాసంతో వాటికి జంతువులను బలి ఇస్తారు. బలి పశువు రక్తంతో అన్నాన్ని కలిపి చల్లుతారు. ఆ తరువాత నిధులను స్వాధీనం చేసుకొంటారు. ఇదీ పెద్దన కాలంలో నిధులు సంగ్రహించే పద్ధతి.

''మరున కొసంగ కాలము తమశ్చట కాటుకగానవోదయ
స్ఫురదరుణ ప్రభాపథిక శోణిత సిక్తసితోడు భక్తమున్
హరిహయదిఙ్నభ స్థలమునన్ బలిచల్లి వటాంకమున్ వసూ
త్కరభరితంబునై వెలుగగాంచి సుధా నిధినెత్తెనత్తఱిన్'' 3.21

కాల పురుషుడు చీకటిని కాటుకగా పెట్టుకొని, ఎర్రని కాంతి అనే రక్తంతో తడిపిన చుక్కల అన్నపు మెతుకులను తూర్పుదిక్కున బలిగాచల్లి, మర్రిచెట్టు గుర్తుగా కల్గిన చంద్రుడనే నిధిని మన్మధునికివ్వడానికి త్రవ్వి పైకెత్తినట్లు చంద్రోదయమైందని భావం.

పారిజాతాపహరణంలో ఉదయించిన చంద్రుడు అరటి గెలతో పోల్చబడ్డాడు.

''పొందుగ పశ్చిమాబ్ధి తటభూస్థలి నంశుపదంశు మత్పలా
కందము వాసరాంత హలిక ప్రవరుండిడ సాంధ్యవారిభృ
త్కందళముల్లమోదళ యుతంబులునై గెల పండిప్రాలెపూ
ర్ణేందుని పేర ప్రాచినది హేతువు వెన్నెల కల్మికల్మికిన్'' 2.42

---

1. ద్విపదపరమయోగి విలాసం, 3.2

సాయంత్రం అనే వ్యవసాయదారుడు పడమటి దిశ అనే పొలంలో సూర్యుడనే అరటి దుంపను నాటాడు. అది ఎదిగి గెలవేసి తూర్పుదిక్కుగా వాలింది. చంద్రుడే ఆ గెల.

చంద్రోదయ వర్ణనలో మరోచోట ముక్కు తిమ్మన బువ్వంబంతిని పేర్కొన్నాడు. పెళ్ళిరోజు కులం వారంతా కలిసి భోజనం చేయడమే బువ్వం బంతి. చకోరాలు మన్మధుని పేర పండుగ చేస్తూ వెన్నెలతో బువ్వంబంతి విందు జరిపాయి.

"చిగురు విలుకాని జాతర సేయబూని
కొలము సాముల నందరకూడబెట్టి
వంతు కలయంగ బువ్వంపు బంతివిందు
పెట్టిరెలమి చకోరపు పేరటాండ్రు" 2.49

పండుగను పెళ్ళితోను, చకోరాలను పేరటాళ్ళతోను, వెన్నెలను బువ్వం బంతితోను పోల్చిన తీరు ఔచితీవంతంగా ఉంది. వసుచరిత్రలో భట్టుమూర్తి చంద్రోదయ వర్ణన చేస్తూ తన కాలంనాటి నాటక రంగాన్ని సాక్షాత్కరింప జేశాడు.

"హరిదంభోరుహ లోచనల్ గగనరంగాభోగ రంగత్తమో
భరనేపథ్యము నొయ్యనొయ్య సడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్ నిటలమున్ వక్త్రంబునుం దోచెనా
హరిణాంకాకృతి వొల్చెరేకయి సగంబైబింబమై తూర్పునన్". 4.17

దిక్కులనే కన్యలు ఆకాశమనే రంగస్థలంలో చీకటి తెరను తొలగించి నప్పుడు క్రమంగా రాత్రి అనే నటియొక్క మౌక్తికపట్టం, నుదురుభాగం, ముఖం కనిపించినట్లే, తూర్పుదిక్కున చంద్రుడు రేకై, సగమై, పూర్ణబింబమై కనిపించాడని భావం. ఇందులో చంద్రుడు రాత్రి అనే నటికి ముఖంగా ఉత్ప్రేక్షించబడ్డాడు.

పూర్వం నాటకశాలల్లో తెరలుండేవి. తోలు బొమ్మల ఆటల్లోనూ వీటిని చూస్తాము. ఐతే ఈ తెరలు ఈ కాలంలోలాగా పైకిగాని. ప్రక్కలకుగాని తొల

గించబడేవి కావు. రంగస్థలంమీద నటీనటులు ప్రవేశించడానికి ముందు పై నుంచి క్రిందికి మెల్లగా దించబడేవి. భట్టుమూర్తి వర్ణన సహజ సుందరంగా ఉండి 16 శతాబ్దంనాటి నాటక రంగానికి సంబంధించిన అవనికా స్వరూపాన్ని తెలియజేస్తున్నది.

పైరు కోతకు వచ్చిన దశలో గ్రామీణులు మేకనో, గొర్రెనో బలి ఇవ్వడం ఆచారం కళాపూర్ణోదయంలోని చంద్రోదయ వర్ణనలో ఈ ఆచారం సూచించబడింది.

"నింగియనియెడు ప్రత్తిచేనికిని రక్త
బలయిడిరనంగ నెఱసంజ తొలుతనమర
తరుచుగా దానవిఁసిన మెఱుగుప్రత్తి
విళ్లనా చుక్కలెంతయు విల్లసిల్లె" 8 12

ఆకాశమనే ప్రత్తిపంటకు రక్తంతో బలి ఇచ్చినట్లు ఎర్రని సంధ్య ఏర్పడింది. ఆ తరువాత విచ్చుకొన్న ప్రత్తివిళ్ళలాగా చుక్కలు మెరిశాయని భావం 'ప్రత్తిచేనికి రక్తబలి' అనడంవల్ల తప్పనిసరి ఆ పంటకు బలి ఇచ్చే ఆచారం సూరన కాలంలో ఉన్నట్లు ఊహించవచ్చు.

తెలంగాణా ప్రాంతంలో ఈ నాటికీ పంటకోసిన తరువాత పొలంలోనే బలి ఇచ్చే సంప్రదాయం ఉంది. దీన్ని 'కందూరు' అని పిలుస్తారు.

సూరన వ్యవసాయంతోపాటు చేనేత వృత్తిని చంద్రోదయ వర్ణనలో ప్రస్తావించినాడు.

"కాలమను కువిందుడు చంద్రికాపటంబు
నేయబన్నిన మగ్గమొకో యనంగ
నవమయూఖాళి కొనసాగి మివులనొప్పె
విధుడమెర వాని గృహభిత్తి వివరమనగ" 8.15

కాలమనే కువిందుడు (పద్మశాలి) వెన్నెల వస్త్రాన్ని నేయడానికి తయారుచేసిన మగ్గమా అన్నట్లు చంద్ర కిరణాలు వ్యాపించాయనీ, చంద్రుడేమో అతని ఇంటి గోడకు గవాక్షంలాగా ఉన్నాడనీ భావం.

యయాతి చరిత్రలోని చంద్రోదయ వర్ణనలో భూతవైద్యం పేర్కొన బడింది.

''ఆతరి వెన్నెల దగురుజ్జాతా జాబిల్లి వెజ్జు జనములకెల్లన్
రాతిరి సోకిన చీకటి బూతము విడువంగ చల్లు బూతియ బోలెన్''
2.80

ప్రజలకు రాత్రిపూట సోకిన చీకటి బూతాన్ని పారద్రోలడానికి చంద్రుడనే బూతవైద్యుడు చల్లిన విబూదిలాగా వెన్నెల ఉందని భావం. పారిజాతాపహరణంలోలాగా యయాతి చరిత్రలోనూ చంద్రోదయ వర్ణనలో బువ్వంబంతి పేర్కొనబడింది.[1]

చంద్రాస్తమయం :

కళాపూర్ణోదయంలోని చంద్రాస్తమయ వర్ణనలో 'సిడి' అనే ఆచారం ప్రస్తావించబడింది.

"సమకాంతి చదల దోచని నీలిగవిసెన
సిడిమ్రాకు తుదనిడ్డ పడగవిధుడు
వలసినప్పుడు దాని వ్రాల్చుటకైకట్టి
నట్టి పగ్గములు దీర్ఘాంశులతలు
రతిరాజు సిరిహెచ్చ రజనికాళికి సిడి
యాడు కోకిల భటుడంక శోభ
యతనిమీద వసంతమాడు కప్రపుధూళి
చంద్రిక విరులు నక్షత్ర సమితి
యా రజనికాళి యెందేని నరుగదలచు
టెరిగి వ్రాల్పించు చున్నవాడేమొ! యిప్పు
డతడు తలసిడి కొమ్ము నానంతకంత
కోలి చంద్రుడు పడమట వ్రాలజొచ్చె" 8.24

'సిడి' ఆటలో మ్రాను ముఖ్యమైంది. గ్రామ దేవతల జాతరలో జంతువును బలి ఇవ్వడానికి ఏతాం దూలంలాగా ఏటవాలుగా పైకెత్తిన పొడవైన

1. యయాతిచరిత్ర, 2.83

స్తంభం సిడిమ్రాను. దీని కొనకు ఇనుప గాలంలాంటి కొక్కాని గాని, లేదా గంపను గాని వ్రేలాడదీస్తారు. బలి పశువు వెన్ను భాగాన్ని ఆకొక్కెకి గ్రుచ్చి గానీ లేదా బలిపశువును గంపలో కూర్చుండబెట్టి గానీ సిడి ఆడుతారు. ఈ విషయం అస్తమిస్తున్న చంద్రునిపరంగా చెప్పబడింది.

ఆకాశం నీలిమ గవిసెన కప్పినట్లుంది. సిడిమ్రానుకు చివర కట్టిన గంపలో చంద్రుడున్నాడు. సిడిమ్రానును వంచడానికి కట్టిన పగ్గాల్లాగా అతని కిరణాలున్నాయి. మన్మథుని ఐశ్వర్యాభివృద్ధికై రాత్రి అనే కాళికాదేవికి కోకిల సిడి ఆడే భటుడు. మీద జల్లే కప్పురపు పొడి వెన్నెలలాగా ఉంది. పూలేమో నక్షత్రాల్లాగా ఉన్నాయి. రాత్రి అనే కాళి వెళ్ళిపోకముందే సిడిమ్రానును కోకిల భటుడు వాలుస్తున్నాడా అన్నట్లు క్రమంగా చంద్రుడు పడమటికి వాలిపోయాడని భావం.

పైరు పక్వానికి వచ్చిన తరవాత రైతులు మడిలో నీరారబెట్టి, పంటను కోసి కుప్పగొట్టి, ధాన్యాన్ని చేటలతో తూర్పారబడుతారు. అలా తూర్పారబట్టి నప్పుడు వీచే గాలితోపాటు పొల్లు పడమటికిపోతుంది. ప్రకృతి సహజమైన ఈ విషయాన్ని భట్టుమూర్తి తన వసుచరిత్రలోని చంద్రాస్తమయ వర్ణనలో ఎంతో చక్కగా మేళవించాడు.

"తారాసస్యము పండినన్ గగన కేదారంబునన్ చంద్రికా
నీరం బారగ గోసి తద్రుచి ఫలానీకంబు ప్రాతర్మహా
సీరి గ్రామణి తూరుపెత్తెనన తోచెందూర్పునం దెల్పు త
ద్దూరన్య స్త పలాల రాశిక్రియ నిందుండేగె నిస్సారుడై" 4.130.

సూర్యుడనే హాలికుడు ఆకాశమనే వరిమడిలో వెన్నెల అనే నీరారబెట్టి నక్షత్రాల పంటను కోసి కుప్ప గొట్టి ఆ తరవాత ధాన్యాన్ని తూర్పార బడుతున్నాడా అన్నట్లు తూర్పు తెల్లవారింది. అప్పుడు పడమటికి విసరగొట్టబడ్డ పొల్లులాగా చంద్రుడు కాంతిని కోల్పోయి కనిపిస్తున్నాడని భావం.

తాత్పర్యం ఏమంటే కొద్ది సేపట్లో సూర్యోదయం అవుతుందని.

# ముగింపు

ఈ సిద్ధాంత గ్రంథంలో కుమార సంభవం మొదలుకొని కూచిమంచి తిమ్మకవి సిలాసుందరి పరిణయం దాకా గ్రామీణ జీవితం ప్రతిఫలించిన కావ్యాలను పరిశీలించాను. ఆంధ్ర మహాభారతంనుంచి అవసరమనుకొన్న చోట ఆయా అంశాలను స్వీకరించాను.

నన్నెచోడుని కుమారసంభవంలో వసంతోత్సవాలు సహజసుందరంగా వర్ణించబడ్డాయి. వసంతాలు ఆడేటప్పటి స్త్రీల ఆకార చేష్టలను ఆ రాజకవి ప్రత్యక్షం చేసినాడు. హోళీని నన్నెచోడునివలె రమ్యంగా చిత్రించిన ప్రాచీన కవులు లేరు. తన కాలంలో ప్రచారంలో ఉన్న పాటలనూ, బాలబాలికల ఆటలనూ, ప్రజల జీవ భత్యాలనూ, శిక్షావిధానాలనూ నన్నెచోడుడు గ్రంథస్థం చేసినాడు.

పాల్కురికి సోమనాథుడు తన కావ్యాల్లో సమకాలీన సమాజంలోని ప్రజల కుల మత భక్తి విశ్వాసాలనూ, వ్రతాలనూ, ఆటపాటలనూ, యాత్రా విశేషాలనూ వర్ణించినాడు. బసవ పురాణంలో గోపాలుని రూపు రేఖలను సహజ సుందరంగా వర్ణించి రూప చిత్రణలో తన సామర్థ్యాన్ని నిరూపించు కొన్నాడు. బెజ్జమహాదేవి, గొడగూచి కథల ద్వారా కవి మానవ స్వభావాన్ని ఆవిష్కరించిన తీరు అద్భుతం.

గ్రామీణ జీవన చిత్రణలో ఎఱ్ఱాప్రెగడ స్థానం నిరుపమానమైంది. హరి వంశ కావ్యంలో అతడు చిత్రించిన గొల్లపల్లె గ్రామీణ సౌందర్యానికి అద్దం-పట్టింది. జానపదులకు వ్యవసాయమే దైవమనీ, ప్రాణప్రదమనీ ఎఱ్ఱన నిరూపించినాడు. వ్రేపల్లెనుంచి బృందావనానికి ప్రజలు వలసవెళ్ళిన సందర్భంలోని ప్రయాణ విశేషాలు సహజ సుందరమై ప్రబంధ పరమేశ్వరుని లోకజ్ఞతను చాటుతున్నాయి.

రూప చిత్రణలో శ్రీనాథుని క్రీడాభిరామానిదే అగ్రతాంబూలం. బ్రాహ్మణులు, బవనీలు, కాపుటాస్లు మొదలైన వారి రూపురేఖలను ఇందుకు ఉదాహరణగా చూపవచ్చు. క్రీడాభిరామం ఏకశిలానగర విశేషాలతోపాటు

కాకతీయుల నాటి ప్రజాజీవితాన్ని చాలావరకు ప్రతిబింబించింది. ఈ కావ్యం లోని కోడి పందాలు, పాములాటలు మన నాకర్షిస్తాయి. మైలసంతలు అంగళ్ళనూ, పూటకూటి ఇండ్లు హోటళ్ళనూ గుర్తుకుతెస్తాయి. మైలారుభటుల ఆగడాలు గగుర్పాటు కలిగిస్తాయి. ఏకవీరాదేవి పూజలు, పరశురాముని మీది పాటలు భక్తిభావాన్ని పెంపొందిస్తాయి శీతాకాలభోజనాలు చవులూరిస్తాయి. శకునాలు అబ్బురపరుస్తాయి. ఇట్లే పండుగల సందర్భాల్లో గ్రామాన్ని అలంకరించే పద్ధతులు మన సంస్కృతీ సంప్రదాయాలకు సంకేతాలుగా కనిపిస్తాయి.

పల్నాటి వీరచరిత్రలో స్త్రీ పురుషులు ధరించే ఆభరణాలు, పెళ్ళి ఆచారాలు, సంతానం కోసం స్త్రీలు ఆచరించే నోములు, దేవతలకు అర్పించే బలులు మొదలైన వాటితోపాటు ప్రజలజీతభత్యాలు పేర్కొనబడ్డాయి. బొంగరాల ఆటను ప్రముఖంగా చిత్రించిన కావ్యం ప్రాచీన సాహిత్యంలో ఒక పల్నాటి వీరచరిత్ర మాత్రమే. ఇట్లే శ్రీనాథుని కాశీఖండం, శివరాత్రి మాహాత్మ్యం మొదలైన కావ్యాల్లోని ఋతువర్ణనల్లో ప్రజల వ్యావసాయిక జీవనం ప్రతిబింబించింది.

కొఱవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశికలో పేదల పాలిటి అమృతంతో సమానమైన అంబలినీ, సాధారణంగా ఆహారంలో చోటుచేసుకొనే చింతపండునూ ప్రస్తావించినాడు. పాల్కురికి సోమనాథుడు వెన్నెల పదాలను పేర్కొంటే, గోపరాజు వెన్నెల గుడి పాటలు పేర్కొన్నాడు. శకునాలను ప్రస్తావించిన కావ్యాల్లో క్రీడాభిరామం తరువాత సింహాసనద్వాత్రింశికనే ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఇందులో పురోహితుల కడగళ్ళను ప్రతిబింబించిన పద్యాలు శ్రీనాథుని చాటువులను తలపిస్తాయి.

తాళ్ళపాక తిమ్మక్క రచించిన సుభద్రా కళ్యాణం ప్రజలు పాడుకొనే ద్విపదరచన. ఇందులో చెప్పబడిన సుభద్రార్జునుల పెళ్ళి వేడుకలు అచ్చంగా తెలుగుహారివే. జాతరకు వెళ్ళేటప్పుడు గ్రామీణులు తమవెంట తీసుకొనివెళ్ళే ఆహార పదార్థాలను తిమ్మక్కవలె వర్ణించినవారు ప్రాచీన సాహిత్యంలో లేరు. ముక్కెరను ముద్దుముద్దుగా వర్ణించిన ప్రథమాంధ్ర కవయిత్రి తిమ్మక్క.

తిరువేంగళనాథుని ద్విపద పరమయోగి విలాసం వైష్ణవుల రూపచిత్రణకు పెట్టింది పేరు. 15వ శతాబ్దం నాటి న్యాయ వ్యవస్థ తీరుతెన్నులనూ, క్రయవిక్రయ పద్ధతులనూ, వ్యవసాయాది వృత్తులనూ ఈ కావ్యం ప్రతిబింబిస్తుంది.

గ్రామీణ జీవన చిత్రణలో రాయలకు గల స్థానం విశిష్టమైంది. ముఖ్యంగా అతని ప్రకృతి పరిశీలన పాటవం అద్వితీయమైంది. ప్రకృతిని మానవీకరణం చేయడంలో అతని కతడే సాటి. ఋతువులను వర్ణించే సందర్భంలో పల్లె జీవితాన్ని లెస్సగా ప్రతిబింబించిన కావ్యం ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఒక్క ఆముక్తమాల్యదే అంటే అతిశయోక్తి కాదు. ఆముక్తమాల్యదలోని విలుపుత్తూరు వర్ణనను చదువుతుంటే మనం నగరంలోకాకుండా గ్రామంలో ఉన్న అనుభూతిని పొందుతాము. ఇంకా రాయలు అతిథి మర్యాదలూ, ఆహార పానీయాలూ, వస్త్రధారణ, గృహాలంకారాలూ, పెళ్ళి ఆచారాలూ, వ్యావసాయిక వృత్తి విశేషాలూ, ప్రత్యేకించి విష్ణుచిత్తుని దారిబత్తెం 15వ శతాబ్ది లోని ప్రజాజీవితాన్ని తెలియజేస్తున్నాయి. కవి విష్ణుభక్తుడైన మాల దాసరి రూపురేఖలను వర్ణించిన తీరు సహజసుందరమైంది.

మనుచరిత్రలో పెద్దన అతిథి పూజకు పెద్ద పీట వేసినాడు. సిద్ధుని రూపచిత్రణ ఆ కాలంనాటి సన్యాసుల వేషధారణను సూచిస్తుంది. మను చరిత్రలోని సూర్యోదయ వర్ణనలో ఆ కాలంనాటి వ్యాయామశాలలు పేర్కొనబడ్డాయి. చంద్రోదయ వర్ణనలో బలులొసగి నిధులను స్వాధీనం చేసుకొనే విధానం సూచించబడింది.

శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో ఆటవికుల జీవితం సర్వసమగ్రంగా చిత్రించబడింది. ఈ కావ్యంలో చెంచుల ఆహారపు అలవాట్లు, ఆచారవ్యవహారాలు, వైద్యం, వేట మొదలైన అంశాలను సహజంగా వర్ణించడంలో ధూర్జటి సాటిలేని నైపుణ్యాన్ని ప్రదర్శించినాడు. పంట పొలాల్లో కాపలా పెట్టే దిష్టి బొమ్మలను గూర్చి, పక్షులను పారద్రోలడానికి మంచెల పైకెక్కి ఒడిసెళ్ళతో రాళ్ళు రువ్వే చెంచు కన్యలను గూర్చి కవి చేసిన వర్ణన హృద్యమైంది. తిన్నడు శివుడే సర్వస్వమని, ఉడుమూరుకు వెళ్ళక అడవిలో ఉండిపోయినప్పుడు అతని

స్నేహితులు అనుభవించిన ఆవేదనను వర్ణించినతీరు కరుణరసభరితమై మానవ మనస్తత్వాన్ని చిత్రించడంలో ధూర్జటికి గల నేర్పును తెలియజేస్తుంది.

సూరన కళాపూర్ణోదయంలోని సుగాత్రీ శాలీనులకథ పూర్తిగా గ్రామీణ వాతావరణంలో చిత్రించబడింది. ఈ కథ జానపదుల స్వభావానికీ, కాయ కష్టానికీ, నిరాడంబర జీవనానికీ అద్దం పట్టింది. ప్రబంధాల్లో ఇలాంటి కథ ఉండడం విశేషం. ఇట్లే ప్రభావతీప్రద్యుమ్నంలోని సూర్యోదయ వర్ణనలో ప్రజల విశ్వాసాలు సూచించబడ్డాయి.

పాండురంగ మాహాత్మ్యంలోని నిగమశర్మ సుశీలల కథలు మానవ స్వభావాన్ని నిరూపిస్తూ మంచిని ఉపదేశిస్తున్నాయి. ఈ కావ్యంలో నిగమశర్మ ధూర్తత్వానికీ, సుశీల అతిధి మర్యాదలకూ, నిగమశర్మ అక్క పుట్టింటిపై ఆడబడుచులకుండే ప్రేమాభిమానాలకూ ప్రతినిధులుగా కనిపిస్తారు.

ఇట్లే ఇతరప్రబంధాల్లో-ముఖ్యంగా పారిజాతాపహరణంలో ఆభరణాలు, రాజశేఖర చరిత్రలో పెళ్ళి ఆచారాలు, వసుచరిత్రలో స్త్రీల పాటలూ పేర్కొన బడ్డాయి. భట్టుమూర్తి వసుచరిత్రలో చేసిన చంద్రోదయ వర్ణనునుబట్టి నాటి నాటక ప్రదర్శనల్లోని తెరదించే విధానం తెలుస్తుంది.

శుకసప్తతిలో ప్రజా జీవితానికి సంబంధించిన అన్ని అంశాలు లభిస్తాయి. ఆయా వృత్తులు చేసుకొని జీవించేవారి రూపురేఖలనూ, మనస్తత్వాలనూ, విశ్వాసాలనూ, ఆచారవ్యవహారాలనూ, ఈ కావ్యం సమగ్రంగా ప్రతిబింబిస్తుంది. 16 వ శతాబ్దంలోని ప్రజల పెళ్ళి వేడుకలు, పండుగలు, జాతరలు, గృహాలంకార పద్ధతులు తెలుసుకోవాలంటే శుకసప్తతి మనకు ఆధార గ్రంథంగా తోడ్పడుతుంది. ప్రత్యేకించి సంక్రాంతి పండుగనూ, గంగమ్మ జాతరనూ కదిరీపతి వర్ణించినతీరు ప్రశంసనీయమైంది.

యయాతి చరిత్రలో చిన్న పిల్లల ఆటలూ, పెళ్ళి వేడుకలూ, విశేషించి వధువు అత్తవారింటికి వెళ్ళేటప్పటి శోక వాతావరణం సహజ రమణీయంగా చిత్రించబడ్డాయి. ఈ కావ్యంలోని యయాతీ దేవయానుల పెళ్ళి తెలుగింటిలో జరిగినట్లు భావిస్తాము.

వైజయంతీ విలాసంలో 16వ శతాబ్దంనాటి న్యాయ వ్యవస్థ ప్రతిబింబిం చింది. వైష్ణవుల రూపురేఖలను ఈ కావ్యం చక్కగా వర్ణించింది. తలారి రూప చిత్రణ ఈ కావ్యంలోని ప్రత్యేకత.

చంద్రభాను చరిత్రలోని ప్రకృతి వర్ణనలు గ్రామీణ జీవితాన్ని ప్రతి బింబిస్తున్నాయి. తిరుమల యాత్ర చేసే భక్తులను గూర్చి ఈ కావ్యంలో విశే షంగా వర్ణించబడింది. ఓలలాట ఈ కావ్యానికి అందాన్ని కూర్చింది. ఇట్లే మన్నారుదాస విలాసం నీలాసుందరి పరిణయం మొదలైన కావ్యాల్లో తెలుగు వారి ఆచార వ్యవహారాలు విశేషించి పెళ్ళి వేడుకలు సహజ మనోజ్ఞంగా చిత్రించబడ్డాయి.

హంసవింశతి శుకసప్తతి మార్గంలోనే రచించబడినప్పటికీ దానికి గ్రామీణ జీవన చిత్రణలో ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. ఆయా వ్యక్తుల రూపురేఖలు ఈ కావ్యంలో చక్కగా చిత్రించబడ్డాయి. ఆయా వృత్తులను నిర్వహించే వారి గృహాలనూ, వృత్తి సాధనాలనూ సమగ్రంగా వర్ణించిన కావ్యాల్లో హంసవింశతిదే అగ్రస్థానం. ఒక మాటలో చెప్పాలంటే హంసవింశతి 18వ శతాబ్దంలోని గ్రామీణ వ్యవస్థకు అద్దం లాంటిది.

ఈ విధంగా ప్రాచీన కావ్యాలను పరిశీలించినప్పుడు గ్రామీణ జీవన చిత్రణ చేసిన వారిలో మొత్తంమీద మనకు నన్నెచోడుడు, ఎఱ్ఱన, శ్రీనాథుడు, తిమ్మక్క, శ్రీకృష్ణదేవరాయలు, ధూర్జటి, పింగళి సూరన, తెనాలిరామ కృష్ణుడు, సారంగుతమ్మయ్య, పొన్నగంటి తెలగన్న, పాలవేకరి కదిరీపతి, నారాయణామాత్యుడు, కూచిమంచి తిమ్మకవి ప్రముఖంగా కనిపిస్తారు విశే షించి ఎఱ్ఱన, రాయలు, కదిరీపతి నారాయణామాత్యుడు పేర్కొన దగినవారు.

ఆయా శతాబ్దాలనాటి తెలుగుప్రజలసంస్కృతీ సభ్యతలకు సంబంధించిన విశేషాలను తెలుసుకోవడంలో ఈ సిద్ధాంత గ్రంథం సహృదయ పాఠకులకు ఏ మాత్రం మార్గదర్శకమైనా నా కృషి ఫలించిందనే భావిస్తాను.

# ఉపయుక్త గ్రంథసూచిక

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర - లక్ష్మీకాంతం, పింగళి.
గంగాధర పబ్లికేషన్స్, విజయవాడ - 1985

2. ఆంధ్ర సాహిత్యము - సాంఘిక జీవన ప్రతిఫలనము -
వేంకటసత్య రామారావు, నండూరి.
తెలుగు సాహితీ సమాఖ్య, తాడేపల్లిగూడెం - 1979

3. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - లక్ష్మీరంజనం &
బాలేందుశేఖరం, ఖండవల్లి.
బాలసరస్వతీ బుక్‌డిపో, కర్నూలు - 1965

4. ఆంధ్రుల జానపద విజ్ఞానం- సుందరం, ఆర్వీయస్.
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్ - 1983

5. ఆంధ్రులసంస్కృతి-చరిత్ర I & II, సత్యనారాయణ, కంభంపాటి.
(సంక్షిప్తానువాదం-మహీధర రామమోహనరావు)
హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్ - 1984

6. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - ప్రతాపరెడ్డి, సురవరం.
సురవరంప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి. హై.బా. - 1982

7. ఆటలు - పాటలు (సంకలనం) - గంగాధరం, నేదునూరి.
ప్రాచీన గ్రంథావళి, రాజమహేంద్రవరం - 1965

8. "ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము-ప్రయోగాలు"
నారాయణ రెడ్డి, సి.
ఆ. ప్ర. బుక్‌డిస్ట్రిబ్యూటర్స్ - సికింద్రాబాద్ - 1977

9. ఆరుయుగాల ఆంధ్రకవిత - హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి.
ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్ - 1986

10. ఎఱ్ఱయ్య తీర్చిన హరివంశము - గోదావరీదేవి, సంధ్యావందనం.

11. కాటమరాజు కథ - సంపా : ప్రభాకరశాస్త్రి, వేటూరి.
గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్, మద్రాసు- 1953

12. కాటమరాజుకథలు I & II సంపా : వెంకటసుబ్బారావు, తంగిరాల.
తిరుపతిరావు, చన్నాప్రగడ.
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్ - 1976-78

13. గాథాసప్తశతిలో తెలుగు పదాలు - రామచంద్ర, తిరుమల.
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ, హైదరాబాద్ - 1983

14. గ్రామీణ సామాజిక పరివర్తన - రత్నయ్య, ఇ. వి.
తెలుగు అకాడమి, హై. బా. - 1978

15. చాటుపద్య మణిమంజరి - సంపా : ప్రభాకరశాస్త్రి, వేటూరి.
ప్రభాకర పరిశోధక మండలి, ముక్త్యాల - 1952

16. జానపద కళాసంపద - దొణప్ప, తూమాటి.
నిర్మలా పబ్లికేషన్స్, విశాఖ పట్టణం - 1975

17. తాళ్ళపాకకవులపద కవితలు-భాషాప్రయోగ విశేషాలు- (ద్వి.భా.)
ఆనందమూర్తి, వేటూరి.
ప్రభాకర ప్రచురణము, హైదరాబాద్ - 1976

18. తాళ్ళపాక కవుల సాహిత్య సేవ - విద్యావతి, ఏ.

19. తెలుగు కన్నడ జానపదగేయాలు - సుందరం, ఆర్వీయస్.
జానపద విజ్ఞాన భారతి, మైసూరు - 1979

20. తెలుగు జానపద గేయ గాథలు - కృష్ణకుమారి, నాయని. 1977

21. తెలుగు జానపద గేయ సాహిత్యము - రామరాజు, బి.
జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాద్ - 1978

22. తెలుగు జానపద సాహిత్యము - పురాగాథలు -
ప్రేమలత, రావి. 1983

23. తెలుగు మెఱుగులు - ప్రభాకర శాస్త్రి, వేటూరి.
శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు - 1960

24. తెలుగులో తొలి సమాజకవులు -
సంపా : రంగనాథాచార్యులు, కె. కె.
ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్ - 1983

25. తెలుగు సాహిత్యంలో క్రీడావినోదాలు-సుబ్రహ్మణ్యం, వడ్లా.
విశ్వశ్రీ ఆర్ట్ ప్రెస్, నరసరావుపేట - 1987

26. పెళ్ళి - దాని పుట్టు పూర్వోత్తరాలు - ధర్మారావు, తాపీ. 1977

27. మీగడ తఱకలు - ప్రభాకర శాస్త్రి, వేటూరి.
శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాద్ - 1951

28. విజ్ఞాన సర్వస్వం (10 వ సంపుటం)
తెలుగు భాషాసమితి, మద్రాసు - హైదరాబాద్ - 196

29. వేటూరివారి పీఠికలు (1914 నుంచి 1950 వరకు)

30. వైకృత పద స్వరూప నిరూపణము - దొణప్ప, తూమాటి.
ఆచార్య తూమాటి దొణప్ప మూడు అరవైల పండుగ
అభినందన సమితి సమర్పణ - 1987

31. సమాజశాస్త్రం - సామాజిక మానవశాస్త్రం- ఖండికలు (4-7)
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హై.బా. - 1985

32. సింహావలోకనము - ప్రభాకర శాస్త్రి, వేటూరి.
శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాద్ - 1955

33. హిందువుల పండుగలు - ప్రతాపరెడ్డి, సురవరం.
సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి, హై.బా. - 1987

సంస్కృతం :

1. గురుబాల ప్రబోధిక
2. మార్కండేయ పురాణం
3. రఘువంశం

పత్రికలు :

1. ఆంధ్రపత్రిక (11-6-1944)
2. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక - సంపుటం 44, సంచిక 5.

నిఘంటువులు :

1. విల్యమ్స్ నిఘంటువు
2. సూర్యరాయాంధ్ర నిఘంటువు (8 సంపుటాలు)

ఆంగ్లం ;

" An Introduction to the Study of Literature ",
W. H. Hudson .

